శ్రీరామ

# శ్రీ ప్రార్థనా భాగవతము

## ద్విపదలు

## ప్రథమ భాగము

ప్రథమస్కంధమునుండి నవమస్కంధమువఱకు


రచయిత:

విద్వాన్, మధురకవి

కనమలూరు శివరామయ్య






ప్రచురణ:

కార్యనిర్వహణాధికారి,

తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి.

1982

SRI PRĀRTHANĀ BHĀGAVATAMU,

By

*Vidwan Madhurakavi Kanamaluru Sivaramaiah.*

T. T. D. Religious Publications Series No. 134.

Copies 1,000.




**Published by:**
Sri G. Kumaraswamy Reddi I.A.S.,
EXECUTIVE OFFICER,
Tirumala Tirupati Devasthanams,
Tirupati.

Printed at:
Tirumala Tirupati Devasthanams Press, Tirupati.

# ప్రకాశకుల విజ్ఞప్తి

పూర్వకాలము ధర్మరక్షణము రాజుల పనిగా సాగినది. ఇపుడా రాజులు లేరు. ప్రజలే స్వాములు. వారే ధర్మరక్షకులు. వారి తరపున దేవస్థానములైనా ధర్మమును కాపాడవలసియున్నది. అందులో మాది పెద్ద దేవస్థానము. ధర్మరక్షణ బాధ్యతగూడ పెద్దదే_అందుకని ఈ తి. తి. దేవస్థానముల తరపున పెక్కు ధర్మ బోధకములగు గ్రంథములు ముద్రించుచున్నాము. అవి ప్రజలకు ధర్మరక్షణ బోధకములుగా బహుళ ప్రచారములో నున్నవి.

ధర్మబోధకములుగా అగ్రపూజనందుకొన్నవి వేదములు, వాని వెనుక స్మృతులు పురాణేతిహాసములు. పాతకాలమునుండి పురాణేతి హాసములు దేశభాషలలోగూడ అనూదితములై ధర్మబోధనము చేయు చున్నవి. వానిలో భారత, భాగవత, రామాయణ, విష్ణుపురాణాదులు హిందూధర్మ సంస్థాపనాభవనమునకు చతుస్తంభములుగా ప్రసిద్ధి కెక్కినవి. అందునను పోతన అనువదించిన భాగవతము ఆంధ్రులకు చాలపరిచయమైనది - ప్రియమైనది - అందలి పద్యమొకటైనను తెలియని ఆంధ్రుడుండడు.

ప్రస్తుతము ఈ గ్రంథము ప్రార్థనాభాగవతము. దీని కర్త శ్రీ కనమలూరు శివరామయ్యగారు. సుప్రసిద్ధ పండితులు. కవులు. వీరిదివరకే శ్రీ అన్నమాచార్య జీవిత చరిత్రమును హరికథారూపమున రచియించినారు. దానిని మా దేవస్థానమువారు ముద్రించినారు. ఆ హరికథ హిందూధర్మబోధనమునకు చాల యుపయుక్తమై బహుళ ప్రచారమునన్నున్నది.

ఈ ప్రార్థనా భాగవతము దేశీయమైన ద్విపద ఛందస్సులో సాగినది. ఈ భాగవతము పోతన భాగవతమునకు ...

కొని, అందలి భాగవతుల కథలను సంగ్రహముగా చెప్పుచు, ఆ కథలోని భక్తులకు, దుర్మార్గులకు, ధూర్తులకు, రాక్షసులకుగూడ ముక్తిని అందిచ్చిన భగవన్మహిమను కొనియాడుచు అట్టివారిని కాపాడిన స్వామి నన్నుగూడ కడతేర్చుమని ప్రార్థించుటచే ఇది ప్రార్థనాభాగవతమనదగి యున్నది. సరళ భాషతో పండితులకు, పామరులకుగూడ, చదువుటకు శ్రీభగవంతుని లీలలు అర్థముచేసి కొనుటకు వీలుగా రచన సాగినది.

ఇందు కథతెలియుట, దానిలో సాత్త్విక, రాజస, తామసుల తత్త్వములు దెలియుట, వారిని ఉద్ధరించిన భగవన్మహిమలు దెలియుట, అట్టి స్వామి నన్ను కాపాడుమని ప్రార్థించుట అను నాలుగు ప్రయోజనములు గలవు.

ఇది మా హిందూధర్మరక్షణసంస్థకు అనువైన గ్రంథము. దీని సర్వాధికారములు మేమే స్వీకరించితిమి, ముద్రించి, ప్రచురింపదలచితిమి. గ్రంథకర్తగారు మా యుద్యమమునకు సమ్మతించి వ్రాతప్రతి మా కొసగినారు. అందు ప్రథమస్కంధమునుండి నవమస్కంధము వఱకు ముద్రణమైనది— ఈ భాగమును "ప్రార్థనా భాగవతము ప్రథమభాగము" అను పేరుతో ఆవిష్కరించుచున్నాము. త్వరలో దశమస్కంధమునుండి ద్వాదశస్కంధము వఱకుగల భాగమును ద్వితీయభాగముగ ముద్రింపించి ప్రచురించెదము. మా యాశయము శ్రీవేంకటేశ్వరుఁడు నెరవేర్చుగాక ! ఈ గ్రంథమును భక్తులు అనుదిన పారాయణముగ పఠించి ఆనందించగలరు. భగవంతుని అనుగ్రహము నొందగలరు. సహృదయులు ఆనందించినచో అదియే మాకు పదివేలు —

ఇట్లు,

తిరుపతి,
తేది : 6-7-1982.

శ్రీ పి.వి.ఆర్.కె. ప్రసాద్, ఐ.ఏ.ఎస్.
తి. తి. దే. కార్యనిర్వహణాధికారి.

శ్రీశ్రీశ్రీపరమహంస పరివ్రాజకాచార్య మకాం : బెంగుళూరు,
శ్రీరామకృష్ణానందస్వామి, 15-10-79
భూమానందాశ్రమం,
గండిక్షేత్రం - కడపమండలము.

# భాగవత ప్రశంస

నా ఉద్దేశంలో "భాగవత ప్రశంస" అంటే భాగవతము యొక్క ప్రశంస కాదు. భాగవతుని ప్రశంస. శ్రీశివరామయ్యగారు భాగవతులు, పరమ భాగవతులు. భాగవత ధర్మంలో శివ కేశవులకు అభేదము. భాగవతాన్ని ఆంధ్రీకరించిన శ్రీపోతనామాత్యులవారి

"చేతులారంగ శివుని పూజింపడేని
నోరునొవ్వంగ హరికీర్తి నొడువడేని"

అంటూ చెప్పిన పద్యము అందరికీ తెలిసిన పద్యము.

వ్యాసులవారి సంస్కృత మూలభాగవతంలో యీ అర్థం చెప్పే శ్లోకంలేదు. ఇది శ్రీపోతన్నగారి సొంత సందేశము. ఈ పద్యము భాగవత ధర్మముయొక్క ధ్యేయాన్ని సూచిస్తూవుంది. నిరూపిస్తూవుంది. మన శివరామయ్యగారు యీ అద్వైతానికి ప్రత్యక్ష మూర్తి. ఆ అనుభూతికి వారి మూర్తినికూడ చూడనక్కరలేదు. వారి నామమువింటేనే చాలు.

వీరు కవులు, పండితులు, విద్యావినయ సంపన్నులు, భాగవత రసికులు, ఇంకేమి కావలె? శివరామయ్యగారూ! మీరు ధన్యులు, మీ కృషి ధన్యము, మీ కృతి ధన్యము, సుఖీభవ! జయీభవ!

ఉదయంవేళ భారత పఠనము, మధ్యాహ్నము రామాయణ వ్యాసంగము, సాయంకాలము భాగవత కాలక్షేపముతో పూర్వపు

పెద్దలు కాలము గడిపేవారట. దీన్ని గురించి ఒక కూటు శ్లోకమూ వుంది.

"ప్రాతర్ద్యూత ప్రసంగేన మధ్యాహ్నే స్త్రీ ప్రసంగతః
రాత్రౌ చోర ప్రసంగేన కాలోగచ్ఛతి ధీమతామ్"

జూదము అంటే భారతకథ. స్త్రీ ప్రసంగమంటే "సీతయాశ్చరితం"_రామాయణ గాథ. చోరుడనగా శ్రీకృష్ణ చరిత్ర, భాగవతము. ఈ మూడు గ్రంథాలు జనసామాన్యంలో ప్రస్థానత్రయాలు. ఈ శివరామయ్యగారు ఈ మూడు గ్రంథాలను గాఢంగా అభ్యాసం చేసినారు. వీరు స్వాధ్యాయ తపస్వి. తనలో జీర్ణించిన తత్త్వాలకు కావ్యరూపాలలో రూపాలుకూడా యిచ్చినారు.

వీరు తాము రచించిన ద్విపదభాగవతాన్ని నాకు వినిపించినారు. దానికి ప్రార్థనా భాగవతమని పేరిడినారు. ప్రతి కథా భాగానికి భగవంతుని స్తుతి పాఠాన్ని ఆద్యంతాలలో చేర్చినారు. ఆ దృష్టితోనే గ్రంథానికి వారా నామకరణము చేసినారు.

వారికి భాషపైన నిరంకుశమైన అధికారంవుంది. వారి కవిత్వము చాలమట్టుకు పోతనామాత్యుని రంగు పూసుకొనింది. తన్మయంగా చదువతారు. వినేవారినికూడ వారి భూమికకు లాక్కొనిపోతారు. వీరు తిరుపతి నివాసులు. వీరికి శ్రీ వేంకటేశ్వరస్వామి యిలువేల్పు; యిష్టదైవం. భక్తుని నివాసం క్రింద; భగవంతుని నివాసం పైన. ఇంతే వ్యత్యాసం, కలియుగదైవము శ్రీ వేంకటేశ్వర ప్రభువు వీరికి సదా సర్వదా అభీప్సితార్థసిద్ధి ప్రదాతయగుగాక! శ్రీ శివరామయ్యగారికి నా హృదయపూర్వక శుభాశీర్వాదములు.

మకాం:
బెంగుళూరు,
15-10-79.

(సం) శ్రీరామకృష్ణానందస్వామి,
గీతావాణి సంపాదకులు.

# మనవి:

భారతీయ సంస్కృతికి మూలాధారములైన రామాయణ భారత భాగవతముల చదువుట యనిన నాకు నెక్కువ మక్కువ. అందలి కథలు, సత్యసందర్శనములు రచనా చమత్కృతులు నన్ను మిగుల నాకర్షించినవి. తద్గ్రంథ సంస్కృతాంధ్ర కవివరులు నా కెల్లప్పుడు పూజనీయులు. కావున తద్గ్రంథముల, గ్రంథకర్తల నేదోయొక విధముగ పూజించవలయునను వాంఛ నా మనస్సున పాదుకొన్నది. ఆ యుత్సాహబలముననే యింతకు పూర్వము రామాయణమున ఉత్తరకాండము నాధారముగ 'సీతాప్రవాసము' అను పద్య కావ్యమును రచించితిని. అవ్విధముననే "శ్రీమదాంధ్ర భారతము నాధారముగ 'శ్రీమదాంధ్ర భారతకథానీతి దర్పణము' అను గ్రంథమును గద్య పద్య మిశ్రమముగ రచియించితిని. ఇంకమిగిలినది భాగవతము.

ఈ సంకల్పమునుగూడ నెరవేర్చుకొను తలంపున 'శ్రీమదాంధ్ర భాగవతమును చేపట్టి తద్గ్రంథ సేవకు రచనావిధాన మార్గమెద్దియో యని యోజించి, తుదకీ క్రింది విధమున పథకము నిర్ణయించుకొని రచనకు పూనుకొంటిని. ఇందు ప్రతి యంశముననను

(1) భగవత్ప్రార్థనతోడి విషయప్రస్తావము.

(2) విషయము.

(3) విషయ విమర్శనము.

(4) ప్రార్థనము.

అను విభాగములు చదువరులకు గోచరింపగలవు.

శ్రీమన్నారాయణుని యవతారములు, తల్లీలలు మొదలగు వానిని కథాకథన రూపముగ భగవంతు నుద్దేశించి ప్రార్థనారూపముగ వెలయించితిని. సామాన్య మానవులుగూడ చదివి ఆనందించ ననుకూలముగ రచనము అతి సులభశైలిలో ద్విపద ఛందస్సున సాగించితిని. పండ్రెండు స్కంధములు పూర్తియగునప్పటికి ద్విపదల సంఖ్యగూడ పదునొకండు వేలకుమించి, పండ్రెండవ వేయింటిలో మూడువందలకు పైగా పెరిగినది. అల్పజ్ఞుడనగు నేను ఇట్టి మహా కార్యమునకు పూనుకొనుట సాహసమేకాని శ్రీవేంకటేశ్వరస్వామి నాయందు అదృశ్యమానముగనుండి యీ గ్రంథరచనమునకు తగిన శక్తిసామర్థ్యోత్సాహములు ఇవ్వగలడను ఆత్మప్రత్యయము నాకు గలదు. కావుననే యీ రచనకు పూనుకొని కృతకృత్యుడనైతిని. ఈ గ్రంథమునకు "<u>ప్రార్థనా భాగవతమను</u>" పేరిడితిని.

## మరియొక మాట :

ఈ గ్రంథరచనము కొంతకొంతగా సాగుచుండినది. ప్రథమ స్కంధము పూర్తియైనది. బెంగుళూరికి వెళ్లియుంటిని. ఆ సందర్భమున శ్రీ గుళ్లపల్లి అనంతకృష్ణశర్మగారిని దర్శించి, యీ ప్రథమ స్కంధ రచనము చదివి వినిపించితిని. వారు చాల సంతసించి, "శైలి సులభము; పథకము నూతనము; ఛందస్సు దైవప్రార్థనము ఏక మార్గమున నిశ్చల మానసముతో గానరూపమున గావించుటకు తగినది. <u>ప్రార్థనా భాగవతమను గ్రంథనామము రచనకు తగినట్లున్నది.</u> మీరు పట్టువిడువక రచనము సాగించి, పండ్రెండు స్కంధముల భాగవతమును పూర్తిగావింపుడు" అని ప్రోత్సహించి ఆశీర్వదించిరి.

శ్రీవేంకటేశ్వరుని యనుగ్రహమున, పెద్దల ఆశీర్వాదబలమున నాయీ రచనము సాగినది. ప్రజల అనుదిన ప్రార్థనమునకు ఈ ప్రార్థనా భాగవతము తోడ్పడి యుపకరించగలదని తలంచెదను.

ఈ పవిత్ర గ్రంథమును శ్రీవేంకటేశ్వరస్వామికి అంకితమొన రించితిని. వారి కరుణా కటాక్షముననే యీ గ్రంథము ముద్రణ భాగ్యము నందగలదని విశ్వసించియున్నాను. —

భాషావేత్తలు మన్నింతురుగాక ! —

శ్రీ కాళయుక్త చైత్ర శుద్ధ
పంచమి సౌమ్యవారము,
తిరుపతి,
12–4–1978.

ఇట్లు,
బుధజనవిధేయుఁడు,
కనమలూరు శివరామయ్య,
గ్రంథకర్త.

—*—

## కృతజ్ఞత:

ఈ గ్రంథమును (ప్రార్థనా భాగవతము, ద్విపద వ్రాతప్రతిని) పరిశీలించి చూచి, యిది తిరుమల తిరుపతి దేవస్థానములవారి హిందూ మతధర్మప్రచారోద్యమమునకు చాల తోడ్పడునని, టి.టి.డి. ప్రచురణ గ్రంథముగా ముద్రించి, వెలయింప దలంచి పరిగ్రహించిన తి. తి. దే. బోర్డువారికి, ఎగ్జిక్యూటివ్ ఆఫీసరుగారికి నేనెంతయు కృతజ్ఞుఁడను. —

— గ్రంథకర్త.

# విషయసూచిక

* * * **

## ప్రథమస్కంధము

## ద్వితీయస్కంధము



## తృతీయస్కంధము



## చతుర్థస్కంధము

## పంచమస్కంధము - ప్రథమాశ్వాసము



### పంచమస్కంధము - ద్వితీయాశ్వాసము



## షష్ఠస్కంధము

## సప్తమస్కంధము

## అష్టమస్కంధము

## నవమస్కంధము

———

# అంకితము



అఖిలాండకోటి బ్రహ్మాండాధిపతికి
నిఖిల నిర్జరముని నిచయవంద్యునకు
గరుడవాహనునకుఁ, గనకాంబరునకు
సరసిజోదరునకు, సర్వేశ్వరునకు
భక్తజనత్రాణ పరిణతాత్మునకు
ముక్తిప్రదాతకుఁ బురుషోత్తమునకుఁ
బద్మావతీ ప్రాణపతికి శేషాద్రి
సద్మున, కానంద సత్యరూపునకు
వేంకటేశ్వరునకు విశ్వవేద్యునకు
నంకిత మీగ్రంథమతిపవిత్రమ్ము.

కవి

కనమలూరు శివరామయ్య.

శ్రీ రామ

శ్రీ గణాధిపతయే నమః

# ప్రార్థనాభాగవతము - ప్రారంభము

## ప్రథమస్కంధము

### ప్రార్థనము

శ్రీరమాలోల ఆశ్రితజనపాల
కారుణ్యసచ్ఛీల కాంచనచేల
బ్రహ్మాదిసురసేవ్యపాదారవింద
బ్రహ్మాండభాండోదరా శ్రీముకుంద
మునిమానసవిహార మోహనాకార
దనుజసమూహవిధ్వంసనశూర
గరుడవాహన జగత్కల్యాణదాత
ఉరగశయనా జగదుద్ధారనిరత
భక్తకల్పద్రుమ పాపవినాశ
ముక్తసంగజనానుమోద లక్ష్మీశ
భవమహాసాగరప్లవ నిఖిలేశ
ప్రవిమలశతకోటిభానుప్రకాశ
ఈసర్వజగతిని సృష్టిగావింప
భాసిల్లఁ బెంప సొంపర సంహరింప
త్రిగుణతత్త్వోపేత దివ్యరూపములు
తగ వేరువేరుగఁ దాలిచి బ్రహ్మ-
విష్ణుమహేశ్వరాభిధల వెల్గొంది
జిష్ణువై దివ్యరోచిష్ణువై చండ-
శాసనంబున జగత్సర్వవృత్తంబు
వాసిగా నడిపించు పరవాసుదేవ.

# గ్రంథావతరణము

దేవాదిదేవ నీదివ్యస్వరూప -
మేవిధంబో యించుకేని నే నెఱుఁగ
గుణసహితుఁడవొ, నిర్గుణుఁడవో నిన్ను
గణియించుజ్ఞానమ్ముగలవాఁడఁ గాను
పంచభూతములె నీపరరూప మండ్రు
కించిద్జ్ఞుఁడను పరికించంగఁ జాల
నీయనంతపవిత్రనిస్తులనామ -
ధేయమ్ము లెవ్వియో తెలియనివాఁడ
ఎందుఁ జూచినను నీ వీసృష్టిలోన -
నుందు వందురు బుధు లోప నిన్వెదుక ; -
నీదుసత్సంకల్పనియతి నెఱుంగ -
రా దిట్టిదని హరబ్రహ్మాదులకును
అట్టినిన్ గుర్తించి యర్చించురీతి
ఇట్టని తెలియనిహీనమానవుఁడ
ఎట్టులో నీసేవ నిట్టలమ్ముగను
పట్టుగాఁ జేయంగ భావించినాఁడ
విశ్వమయుండవు విశ్వేశ్వరుఁడవు
విశ్వరూపుఁడవని వినియున్నవాఁడఁ
గాన, నాదృష్టికిఁ గన్పించువిశ్వ -
మే నీదురూపని మిగుల భావించి 20
ఈచరాచరముల క్రీడనామములె

సకలజంతుశరీరసంబంధమైన -
యకలుషాత్మలె భవదాత్మగా నెంచి
కలిమిలేములును సౌఖ్యములు కష్టములు
తెలివితేటలు వెతల్ దెచ్చుగుణాలు
వినయవిధేయతల్ విఱ్ఱవీఁగుటలు
జనభూషణములు దుర్జనదూషణములు
మనుజడుఁ జేసినపుణ్యపాపముల -
కనువుగా ప్రాణుల కబ్బంగఁ జేసి
లోకవర్తనము విలోకించుచుంట
నీకున్నసంకల్పనియమ మంచెంచి
నీవిశ్వరూపంబు నెమ్మదిలోన
భావించి భక్తిగాఁ బ్రణతు లర్పించి
ఒకవిన్నపముఁ జేయుచున్నాఁడనయ్య
సకలాత్మ వినవయ్య శరణంటినయ్య
నీదుభక్తులవలె నేర్పునఁ బ్రార్థ -
నాదికమ్ముల నిన్ను నర్చించుశక్తి
చిత్తశుద్ధియులేనిచెన్నటి నాకు -
నుత్తమమగుమార్గ మొక్కటి కలదు. 30

భవదీయకారుణ్యఫలముగాఁ గొంత
ప్రవిమలసాహితీభాగ్యంబుఁ గంటి
ఆసాహితీసేవయనెడుసుమంబు
వాసిగా నీ కతిభక్తి నర్పింతు
నాసాహితీవని నవసౌరభముల
వాసించెఁ గావ్యపుష్పమ్ములు గొన్ని;
మరియొకకావ్యసుమమ్ముఁ బుష్పించు -

లోకకల్యాణమ్ము లో నూహచేసి
ఏకదీక్షను పదునెన్మిదిసంఖ్యఁ -
గలపురాణమ్ములఁగావించె వ్యాసుఁ -
డలఘుమానసుఁడు దైవాంశసంభవుఁడు;
ఏలొకో యమ్మౌనిహృదయమ్మునందు
చాలినతృప్తియు శాంతియు లేదు;
మనసు చాలవిచారమగ్నమై యుండె
తనదుకర్తవ్య మెంతయుఁ దోఁచకుండె;
తనయసంతృప్తికి తనఁ జడస్థితికి
దనమనశ్చంచలత్వమునకు హేతు -
వేమో యెఱుంగక ధృతి మది లేక
పామరమనుజునివలె నుండె మౌని. 40

కారించుతనమనోగతదుఃఖమునకు
నారదమునికరుణావిశేషమున
కారణ మ్మరసి, వికారమ్ముఁ బాసి,
పారమార్థికచింత బాగని తెలిసి,
"పరమాత్ముఁ డత్యంతపరపావనుఁడు
పరలోకంసత్సుఖప్రదుఁడైన
మహిమలూరెడునతిమానుషక్రియలు
రహిఁజాటురచనల రచియింపనైతి
జనులకు దేవునిసాలోక్యగరిమ
వినుతమౌసారూప్యవిభవసంసిద్ధి
సామీప్యభాగ్యంబు సాయుజ్యపదవి
యేమార్గమున నబ్బు నెద్ది సాధనమొ
ఆమార్గమును మరి యాసాధనమ్ము -
నేమానవుండైన నెఱుగంగఁ దెల్పి

పరమేశుమహిమల భక్తిఁ గీర్తించి
తిరముగా నిత్యశాంతినిఁ గందు" ననుచు
దీక్షవహించి, యేదివ్యపురాణ
మీక్షితి శాశ్వత మీద్యమై యుండ
సృష్టించి జగతికి శ్రేయంబుఁ గూర్చి
యిష్టార్థసిద్ధిఁ దా నెసఁగె నమ్మౌని 50

ఆపురాణమ్ము మహాభాగవతము
పాపనిరాసమ్ము భాగ్యప్రదమ్ము
తత్సేవ పుణ్యప్రదమ్మని మున్ను
సత్సంగతిని విని సంతసించితిని
భాషాసతికి మణిబంధురమైన
భూషణమ్ముగఁ బొలుపొందెడియాంధ్ర -
భాగవతమ్మును భక్తి సేవించి
నీగురుమహిమల నెఱి కొంత దెలిసి
నతు లొనర్చుచు ప్రార్థనాపూర్వకముగ
కృతి సవరించి నీకే సమర్పించి
భవదీయకారుణ్యభాగ్యమ్ము వడసి
భవబంధములఁ బాయ భావించినాఁడ;
నాయుద్యమము శుభాంతముగాగ నన్నుఁ
బాయక నాకుఁ దోడ్పాటుగా నుండి
నావాంఛితముఁ దీర్చి ననుఁ బ్రోవుమయ్య
నీవెగా నాదిక్కు నీరజనాభ
భాగవతరహస్య భావంబులెల్ల
బాగుగా గుర్తించి ప్రవచించునేర్పు
శూలికైనను తమ్మిచూలికినైన

ఐన నాతెగువకు నాధార మొండె
దానియథార్థంబుఁ దగ విన్నవింతు
దేవాదిదేవ నుతింపఁ బూజింప
భావింప ధ్యానింప భక్తి సేవింప
పండితుఁడైనను బామరుఁడైన
మండలపతియొ సామాన్యుఁడోయైన
జ్ఞానియేయైన నజ్ఞానియేయైన
శ్రీ నొప్పువాఁడొ దరిద్రుఁడోయైన
వృద్ధుఁడైనను చాలపిన్నఁడేయైన -
నిద్ధచరిత్రుఁడో హీనుఁడోయైన
మరి యెట్టివాఁడైన మాన్యుఁ డర్హుండు
తరతమభావముల్ తడవంగ లేవు
గురిగలభక్తియే గొప్పని యోగి -
వరులును బెద్దలు వల్కిరి; మరియు
భవదీయదివ్యకృపాకటాక్షమ్ము
ప్రవిమలమగుభక్తిపక్షమ్మటంచు
నాశక్తికొలఁది ననంతు సర్వేశు
శ్రీశు నిత్యుని నిన్ను సేవింతు భక్తి
నీదుమాహాత్మ్యమ్ము నిక్కమ్ము ఘనము
నాదుశక్తియు భక్తి నలికమ్ము నిజము. 70

కొండంత దేవరా! కొండంతపత్రి
కొండికవాఁడ నీకుం గూర్పఁగలనె
నూలుపోగులను జంద్రున కిచ్చురీతి
నాలఘుభక్తిసూనముల నర్పింతు
స్థిరచిత్తమున నాకుఁ దెలిసినయట్టి -
గురుజనంబులబోధ గురుతించినట్టి -

భవదీయమహిమప్రభావంబులెల్ల
ప్రవిమలభక్తితో వర్ణించువాఁడ
పరమ పవిత్రాంధ్రభాగవతమ్మె
యరయ నీనవ్యకావ్యమ్ముమూలమ్ము
అందుండునీదుమాహాత్మ్యంబులెల్ల
నిందు స్తోత్రములుగా నెలమి రచింతు
పరగంగ ప్రార్థనాభాగవతాఖ్య
తిరముసేసితి నీకృతికి బుధుల్ మెచ్చ
నాహూన్కి యిది యవిఘ్నమ్ముగా సాగఁ
బ్రాపు నీవని నిన్ను భక్తితోఁ గొలిచి
మరియు వేదవ్యాసమౌనిచంద్రునకు
వరతపస్వికి శుకబ్రహ్మమ్మునకును
శౌనకాదిమహర్షిసంఘమ్మునకును
నానాపురాణజ్ఞునకు సూతునకును 80

కృతకృత్యుఁడగు పరీక్షిజ్జనపతికిఁ
దతవిజ్ఞుఁడైనపోతనకవీంద్రునకు
గంగనకవికి సింగనకు నారయకు
చెంగలించినభక్తి చేతులు మోడ్చి
ఓ సచ్చిదానంద యో యోగివంద్య
ఓ సాధురక్షణ యో రమారమణ
ఓ పురుషోత్తమ యో దివ్యనామ
ఓ పుణ్యమూర్తి మహోజ్జ్వలకీర్తి
స్వస్తివాచకములు వల్కి త్వదీయ
శస్తమౌ యేకవింశత్యవతార -
ములను క్రమంబుగా మొదలిడి భక్తి
వెలయంగఁ జెప్పెద విశ్వప్రకాశ.

## భగవంతుని యేకవింశత్యవతారములు :—

మహదహంకార తన్మాత్రసంయుతుఁడు
రహి షోడశకళల రాజిల్లువాఁడు
పంచభూతవిభాసి పరిశుద్ధసత్త్వుఁ-
డంచితనానాసహస్రాంగధరుఁడు
సురుచిరభూషణశోభితాంగుండు
పురుషరూపధరుండు పురుషోత్తముండు-
నై లోకవర్తనయత్నమ్ము దనర
పాలమున్నీటిలోఁ బవళించి యోగ- 90

నిద్రావిలాసాన నెగడుచుండుదువు
భద్రమౌనీరూపు పరమపావనము
ఆదివ్యరూపమే యవతారములకు-
నాదియై యలరారునంద్రు ముకుంద
నీబొడ్డుతమ్మి జన్మించెను బ్రహ్మ
ఆబమ్మయంగంబులందు జగాలు
కల్పింపఁబడియె వికల్పమ్ము లేక
కల్పమ్ము నీదు సంకల్పమ్ము దేవ;
మునుపుగా కౌమారమున బ్రహ్మచర్య
మును నిష్ఠతో సల్పి పొగడొంది తీవు
పాతాళగతభూమి పైకెత్తుటకును
ఖ్యాతి వరాహవిగ్రహమయి తీవు
నారదుఁ డగుచు వైష్ణవతంత్రములను
పేరుకొంటివి పెక్కు విబుధులు మెచ్చ
నరుఁడు నారాయణుండన జనియించి
పరమతపశ్చర్య భాసిల్లి తీవు

కపిలావతారవిఖ్యాతి సాంఖ్యమ్ము-
నుపదేశ మిచ్చితి వొకభూసురునకు
పరగ దత్తాత్రేయభవ్యరూపమున-
నరయగా నాత్మవిద్యను దెల్పి తీవు. 100

మహిమ స్వాయంభువుమన్వంతరమును
మహి యజ్ఞుఁడన కృపామతిఁ బ్రోచి తీవు;
ధర నురుక్రముఁడునాఁ దగి పండితులకు
పరమహంస నెఱుంగుపట్టు తెల్పితివి;
పృథుచక్రవర్తివై పృథివి ధేనువుగ
విధియించి పిదికితి వివిధవస్తువుల
వైవస్వతునకు సంవర్తకాలమున
నీవె మీనాకారమెత్తి తోడ్పడితి
త్రిదశులు దైత్యు లబ్ధి మథించ గిరిని
కుదురుగా మోసితివి కూర్మరూపమున;
అరయ ధన్వంతరియనురూపమెత్తి
సురల కిచ్చితివి విశ్రుతముగా సుధను
సురలకు సుధయు నసురులకు వ్యథయు-
నిరవయ్యె నీదు మోహినిరూపమహిమ
కనకకశిపుఁడనుక్రవ్యాదుపీచ-
మణఁచినాఁడవు నృసింహావతారమున
వామనమూర్తివై పాదత్రయమ్ము
భూమి బలినిఁ గోరి భువనముల్ గొంటి;
పరశురామాఖ్య నిర్వదియొక్కమారు
నరనాథకులము భ్రమందఁగఁజేసినావు. 110

వేదమెల్ల రెఱుంగ విభజనచేసి
మోదించితివి వ్యాసమూర్తివై వెలసి

రాముఁడవై సముద్రము నిగ్రహించి
నీమహోన్నతశక్తి నేర్పు చూపితివి;
బలరాముఁడనియెడుభవ్యరూపమ్ము
విలసితకృష్ణాఖ్య వెలయురూపమ్ము
దాలిచి కుజనహత్యలును గావించి
పోల భూభారమ్ము పోగొట్టితీవు;
కలఁచి యాత్రైపురీకాంతాజనమ్ము
నలరితివయ్య బుద్ధావతారమున
యుగసంధి నృపులు దస్యులుగాఁగ వారిఁ
దెగి కల్కిరూపాన తెగటార్చఁగలవు
కట్టతెగినఁ బెక్కుకాల్వలౌ నీర -
మట్లులే నీదాల్చునవతారములును
సురలును మునులు భూసురులు సంయములు -
నరయంగ నీదుదివ్యాంశజుల్ దేవ;
జగముల కెపుడు రాక్షసబాధ గలుగుఁ
దగఁ బుట్టుదువు వ్యథల్ తలగించ నపుడె;
నీజన్మకథనమ్ము నిత్యమ్ము దలఁప -
నేజన్మలే కెవ్వఁడేని తరించు. 120

నాకడతేరుచన్దముఁ దెల్పి నన్ను
నీకడఁజేర్చు మనింద్య చరిత్ర.

## శ్రీమద్భాగవతావతారము:—

చిత్తశాంతికి భవచ్చింతనకంటె -
నుత్తమసరణి వే రొం డెందు లేదు
"వేదముల్ విభజించి విఖ్యాతిఁ గాంచి
వేదార్థములనెల్ల వివరించునట్టి -

భారతమ్మనియెడు పంచమామ్నాయ-
మారూఢి వ్రాసితి నార్యులు మెచ్చఁ
గాని, నాయాత్మకు గలుగదు తృప్తి
శ్రీనాథుఁడును సంతసించెనో లేదొ
యోగులకు హరికి నుత్సాహమిచ్చు-
భాగవతవిధమ్ము భాషింపనైతి"-
నని వగచుచున్నవ్యాసునికడకు
మునినారదుఁడు వచ్చి ముంగల నిలిచి
"వ్యాసమునీంద్ర! మహర్షివి జ్ఞాన-
భాసురుండవు నీకు వగపేల కలిగె?"-
ననుఁడు నమ్మౌనియు నమ్మౌనితోడ
తనమనోవ్యథ నిట్లు తగ వచియించె
"ఓ నారదా! అబ్జయోనిసుపుత్ర!
శ్రీనాథపదసమర్పితచిత్త! నీవు 130

త్రిజగాల రవివోలెఁ దిరుగుచుండుదువు
ప్రజలలో మెలఁగుదు వాయువువోలె
సకలలోకంబుల సర్వధర్మములు
ప్రకటించఁగలవు సర్వజ్ఞుండవగుట
నాకొఱఁతకుఁ గారణమ్మును నీవె
సాకల్యముగఁ దెల్పు సన్మునిచంద్ర"
అన, దేవముని యిట్టులనె వ్యాసుతోడ;
"వినుమయ్య యంతయు వివరించువాఁడ
అంచితధర్మంబు లన్ని చెప్పితివి
యించుకేనియు నందు నీశ్వరుఁగూర్చి
చెప్పవు; ధర్మముల్ చెప్పినమాత్ర

హరినామనుతి సేయునట్టికావ్యమ్ము
నరివచ్చు హేమాబ్జసరసికి నిజము
హరినామనుతిలేనియట్టికావ్యమ్ము
గరళపూరితమగుగర్తసమమ్ము
హరిఁ గూర్చి పాడుచు హరిఁ గూర్చి వినుచు
హరిని ధ్యానించుచు హరిఁ గొల్చువారె
పరమధన్యులు గాన, ప్రజలెల్ల రెఱుఁగ
హరిలీలలను దెల్పుమయ్య మునీంద్ర. 140

కులధర్మమును మానుకొని హరిపాద-
జలజముల్ గొలిచినజనుఁడు ధన్యుండు
గాక చచ్చిన, మఱుకాయానవైన
శ్రీకరమగుమోక్షసిద్ధినిఁ బొందు
సంసారవార్నిధిఁ జయ్యన దాఁట
కంసారిభజనమేగద మంచినావ"
అని చెప్పి నారదుఁ డరిగినయంత,-
వనఘుఁ డాబాదరాయణి వ్యాసమౌని
పరమపావనసరస్వతితీరభూమి-
నరయ వర్యమ్ము శమ్యాప్రాసమనెడు-
నాశ్రమమునఁ జేరి, యతినిష్ఠఁ దనకు-
నాశ్రయ మాహరియని నమ్మి మదిని
తిరముగాఁ జేసి, భక్తియుతచిత్తమునఁ
బరిపూర్ణుఁడైనయీశ్వరుని దర్శించి
ముక్తినిఁ బొందంగఁ బూనుజీవునకు
భక్తియే కుదురని బాగుగాఁ దలఁచి
ఏపవిత్రామ్నాయ మిమ్ముగా విన్న
పాపికినైన శ్రీపతిపైన భక్త-

సులభునిపై భవసూత్రముల్ ద్రెంపఁ-
గలభక్తి జనియించుఁ గల్మష మడఁచు- 150

నట్టిభాగవతాఖ్య నలరునామ్నాయ-
మిట్టులమగుశ్రద్ధ సృజియించి తనదు-
స్వాంతమ్మునకు శాంతి సవరించె జగతి-
కంతకు శుభము నిత్యమ్ముగాఁ గూర్చె. —
వేయివేదంబులు వింగడించినను
శ్రేయమౌముక్తిని జేకొనఁ గాదు;-
భాగవతమ్మును బఠియించువారు
బాగుగా మోక్షమ్ముఁ బడయంగఁగలరు.
పరమాత్మ! శ్రీ భాగవతముఁ బఠించు-
స్థిరచిత్తభాగ్యమ్ము చేకూర్చి, నీదు
చరణసరోజముల్ సద్భక్తిఁ గొలుచు-
నిరతి నా కొసఁగి మన్నింపఁగదయ్య.

## నారదుని జన్మవృత్తాంతము:—

నారాయణా! పద్మనాభ! రమేశ!
కారుణ్యమూర్తి! జగద్ధితకీర్తి!
నీకటాక్షమ్ము పొందినఁ జాలు, వాఁడు
ప్రాకృతుఁడైనను వరయోగి యగును
పరమయోగీంద్రులభవ్యచరిత్ర
నరుల కాదర్శమ్ము జ్ఞానప్రదమ్ము
నారదమౌనిజన్మకథ యిందులకు
తారకాణమ్మని తలఁతు గోవింద. 160

తొలిజన్మమున నారదుఁడు వేదవిదుల-
నిలయదాసీపుత్రి నెఱపుముదియకు

జనియించె; పెద్దలు చెప్పినయట్లు
చని, వానకాలాన సన్మునిసంఘ-
మొకచోట వ్రతదీక్ష నూనియుండంగ-
నకలుషభక్తి వారందఱు మెచ్చ
పరిచర్యసేయుచు; వారు నీకథలు
పరిపరివిధముల వర్ణించుచుండ
విని, నీదుసేవ పవిత్రమ్మటంచు
తనమనమున నెంచి తన్మయుఁడయ్యె;
మునులును నీతత్త్వమును గనునెఱుక
కనికరించి చనిరి కడు కృపాబుద్ధి;
యోగులయుపదేశ మొంది బాలుండు
బాగుగ మోహవిభ్రాంతజీవితము
మాని, "సమస్తకర్మలు నీకు భక్తి-
తో నర్పణముసేయఁ దొలఁగు పాపములు
భక్తియోగము పట్టువడు" నని యెంచి,
ముక్తికి నద్దియే మూలమ్మటంచు
తనకర్మజాలమంతకు నీవె సాక్షి-
వని నీకె యర్పించి యనవరతమ్ము. 170

వాసుదేవాదినీభవ్యనామములు
భాసురోంకారపూర్వకముగాఁ బలికి
భవదీయకారుణ్యభాగ్యంబుఁ బడసి
ప్రవిమలవిజ్ఞానపద్ధతి నుండె;
ఐదేండ్లవయసువాఁడయ్యె నారదుఁడు
నీదు చింతనమె వానికి ధ్యేయమయ్యె;
తమ్మేలుచున్నపెద్దలయింట నొక్క-

నారదుతల్లిఁ బన్నగమొండు గఱవ
ధారుణిపై వ్రాలె; తనువుఁ దొఱఁగె;
బాలుఁడాదృశ్యమ్ముఁ బరికించి చూచి,
చాల మేలయ్యెను; సంగమ్ము వాసె;
నారాయణునిదివ్యనామసంస్మరణ
పారమ్ముముట్టగా భక్తి గావింతు
నని, తా నుదగ్దిశ కభిముఖుఁ డగుచుఁ
జనిచని క్షుత్పిపాసలఁ జిక్కి యలసి
ఒకయటవీమధ్య మోపికఁ జేరి
యకలంకమగునదీహ్రద మొండు గాంచి
యందుఁ గ్రుంకి జలమ్ములాని సంతృప్తి-
నొంది, శ్రమము వాయ నూరట నొంది, 180

ఆపొంతఁ గలయట్టియశ్వత్థమునకు
దాపునఁ గూర్చుండి తా విన్నరీతి
తనయాత్మగతుఁ బరతత్త్వస్వరూపు
నినుఁ దలంచుచునుండ నీరూపు తోఁచె
అతఁ డానందాబ్ధియందున మునిఁగి
యాతఁడిఁ గర్తవ్యమంతయు మఱచి
దిగ్గన లేచి నీదివ్యరూపంబు
దృగ్గోచరముగాక దిగ్భ్రాంతి గలుగఁ,
గ్రమ్మఱ నినుఁజూచుకాంక్ష స్వాంతమున-
నిమ్ముగా నీరూప మేర్పడ నిలిపి
ఆతురబుద్ధి నిన్నరసియు నరయ-
నైతిగా నని గహనాంతరమునను
దిరుగాడునతని నుద్దేశించి యిట్లు
వరసగంభీరభాషణము వినిపించితివి!

"ఏల కుమార నీ వీట్లు శోషిల్ల
చాలింపు తాప మీజన్మంబునందు
ననుఁజూడఁజాల; వైనను నీదుకోర్కి
కొనసాగ నామూర్తి గురుతు చేసితిని
నీకోర్కి వృథ గాదు నెట్టు దోషముల
ప్రాకటభక్తి శాశ్వత మొనరించు. 190

ఈపుట్టుకడపట నీబొందెఁ బాసి
యాపైన మాయాజ్ఞనంది పుట్టెదవు;
విలయమై యీసృష్టి వేయియుగాలు
కలయ యామినియైనకాల మేర్పడును
మరుసృష్టిఁ బూర్వజన్మజ్ఞానగరిమ
వరసాత్త్వికగుణమ్ము పరగఁ బుట్టెదవు."
ఆమాటలను విని యానందమంది
యామాణవకుఁడు మహాత్ముని నిన్నుఁ
గొలుచుచు కామాదిగుణములు వదలి
పలువోకలం బోక భక్తితో నుండె
కాలమంతటఁ గొంత గడచినయంత
కాల మాసన్నముగాఁగ నారదుఁడు
తొలికర్మకాయమ్ము దొలఁగ సత్త్వమున -
నలరుభాగవతదేహమ్మునఁ జొచ్చి,
ప్రళయకాలమ్మునఁ బండునీలోన
వెలకొని నెమ్మది నిదురవోఁ దలఁచు -
నజునిశ్వాసమువెంట నతనిలోఁ జేరి,
గజిబిజి లేకుండె కాలమ్ము గడచె
కాలమ్ము వేయియుగమ్ములు జరగ
మేలుకొనినవేల్పు మేటియౌ బ్రహ్మ - 200

ప్రాణాలనుండి నారదుఁడు జన్మించి
మానుగ తొలియాశ్రమముఁ బూని నీదు-
కరుణాకటాక్షభాగ్యమ్మున నేఁడు
స్వరముల దనయంత స్వనియించుమహతి-
యనెడివీణాలాప మనుసరింపంగ-
ననఘముల్ నీకథలన్ని వేర్వేర
భజియించి పాడుచు పరితోషపడుచు
త్రిజగమ్ములందునఁ దిరుగుచున్నాఁడు
అతఁడె దేవర్షినా నమరలోకమున
యతిలోకముఖ్యుఁడై యలరుచున్నాఁడు.
అతఁడె వైకుంఠమ్మునందు నీచెంత
సతతమ్ము నీసేవ సల్పుచున్నాఁడు
ఈనారదమునీంద్రునిద్ధచరిత్ర-
మేనరుఁడేయైన నెలమితో విన్న
నీకరుణాదృష్టి నిఖిలదోషములు
పోకార్చి భక్తుఁడై ముక్తుఁడే యగును
అట్టిభాగ్యము నాకు నమరుచుమయ్య
పట్టితి నీపాదపద్మముల్ దేవ. 209

## పుత్రమరణశోకముననున్న ద్రౌపదిని శ్రీకృష్ణుఁ డోదార్చుట

భక్తవత్సల! కృపాపారీణ! నిత్య-
ముక్తిప్రదా! శోకమోహవిదూర! 210

నీమహత్వము గన్న నీబోధ విన్నఁ
బామరుఁడును బుణ్యవర్తనుఁ డగును

ఉపపాండవులమృతి కోర్వకఁ గుందు-
ద్రుపదజ నోదార్చి దుఃఖమ్ముఁ దీర్చ
ద్రౌణి బంధించి తేఁ దరలునర్జునుని
కాణకమేలంచు వెన్కను గదలితివి
నరుఁగని వెఱచి యనయుఁడైనద్రౌణి
పరపె బ్రహ్మాస్త్ర మాబాణతేజమ్ము
భూనభంబులు దిశల్ పూర్తిగా నిండి
ప్రాణిలోకమునకు భయము గల్పింప,
"కమలలోచన, కృష్ణ, కల్యాణదాత
విమతరాక్షసశిక్ష, విబుధసంరక్ష
ఇది భయంకరతేజ మెదురయ్యె మనకు
విదితమ్ముఁ జేయు మెవ్విధమొ సర్వేశ!"
అని పార్థుఁ డడుగ నత్యంతాదరమున
"వినుము ఫల్గున నీకు వెఱచి ద్రోణజుఁడు
వదలినబ్రహ్మాస్త్రవరతేజ మిద్ది
అద నిది నీవు బ్రహ్మాస్త్రమ్ము వదలి
దానితేజ మడంచు తడయకు" మనుచు
పూనించితివి శంక పోఁద్రోలి నరుని. 220

శరతేజ మడఁచి, దుస్తరకోపి యగుచు
గురుసుతు బంధించి కొనివచ్చి యతఁడు
చంపెదనని పూన "సాహసింపకుము
చంపె బాలుర వీఁడు చను నధోగతికి
బాపఁడుగాన చంపఁగరాదు వీని
పాపిని దండింపు పాపమ్ము రాదు
నీరాజదండన నెఱి వీఁడు పాప-
దూరుఁడై స్వర్గమందున నుండఁగలఁడు"

అని చెప్పి యర్జును నాఁపి సత్కర్మ-
మునకు దింపిన నిన్ను పొగడఁజాలుదునె!
సుతులఁ జంపినద్రౌణిఁ జూచి పాంచాలి
యతిమాత్రమగుదుఃఖమందున మునిఁగి
న్యాయనిష్ఠురభాషణమ్ముల నాడి
వేయివిధాల నొప్పించెనేగాని
యతఁడు విప్రుండౌట నతని హింసింపఁ
బతితు లౌదుము హింస వలదని చెప్పి
వాని మృత్యువునుండి వదలించునామె-
జ్ఞానధర్మములకు సంతసించితివి
"పాంచాలి వెఱ్ఱిది బాలఘాతుకుని
గాంచి కోపింపదు; కష్టుఁడు వీఁడు. 230
పాఱుఁడు గాఁడు చంపఁగఁ దగువాఁడు

మీరలే చంపుఁడు; మిడికెదరేని
నాముష్టిఘాతమ్మునను ప్రక్కలింతు-
నీమూర్ధశిర" మని యెగసె భీముండు;
అతనివిజృంభణ మతివేల మగుట-
నతివ ద్రౌపది ద్రౌణి కడ్డమై నిలిచె
ఆభయంకరదృశ్యమంతయుఁ జూచి
ప్రాభవంబున చతుర్బాహువుల్ దాల్చి
రెంట భీముని నివారించి, యాతక్కు-
రెంటిచే ద్రుపద పుత్రికఁ దలఁగించి,
మోము మందస్మితపూర్ణమై యుండ
స్వామి! పామీరితోఁ బలికితి విట్లు;
"వీఁడు దుర్మార్గుండు వీఁ డాతతాయి
వీఁడు హంతవ్యుఁడు వివరింపఁ; గాని

వేదంబులెల్లను విప్రునిఁజంప -
రాదని తెల్పు ధర్మరహస్యవేది!
కనుక నీవిప్రునిఁ గాచుట లెస్స"
అని భీము మెప్పించి, యర్జునుతోడ
"పాంచాలికిని నాకుఁ బవనసూనునకు -
నించు మిక్కిలి జనియించెడునట్లు. 240

నీచేసినప్రతిజ్ఞ నెరవేరునట్లు
నాచెప్పినట్టుల నయమొప్పఁజేయు" -
మని ధర్మరాజాదులందఱు మెచ్చ
పనుపు చేసితి ధర్మపరిరక్షదీక్షఁ
బరగ నీయాజ్ఞానువర్తియై నరుఁడు
తఱిగె నశ్వత్థామతలనెఱు; లందుఁ
గలశిరోరత్నంబుఁ గైకొనె; వానిఁ
దొలఁగఁగఁ ద్రోసె; న్నాద్రోణసుతుండు
తనశిరోరత్నమ్ము తనదుతేజమ్ము
తను వీడ దీనుఁడై తలఁగె నెచ్చటికొ;
యాదవవంశసుధాంబుధిచంద్ర
వేదోద్ధరణ వేదవేద్య గోవింద
శ్రీకృష్ణ నీచిత్రవృత్తిధర్మమున -
కాకరమ్మగుదాని నరయలే రెవరు
నే మూఢచిత్తుఁడ నే మెఱుంగుదును
పామరుఁడను నన్ను పాలింపుమయ్య

## ఉత్తరాగర్భస్థశిశురక్షణము

శ్రీ వాసుదేవ రక్షితసర్వదేవ
గోవింద పాలితగోకులబృంద

ఆపదుద్ధరణ నీయనుపమలీల-
లాపాపఱేడైన నరయంగ లేఁడు. 250

అవని యపాండవ మయ్యెడుననుచు-
నవగుణి ద్రౌణి దివ్యాస్త్రమ్ముఁ బఱప
అయ్యస్త్ర మతిదుస్సహంబగుతేజ-
మెయ్యెడ భయదమై యెదురుగా రాఁగ
నీమేనయల్లుని నెలఁత, సుభద్ర-
ప్రేమించుకోడలు, భీతి నీకడకు
చనుదెంచి యుత్తర, "స్వామి, శ్రీకృష్ణ,
ననుఁ బ్రోవుమయ్య, దీనజనశరణ్య
కాలానలాభమార్గణము స్ఫులింగ-
జాలమ్ముఁ జిమ్ముచు చనుదెంచె నదిగొ
కనుఁగొను మది నాదుగర్భస్థశిశువుఁ
దునుమవచ్చెడురీతిఁ దోఁచెడు దేవ!
గర్భస్థపిండ మాకాండతీక్ష్ణాగ్ని-
దుర్భరమగుటచే దొరలుచున్నయది
నీగర్భమం దుంచి నిఖిలలోకముల
బాగోగు లరసెడుపరమాత్మ వీవు
నాగర్భమున రక్షణములేనిశిశువు-
నేగతి నేఁ బ్రోవవే వాసుదేవ"
అని మొఱవెట్ట నాయబలగర్భమ్ము
కనికరమునఁ గావఁగానెంచి నీవు 260

చక్రమ్ముఁ దాల్చి వైష్ణవమాయ గప్పి
విక్రమమ్మున ద్రౌణివిశిఖమ్ము నడ్డి
ఆనారసము శక్తి నణఁగించి పాండు
సూనుల, నుత్తరచూలుఁ గాపాడి,

కురువంశ మభివృద్ధిగొని విలసిల్ల-
నరయంగ నీవెగా యాధారమైతి
నీదీనరక్షణనిరతి నుతింప-
నేఁ దగుదునె జగదేకశరణ్య
దీనావనుఁడ వీవు దీనుండ నేను
నానేరములఁ బాపి ననుఁ బ్రోవుమయ్య

## కుంతీదేవి శ్రీకృష్ణుని స్తుతించుట

ప్రకృతి కాధ్యుండవు పరుఁడ వాద్యుఁడవు
సకలమ్మునకు నీవె సాక్షివి కృష్ణ!
నీదుమేనత్త కుంతీదేవి నిన్ను
వేదవేద్యునిగ భావించి కీర్తించె;
జతుగృహంబునఁ తనసంతతి తాను
హతముగానివిధాన నాదుకొన్నట్లు,
పాపికౌరవుఁడు వల్వలు లాగుచుండ
ద్రౌపదిమానంబు దలఁగనియట్లు,
అని భీష్మగురురవిజాదులచేత
తనదుపుత్రకులు బాధల నొందనట్లు, 270
విరటుపుత్రికకుక్షి వెలయుచూల్ ద్రౌణి-
శరవహ్నితీక్ష్ణాన చావనియట్లు,
పరికింప నెవ్వేళ పాండుపుత్రకులు
పరిరక్ష ధారుణిఁ బాలించునట్లు,
నీదుతోడ్పాటులు, నీమహత్వములు
మోదాన నీతోడ ముచ్చటల్ సలిపి
నిన్నె దైవముగాఁగ నెమ్మది నమ్మి
తన్ను మోహమునుండి తప్పింపుమనుచు

వందన మొనరింపఁ బరితోష మొంది
మందహాసము చేసి మాయ గల్పించి
యాయమ యానందమందెడునట్లు,
చేయఁగల్గితివి విశిష్టచరిత్ర!
ఆతీరు గావింప నగులాభమేమొ
నీతలంపు నెఱుంగనేర రెవ్వరును.
యదుభూషణా కృష్ణ హరి వాసుదేవ
కుదురగుభక్తి నాకుం గూర్పుమయ్య.

## ధర్మజుని మనోవ్యాకులము

శ్రీకమలాలయా చిత్తాబ్జమిత్ర
వైకుంఠపురవాస పరమపవిత్ర
కృష్ణ! నీ మహిమలు గీర్తింప విన్నఁ
దృష్ణ తొలంగు శాన్తియుఁ గల్గు దేవ! 280

“తనశరీరమ్మునఁ గని జంతుతతిని
దునిమించుకష్టుఁడౌ దుర్జనుపోల్కి
కురుభూమి నాకయి కురువంశజులను
గురువుల మిత్రుల గూల్పించినాఁడ-
నెన్నివత్సరములకేని యీయఘము
నన్ను మానదు నాకు నరకమే దిక్కు
అరులను నృపుఁడు ధర్మాహవమందు
పొరిగొన్నఁ బాపంబు పొరయ దటంద్రు
అజ్ఞానులకు నద్ది యాధారమౌను
విజ్ఞానులకు నద్ది వింతగాఁ దోఁచు
హయమేధముల బ్రహ్మహత్యాదిపాప-
చయము వాసెడునని శాస్త్రముల్ దెలుపు

పంకభూయిష్ఠమై పాడైనభూమి
పంకమ్ముచేత శుభ్రముగా నియట్లు,
మద్యముండినపాత్ర మద్యమ్ముచేత
హృద్యమ్ముగా శుద్ధి నెనయనియట్లు,
హింస ముఖ్యముగఁ జేయించుమేధములు
హింసార్జితాఘమ్ము లెటుల మాయించు?" -
నని ధర్మజుఁడు చింత నతిబాధ నొంది,
తన వెంట నీవును తనదుబందుగులు 290

గురుజనంబులు రాఁగఁ గురుభూమి చేరి
శరతల్పగతు భీష్మ సరసను నిలిచి
వందనములు సేసె; వరమునీంద్రులును
గొందఱు చనుదెంచి గుమిగూడి రచట.

## భీష్మ నిర్యాణము

మునుల నందఱఁ జూచి ముదమొంది గంగ-
తనయుఁడు వారిని తగ గౌరవించి
నినుఁజూపి వారి "కీనిగమగోచరుఁడు
మనుజరూపం డయ్యె మాయ మోదించి"
అని నీకు జోతల నర్పించి పాండు-
తనయులతో నివ్విధంబునఁ బలికె
"హరియు విప్రులు ధర్మ మాధారమనుచు
నెఱనమ్మి జీవింప నిశ్చయులైన
మీరలే కష్టాలు మితిలేనియట్టు-
లారయఁ బడితిరి యది విచిత్రమ్ము
పతి గతించిన మిమ్ముఁ బడుచులఁ దెచ్చి
కుతుకంబుతో నింత గొప్పగాఁ బెంచె

మీతల్లి కుంతి; యీమెకు లేదు సౌఖ్య-
మేతఱి, దుఃఖమ్ములే గతియయ్యె;
భగవంతుఁ డెవ్వ డెవ్వనికి నేమేమి
తగఁగఁ గూరుచు నావిధ మ్మెవ్వ డెఱుఁగు 300

దైవతంత్రమునఁ బ్రాప్తంబైనదశకు
ధీవిశారదులు చింతిల్ల రెన్నఁడును
ఎవ్వని నతిభక్తి హృదయాన నిల్పి
యెవ్వనిరూపమ్ము నేర్పడఁ బొగడి
కామాదుల నడంచి కాయమ్ము వాసి
క్షేమమౌ ముక్తినిఁ జెందునో యోగి;
అట్టి లోకేశ్వరుం డట్టివైకుంఠుఁ-
డిట్టుల కరుణ శ్రీకృష్ణరూపమున
నేను బ్రాణమ్ముల న్విడుచునందాఁక
నానేత్రములకుఁ గన్పడ వచ్చినాఁడు
నాభాగ్యమహిమచన్దము శస్తమయ్యె-
నే భద్రమతి పుణ్యమేమి సేసితినొ"
అని చెప్పి మరి పాండవాగ్రజుఁ డెఱుఁగ
వినుతమౌ ధర్మముల్ వినిపించుచుండె
అంతట నుత్తరాయణ మరుదేర
స్వాంతాన భీష్ముండు చక్క యోచించి
తనమరణమునకుఁ దగుకాల మదియ
యని నిశ్చయించి వ్యాహారముల్ మాని
నెమ్మది చెదరక నిల్పి నీమోముఁ-
దమ్మిపై దృష్టులఁ దగఁజేర్చి భక్తి 310

నీరూపు వర్ణించి నీవు ధర్మముగ
భారతయుద్ధానఁ బ్రకటించినట్టి-

లీల లన్నింటిని లెక్కించి నరుని -
పాలఁ జూపినపక్షపాతమ్ముఁ దడవి
నీదు నేకత్వమ్ము నీదుబహుత్వ -
మాదియౌ నీరూపు లాత్మ నిమిడ్చి
నిశ్వాసముల నిల్పి నిరుపాధికమగు -
శాశ్వతబ్రహ్మంబు సంధించి కలిసె
ఏకులమ్మునఁ బుట్టనేమి, యేవిద్య
సాకల్యముగ నేర్వఁజాలిన నేమి,
ధర్మశాస్త్రముల వేదములఁ గలట్టి -
మర్మజ్ఞవిజ్ఞానమతి గల్గెనేమి,
అతినిష్ఠ బ్రహ్మచర్యము సల్పనేమి,
మితిలేనిశూరుఁడై మించిననేమి,
నిను భజియింపక నీస్మృతి లేక
మనుజుఁడు మోక్షసామ్రాజ్యమ్ము గనఁడు
భవదీయగుణనామభజనమ్ము సేయు -
ప్రవిమలబుద్ధిసంపద నా కొసంగి
నాదుదోషముల నణంచి నీదివ్య -
పాదసేవకు నన్నుఁ బాలింపుమయ్య. 320

## శ్రీకృష్ణుఁడు హస్తిపురినుండి ద్వారకకుఁ జనుట

శ్రీరుక్మిణీసతీచిత్తాబ్జభృంగ!
కారుణ్యపీయూషకలితాంతరంగ!
యాదవాన్వయకలశాంబుధిచంద్ర!
వేదోద్ధరణ శుభాన్విత గుణసాంద్ర!
తొలిజన్మమందు నిస్తులభక్తితోడ
నలిపినపుణ్యసంచయమునఁగాక

భవదీయసామీప్యవర్తనభాగ్య -
మవని సామాన్యుల కబ్బుట యరిది.
భారతరణమునెపమ్మున భూమి -
భారమ్ము వాపి సర్వజగత్తునకును
శాంతిభద్రతల ప్రశస్తిగాఁ గూర్చి
కుంతీసుతాగ్రజుగురుజనానుమతి
ధరణీశుఁగాఁ జేసి, ద్వారక కీవు
తరల నాహస్తిపత్తనవాసులెల్ల
నిను వీడఁజాలక నీమహత్త్వముల
వినుతించినవిధంబు వివరింపఁ గలనె?
పసిఁడిమేడలనుండి పడఁతులు వేడ్కఁ
గుసుమవర్షంబులు గురియించుచుండ -
నల్ల ముప్పొంగుచునుండ సద్భక్తి
వెల్లఛత్రమ్మును విజయుండు పూన 330

ఉద్ధవసాత్యకు లుత్సాహమొప్ప -
నిద్ధచామరముల నెసఁగంగ వీవ
నేలయు నింగియు నిండంగ వాద్య -
జాలమ్ము మెండుగా శబ్దించుచుండ
భూసురబృందమ్ము పొగడుచునుండ
భాసుర మయ్యె నీపయనమ్ము కృష్ణ!
ఆసమయంబున నాపౌరసతులు
ప్రాసాదశిఖరాలపై నుండి నిన్ను
దరిసించి, తనిసి, హస్తమ్ములు చాఁచి,
గురుతుగా నితరులకుం జూపి, లోక -
సృష్టిస్థితిలయప్రసిద్ధవర్తనము
స్పష్టంబుగా నీదుసంకల్ప మనుచు

మనములఁ బొంగి యామానినులెల్ల
కొనియాడుచుండిరి కుతుకంబు మీఱ
కనుచూపు దాఁటెనే కమలాక్షురథము
కనఁజాల మింక నాకల్యాణరూపుఁ
గనలేనిదినములు కల్పంబు లగును
మనము పోదము రావె మాధవుఁ గొల్వ -
ననె నొక యబ్జాక్షి హర్షమ్ముతోడ
తనచెంతనున్నట్టితరళాక్షిఁ గాంచి ; 340

తరుణిరో యితఁడు యాదవరాజు గాఁడు
వరుస లోకప్రభవస్థితిలయము -
లరుదుగా నడుపుమహానుభావుండు
పరమేశ్వరుఁడు నాదుభాగ్యంబుకతన -
నితని దర్శించి సుకృతినైతి నంచు -
నతిమోదమున నొక్కయతివ నర్తించె,
నరపతుల్ క్రూరమానసులయి ప్రజలఁ
బరిమార్ప నీపరాత్పరుఁడును వారి
ప్రతికల్పముననుు సత్త్వశరీర మొంది
హతమొనరించునమ్మా! యనె నొకతె ;
ఇతనిపుట్టువుచేతనే యదువంశ
మతివరో మహిమచే నలరారెనమ్మ!
ఇతఁ డెప్పుడును వసియించుట మధుర -
నతిమహిమాన్విత మయ్యెఁగదమ్మ
ఇతని సద్భక్తితో నీక్షించి ద్వార -
వతిప్రజల్ కడుమహత్త్వము నొందిరమ్మ
ఇతని బలోద్ధతి నీవిశ్వమెల్ల
వెతవాసి హాయిగా విలసిల్లెనమ్మ

ఇతని సుందరరూప మెదనిల్పి గొల్ల-
సతులు తన్మయులౌట సత్యమేనమ్మ 350

ఈకమలాక్షుఁ బ్రాణేశుఁగాఁ బడయ-
నేకదీక్ష వహించి యెట్టివ్రతాలు
సలిపిరో రుక్మిణీసత్యాదివనిత-
లలతులే వారిభాగ్యంబు లోయమ్మ
అని, యిట్లు పురకాంత లనువచనాలు
విని వారిఁ గరుణించి వెడలితి వీవు
శ్రీకృష్ణ సద్భక్తబృందచకోర-
రాకాసుధాకర, ప్రణవస్వరూప
పాండుపుత్రులకు నీపైఁ గలభక్తి
మెండు వారలకు నేమిట లేదు గొదువ;
కరిపురినింగలకాంతలు నిన్ను
పరుఁడ వాడ్యుఁడవని భావించినారు
తొలిజని వా రెట్టితులలేనినోము
సలిపిరో యెఱుఁగంగఁజాలను నేను
నాకు నీప్రవిమలనామచింతనము
ప్రాకటముగఁ గూర్చి పాలించుమయ్య
పతితపావననామ పాపిని నేను
గతి నీవె నమ్మితి కరుణింపుమయ్య. 359

## శ్రీకృష్ణుఁడు ద్వారకాపురియందు అంతఃపురకాంతలను-జూచుట

జలజాక్ష! నీదువక్షము సిరులిచ్చు-
చెలువ వసించుప్రసిద్ధస్థలమ్ము 360

భవదీయవదనమ్ము భక్తచకోర -
నివహమునకు సుధాన్వితకలశమ్ము
నీదుబాహుబలమ్మె నిఖిలదిక్పాల -
కాదుల కవ్యయమగు నాశ్రయమ్ము
నీదు నిరుపమపాదనీరజద్వయమె
దీనజనాళి కంతికమగుదిక్కు
స్వామి! ద్వారక నీవు బంధుల సతుల
ప్రేమించురీతి నేఁ బేర్కొనఁగలనె
ద్వారక నీతలిదండ్రులయిరవుఁ
జేరి తల్లులకు జేజే లొనర్చితివి
ఆయేడుగురుమాతలంకమ్ములందు
కాయముల్ వొంగ నిన్నదియించి చనులఁ
బాలొడ్డగిలఁ బ్రేమభరమున నశ్రు -
జాలమ్ముల న్ముంచి సంతోషపడిరి.
తదనంతరమున శుద్ధాంతభామినుల
పదునారువేలనివాసమ్ములకును
పట్టపురాణులప్రాసాదములకు
నిట్టలమగుప్రేమ వేగ నెంచితివి.
ఒకతె యిల్ మున్జొర నొక్కతె కుందు;
సుకరభాషలు మాను సొలయు నెడంద 370

వికలత్వమగు ప్రేమ వేఱగునంచుఁ
బ్రకటాద్భుతవిభూతి పలురూపు లెత్తి
ఏకకాలమున నాయింతులయిండ్లు
జొక ప్రవేశించి శోభిల్లి తీవు
నాపతి తొలుదొల్త నాయిలు సొచ్చె
నాపయి ప్రాణేశునకుఁ బ్రేమ హెచ్చు -

ననుచు వేర్వేర నాయంగనలెల్ల
మనములఁ దముఁదాము మరిమరి పొంగి
నీదర్శనమ్మున నిఖిలమ్ము మఱచి
మోదమ్ముతో నిన్నుఁ బూజించి రంత,
వారలభక్తివిశ్వాసముల్ మెచ్చి
గారాబమున నిట్లు కరుణించి తీవు,
పడఁతులారా! మిమ్ము భయభక్తు లొలయఁ
గొడుకులు సేవింత్రె, కోడండ్రు మీకు
బదులు వల్కరె, మీరు ప్రతి వాసరమ్ముఁ
గొదలే కొనర్తురె గురుపూజనమ్ము,
తొడవు లంబరము లస్తోకమ్ము లగునె,
కడమలేక గృహాలఁ గలవె వస్తువులు
తిలకమ్ము నీవేల దిద్దవు చెలియ;
అలరులఁ దురుమవే యన్నులమిన్న, 380

కస్తురి యలదవా కలకంఠి నీవు,
శస్తమౌ తొడవులఁ జాలింతె మగువ,
కలహంసలకు నడల్ గఱపనా నీవు,
చిలుకకు మాటలు చెప్ప వెందులకు,
లతలఁ బోషించువిలాసమ్ము లేదె,
మతిఁగాదె కాసార మజ్జనక్రీడ,
మృగి చాలఁ గృశియించె మేఁతలే కఱవ
తగవుగాఁ బెద్దలఁ దన్పుచుందువె
బందుగులకుఁ జాల బాసట యగుదె
కుందు మీడెందాలకుం దూరముగద
ఇవ్విధి ననురాగ మేర్పడులీల -
నవ్వరిబోడుల నడిగితి వీవు;

నీపరోక్షమున నానెలఁత లెవ్వరును
చూపరు తమమేనిసొబగుపై బుద్ధి
జలకేళి వాహ్యాళి సలుపరు నిన్నె
తలఁపున నిడికొని తనివిఁ జెందుదురు
నీదుప్రశ్నములకు నెమ్మదుల్ పొంగ
మోదమ్ము విరివియై మోహమ్ముఁ బెంపఁ
గరయుగమ్ములు సాఁచి కౌగిళ్లఁ జేర్చి
తిరముగా నిన్ను బుద్ధిని చక్కనిల్పి 390

ఆనందబాష్పతోయములు రాల్చుచును
మేనులు మఱచి సంప్రీతినిఁ గనిరి
పాప మాజవరాండ్రు పామరబుద్ధి
నీపయింగలభక్తి నినుఁ బ్రాణపతిగ-
నెలమి పూజించిరి; యెక్కుడు మహిమ-
గలయది వారికిఁ గలభక్తి దేవ!
ఆత్మాశ్రయమె బుద్ధి యైన నేమాత్ర
మాత్మానుభవముల నందకయుండు-
నటులె ప్రకృతితోడ ననుబంధమైన-
యటులుండి ప్రకృతిగుణాదు లౌమంచి-
చెడుగుల నెప్పుడుఁ జెందవు నీవు
కడురహస్యములు నీఘనమహత్త్వములు
నిన్ను సంసారిగా నిఖిలజగమ్ము-
లెన్నును నీలీల లెఱుఁగ వెన్నఁటికి
ఇట్టినీలీలల నెఱిఁగెడిబుద్ధి-
నెట్టులో యించుకయేని నా కొసఁగి
నెనరున నీపాదనీరజద్వయిని
నను చేర్పు భక్తమందార జేజేలు. 399

## పరీక్షిజ్జననము :—

పద్మలోచన నీదు భజనమ్ము హృదిని
ఛద్మమ్ము మాన్పించు సత్త్వముఁ బెంచు 400

మృత్యుభయము మాన్చు మృషగాఁగ దోఁచు
నిత్యమ్ముగా నెంచు నిఖిల జగమ్ము
గురునందను:డు సక్రోధమానసుఁడు
పరపిన బాణాగ్ని బాధించుచుండ -
నుత్తరగర్భమందున్నడింభకుఁడు
తత్తరపడి పరితాపమ్ము నొంది
“ఉదరగోళములోన నున్నాఁడ నొదిగి
యెది నాకు దిక్కు నే నెఱుగంగఁజాల
నామాత వల్కు ననాథ తా ననుచు -
నీమార్గణాగ్ని మాయించుట యెటులొ
ఈవిపత్తును జూచి యెవరు నన్బ్రోవ
భావింపగలరొ దైవమ! వారి నెఱుఁగ -
నీశరానలమున నేఁ జచ్చి గర్భ
కోశమందే యుండు ఘోరకాలమున -
నుదరసంతాపమ్ము నోర్వంగలేక
మదినొచ్చి మా తల్లి మరణించునేమొ
విశిఖాగ్ని యేతేర విష్ణుఁ డాయార్తి
ప్రశమిత మొనరించుఁ బాలించు మనల -
ననుచుండు మాయవ్వ యతివలతోడ
ననిశ మమ్మాట తథ్యమ్మగు నేమొ. 410

సర్వజీవులయందు సాక్షియై వెలుఁగు
సర్వేశ్వరుని చూడఁజాలనా లేన;

ఈయగ్నిశరము వారించి మన్నించి
శ్రేయ మియ్యెడ నాకుఁ జేకూర్ప రాఁడ
యెందఱో ప్రోచునీశ్వరుఁ డతఁడు
మందభాగ్యుఁడ నన్ను మంచునో లోదా''
అనుచు గతాగతప్రాణియై శిశువు
నిను మదినుంచి చింతించు నవ్వేళ.
మించుమేఘంబుపై మెఱసెడునట్లు
కాంచనవస్త్రమ్ము కాయమం దమర
గండభాగమ్ములఁ గమనీయకనక -
కుండలమ్ములకాంతి గొనబుగా వెలుఁగ
ఉదయభాస్కరమండలోపమప్రథిత -
విదితకిరీటమ్ము వెలయుచునుండ
వనమాలికాదిదివ్యవిభూషణాదు -
లనుపమకాంతుల నలరారుచుండ
శరవహ్ని నణఁగించుసంభ్రమమౌట
అరుణమ్ము నేత్రమ్ములందుండి పర్వ -
నంగుష్ఠమాత్రదేహముఁ దాల్చి చేత
రంగగుగదఁ బట్టి రమణీయరూప - 420

మేపార నుదయించి యివము హరింప
దీపించు రవివలె దీనుఁడౌబాలు
చుట్టును గద ద్రిప్పుచును శరవహ్నిఁ
బుట్టెడువేఁడిమిఁ బోకార్చి శిశువు -
తాపము మాన్చి సంతసమును గూర్చి
ఆపదఁ బాపితి హరి వాసుదేవ
గద చేతఁబట్టి నగ్నాపాడినట్టి -
సదయుఁ డెవ్వండని చర్చించి బాలుఁ -

డెదురయి చూడ నదృశ్యుండవైతి
విదితముల్ గావు నీవింతకర్జములు
సకలశుభంబులు సమకూర్చునట్టి-
యొకశుభలగ్నాన నుదయించె శిశువు
పౌరవసంతతి పర్ధిల్ల వీని
కారుణ్యవారిధి ఘనుఁడు విష్ణుండు
బ్రదికించెఁగద విష్ణురాతుఁడన్ పేర-
నెదుగు వీఁడని యార్యులెల్లఁ బేర్కొనిరి
తనతల్లియుదరానఁ దన కగుపడ్డ-
నిను విశ్వమంతయు నిండినదేవుఁ-
డని పరీక్షించుట నాతని లోకు-
లనిరి పరీక్షితుఁ డని ప్రసిద్ధముగ. 430

వేదమయా జగద్విఖ్యాతచరిత
నీదుసంస్మరణమ్ము నిఖిలార్తిహరము
ఆపదుద్ధరణ నిన్ననవరతమ్ము
ప్రాపుగా మదినెంచి భజియించినంత
కష్టముల్ దొలఁగు సుఖమ్ములు గలుగు-
నిష్టార్థసిద్ధి యెంతేని చేకూరు
భవదీయపవిమలభజనానురక్తి
భవదూర నాబుద్ధిఁ బట్టించుమయ్య.

## శ్రీకృష్ణుఁడు పాండవులయెడఁ జూపిన దయావిశేషములు:—

శ్రీసరసిజనేత్ర శ్రితజనస్తోత్ర
వాసవార్చితపాద భక్తానుమోద
నీదుకటాక్ష మందినఁజాలు నరుఁడు
మేదిని దనుఁడె మెలగంగఁగలఁడు

పాండుకుమారులపక్షమందుండి
నిండైనదయఁ జూపి నిఖిలకార్యముల
వారికి విజయ మాపాదించినట్టి-
శౌరి నీ కిదె నమస్కారశతంబు
ద్రుపదజ నెటికురుల్ దుర్వృత్తిఁ బట్టి
యపరాధమనక సభాంతరమునకు -
నీడిచి తెచ్చినహీనులసతుల -
పోడిమి చెడ కేశముల్ హరియించి 440

పాండవేయులకును బాంచాలసుతకు
నిండుగా మోదమ్ము నెమ్మిఁ గూర్చితివి.
కట్టినపుట్టముల్ ఖలు లూడ్చుచుండ
గట్టిగా నిను నమ్మి కాపాడు మనుచు
పాంచాలి వేఁడగా వస్త్రమ్ము లొసఁగి
మించినయట్టిపేర్మినిఁ బ్రోచి తీవు
వనవాసకష్టముల్ వడుపాండవులకు
వనటఁ గూర్పఁగ కౌరవపతి పంపంగ
పదివేలశిష్యులు భక్తి సేవింప
కదలి దుర్వాసుండు కాన కేతెంచి
అన్నంబుఁ బెట్టింపుఁడన పాండుసుతులు
క్రన్నన పెట్టింపఁగలమని చెప్పఁ
బెట్టింపకున్న శపింతునం చతఁడు
గట్టిగాఁ బల్కి మున్గఁగ నది కేఁగె
వార లంతకుమున్నె వండినబోన -
మారగించిరి సమయము దాఁటెఁగాన
కడవల నన్నశాకము లెవ్వి లేవు
కడుదుష్కరసమస్య గల్గె వారలకు

ఆవేళ ద్రుపదరాజాత్మజ నిన్ను
భావంబులోపల భావించి వేఁడ, 450

పాండవుల్ ముదమొందఁ బ్రత్యక్షమగుచు
భాండశిష్టాన్నంబుఁ బ్రాశించి తపసి -
నుదరపూర్ణునిఁ జేసి యుగ్రమ్ము వాపి
సదయునిగాఁ జేసి సాగనంపితివి;
పురహరుఁ బందికై పోరాట గెల్చి
యరుదుగా పాశుపతాస్త్రమ్ముఁ బడయఁ -
దనదేహముననె సుత్రాముపీఠార్ధ -
మును నధిష్ఠించి పెంపును పేరు నొందఁ
గాలకేయనివాతకవచాదిదైత్య -
జాలమ్ము క్షణములో సంహరింపంగ
గోగ్రహణమ్మునఁ గురువీరచయము
విగ్రహమ్మున గెల్చి విజయమ్ము నొంద
అరులయుష్ణీషమ్ము లన్నియుఁ దెచ్చి
విరటుపుత్రికకిచ్చి వేడుక గూర్ప,
నరునకు నీకరుణాకటాక్షమ్మె
వరముగా బలముగా వరలెఁ గదయ్య
భారతయుద్ధానఁ బార్థుఁడు గోర
సారథిత్వమున నశ్వములపగ్గాలు
డాకేల, మరి కొరడా వలకేల,
వీకఁ బట్టి కిరీటివిశిఖచయమ్ము 460

వారక మున్నె యాపరయోధవీర -
ఘోరబలోత్సాహక్రోధోద్యమంబు
నీదృష్టులన మాన్చి నిస్తులోత్సాహ -
మాదృతి నరునకు నరయఁ గూర్చితివి ;

ద్రోణకర్ణాదియోధులు ప్రయోగించు -
బాణజాలమ్ములు పార్థునిదెసకు
శ్రీకృష్ణ! నీదయాదృష్టిహేతువున
రాకుండఁ దొలఁగె నారణరంగమందు
సైంధవుఁ జంపువానరమున నరుఁడు
బంధురముగ భూమి బ్రద్దలుసేసి
ములుకులచేఁ దీరములు వెలయించి
కొలఁకు నిర్మితిచేసి ఘోటకమ్ములను
శత్రువు లరుదన జలముల దింపె
చిత్రమ్ముగా నీదు చెల్మిభాగ్యాన
నెచ్చెలీ యని పిల్చి నెనరు చూపితివి
మచ్చిక మఱఁదని మాటలాడితివి
బందుగుమర్యాద పాటించి తీవు
పొందుగా ధనమిచ్చి పోషించి తీవు
అరయ మంత్రివైతి వాలోచనమున
గరపితి బోధివై జ్ఞానమార్గమును 470

సారథి వైతివి చనవు గల్పించి
నేరముల్ మాన్పితి నిండినప్రేమఁ
గ్రీడించితివి మరి గేలిసేసితివి
తోడుగా నుండి పొత్తున భుజించితివి;
పార్థునిపై నీకుఁ బ్రణయమ్ము ఘనము
పార్థున కీ వన్న భక్తి తోరమ్ము
వారిజాక్షులలోన వాద మేర్పడిన
వారించి రమ్మని పార్థుఁ బంపెదవు
అంతఃపురస్త్రీరహస్యభావములు
వింత లర్జుననకు వినిపించుచుందు

నీదుభక్తులకును నీకు నెప్పుడును
భేద మేకోశాన లేదు సర్వేశ!
హరి! నీవు నీదులీలావతారమ్ముఁ
బరిహరించితివి నీపదునారువేల -
నంతిపురస్త్రీల నందఱఁ గ్రీడి
కాంతారమున నొంటిగాఁ దనవెంట
బడిరాగఁ దోడ్కొని పయనమ్ముసేయ
నడుత్రోవలోనఁ గాననియటుల్ వచ్చి
బోయలు మూఁగి యా పొలఁతులఁ బట్టి
నాయర్జునుఁడు వారి నాఁపలేఁడయ్యె. 480

ఆనాఁటి రథికుఁడె, యానాఁటితేరె
ఆనాఁటిశరములె, యానాఁటిహరులె
కాని, యేనాఁడు నిన్ననలేదొ క్రీడి
యానాఁడె వ్యర్థమ్ము లయ్యె నన్నియును ;
దిక్కు నీవే వేఱు దిక్కేది నాకు
దిక్కయి ననుఁబ్రోవు దీనశరణ్య
అని నిన్ను నమ్మభక్తాళికష్టమ్ము -
లను మాన్పి శ్రేయమ్ములను గూర్తు వీవు
అనిశము నీశరణ్యమె గోరుచున్న -
ననుఁ గావుమయ్య దీనజనమందార.

## భూదేవీ ధర్మదేవతల సంభాషణము

ములుతోన ములుఁ దీసి ముళ్లు రెండిటిని
వెలిఁ బాఱవేసెడువెరవరిలాగు
యాదవరూపదేహముచేత హింస
మోదించు దేహుల బొరిగొని నీదు

దేహంబు విడిచితి దివ్యస్వరూప
పాహి పాహి రమేశ పాహి మాం పాహి ;
మును సరస్వతీతీరమున వృషరూప -
మును దాల్చినట్టి ధర్ముఁడు ధేనురూప -
మున నశ్రువులు రాల్చు భూదేవిఁ గాంచి
యనుతాపమును జూపి యనియె తా నిటుల. 490

“తల్లి! భూదేవి, నీతనుశోభ తఱిగె
వెల్లిగాఁ గన్నీరు విడుచుచున్నావు
శ్రేయమేగద నీదుప్రియబంధువులకు
నీయసంతృప్తికి నిజమన నెదియొ
పాదత్రయము లేక పాద మొక్కటియె
పాదుగా నున్న నన్ బంధించ నీచ -
మానవు లుద్ధతి మలయుదు రనియొ,
పూనితే యనుతాపమును; గాక యున్న
మఖములు లేమి నమర్త్యుల కింక
మఖభాగసంపద మానుగా ననియొ,
పతులు సతుల నింక పాలింపరనియొ,
పితరులఁ బుత్రులు ప్రేమింపరనియొ,
పతితులు దేశానఁ బ్రబలుదు రనియొ,
క్షితిపుల విప్రులు సేవింతు రనియొ,
కులిశహస్తుఁడు వానఁ గురియింపకున్నఁ
బలుకష్టములు ప్రజల్ పడఁగలరనియొ,
హీనులు రాజ్యంబు లేలుటవలన
మానైనధర్మముల్ మఱుఁగగుననియొ,
మనుజులు భోజనమైథునశయన -
ధనభోగములయందుఁ దగులుదురనియొ 500

శౌరి శ్రీ కృష్ణుండు జనియించి నాదు -
భారమంతయుఁ దీర్చి ప్రమదంబు గూర్చె
ఆదేవుఁ డరిగె నాయానంద ముడిగె -
నేదుష్టశాసన మిఁక యెట్టు లనియొ,
మరి యెందులకొ దుఃఖమగ్నచిత్తమున
పరితాప మిట్టులఁ బడుచునున్నావు"
అని ధర్మదేవత యడుగ భూదేవి
తనదువిచారమంతయు నిట్లు వినిచె;
"ఓ ధర్మదేవ! వృషోత్తమరూప!
సాధుపోషిత! సదాచారసంపన్న
నీపరిస్థితి గన్న నెనరయి మిగుల
తాపంబు గలిగించె ధర్మస్వరూప
నాలుగుపాదాల నడిచెదు తొల్లి
యీలాగు నొకపాద మేర్పడె నీకు
నారాయణుఁడు లేమి నాకును నీకు
పోరాము లీతీరు పొడమెఁగదయ్య
మరి సత్యశౌచాదిమహితగుణాల -
కిరవగుశ్రీకృష్ణుఁ డేఁగినపిదప
కడు భయంకరమగు కలిప్రేరణమునఁ
జెడినపాపులఁ జూచి చింతించుదాన; 510

దేవతలకు పితృ దేవతలకును
గోవులకును సత్త్వగుణయుతులకును
సకలవర్ణాశ్రమాచారశీలురకు -
నకలంకదైవచింతాసక్తులకును
పీడలు నానాఁట పెరుగుగా యంచు
నాడెందమందుఁ గొందల మందుదాన;

ఎవనికటాక్షమ్ము నిచ్చించు బ్రహ్మ
యెవని భక్తిగ భజియించు శ్రీలక్ష్మి
యెవనిఁ జిత్తంబుల నీక్షింత్రు మౌను-
లెవనికథల్ నుతియించు వేదములు
అట్టి శ్రీ కృష్ణునియడుగుఁ దామరలు
మెట్టవు నన్నని మిడికెడుదాన
హరిపాదములు సోఁకినన్నిదినాలు
స్థిరచిత్తమున నుంటి చెలువమ్ముగంటి
శ్రీలలనేశనాశీర్విశేషమున
నాలుగుపాదాల నడచుచునుంటి
ఆ దేవుమధురోక్తు లాదేవునయము-
లాదేవుదరహాస మా దేవుకరుణ
ఆ దేవుమురిపంబు లాదేవుతగవు-
లాదేవు గమన క్రియామంజులములు 520

ఆదేవుప్రేమకరావలోకనము-
లాదేవులోకమోహనరూపగరిమఁ
గనఁజాల మిఁక కృష్ణుఁ గాంతలే గాదు
ఘనయోగులును బాయఁగా నోర్వఁగలరె."
అని నీపరోక్షమ్మునందు ధర్మునకు
జననిభూదేవియు సంతాపపడిరి.
నీదర్శనముచేత నిఖిలభూతులకు
పాదయి లోకమ్ము పరితోషమందు
నీదర్శనము లేక నిఖిలబాధలకు
పాదయి లోకమ్ము పరితాపమందు
నీదర్శన మొసంగి నీదయఁ జూపి
యాదరింపను నను నఖిలశరణ 526

## పరీక్షిత్తు శాపవృత్తాంతము ప్రాయోపవేశము :—

శ్రీవార్ధికన్యకాచిత్తాబ్జభృంగ
నీవార్త లెఱిఁగిన, నీ కథల్ విన్న-
వేమానవుని కేని మృత్యుభయమ్ము
పామరత్వము మోహపటలమ్ము దొలఁగు
ఒకనాడు వేటకై యుగ్రవనమ్ము-
నకుఁబరీక్షిజ్జననాథుండు వేడ్క
గొని పోయి, యావనిఁ గ్రూరమృగాలఁ
దునిమి, యలపుతోన దూప బాధింప- 530

నొకతపోవనముఁ దా నోపిక చేరి
యకలంకనిష్ఠమై ధ్యానమందున్న-
ముని శమీకుని నీరముం గోర నతఁడు
కననివిననియట్లు కదలక యుండె;
బాపఁ డతండు గర్వమతి యంచతని-
మూపున మృతసర్పమును బడవైచి
చనెఁ బరీక్షిత్తుఁ; డాసంయమిసుతుఁడు
తనతండ్రిదశ చూచి, దయమాలి శృంగి :—
“మాతండ్రిమూపున మరణించినట్టి-
భీతిదమౌ పాముఁ బెట్టినయట్టి-
నరపతి యేడవనాఁటికిఁ జచ్చు
హరిహరాదులు గావనరుగుదెంచినను
క్రూరతక్షకఫణిఘోరవిషాగ్ని
మారు లే దిఁక” యని మండి శపించె.
తనశాపవిధము నంతయుఁ బరీక్షితుఁడు
విని యది నిజదోషవిధియని తలఁచి

కామాదివిషయసక్తతనున్నతనకు
క్షేమమైనవిరక్తిఁ జేకూరుటకును
తక్షకఫణిఘోరదంష్ట్రావిషాగ్ని
యక్షయమార్గమై యలరారుననుచు 540

భాగీరథీతీరభాగమ్ముఁ జేరి
రాగమ్ము విడిచి వైరాగ్యమ్ము వడసి
కాయమ్ముపై భ్రాంతి కడఁద్రోసి యతఁడు
ప్రాయోపవిష్టుఁడై భక్తితో నుండె;
ఆరాజుఁ గనువేడ్క నాగతు లైరి
నారదుఁడాదిసుజ్ఞానులౌ మునులు
ఆమహనీయుల కతఁడు దండప్ర-
ణామముల్ చేసి విన్నప మిట్లు చేసె
"మునిచంద్రులార! వ్యామోహమ్ము తొలఁగ-
ననువగుమార్గ మెయ్యది నాకు; మరియు
నేడునాళులకు నే నేరీతి ముక్తిఁ
గూడఁగలనొ తెల్పఁగోరెద మిమ్ము."
అని వేడుచుండ నాయవనీశుకడకు
ఘనుఁడు శుకబ్రహ్మ కరుణ నేతెంచె.
ఆయవధూతకు నాపరీక్షితుఁడు
పాయనిభక్తి తత్పరతఁ గేల్మోడ్చి
"ఆవును బిదికెడు నంతకాలమ్మె
నీవు నిల్తువు పెచ్చు నిలువ వెచ్చటను
ఐన నే మోక్షమ్మునందుమార్గమ్ము
మౌనిసత్తమ తెల్పి మన్నింపఁగదవె."
అని ప్రార్థనము సేసె; నార్రాజచంద్రు- 550
మనవి మన్నించె నమ్మౌని శుకుండు. 551

ఇది ప్రథమ స్కంధము

---

# ద్వితీయ స్కంధము.

## శుకమహర్షి పరీక్షితునకు భాగవతమును వినిపింపఁ

**బూనుట :—**

అనఘుఁడు శుకముని యవనీశుతోడ
"వినుము రాజేంద్ర నీ విజ్ఞాపనమ్ము
వరము; మోక్షము నీకుఁ బ్రాప్తించుతెఱఁగు
నెరిగింతు, విడువు నీ హృదయతాపమ్ము;
ద్వైపాయనుఁడు నాదుతండ్రి వ్యాసుండు
ద్వాపర నాచేత భాగవతమ్ము
పఠనమ్ము సేయించె; బ్రహ్మతత్పరత
పఠియించితిని నేనుఁ బాయనిభక్తి.
హరిపాదభక్తుండవగునీకు దాని-
నెరిఁగింతు దాన నీయెడ తాప మడఁగు
భాగవతమ్మును భక్తితో వినిన
రాగాదు లడఁగి నారాయణుఁగొలుచు
పరిశుద్ధచిత్త మేర్పడు; భవభీతి
పరిహారమగు; ముక్తి ప్రాప్తించు" ననుచుఁ
గృప శుకయోగి పరీక్షిన్నృపతికి
విపులభాగవతమ్ము వినిపింపఁదొడఁగె
భాగవతనిగూఢభావంబులెల్ల
బాగుగా నామది వఱల బోధించి
మోక్షసిద్ధికి మార్గమును జూపి నన్ను
రక్షించుమయ్య భద్రాయితమూర్తి.

## ఖట్వాంగచరిత్రము :—

శ్రీసచ్చిదానంద జేజే ముకుంద
వాసవార్చిత దివ్యపాదారవింద
గోవింద నిను భక్తిఁ గొంతసేపైన
భావించినను ముక్తిఁ బడయంగవచ్చు;
మున్ను ఖట్వాంగుఁడన్ భూపతిచంద్రుఁ-
డెన్నంగ దీవుల నేడింటి నేలు-
నాతనిపాలన మతిధర్మమగుట
భూతలమున శాంతి పొదలుచునుండెఁ
కలహాన నొకపరి ఖలరాక్షసులకు
బలభేదిముఖ్యదేవత లోడివచ్చి
ధరణిప ఖట్వాంగుఁ దమకుఁ దోడడుగ
సరియని యారాజు స్వర్గముఁ జేరి
దనుజుల నందఱ ధ్వంసమ్ముసేయ
మనములఁ బొంగి యమర్త్యులు నీకు
వరమిత్తుమన రాజు వారలఁ గాంచి
"యరుస మందితి మీదయాకృతజ్ఞతకు
నవశిష్టమైననాయాయుఃప్రమాణ
మవగత మొనరింపుఁ డది నాకు పరము,
వేరొండు వలద" న, విబుధు లింకొక్క
మూరుతమే యన, భూపతి గగన- 20

యానమునను వచ్చి యవనికిఁ దనదు-
ప్రాణప్రియల బంధువర్గాల హితుల
సకల సామ్రాజ్య ప్రశస్తసంపదల-
నకలంకమతితోడ త్యజయించి గాఢ-

వైరాగ్యమంది నీభవ్యనామంబుఁ
గోరి కీర్తించి వాక్కుల కందరాని -
కైవల్యమును రెండుగడియలలోన
దేవతలెల్ల నుతించ సాధించె;
గరుడవాహన యొక్కక్షణమేని నిన్ను
స్మరియించునట్టినిశ్చలభక్తి నాకుఁ
బ్రాపింపఁ జేసి నాపాపముల్ దొలఁచి
శ్రీపతీ నీలోనఁ జేర్చుకోవయ్య.

## శ్రీమన్నారాయణునిలీలావతారంబుల యభివర్ణనము:—

శ్రీలలనామణీచిత్తేశ నీదు -
లీలావతారముల్ లేఖర్షభాది -
దేవతలైనను దెలియంగలేరు
నా వశమా యభినందించ స్వామి;
కనకాక్షదైత్యుఁడు కాశ్యపిఁ జుట్టి
కొనిపోయి డాగఁగాఁ గూపారమందు
ఆదికోలమవయి యసురు భంజించి
మేదినిఁ బైకెత్తి మెచ్చు నొందితివి; 30
అరయంగ రుచికిని నాకూతి యనెడు
గరితకుఁ బుట్టి శ్రీకరసుయజ్ఞాఖ్య -
వలరుచు సుయమనామామరస్తోమ -
మెలమి దక్షిణయను నింతిమూలమునఁ
గలిగించి జగములఁ గలఁచెడు నార్తిఁ
దొలగించితివి; నిన్ను తోరంపుభక్తి
మనువు స్వాయంభువు మాతామహుండు
వినుతించె హరివి నీవేయని పొంగి

మాననీయుఁడు కర్దమప్రజాపతికి
ధీనిధి దేవహూతికి గపిలాఖ్య
జనియించి నినుఁ జేరు సాంఖ్యయోగమ్ము
జననికిఁ గఱపితి జన్మ తరింప
అత్రిమహాముని యచ్యుతా! తనకుఁ
బుత్రుని గోరి నిన్ బూజింప నేన
దత్తుఁడ నీ కౌదు తప్పకయనుచు-
నత్తపసికి బిడ్డవయి జనించితివి
అది కారణముగ దత్తాత్రేయనామ-
మొదవె; నాయవతారమున నీకు దేవ
ఈయవతారమం దెనఁగునీపాద-
తోయజమ్ముల రజస్తోమంబు సోఁకి 40

యాదవుల్ హైహయులైహికాముష్మి-
కాదిసుఖంబులఁ గలిగించుయోగ-
బలసంపదలఁ బొంది వాసికి నెక్కి-
రలఘుచరిత్ర నీయాదృతివలన;
పరమేష్ఠి యాదివిశ్వమ్ము సృజింప
దొరకొని తపము నిస్తులనిష్ఠ సేయు-
నవసరమున 'సన' యనియె నక్కతన
నవతరించిరి సనాఖ్యల నల్వు రపుడె;
నలువకు వారు మానసపుత్రులనఁగ
వెలసి, తత్త్వమెఱుంగువిధము లోకమున
విస్తరింపఁగఁ జేసి విశ్రుతి నీకు
శస్తమౌ కళలంది సజ్జనలోక-
తతి సనకాద్యవతారంబనంగ
నుతికి నెక్కిరి జగన్నుత పూతచరిత;

ధర్మనకును దక్షుతనయమూర్తికిని
నిర్మలమానసనియతి నరాఖ్య-
నారాయణాఖ్య నందనులుగాఁ బుట్టి
సారతపోవృత్తి సలుపుచు నుంటి;
బదరికావని మీతపమ్మును జెఱుపఁ
గదలి వచ్చిరి దేవకాంతలు శక్రు- 50
ప్రేరణమ్మున వారిశృంగారచేష్ట-
లారయ మీముందు వ్యర్థమ్ములయ్యె;
నారాయణతపస్వి నగి తనతొడను
జీరఁ బుట్టిరి యూర్వశీముఖస్త్రీలు;
ఊరువునందుండి యుద్భవించుటను
పేరు ప్రఖ్యాతియుఁ బెరిగె నూర్వశికి;
దేవకాంతలు భవద్దీక్షలు మాన్ప-
నేవిధమగుత్రోవ నెఱుఁగక నోడి
తమకు నూర్వశిని పెద్దగఁ జేసికొనుచు-
నమరలోకమ్మున కరిగి రందఱును;

అనఘుఁ డుత్తానపాదాఖ్యభూపతికిఁ
దనయుఁడవై పుట్టి తగు పెంపుఁగంటి;
చిననాట జనకుని చెంతవసించు
నినుఁగని పినతల్లి నిందింప నొచ్చి,
యడవికి నొకఁడవే యరిగి తపమ్ముఁ
గడునిష్ఠఁ గావించి, కాయమ్ముతోన
దివిఁజేరి యందున దివిజులు పొగడ
ధ్రువపదస్థుఁడవయి తోరంపుమహిమ
అటు పైనఁ గ్రిందున నర్థి వర్తించు-
జటికులోత్తములు నిన్ సంస్తుతియింప 60

వరలుచున్నావు వరద లోకేశ
యరయంగ నిదియ ధ్రువావతారమ్ము.

మును విప్రశాపమ్ముఁ బొంది వేనుండు
చనె దుర్గతికి నంత సన్మునుల్ వేడ, -
నారాజుదేహమ్మునందుండి పొడమి
నారకమువనుండి నరనాథుఁ బాపి
పృథుచక్రవర్తినాఁ బేరునఁ బెరిగి
పృథివి గోవుగ వస్తువితతినిఁ బిదికి
జగతికి శ్రేయమ్ము చక్కఁగఁ గూర్చి
పొగడొందితివి సురల్ మునులు హర్షింప.

వేదాంతవేద్య నాభికి, సుదేవికిని,
మోదముగల్గ నీమూర్త్యంతరమున
వృషభస్వరూపమ్ము వెలయంగఁబుట్టి
విషయవాంఛలు మాని విబుధులు మెచ్చ
పరమహంసను గనుపద్ధతి లోక -
మెఱుగంగఁ దెల్పితి వృషభావతార.

చతురాననుఁడు సేయుజన్నమ్మునుండి
యతితేజమొప్ప హయాననరూప -
మునఁ బుట్టి నిశ్వాసములనుండి శ్రుతుల
జనియింపఁ జేసితి జగదీశ నీవు. 70
శ్రీకర నీహయగ్రీవరూపమ్ము
లోకకల్యాణమ్ము లోకసంరక్ష.

ప్రళయ మేర్పడి విష్టప మ్మెందుఁ జూడ
జలమయమయి సాధ్వస మ్మేర్పడంగ,

దయతోడ మత్స్యావతారమ్ము దాల్చి,
భయపడి పెన్నావవయి నెక్కియున్న -
వైవస్వతమనువు వార్ధిమధ్యమున
నావయుఁ దాను మగ్నముగాకయుండ
కాపాడి, వేదభాగములకు నీవె
ప్రాపయి వానిని బ్రహ్మకొసంగి
వెలసిన నీతత్త్వవిధ మిట్టిదనుచుఁ
దెలియంగఁ జాలరు దేవతలైన.

సుర లసురులు గూడి సుధకువై క్షీర -
శరనిధి మందరాచలముఁ గవ్వముగ -
నొనరిచి తరుచ మహోదధి శిఖరి
మునుఁగ తాఁబేటిరూపున నీవు దానిఁ
దాలిచి, యాపర్వతభ్రమణమున
తొలఁగించితివి వీఁపుదురద మహాత్మ
గోవింద భవదీయకూర్మావతార -
భావంబు జగతికి భవ్య మవ్యయము. 80

సురలోకముఁ గలంచి సురల స్రుక్కించి
కరమున భీకరగద ధరియించి
చెలఁగుహిరణ్యకశిపుకుక్షి నఖర -
ములఁ జీల్చి, ప్రేవుగుంపులు వెలికీడ్చి
పరిమార్చితివి సురవర్గమ్ము పొంగ
నరసింహమూర్తివై నగవైరివంద్య.
కరిరాజు మున్ను మకరిపట్ట మిగుల
పరితాపమంది "నాబాధ వారించు
వేలుపులే లేర, వినర నామొఱ్ఱ
జాలి చూవర, నాదు సరసకు రార,"

అని వేద విశ్వమయత్వమ్ములేమి
విని యూరకుండిరి వేల్పులందఱును;
హరి నీవె నాకు దిక్కని గజరాజు
స్మరియింప, వచ్చి యామకరమ్ముఁ ద్రుంచి
మోదమ్ము హస్తికిఁ బొనరించినట్టి-
యాదిమూలవతారా! వందనమ్ము.

అదితికి తనయుఁడవై జనించితివి
యెదిగితి వమరులకెల్లఁ దమ్ముఁడుగ
వామనరూపాన బలికడ కేఁగి
భూమి మూఁడడుగులు పొందఁగోరితివి; 90
పాదత్రయిని విష్టపములు—మూడింటి-
నాదైత్యుచేఁ బొంది, యమరనాథునకుఁ
అతిప్రీతి నొసఁగితి వాడ్యుఁడవయ్యు.
ఖతిమాలితివి ధర్మపరిరక్షకొఱకు,
బలిచక్రవర్తియు, భార్గవుండాడు-
పలుకులు వినక నీపలు కాదరించి,
తనమౌళి నీదుపాదము ధరియించి,
వినుతవదాన్యాఖ్య వెలసె లోకాన.

హంసావతారమ్ము నంది పంకమ్ము
ధ్వంసమ్ము గావించుభక్తియోగమునఁ
దనిసి నీయాత్మతత్త్వముఁ దెల్పునట్టి-
యనఘమౌభాగవతాఖ్యపురాణ
మెలమి నారదముని కెఱుక చేసితివి.
జలజాక్ష భక్తవత్సల దేవదేవ

యెలమి మన్వవతారమెత్తి స్వకీయ-
విలసితతేజమ్ము, విభవమ్ము వెలయ

చక్రమ్ముఁ దాల్చి దుర్జనభూమిపతుల
విక్రమంబున దండవిధిని శాసించి
సుజనులఁ గాచితి సురలోకవంద్య
నిజముగా నెఱుఁగరు నీలీల లెవరు. 100
అరయ ధన్వంతరియనఁ బుట్టి నిన్ను
స్మరియించువారి యామయములఁ బాపి
పొనర నాయుర్వేదమును జగత్క్షేమ-
మునకు సృష్టించితి ముక్తిప్రదాత.

అవని గంటకులైన హైహయరాజ-
నివహమ్మునెల్లను నీకుఠారమున
ముయ్యేడుమారులు మొగి సంహరించి,
నెయ్యమ్ముతో విప్రనికరమ్మునకును
భూమి నిచ్చిన దివ్యపూరుష పరశు-
రామావతార పరాక్రమోదార.

రవివంశదుగ్ధపారావారమందుఁ
గువలయపతినాఁగ గొమరొప్పఁ బుట్టి
జనయిత్రియైనకౌసల్యకు మరియు
జనకుఁడౌదశరథక్ష్మాపాలునకును
ప్రమదమ్ము గూర్చినరామావతార ।
అమరవైరి విదూర! అర్థిమందార ।
లక్ష్మీకటాక్షవిలాసులౌ భరత-
లక్ష్మణశత్రుఘ్నలలితాభిధాను-
లనుజులు ముగురు నిన్నర్థి సేవింప
దినకరకులనాథ తేజరిల్లితివి. 110
శివధనుర్భంగప్రసిద్ధి యుంకువగ-
నవనీసుతను వివాహము చేసికొంటి.

జనకాజ్ఞ సీతయు సౌమిత్రి నిన్ను
వెనుకొన నరిగితి విపినభూములకు,
దండకాటవి మునితండంబు మెచ్చ
దుండగీడుని ఖరుఁ దున్మి తూఁటాడి,
పవనకుమారుని బంటుగా నేలి,
దివిజేంద్రుతనయుని దివిఁజేరఁ గొట్టి,
రవికుమారునకును రాజ్యమ్ము, రమణి
నవరించితివి కడు సాహసమ్మునను.
దంటతనాన సీతకునై త్రిలోక -
కంటకుఁడగుదశకంఠుఁ దున్మాడఁ
గపిసేనతోఁ గృతగమనుఁడవగుచు
విపులాభిమానసంవృతబుద్ధితోడ
త్రోవ చూపక పేర్చుతోయధిఁ గోప -
భావారుణాంబకప్రస్ఫుటతీక్ష్ణ -
వీక్షణమ్ముల నీవు వీక్షింపఁ గడలి
యాక్షణమున నింక, నాసాగరుండు
శరణు నీవే స్వామి, శరణు నావలని -
యరయమి మన్నింపు మని వేడఁ, దొల్లి - 120
యటుల వారిధి నిల్పి, యందు సేతువును
బటువుగా నలునిచే బంధింపఁజేసి,
వనచరసేనతో వననిధి దాఁటి
ఘనరాజనమున లంకాపురిఁ జేరి
మువ్వురముల నొక్కములికినిప్పనకు -
నప్పించినట్టిమహాదేవుపోల్కి
యొకతీక్ష్ణబాణప్రయోగాన లంక
సకలమ్ము చెడఁగ ధ్వంసమ్ము చేసితివి.

రావణు లోకవిద్రావణుఁ జంపి
నీవిలసితకీర్తి నింపి తెల్లెడల.
ధరణి శ్రీరామావతార చింతనము
పరమపావనము శుభప్రదము వరమ్ము.

అసురాంశమునఁ బుట్టినట్టిభూపతులు
విసిగించి ధాత్రిని వేధించుచుండ
నాపంటవలఁతిదైన్యము వాపఁదలఁచి
శ్రీపతీ! నీసితాసితకేశయుగమె
తలపోయఁగా సమర్థమని తదంశ -
ముల రామకృష్ణులై భూమాత యలర
మోదమ్ము సురలును మునులు వొందంగ
యాదవవంశాన నవతరించితివి. 130
వసుదేవుసతులు సువ్రత రోహిణియును
వసుధసమానదేవకియును మున్ను
ఏనోము నోచిరో ఈశ్వరు నిన్ను
సూనులుగాఁ గనుసుకృతసంపదకు.
బలరామకృష్ణులైపరగుమీలోన -
నలరె శ్రీకృష్ణుమాహాత్మ్య మెక్కుడుగ.

పురిటిబిడ్డగ నుండి పూతన శమను -
పురి కంపితివి ప్రాణములు హరించి;
మూఁడువెలల ప్రాయమున మించి శకటు
పోఁడిమిచెడ మృత్యుముఖముఁ జేర్చితివి.
మద్దులఁ గూల్చితి మాత నిన్ ఱోటఁ
దద్ద బంధించిన తరుణమ్మునందు.
మను దింటివని నిన్ను మందలింపంగ
జనని యశోద కాస్యము చూడుమనుచు -

నందున విశ్వమ్ము నంతయుఁ జూపి
పొందిక నాయమ బుద్ధిఁ ద్రిప్పితివి.
కాళియసన్నగు గర్వమ్ము దింపి
మేలు ద్రేవల్లెకు మిగులఁ గూర్చితివి.
రేతటి కార్చిచ్చు రేఁగగా మ్రింగి
భీతి మాన్పించితి వ్రేపల్లెప్రజకు. 140
మందుఁడై నిసి నదీమగ్నుఁడైయున్న -
నందుఁ దేల్చితివి ప్రాణమ్ములతోడ ; -
నసుర యొక్కండు మాయాబుద్ధి గోప -
విసరమ్ము నొకగవిఁ బెట్టి తత్పథము
నీరంధ్ర మొనరింప నిజమెల్ల నెఱిఁగి
పోర నారక్కసుఁ బొరిగొని మాయఁ
దూలించి గొల్లల దుఃఖముల్ దొలఁచి
పాలించితివి వారు భద్రమ్మునొంద.
వల్లవు లేఁటేఁట వజ్రి మెచ్చంగ -
నుల్లాసమున సవనోత్సవ మొందు
పలుపుదు రద్దాని జరుపరాదంచు
నిలిపించితివి లోకనియమనిర్ణేత.
ఇంద్రుఁ డామార్పు సహింపంగ లేక
సాంద్రవర్షాపాతసారమ్ముచేత
గొల్లలల్లెల గోపవాసములను
తల్లడిల్లగఁజేయ తరలు దటంచు,-
నానసేయఁగ ప్రళయాభీలచటుల -
నానాభ్రసమితి సాంద్రముగ వర్షించి
మందలెల్లెడల నమందదుఃఖమ్ము
పొందునట్లొనరింప పొగిలి గోపకులు 150

రక్షింపుమా కృష్ణ! రక్షింపు లోక-
రక్షక! యని నిన్నుఁ బ్రార్థనసేయ,
కరుణాళుఁడవు వారిఁ గావఁగానెంచి
గిరినొండు గొడుగుగాఁ గేల ధరించి
సప్తాహములు పశుజాతి గోపకుల
గుప్తజీవితులుగఁ గూర్మిఁ బ్రోచితివి.
ఏడేళ్ల బాలుఁడ వెంతటిమహిమ
చూడంగఁజూడంగ చోద్యమయ్యెడిని
పండువెన్నెల బృందఁ బరమమోదమున
నిండురాసక్రీడ నెరపగా నెంచి
స్వరభేదములు మరి స్థాయిభేదములు
సరళకళలును మూర్ఛనలు జాతులును
వెలయ మనోహర వేణుగానమును
లలితాంగుళీన్యాసలాలనవలన
దారువుల్ చివురింప తన్మయత్వమున
మొరయించితి జగమ్ము మోహమ్మునొంద.
నీమురళీమంజునిస్వనాహూతి
భామ లేతేర గర్వమున యక్షుండు
గొంపోవ వారలు కుయ్యిడ వాని-
తెంపునుబెంపును దించి యాస్త్రీలఁ 160
బరిరక్షగావించి పాలించి తీవు.
హరి! కృష్ణ! నీలీల లత్యద్భుతములు
నరకాదులను నీవె నాశమ్మొనర్చి
మరియు దుర్మార్గాన మహివేలునృపుల
బలదేవ, భీముని పార్థు నర్థముగ
నిలిపికొంచు హరించి నిఖిలధరిత్రి

భారమ్ముఁ దగ్గించి, భద్రమ్ము, శాంతిఁ
గూరిచి సాధులకోర్కెలు దీర్చి
యలరిన నీదు దివ్యావతారమ్ముఁ
దలఁచిన శ్రీకృష్ణ! తలఁగు పాపమ్ము.

యుగయుగమున దురుద్యోగమ్ము మరగి
సుగతి మార్గమ్మెమొ శోధించనట్టి -
మానవులకు నగమ్యములు త్వదీయ -
మానసోద్భవములు మరి శాశ్వతములు -
వగువేద విభజనకయి వ్యాసుఁడనఁగ
నిగమగోచర! దేవ! నీవు పుట్టితివి.

దోషశీలుర జగద్ద్రోహకారకుల
పాషండమతుల వ్యాపాదముల్ వాపి
యుద్ధతిమించు దైత్యులఁ జెండి తీవు
బుద్ధాకృతిని జగత్పూజితచరిత. 170

సకల వర్ణాశ్రమాచారధర్మములు
వికలమ్ములై చెడి విశ్వమంతయును
కలిమహత్త్వమ్మున కలుషమ్ము పెఱిగి
ఖలనరాశనవృత్తి క్రందైనవేళ
కలికి రూపాన జగమ్మునఁ బుట్టి
నిలిపెదు ధర్మంబు నిగమసంచార.

ఈసర్గకార్యాదు లేర్పడ మాయ
భాసింప పెక్కురూపములు దాలుతువు.
తపము, బ్రహ్మము, ఋషితండమై పుట్టి
విపుల జగత్సృష్టి వెలయఁజేయుదువు.

మనువు, లింద్రాదులు, మనుజ నాథులుగ
జనియించి లోకరక్షణము సేయుదువు.
దనుజభుజగకూటధర్మరూపమ్ము-
లనువుగఁ దాల్చి లయమ్ము సేయుదువు.
భూరేణువులవైన పూని లెక్కించు-
వేరుపరుల్ మహనీయు లేరైనఁ
గలరేమొకాని, నీకల్యాణలీల-
లలర లెక్కించు వారరయంగ లేరు.
నాదులఘుజ్ఞానవైపుణితోడ
నీదుగురుత్వసందీపితమహిమ- 180
లరసి వర్ణింప సాధ్యమె కాదు; కాన
పరమకృపానిధీ! భక్తితో నీవె
దిక్కని వేడితి దీనశరణ్య
మక్కువ నను బ్రోవుమా దేవగణ్య

నారాయణుఁడు బ్రహ్మతపంబునకు మెచ్చి వరము లిచ్చుట :—

చతురాననుఁడు నిజాశ్రయపద్మమూల-
మతిశ్రద్ధఁ గనుఁగొనునభిలాషతోడ
జలముల నెమకి యాజలజమ్ముమొదలు
తెలియక, మరలి, యధిష్ఠితదివ్య-
జలజుఁడై సృష్టికి జతనమ్ము సేసి
తలఁపున కేమి యందక మిన్నకుండె.
అంత నాతోయమధ్యంబున నుండి
వింతగా 'తప' యను వినుతశబ్దంబు
వినవయ్యె నినుమాఱు; వేధ తచ్ఛబ్ద-
మును వినిపించిన పురుషుఁ డెవ్వండో

వీక్షింపఁగా నెంచి వెదకియు నిన్ను
వీక్షింపలేక హృద్వీథి యోచించి,
తపముసేయు మటంచు తగబోధ చేసె
'తప' యనుధాతువు ధన్యుండ నైతి;
వనియెంచి యతఁడు తా నతినిష్ఠఁ దపము
ఘనదీక్ష వహియించి కావింపఁదొడఁగె. 190

శశ్వత్ప్రశాంత, ఈశ్వర, దేవదేవ
శాశ్వత, విశ్వాత్మ, సర్వలోకేశ
నీమాయ యెట్టిదో నీరజగర్భుఁ-
డేమాత్రమేనియు నెఱుఁగలేఁడయ్యె.
నావంటియల్పుల కది యాకసంపు-
హూవగు నచ్యుత! పురుషవరేణ్య.

దశశతదివ్యవత్సరములు నిండె
ప్రశమితుఁడై చేయు బ్రహ్మతపమ్ము.
అతని తపోనిష్ఠ కలది యాతనికి-
నతులవైభవముల నలరారుచున్న-
వైకుంఠపురియందు పరగునీమంగ-
ళాకారదర్శన మబ్బఁజేసితివి.
ఆవికుంఠపురము నజుఁడు దర్శించి
యావిభవమ్ముల కబ్బురపడియె.
తమవెలుంగుల వికర్తనువెల్గు నణఁచి
విమలరత్నాభల వెలయుగేహములు
అనయమ్ము పుష్పఫలాదుల నిండి
వినతికెక్కినదేవవృక్షరాజములు
కాంచనదండసంగతములై దివిని

సరసిజకైరవస్వాదుమరంద -
పరితోషమధుపరవంబులచేత,
రాజహంసలవిహారమ్ములచేత,
రాజిల్లుచున్నసరస్సు లాపురిని -
నెందుఁ జూచిన నందు హృదయ మానంద -
సందోహమున మున్గ శాంతినిఁ బొందు
కీరరాజములు పల్కెడుపల్కులందు,
శారికల్ చదివెడుచదువులయందు,
కోగెలల్ వినిపించుకుహుకుహులందు,
రేఁగి నెమ్మలొనర్చుక్రేంకృతులందు,
జానగుమత్తాళిఝుంకృతులందు
మానుగ నీదివ్యమంత్రరాజమ్మె
వినఁబడు చుండు; నీవిమతధామమ్ముఁ
గనుగొన్నవారె నిక్కము పుణ్యధనులు

అట్టినీధామమ్మునందున్నవార -
లెట్టిపున్నెమ్ముల నెటు చేసినారో;
అందఱు స్నిగ్ధనీలాంగశోభితులె
యందఱు నవ్యపీతాంబరధరులె
యందఱు కమలదళాయతనేత్రు -
లందఱు కేయూరహారభూషితులె; 210
యందు సునందుండు నర్హణాఖ్యుండు -
నందుండ్రుఁ బ్రబలుండునా నొప్పువారు;
నీపార్శ్వచరులట నీరూపుతోన
నీపాదములె నమ్మి నిన్ను సేవింత్రు;
ఇన్ని వైభవముల నెసఁగునీధామ -
మన్నలువ గని యాహ్లాదించి మరియుఁ

గలుషమ్ములడఁచుగంగజనించినట్టి-
విలసితపాదాల వెలసెడువాని,
సిరుల నొసంగులక్ష్మికి నెలవైన-
యురువత్సపంపద నొప్పెడువాని,
రవియు చంద్రుండు నేత్రములుగా నొప్పఁ
బ్రవిమలవదనుఁడై భాసిల్లువానిఁ,
దనజన్మమూలమై తనరుతామరకు-
ననువుగాఁ గలనాభి నలరెడువాని-,
నహిలోకరాజు శయ్యగఁ బండువాని, -
నహిరిపుగమనుని యచ్యుతు నిన్ను
నాధామమునఁ గాంచి యాత్మ హర్షించి,
యాధాత వినుతించి యతిభక్తితోడ
పులకితగాత్రుఁడై పాదము హర్షాశ్రు-
సలిలసిక్తకపోలసంయుతుఁ డగుచుఁ 220
దననాల్గుమోములు ధరణి మోవంగ
వినయవిధేయతల్ వెలయంగ మ్రొక్కె -;
నావేల్పుపెద్దదేహమ్ము నాదృతిని,
నీవరహస్తాన నిమిరి యిట్లంటి

"వత్స! లోకేశ! నా స్వాంతమ్మునందుఁ
గుత్సితమౌనులకుం జోటు లేదు
నీయవితథతపోనియతికి మెచ్చి
నీయభీష్టము దీర్ప నిశ్చయించితిని.
కావ వైకుంఠనగరముతో నీకు
నావిజరూపసందర్శన మబ్బె
తపము నారూపమ్ము తథ్యము, మరియుఁ
దపమనుత్తమతరువల మేను.

కావ నాభక్తికిఁ గలమూలధనము
మానితతపమని మదినెంచుమయ్య.
ఈరహస్య మెఱింగి యెనలేనితపము
సారమతి నొనర్చి సంగమ్ము మాని
విగతమోహాత్మక విశ్రుతబుద్ధి
నెగడితి నీజన్మ నిర్మలమయ్యెఁ.
గోరుము నీకోర్కె కొదలేనియట్లు
దీరుతు" నని పల్కితివి ప్రియం బెసఁగ 230
భవదీయకారుణ్యభరితభాషణలు
శ్రవణప్రేయమ్మలై స్వాంతమ్మునకును
అరుసమ్ము గలిగింప నజుఁడు కేల్మోగిచి
పరమ భక్తిగ నిట్లు పలికె నీతోడ.

"వరమోపదేశక పరమాత్మ సర్వ-
మరయుదు నీ; వైన నడిగితి గావ
వినిపింతు నాకోర్కి విశ్వప్రకాశ,
విని దయామతి నన్ను వీక్షింపుమయ్య.
సృష్టిస్థితిలయమ్ము లేర్పడ నీవె
స్రష్ట్రాదిరూపధారణమున సర్వ-
భువవవర్తనము నిమ్మగ జరిపింతు;
భవదీయఘనమహత్వరహస్య మెఱుఁగు-
వెఱుక నా కొనఁగి నాయెడదకు జ్ఞాన-
పరిపూర్ణతను గూర్చి పాలింపుమయ్య.
నీయానతిని జగన్నిర్మాణ మేమ
సేయునప్పుడు నాదుచిత్తమ్మునందు
మానదు బ్రహ్మాభిమానంబు దానఁ
గానవౌఁ గడునహంకారముత్ పెక్కు

నాలోన; నవియెల్ల నాశమ్ముసేయ
శ్రీలలవేశ ప్రార్థించెద నిన్ను.'' 240

ఆవిన్నపము విని యతనికి శుద్ధ -
భావంబు కుదరఁగాఁ బలికితివిట్లు
"సకలశాస్త్రార్థవిచారమ్ము, భక్తి,
ప్రకటసాక్షాత్కారబంధురబుద్ధి
యనెడు మూఁడింటి నీయాత్మలో నిల్పు;
మనిశమ్ము దాన నీ కగు చిత్తశుద్ధి.
ధాత! సృష్టికి మున్ను తర్కింప నేను
వీతకర్ముండనై వెలయుచునుందు.
స్థావరజంగమసంయుతప్రకృతి
నావశమగును, లీనమగు నాలోన.
నే నొకండనెగాని యెందు నన్యంబు
కానరా దంతయు గాఢతమమ్ము.
సృష్టికాలమునందు సృజ్యమానమగు -
విష్టపమగును నావిశ్వరూపమ్ము.
ఈరహస్య మెఱింగితేని మోహమ్ము
దూరమౌ సర్గాదిఁ దోఁచు సత్యమ్ము''
అని బ్రహ్మనోదార్చి యాదరించితివి.
ఘనము నీ మహిమంబుఁ గనఁజాల రెవరు.
నమ్ఁబోటి యజ్ఞానవనరులు నీమాయఁ
గమఁగొనవేర్తురె కంజదళాక్ష. 250
భవదీయకారుణ్యఫలమె నావంటి -
యవగుణులకు శరణ్యమ్ము సర్వేశ!

## సర్గాదిదశలక్షణంబులు :—

శ్రీవిరాడ్రూప! నిర్జితసర్వపాప!
పావన భక్తకల్పద్రుమరూప!
జగములు వొడమెడు చాడ్పెఱిగింపఁ
దగినది భాగవతమ్మని యంద్రు;
అదియును దశలక్షణాన్విత మగుచు
విదితమ్ముచేయు నీవిభవసంపత్తి; -
నాదివ్యదశలక్షణాదు లన్నియును
శ్రీదయితా జగచ్ఛ్రేయంబు లగును;

పంచతన్మాత్రలు పంచభూతమ్ము -
లంచితమ్ముగను నీయందు నెల్లపుడుఁ
గనఁబడుచుంట సర్గమ్మని దీని
ఘనులు వల్కుదురు జగద్ధిత తత్త్వ.
వనజగర్భుండు నీవలన జన్మించి
పనివడి సర్వప్రపంచనిర్మితిని
ఘనముగాఁ గావించెఁగాన నిసర్గ -
మనులక్షణ మొకండు మహితమై వెలసె.
జగదపకారకజననాథకులముఁ
దెగటార్చి లోక మాదృతిఁ గాచినట్టి - 260
సరసిజనాభ నీజయము స్థానాఖ్యఁ
బరగు లక్షణమయ్యెఁ బ్రాజ్ఞులు వొగడ.
నిరుపమశుభమూర్తి నీసేయుభక్త -
పరిరక్ష పోషణపదలక్షణమ్ము.
ప్రాణులకగుకర్మవాసనాతతిని
జ్ఞాను లూతులనులక్షణముగా నెంత్రు.
నీనియమితజగన్నేతలవిధులె

మానితలక్షణమన్వంతరములు.
శ్రీశ నీపుణ్యచారిత్రాదికములె
యీశానుకథలన నెసఁగులక్షణము.
చిదచిదానందభాసితమూర్తి! నీవు
నిదురించునవ్వేళ నిఖిలజగమ్ము
వ్యాపారశూన్యమౌ, నది నిరోధమన-
నేపారు లక్షణ. మీశ। సర్వేశ!
జీవి నీకరుణ నిర్జితపాపుఁడగుచు
పావనపుణ్యసంపద నొంది కర్మ-
దేహమ్ము వదలి నీదివ్యదేహమ్ము
వహియించుటే ముక్తి. వరద। గోవింద!
జననమ్ము, వృద్ధి, నాశమ్మనుచొప్ప-
ననఘ మానసు లాశ్రయమ్మని యంద్రు. 270
తరమె సర్గాదులౌ దశలక్షణముల-
తెలిఁ గిట్టిదని చెప్పఁ దెలిగంట్లకైన-
నల్పుఁడ వాని నే నరయఁగలేను
తెల్పెద నాదు బుద్ధికిఁ దోఁచినంత.

అణువన బ్రహ్మమ్మునందున నుండి
యనయమ్ము బ్రహ్మాండమంతయు నిండి
యీవె జగమ్ముగా నెంచంగ జగము
నీవెగాఁ దోఁచెదు నీరజనాభ.
అన్నియు నీదుమాహాత్మ్యంబు లనుచు
పన్నినభక్తి నిఁక బ్రార్థించుచుందు
నన్నుఁ గృపామతిఁ జూచి నావేరములను
గణియింప కనిశమ్ము కాపాడుమయ్య. 276

ఇది ద్వితీయస్కంధము.

# తృతీయ స్కంధము

శ్రీకృష్ణరాయభారము :—

సర్వలోకోద్ధార సర్వశరణ్య
సర్వపాపవిదూర సాంద్రకారుణ్య
భక్తులు నీకు సేవకులు న్యాయమ్ము
భక్తసేవకుఁడవై పరగెదే నీవు.
భవదీయధర్మతత్త్వ మ్మెరికేని -
నవగతమగునె ధర్మాశ్రయమూర్తి.
అన్నియు నీలీల లనియెంచి నిన్ను
సన్నుతించిన మోక్షసామ్రాజ్య మబ్బు.

ధర్మతనూజు ముదలఁగొని నీదు -
ధర్మప్రతిష్ఠ కాదౌత్యకార్యమ్ము
తోడ్పడునని, హింసతొలఁగెదు ననియు,
చేడ్పాటు ధరకు నశించెడు ననియు
కరిపురికరిగితి; కౌరవుల్ భీష్మ -
గురు కృపాదులు దొరల్ కొలువుండువేళ
ధృతరాష్ట్రుతోడ "నో ధృతరాష్ట్రమౌళి
మతిమంతుఁడవు నీకు మరిచెప్పవలెనె
కురుపాండుసుతులు నిక్కువముగా నీకుఁ
బరికింప నొకరూప; పాండుపుత్రులకు -
వేరీతినేనిఁ బాలిచ్చితివేని
వారెందుతెగలకు నబ్బు శుభమ్ము''  10
అని ధర్మసహితమ్ములైనబోధనలు
వినిపించితివి బుధుల్ వేనోళ్లఁ బొగడ.

ఆమాటలను విని యధమకౌరవులు
సామాన్యుఁగా నిన్ను స్వాంతాలఁ దలఁచి
పట్టి బద్ధునిఁజేయ భావింప, వారి
మట్టుపెట్టవు నీదు మదినేమిగలదొ?
కౌరవజాతినే గాదు జగమ్ముఁ
గారించు రాజలోకమ్మును సైన్య-
యుతముగా భారతయుద్ధమ్ములోన
హతముసేయింపఁగా నాత్మనెంచితివి
కాన, నాకౌరవఖలులచేష్టలకు
హీనభాషణలకు నెత్తికోళ్లకును-
నేమాత్రమును నాగ్రహింపకయుంటి
వామర్మ మా కౌరవాళి యేమెఱుఁగు.

జననమేలేనియీశ్వరుఁడవు నీవు
జననమెత్తితి ధర్మసంరక్షకొఱకు.
భవకర్మములు నీకుఁ బరికింప లేవు.
వివరింప లీలలౌ విశ్వేశ నీకు.
భవకర్మముల బాధపడుచున్ననన్ను
దవులఁ ద్రోయక నీదుదరిఁ జేర్చుమయ్య. 20

శ్రీకృష్ణుఁ డుద్ధవు ననుగ్రహించుట :—

ఆర్తరక్షణపరాయణ, లోకశుభద
మూర్తి, శ్రీదేవకీపుత్ర, పవిత్ర
అతులితానందమ్ము నందుచు నీవు
పతితపావనద్వారవతి యందువేళ-
నొకపరి యదుభోజు లొక్కటఁగూడి
యెకసక్కెములు పల్క నెవరలుమంది

శపియించి సన్మునీశ్వరులు వో; నద్ది
నెపమయ్యె వారలనిధనమ్మునకును.
దైవయోగమున జాతరవోవు వేడ్క
కావించి యాదవవరులు భోజులును
దరలి ప్రభాసతీర్థముఁ జేరి యందుఁ
బరమనిష్ఠను గ్రుంకి, భక్తి దేవతలఁ
బితృదేవతలఁ గొల్చి పెక్కుదానములు
కుతుకంబుతో ద్విజకోటి కొసంగి
యిష్టమృష్టాన్నమ్ము లెసఁగుమోదమునఁ
దుష్టిగా భుజియించి తోరంపుహాళి
మధురసాస్వాదనమత్తులై సోలి,
విధి ప్రోత్సహింప వివేకమ్ము దూలి,
అన్యోన్యహాస్యవాక్యమ్ములఁ గలఁగి
మన్యుగుణమ్ముల మతిమాలి చెలఁగి 30
యొండొరులను దాఁకి యుద్వృత్తిఁ బోరి
గండర పొలిసి రొక్కండైన లేక.

లీలావతార యాలీల యాదవులు
గూల నంతయుఁ గనుంగొని నీవు విమల-
జలతరంగిణిఁ గ్రుంకి సంధ్యాదివిధులు
విలసితమ్ముగ సల్పి విగతమోహమున-
నొకతరుమూలమ్మునొద్దకు చేరి
యకలంకబుద్ధిఁ పద్మాసన మొప్పఁ
గూర్చుండి యుద్ధవుఁ గూర్మి నీచెంతఁ
జేర్చి, "యోయీ! నీవు చెచ్చెరఁ జనుము.
బదరికావని" కని పలికి యాక్షణమ
కదలి తెచ్చుటికా యాఘను వేమఱించి.

నీదుభక్తుండు వినిర్మలచరితుఁ -
డాదాసజనముఖ్యుఁ డాయుద్ధవుండు
క్రమముగా వంశమ్ముఁ గడతేర్చఁదలఁచు -
విమలమౌనీపూన్కి విధము తా నెఱిఁగి
నీదుపావనపాదనీరజవిరహ -
ఖేదమ్ము తనమదికిని బాధగూర్ప,
నిను దరిసించఁగా నెమ్మదినెంచి
చనిచని యొక్క వృక్షమ్ముమూలమున
మనసు చక్కఁగనిల్పి, మాయను దుల్పి
ఘనకళేబరదివ్యకాంతులతోడ
వెలయుచుండెడునిన్ను, వేదాంతవేద్య,
విలసితసన్మూర్తి, విశ్వప్రకాశుఁ
గాంచి యానందసాగరమున మున్గి
యంచితభక్తితో నగ్గించుచుండె.

ఆశుభవేళ నత్యంతపవిత్ర -
మై శోభవెలయు నీయంతికమ్మునకుఁ
దీర్థముల్ దిరుగుమైత్రేయుండు వచ్చి,
సార్థకమయ్యె నాజన్మ యంచలరి
నినుఁగని నీపాదనీరజమ్ములకు
వినతుఁడై మ్రొక్కి తృప్తినిఁ బొందియుండె.
దరహాసచంద్రికల్ దశదిశల్ నిండ
నిరుపమాదృతి నీవు నింపుసొంపిల్ల
ఆమునిమైత్రేయుఁ డాలించుచుండ
ప్రేమ యుద్ధవునకు వినిపించి తిటుల.
"పూర్వభవంబున పుణ్యులు వసులు
నిరతిహించెడుయాగనియమమ్మునందు

నీవొకవసువవై నియతితో నుండి
భావమ్మునందు నేపదవులుగాని 50
కోరక నాసేవఁ గోరితికానఁ,
జేరియున్నాడ నీచిత్తమ్మునందు
మరుపుట్టువొందని మహిమ నిన్నొరయఁ
గరుణించితిని; యదిగాక నీకిపుడు

పద్మకల్పమున సంభ్రమమతి నున్న-
పద్మగర్భునకు నే వచియించినట్టి-
జననమరణయుతసంసారజలధి
మునుఁగనిమార్గమ్ము, మోహమ్ము విన్చి
యవిరతానందసౌఖ్యమ్ము గల్గించు-
ప్రవిమలవిజ్ఞానభాగ్యమ్ము నీకుఁ
దెలిపెదనని దయ దీపింపఁ బలికి
యలరించితివి; యతఁ డానందమొంది
కరములు ఫాలభాగమునఁ గీలించి
స్థిరమతితో నమస్కృతు లొనరించి
"పురుషోత్తమా! భవత్పుణ్యనామమ్ము
పరమభక్తి సతమ్ము పారాయణమ్ము
గావించు నామదిఁ గలవె వేరొండు
భావముల్. కోరికల్ పరికించి చూడ,
స్వామి! నీయెడ నాకు సందియం బొండు
వేమారు కలుగు నవ్విధ మెఱిఁగింతు. 60

జననమ్ములేనినిశ్చలతత్త్వ మీవు
జనన మెత్తుదు దానిసత్య మెయ్యదియొ?
జగముల హరియించుచతురుఁడ వీవు
పగవారి కులుకు నీభావ మెయ్యదియొ?

పరగ నాత్మారామభావమ్ము నీది
గరితపిండు రమించు కారణం బేమొ ?
పరతత్త్వ మెఱిఁగినవారును నిన్ను -
నరయ సంసారియేయని గణియింత్రు.
విజ్ఞానమూర్తివి విశ్వేశ్వరుండ -
వజ్ఞానివలె నిట్టు లణఁగియుండుదువె !
నినుఁ జూచి నామది నిర్భరమైన -
వనట పొందినదయ్య వనజాయతాక్ష !
నేనర్హుఁడనొ కానొ, నీవ యోచించి
నానేరములను వినాశమ్ము చేసి
ధాతకుఁ దెల్పినతత్త్వమ్ము నాకుఁ
బ్రీతి బోధింపు మోశ్రీరమారమణ
అని యుద్ధవుఁడు భక్తి నంజలించుచును
గొనియాడ నాతనికోర్కి మన్నించి
పరతత్త్వమహిమంబు బాగుగఁ దెల్పి
కరుణించితివిగదే కరుణాసముద్ర ! 70

నిన్నాశ్రయించిననిజభక్తవరుల -
కెన్నంగ కల్పమహీజంబ వీవు.
నీపాదముల నమ్మి నిను వేఁడువాఁడ
నా పాపములఁ బాపి ననుఁ బ్రోవుమయ్య.

## జయవిజయుల శాపవృత్తాంతము :—

శ్రీకమలాలయాచిత్తవిహార
వైకుంఠపురవాస భక్తమందార
సాధునమస్కృతి సౌఖ్యమ్ముకొఱకె
సాధుతిరస్కృతి సంకటమ్మునకె

బ్రహ్మమానససుతుల్ వరమునీశ్వరులు
బ్రహ్మమ్ము నెఱిఁగినభక్తశేఖరులు
సనకాదిమునులు కాంక్షాదూరు లగుచు
మునుకొని యొకమాటు భువనంబులెల్లఁ
దిరుగుచు నుండి నీదివ్యపాదముల
స్థిరమతి సేవింపఁదివిరి శ్రీకరము
వైకుంఠపురము భవన్నివాసమ్ము
జోకఁ జేరిరి వారు చొక్కెడుభక్తి
వైకుంఠనగరము వరసరోవరము
నీకమ్రకనకమన్దిరము నీరజము
ఆగృహాంతరభోగియగుఁ దమ్మిదిమ్మె
ఆగొప్పదిమ్మె శయన మగు నీకు. 80
నీవు నాసెజ్జ నిందిందిరాకృతిని
భావముప్పొంగగాఁ బండియుండెదవు

అట్టినీదివ్యగృహప్రాంగణమ్ము
జట్టుగా డాసి యాసన్మునివరులు
వాసిగా నారుదువారముల్ దాఁటి
భాసురసప్తమద్వారమ్ముఁ జేరి
భూరిరత్నాంచితభూషణధరులు
సారచతుర్బాహుసౌభాగ్యవరులు
వనమాలికోన్నతవక్షంబువారు
ఘన గదాధరులు, రక్తచ్ఛాయభయద -
నేత్రులు, భ్రూభంగనిటలదర్పితులు,
వేత్రహస్తులునయి వెలయునిద్దఱను
సనకాదియోగు లచ్చటఁ గాంచి తాము,
పెనుకాలపరిమితి వృద్ధులేయయ్యు

వైదేండ్లబాలురయట్లి గన్పడుచు-,
నాదివ్యమగునికాయ్యముఁ జొఱఁబోవ,
వార లీమునిలోకవంద్యుల నెదిరి
వారించి ప్రతికూల వచనముల్ వలుకఁ,
గోపారుణితనేత్రగోళసంజనిత
తాపస్ఫులింగముల్ తద్దయు రాల 90
బృందారకులబృంద మీక్షించుచుండ-,
నందఱు నచటివారాలించుచుండ,
ద్వారపాలురరొదల్ వారించి మునులు
పారుష్యవచనముల్ వలికి రీరీతి.

"పరము ననంతుని భక్తితోఁ గొలువ -
నరుగుదెంచినమమ్ము నడ్డిరి వీరు
కరము దురాత్ము లీకట్టిడికర్మ
పరమేశభజనకు భంగమ్ము గూర్చె"-
నని ద్వారపాలుర నటుచూచి మీర -
లనయప్రవర్తకు లజ్ఞాను లగుట
మము నల్పజనులుగా మదినెంచినారు;
"సమయ సందర్భముల్ చక్కగాఁ దెలిసి
కొందఱఁ బంపుట, కొందఱ నాఁపు -
టెందు దౌవారికు లెప్పుడు సలుపు
టరుదుగా" దని మీర లనవచ్చుఁగాని
పరమేశునకు నట్టిపట్టింపు లేదు.
"అపరాధ మొనరించినట్టికింకరుల
నృపులుదండించెడురీతి దండించు
శ్రీపతి మమ్మని చిత్తముల్ కలఁగ
నాఁపితి" మని మీర లనవచ్చుఁగాని. 100

భూసురులగు మాకు పురుషోత్తమునకు
నీసమంతేనియు భేదంబు లేదు
ఇంత యెఱింగియు హీనమనీషఁ
బంతముతో మమ్ముఁ బదరి వారించి
యనుచితమగుకర్మ నాచరించితిరి.
యెనయుఁడు దీనికి నెనయగుఫలము
"అరిషట్క మెపుడు మిమ్ములయించుచుండ
ధర జనియింపుడు తగుదండ మిదియ"

అని భూసురులు దిట్ట; నశనిపాతమున-
కెనయయి యా శాప మెడల భేదింప,
దౌవారికులు గడుఁద్రాసమ్ముతోడ
భావముల్ చెదర దిగ్భ్రాంతిఁ దా మొంది,
సనకాదులపవిత్రచరణాబ్జములకు
వినతులొనర్చి యివ్విధి వేఁడుకొనిరి.

"మునులార! మీరు మమ్ముల నొవ్వ నిట్టు-
లనినమాటలకు మే మావంతయేనిఁ
జింతింప, మార్యులఁ జీరికిఁ గొనక
యింతటి యవమతి నే మొనర్చితిమి.
ఆపాపఫల మిద్ది; యైన శుభంబు
చేపడు; విన్నవించెదము వినుండు:—     110
కామాది శత్రువర్గసమేతమైన-
మామీఁదిజన్మముల్ మహినుండువేళ,
నారాయణునిదివ్యనామవిస్మరణ-
మారయఁ గలుగనియట్టుల మీరు
మముఁ గరుణింప, మామరుపుట్టువులను
విమలశుభంబుల వెలయంగఁగలము"

అని ద్వారపాలకు లనువేళ నీవు
వనజాక్ష యాయలబల మాలకించి
జలధికన్యకతోడిసరససల్లాప -
ముల మాని, శుద్ధాంతమును వీడి, నీదు
ద్వారపాలురఁ దపోధనులున్న స్థలముఁ
జేరంగ వచ్చి తాశ్రితపారిజాత ;
నీ వెనువెంట వార్నిధికన్య మోద -
భావంబు మునుకొన వచ్చె నచ్చటికి.
భవదీయసుందరపద్మాననమ్ము
ప్రవిమలసుస్నేహభరవీక్షణమ్ము
వనమాలికాయుతవక్షస్థలమ్ము
కనకకౌశేయసంగతకటిస్థలము
అదిఇది యననేల యచ్యుతా! నీదు
సదమలదివ్యసాక్షాద్రూపగరిమఁ 120
గాంచుచు సనకాది కర్మంది గణము,
మించు సంతసరసామృతవార్ధి మునిఁగి,
నీపయినిల్పిననిజవీక్షణముల
నేపాటద్రిప్పనేర్పేమియుఁలేక,
నీపదపద్మముల్ పెమ్మది నిల్పి
ప్రాపు నీవేయని ప్రార్థించి రిట్లు

"వనజోదరా! మాకు వనజగర్భుండు
వినఁగూర్చి బోధించె, నీ దివ్యరూప -
మనయమ్ముఁ జూచు భాగ్యమ్ము మా కొదవె
మనుగడలును మాకు మహితమ్ములయ్యె
సకలజీవాత్మలే స్థానమ్ములయ్యె
వెకలుల కెవుడు గన్పింపపు నీవు

చేతనాచేతనస్థితిఁ గని యందు
వీతరాగులు నిన్ను వీక్షించుచుంద్రు;
భవదీయపాదసేవారతి మనెడు-
ప్రవిమలమతి కన్యభావ మేర్పడునె!
పరమతపశ్శక్తి భవబంధములను
పరిహరించినమేము భవదాశ్రితులను
గోపించి తిట్టి తత్పూత్కారకృత్యమునఁ
దాపసధర్మంబుఁ దప్పితిమయ్య 130
విరయమ్ముఁగూర్చుమా వేరముల్ మాన్చి
పరమపావన మమ్ముఁ బాలింపుమయ్య"
అని సనకాదులో హరి! నీదుపాద-
వనజములకు మ్రొక్కి భక్తి నిల్చుండ
వారలభక్తితత్పరతకు మెచ్చి
కారుణ్యపూర్ణవాక్యముల నిట్లంటి;

"యతులార జయవిజయాభిధానముల
మతిమంతులై నాదుమందిరద్వార-
పాలకులై వీరు భయ భక్తులొప్ప
చాలియుందురు; కాని చాలనివేళ
నాదునాజ్ఞోల్లంఘనము చేసినారు
మీఁదుమిక్కిలి వీరు మిమ్ముఁ గైకొనరు
తప్పునకుం దగ్గ దండన గల్గె
మెప్పయ్యె నాకు మీమేలిమిపనికి;
భటులదోషంబులు స్వామిని నన్ను
వటులార! మన్నింపఁ బ్రార్థింతు మిమ్ము;
కాయానఁ బుట్టిన గదముచే త్వక్కు
పాయుగా నిజకాంతి; పాలకుకీర్తి

భటులొనరించునొప్పనికార్యములను
మటుమాయమగు నన్నమాట సత్యమ్ము 140
సాధుల కపకృతి సల్పినవారు
శోధింపఁగ మదీయసురుచిరబాహు-
సములైనఁ ద్రుంతు; నుత్సవమతినన్న
సమయింపకుందునె జనుల నన్యులను;
నామనోభావవిజ్ఞానమ్ము లేక
మీమనంబులు నొవ్వ మెలఁగినవారి-
కిద్దఱకును స్వయంకృతకర్మ మగుట
తద్దోషఫల మబ్బెఁ దప్పింపనౌనె!
మునులార! నామనమ్మున నున్నరీతి-
యును నిట్టిదే; యైన నొక విన్నపమ్ము;
అవనిఁబుట్టినవీర లచిరకాలమున
భవబంధములఁ బాసి, పాపముల్ మాసి,
నాయంతికమ్మందు నన్ జేరునటుల
మీయనుగ్రహమయామృతవర మొందు
వారికి దయసేయవలె మీరలంచు
కూరిమిఁ బల్మినెక్కొనఁ బల్కుటయును"
స్వామి! భవద్దివ్యవాగమృతమ్ము-
నామునివరు లాని యానందమొంది
పులకితగాత్రులై పొంగుడెందములఁ
దులలేనిభక్తియుత్సుకత మిన్నందఁ, 150
"గమలాక్షుఁ డీరీతిఁ గరుణించె. మనకు
నమరె పుణ్యములు కృతార్థులమైతి"-
మని. నిటలన్యస్తహస్తులై నతులు
వినయముగ నొనరిచి వినుతించిరిటు:

"హరి, సర్వలోకేశ, యనఘుండ వీవు
నిరుపమాధికుండవు, నిర్వికల్పుండవు,
ధర్మాత్ముండవు, జగత్కర్తవు నీవు
కర్మదూరుండవు శ్రీకరలక్ష్మణుండవు

మాచెద్ది నీ కభిమతమంటి నీవు
మాచేసినతపంబు మహిమంబు గాంచె
సాదుల మము నీవు సత్కరించితివి
నీదునాధుప్రీతి నిర్హేతుకమ్ము
శాపమిచ్చితిమి యీజయవిజయులకు
సాపరాధుల కది స్వల్పమయేని
అంతకుమించి నీ వానతియొసంగు-
మింతయు వలదని యెంచితివేని
వారి మన్నించి మావర్తనలోవ
నేరముండిన మము నియమింపుమయ్య"
అని కృతాంజలులయి యామును లుండ
కనికారమున వారిఁగని యిట్టులంటి 160

"వరయోగులార! నాభక్తులు వీరు
ధర జనియింతురు దైత్యవంశమున;
అపమార్గముల జగదపకారులగుచు-
నెపుడు నాపయి వైరమే పూనియుంద్రు
సమరాన నెదిరి నాచక్రాయుధమున
సమసి యుత్సుకత నాసరసఁ జేరుదురు;
పగనైన నను మది భావించుకతనఁ
దెగువేళ నాదుమూర్తినిఁ జూచుకతన-
ననఘులై పొందుదు రస్మత్పదంబు;
జనన మావల లేదు జయవిజయులకు

ఇదియ నాసంకల్ప మెఱిఁగించినాఁడ
వదలుఁడు మీచింత వరమునులార!''
అని నీవు నీకున్న యభిరతిఁ దెలుప
సనకాదిమునులు నీసంకల్ప మెఱిఁగి
మనములఁగలశంక మాని తెల్వొంది
వనజాక్షునకు నీకుఁ బ్రణతు లర్పించి
తమపలికినభాషితములు నీయవిగ
ప్రముదితులై యెంచి భద్రమౌ నీదు-
ధామము, నీరూపు తనివొందఁ జూచి
యామును లటనుండి యరిగిరందఱును. 170

అంత నాజయవిజయాభిధానులను
జెంతకు రావించి, "చింతిల్లనేల
ద్వారపాలకులార! దానవయోని
మీరు కాదనక జన్మింపంగవలసె
సారబలాఢ్యుఁడ, చతురుఁడనయ్యు
వారింపనోప విప్రవచనమ్ములను
కాన, మీరింక రాక్షసయోనిఁ బుట్టి
మాననివిద్వేషమార్గాన నపుడు
నన్నె తలంచుచు నాచేతఁ జచ్చి
క్రన్నన నిటకు రాఁగల్గుదు" రంచు-
నాదరంబున వారి కానతి యిచ్చి
మోదమ్ము లోకాళి పొందంగఁ గూర్చి,
శ్రీదేవి వెంటరాఁ జెచ్చెర నీవు
నీదివ్యపుణ్యమందిరముఁ జేరితివి.

సాధుబాధలఁ జూచి సహియింపలేవు

నన్ను నసాధుఁ బోనాడక కరుణ
మన్నించి కాపాడుమా రమారమణ.

## శ్రీయజ్ఞవరాహావతారాభివర్ణనము :—

శ్రీ దేవదేవ, హృషీకేశ, సత్య-
వాదానుమోద, సర్వసురసంస్తుత్య. 180
వేలుపు లెందఱు వెలసిననేమి
చాలుదురే జగత్సంకటములను
బాపఁగా; నీవెగా ప్రాపుగా నుండి
పాపి బాధల శుభప్రాప్తి చేకూర్చు-
నాదిదేవుఁడవు దయాస్వరూపుఁడవు.
నీదివ్యలీలలు నిరుమానములు

రాగవర్జిత! నీవు ప్రళయమ్మునందు
యోగనిద్రాముద్ర నుండంగ ధరణి
ఘనజలాంతర్నిమగ్నమయి పాతాళ-
మును జేరె; నజున కాభువి నుద్ధరించు-
వేరుపు లేక నీనిజరూప మెదను
కోరిక నిల్పి నిన్గొనియాడె నిట్లు.
"స్వామి నీయాజ్ఞానువర్తినై జగము
వేమమ్ముతో సర్ధి నిర్మించునపుడు
తొలినీరు మలిభువి తోరమ్ముగాఁగ
సలిపితి సృష్టి యీసమయమ్మునందు
భువి క్రుంగె నీట నాభూమ్యుద్ధరణము
తవిలి గావింపఁగాఁ దగ వేమ దేవ!"
అని నిన్నుఁదలఁచెడునంతలో నీవు
ఏనజజునాసావివరములనుండి 190

క్రతువరాహాకృతిగాఁగ సంగుష్ఠ -
మితగాత్రమునఁ బుట్టి మింటికిఁ బెరిగి
క్షణములో భూరిగజప్రమాణమ్ముఁ
బొనరితి సురల కబ్బుర మగునట్లు.
అంత నిన్గని మరీచ్యాదులౌమునులు
"వింతగదా యిది వ్రేలెఁడురూపు
దంతిప్రమాణమై తగె క్షణమాత్ర
ఎంతయో యద్భుత మీదృశ్య" మనిరి.
జలజసంభవుడు హర్షము చిగురొత్త
"జలజనాభుండు నాశంక మాన్పుటకు -
నాదివరాహమై యవతారమొందె
మోదమ్ముతో" నని మునులకుఁ దెల్పె.
సూకరాకారావ చూపిననీదు -
ప్రాకటపరమహత్త్వము లద్భుతములు.

భవదీయవిలయాభ్రభయదగర్జనము
దివిజులకెల్లఁ గుదిర్చె సంతసము.
ఘనఘుర్ఘురారావఘాతమ్ముచేత
వనజభవాండమ్ము వగిలినట్టయ్యె.
చలితసటావ్యూహజాతవాతమున
జలదము లటునిటు చదలునం జెదరె. 200
సునిశితఖురపుటస్ఫుటహతిచేత
ఫణిరాజదిగ్గజప్రచయమ్ము గ్రుంగె.
పాటవదంతసంభవవహ్ని రజత -
హాటకగ్రావసౌహార్దంబు దెలిపె.
ఘోరగంభీరఘుర్ఘురనిస్వనంబు
వారిధిచయవికల్ప మ్మొనరించెఁ.

బరఁగఁ బద్మాల్గు భువనములన్ దొంతు -
లొరగఁ గొమ్ములఁ జిమ్ము దొక్కొక్కమాటు ;
పుత్తడిగిరి నీదుమూఁపుల రెంట -
నొత్తుకో రాపాడు దొక్కొక్కమాటు ;
ఖరఖురముల రొంపిగాఁజేసి కడలి -
నలుకుదు దిరుగుదు వొక్కొక్కమాటు ;
అరుదన వాలవాతాహతి మింటి -
నొరసి ప్రబ్దలుసేయు దొక్కొక్కమాటు ; -
నయనమ్ము లగ్నికణమ్ములు రాల్చ
భయదమ్ముగాఁగఁ గన్పడు దొక్కమాటు ;
వరయోగిజనసేవ్యవైభవ మొప్ప
మెఱయుచుండుదువు వెమ్మిగ నొక్కమాటు ;
పొరలుచుండుదువు, రొప్పుచునుందు, కెరలి
చలియింతు, వెగయుదు చదలంటునట్లు ; 210
ముట్టె బిగింతువు మునమునమనుచు -
వట్టిట్టు మూర్కొంచు నడచుచుండుదువు ;
నీవిశృంఖలవృత్తి నీసాహసమ్ము
నీవైభవాత్తఘోణిస్వరూపమ్ము
దేవతలెల్లరు దివినుండి చూచి
భావముల్ వొంగ నిన్ ప్రార్థించుచుండ్రు.

## హిరణ్యకశిపు హిరణ్యాక్షుల జన్మవృత్తాంతము :

శ్రీవత్సలాంఛనాంచితభుజమధ్య
భావుకప్రద సురవరసమారాధ్య
నాదులేయైన దోషముల నొనర్చి
ఖేదముల్ ఎడసి నిష్కృతిఁ గందు రెందు ;

నిను మదిలోనుంచి నిష్ఠాగ్నిహోత్ర -
మును భక్తిమీరంగ పూజించి హోమ -
శాలాంగణమున కశ్యపమౌని నీదు -
లీలావిశేషమ్ములే యెన్నుచుండె; -
నపుడె దివాకరుఁ డస్తాద్రిఁ జేర -
నపరాహ్ణ మరుగ సంధ్యాకాలమయ్యె -
సంతానలాలసస్వాంతమ్ము రేఁప
సంతసమ్మున దితి చని తననాథు -
మునికశ్యపునకు నిమ్ముగ నిట్లు తనదు -
మనమునఁగలకోర్కి మనవి గావించె;

"నాథ! ప్రసూనబాణములచే నన్ను
బాధించుచున్నాఁడు భావభవుండు
అదిగాక నాతోడియాండ్రు నీకరుణ
ముదమొప్పఁగా గర్భములు దాల్చియుండ
కనుఁగొన నామది గడువిచారమ్ము -
నను ముగ్గియున్నది; నావిన్నపమ్ము
విని నన్నుఁబ్రోచుటే విమలధర్మమ్ము;
ఘనధర్మవేత్తవు, కాదనియనక
సంతానభాగ్యంబు నవరించి, నాకు -
సంతసమును గూర్పు సన్మునివంద్య"
అనుదితివిన్నప మతఁ డాలకించి
తనమనమున భావిఁ దగ విలోకించి
సమయసందర్భముల్ చక్కయోచించి
తమిమీఱ నామెతోఁ దా నిట్టులనియె;

"సరసిజానన! నీవు సంతానకాంక్ష -

వరగుణియగుభార్యవాంఛ తీర్చుటయుఁ
బురుషునకునుగూడ ముఖ్యధర్మంబె
కాని, యొక్కముహూర్తకాలమ్ము సహన –
మూనుమా, యిది సంజ, యుచితమ్ముగాదు; 230
హరుడు నందీశ్వరయానమ్మునందుఁ
దిరిగెడువేళయ్యె, దీన రమించు –
టురవుగాదని యందు రువిద యాలాగు
నిరసించఁదగువేళ నీతిఁ బోఁద్రోలి
ధర్మపథమ్మును దప్పి యకార్య –
కర్మల నొనరింపఁగడఁగుట మేలే?"
అని పెక్కుధర్మము లాకశ్యపర్షి
వినిపించెఁ గాని, యావిమలాంగి మదన –
బాణముల్ తనమది బాధవెట్టంగఁ
బ్రాణేశు పైకొంగుఁబట్టి పెనంగి
త్రపచేతఁ దలవంచి తాల్మి నణంచి
అపరాధయుతకర్మ కభిముఖియయ్యె; –
వీరీతి గావించునింతినిర్బంధ –
మేరీతినేఁ దొలఁగింప నేరుపక
శ్రీకంఠునకు నమస్కృతు లాచరించి
యేకతమ్మున భార్యయిచ్ఛను దీర్చి
యావల స్నానసంధ్యాదు లొనర్చి
పావనమతి కశ్యపబ్రహ్మ యుండె;

తానొనర్చినదుష్కృతమునకు మదిని
నానయు నీలకంధరు గూర్చి భయము 240
పెనగొన దితి తనవిభుకశ్యపునకు
వినయమ్మును వయమ్ము వెలయ నిట్లనియె;

“స్వామి, ప్రాణేశ! నాస్వాంతమ్మునందు
వాసుదేవునకు నీశ్వరునకు భక్తి
నతులు సమర్పించి నాతప్పిదమ్ము-
నతికృప మన్నించి యనురాగమొప్ప
నాగర్భపరిపాలనముసేయు మీవె
నాగతియని ప్రార్థన మ్మొనరింతు” -
ననిపల్కి సంతులేనట్టియా వధువు
తనగర్భలబ్ధికిఁ దనివితో నుండె;

దితిగర్భచిహ్నముల్ దెలిసి కశ్యపుఁడు
కుతుకమ్మునొందక కోమలిఁ జూచి,
“అతివ, నీచేసినయక్రమకృత్య-
మతిదూషితము దాన నగునీఫలమ్ము;
పరమేశునసుచరుల్ భద్రానుభద్రు-
లరయఁగా నమితబలాఢ్యు లుద్ధతులు
ఇద్దఱు నీ కుదయింతురు; వారు
తద్దయు సాధుబాధకులై చరింత్రు
వారల శ్రీహరి వధియించు సురల-
ప్రేరణమ్మున,” అని పవరించుటయును 250
విని దితి తన గర్భవిధము నెఱింగి
ఘనశోకభరమునఁ గలఁగుచిత్తమున
నిజనాథుఁ గనుఁగొని “నిక్కమ్ము స్వామి,
సుజనాపరాధులు సుఖియింప రెందు
సంపదల్ నిలుపవు, శత్రువుల్ మూఁగి
చంపుదు రందుకు సందేహమేమి?
కాని, నీతనయులు కమలాక్షుచేతఁ
[illegible]

అని తనప్రియసతి యంగలార్చంగ
విని ప్రాణవిభుఁ డిట్లు ప్రేమ నోదార్చెఁ;
అతివ వేరొకరహస్య మ్మిది వినుము
పతితులౌ నీసుతద్వయుని హిరణ్య-
కశిపుబిడ్డలలోనఁ గడుధార్మికుండు
ప్రశమితేంద్రియుఁడు శ్రీపతిభక్తుఁ డొకఁడు
పరమభాగతాఖ్యఁ బడయు; సన్మౌని-
సురవరబృందసంస్తుతులచే వెలయుఁ
గాన, నీమనమునఁగల విచారమ్మ
మానుము పూనుము మది సంతసమ్ము''
అని కశ్యపుఁడు పల్క నాయమ తనదు-
తనయులు హరిచే హతమ్మగునట్లు 260
మనుమఁడు హరిభక్తమాన్యుఁడౌనట్లు
మనవిధి చేసినక్రమము నెఱింగి
తాపతోషణములు తన కేర్పడంగఁ
బ్రాపు విష్ణుఁడెయని భక్తితో నుండె;
సతిదితిగర్భమ్ము శతసమల్ నిండె-
నతిరుచిరాకృతి నందుండి యొండు
తేజమ్ము వెల్వడి, దిశలు భూనభము;-
లోజ నిండఁగఁ, జాలనులికె జగమ్ము;
ఆతేజముంగని యమరులెల్లరును
భీతచేతస్కులై వేలుపుంబెద్ద-
పాలికిం జని యభివందనమ్ములను
చాల సమర్పించి నన్నుతుల్ సేసి
“కమలాసనా! విను, కశ్యపువీర్య-
మమితమై దితిగర్భమందుండి వెడలి

భూనభోంతరములు పూర్తిగా నిండె;
దానఁ గష్టములుపొందనియట్లు జగతిఁ
గారుణ్యమయకటాక్షముల వీక్షించి
పేరిమిఁ గాపాడవే జగద్రక్ష."
అని వేఁడ వారల కబ్జభవుండు
మును జయవిజయులు పొందిన శాప- 270
వృత్తాంతమంతయు వివరించి, "వారె
యిత్తఱిఁ గశ్యపునింతిగర్భమున-
నున్నారు వారలయుగ్రమౌ తేజ-
మెన్నంగ నిది మీకు నెట్టికష్టమ్ము
వెన్నునిదయ రాదు, విడువుఁడు భీతిఁ
గ్రన్నన శుభములు గలుగు" నటంచు
కరుణతోఁ బల్కఁ శంకలుమాని విబుధు-
లరిగిరి తమతమయావాసములకు-

తదనంతరము లోకదమనులక్రూర-
హృదయుల దితి గనె నిద్దఱ సుతుల;
అయ్యవసరమున నవని కంపించె;
వెయ్యేఁడఁ గన రక్తవృష్టి పెల్లయ్యె;
కులగిరుల్ వడఁకె; దిక్కులకరుల్ మ్రొగ్గె
జలధులు గలఁగె నక్షత్రముల్ డుల్లెఁ;
బ్రతికూలవాయువుల్ బలముగా వీచె
మితిమీఱి చీఁకట్లు మేదిని నిండె;
ఇట్టియుత్పాతమ్ము లేకమై భువికి
బెట్టిదమ్మును గూర్చెఁ బీడలు హెచ్చె

అదితితనయుల నసురనాయకుల
వేదండనిభగాత్రవిభవశోభితుల 280

కాంచనమణిమయకమనీయభూష -
ణాంచితులను తనయాత్మోద్భవులను
దిలకించువేడుక దితిగేహమునకు
వలముమానసుఁడు కశ్యపుఁడు వేంచేసి
దితిగర్భమునఁ దొల్త దేహమేర్పడిన -
సుతు, "హిరణ్యకశిపూ" శుభమని పిల్చి,
మునుపుగా దితినుండి పుట్టినవానిఁ -
గని "హిరణ్యాక్ష" మంగళమని పిల్చి
యీరీతి నామము లేర్పడఁ బెట్టి,
యారుసి చనియె నిజాశ్రమస్థలికి ;

ఖలచిత్తుఁడు హిరణ్యకశిపుఁడు మించి
జలజోదరునివరనమితి గర్వించి
ప్రకటలోకేశుల బవరాన గెలిచి
సకలజగమ్మును స్వవశ మ్మొనర్చి
మృత్యుభయమ్ము సుంతేనియు లేక
యత్యంతసంతోషితాత్ముఁడై యుండె ;
అతనితమ్ముఁడు హిరణ్యాక్షుండు సతత-
మతిభయంకరుఁడయి యంసాగ్రమందుఁ
బెనుగద ధరియించి పృథివి నెచ్చటను
తన కెదురగుచు యుద్ధముసేయువీరుఁ 290
గానక, కడుఁబరాక్రమమొప్పు దివికిఁ
బో నుద్యమించెఁ దెంపున బెంపు మిగుల ;

ధర్మసంస్థాపనార్థము జన్మమెత్తి
శర్మమ్ము జగతికి సవరింతు వీవు
కర్మసాక్షివి నీ వకర్మ లొనర్చు-
దుర్మదాంధులను నొంతువు దండనమున ;

దెలిసితెలియనివాదినచర్యలందుఁ
గలదోషములను లెక్కకుఁ జేరనీక
వనమాలి! నను దయఁ బాలింపుమయ్య
నిను నమ్మినానయ్య నీరజనేత్ర.

## హిరణ్యాక్షునివృత్తాంతము :—

అనఘాత్మ సకలకల్యాణప్రదాత
వనజగర్భాదిదేవసమూహనేత
బలదర్పితులపిండుఁ బరిమార్ప నీవు
పలురూపములఁ దాల్తు పాలింతు జగతి;

మును హిరణ్యాక్షుండు ముప్పిరిగొన్న -
ఘనబలమదదౌష్ట్యగర్వితబుద్ధి,
గజతుండసమభుజస్కంధసంయుక్త -
నిజగదాదండసందీప్తి నల్గడల
వ్యాపింప భూలోకమంతయుఁ దిరిగి
యేపారఁ దనతోడ నెదిరి పోరాడు- 300
ఘనబాహుబలు నెందుఁ గానక వాఁడు
తనపూన్కి మానక ధైర్యాన దివికి
దాడివెట్టియు నందు తనతోడ యుద్ధ -
మాడకయుండుదేవాళినిఁ గాంచి
వనజగర్భునివరబల మెద నెంచి
తనవారు పొంగ నితరజనుల్ క్రుంగ
తతవైజయంతికాదామమ్ము వెలుఁగ—
నతులనూపురయుగ్మ మంతట మొరయ
నిజతనుద్యుతి దిశల్ నిండంగఁ దిరుగ-
నజవరగర్వితు నాహిరణ్యాక్షుఁ

గని భీతచిత్తులై గరుఁడుని గాంచి
ఫణిలోకమెల్లను బఱచెడురీతి
తమతమనిలయముల్ తలఁగి వేవేగ-
నమరబృందమ్మెల్ల నరిగె నెచ్చటికొ;

అమరులగతిఁ గాంచి హర్షించి యార్చి
యమరారి కెరలుచు నబ్ధిఁ దూకొనియె
దనుజుతేజముఁ గాంచుధైర్యమ్ము లేక
వననిధి దాఁగిరి వరుణుసైనికులు;
తనదుశ్వాసముల నుద్భవమైనజలధి-
ఘనతరంగమ్ముల గదచే నడంచి 310
యసురేంద్రుఁ డా హిరణ్యాక్షుండు కుతుక-
మెసఁగంగ నందు పెక్కేండ్లు క్రీడించి
యరిసైన్యవిదళన మాత్మలో నెంచి
వరుణపురము విభావరిఁ జేరి పాశిఁ
గనుఁగొని పరిహాసగర్వోక్తు లిటుల
వినిపించె నెక్కుడు విఱ్ఱవీగుచును;

"వినుము ప్రచేతస! విశ్వమ్మునందు
ఘనులగుసకలదిక్పాలురలోన-
నతిబలాఢ్యుండ వీవని నిన్ను జగము
నుతియించుననుచు విందును నిక్కమేని
ననుఁ బోర నెదిరి యెన్నందగు నీదు-
ఘనపౌరుషముఁ జూపఁ గడఁగుమా" యనియె
ఆమాటలను విని యాదోధినాథుఁ
డామనుజాశిజయమ్ము బలమ్ముఁ
దనబలమ్మును మదిఁ దలపోసి, యద్ది
దనుజు వారించి యుద్ధముసేయఁదగిన-

సమయమ్ము కాదని శాంతమ్ము పూని
యమరారితో నిట్టులనె సాంత్వనమున;
"దానవనాథ! నే దాంతియు శాంతి-
నూని యాలము సేయు టుడిగియున్నాఁడ 320
గాన, యుద్ధమొనర్చుకడఁక నేనొల్లఁ
బూన రింకెవ రిందుఁ బోర నీతోడ
భవదీయఘనబాహుబలవిక్రమమ్ముఁ
దివిరి యెదుర్కొను ధీరోత్తముండు
అరిగర్వపరిహారి హరి యొక్కరుండె
పరులెవ్వ రిందెందుఁ బరికింప లేరు
అతఁడు వైకుంఠమ్మునందున్నవాఁడు
వితగాదు నీకోర్కె వేవేగఁ జనుము
అనిభిక్ష నీకు నాయచ్యుతుఁ డొసఁగి
నినుఁ దున్మితూఁటాడి నెగడంగఁగలఁడు;
అప్పటినీపాటులన్నియు నిపుడు
చెప్పంగవేల నీచిత్తమే యెఱుఁగు"
అను వరుణోక్తుల కాగ్రహమ్మొంది
వనజనాభునితోడ బవర మొనర్త-
నవి భయంకరమూర్తియై దానవుండు
చనుచుండె హరి నీదు సద్మమ్ముఁ జేర

ఆహిరణ్యాక్షున కతిఘోరకార్య-
సాహసికునకు నిర్జరమౌనివరుఁడు
నారదుఁ డెదురయి "నాణెమొప్పార-
నీరీతి సంబరమెసగంగ నీవు 330
చనుచున్నాఁడ వెచ్చటి" కని యడుగ
వినిచె నాతఁడు నిజాభిప్రాయమిట్లు

"నారద! మునిచంద్ర! నగధరుఁ దొడరి
ఘోరాహవమున నాక్రూరు క్రమందించి
భీతి నిర్జరులకుఁ బెంపంగఁ దలఁచి
దైతేయులకు సమ్మదము గూర్చనెంచి
వైకుంఠపురికి నేఁబయనమైనాఁడ
తేకువతో" నన, తెలిసి యామౌని -
యతని కిట్లనియె "వోయసురేంద్ర నీదు -
ప్రతిన మేలు, నిజమ్ము వల్కెద వినుము
వైకుంఠపురి లేఁడు వనజాక్షుఁ డిపుడు
ప్రాకటముగ భూమిభారమ్ము దాల్పఁ
బరఁగ గ్రోడాకృతిఁ బాతాళలోక -
మిరవుగ నున్నవాఁ డెదు రెందులేక
ఆవీరు నెదురుదార్ఢ్యము గలదేని
వేవేగ నచటికి వెడలుము నీకు
పురుషోత్తమునితోడిపోరు లభించు
వరయంగ లోకవిఖ్యాతి ప్రాప్తించు"
అనవుఁడు రక్కసుం డాగ్రహమ్మంది
నినుఁ బోర నోడించి నేర్పుచూపింప 340
ఘనగదఁ బూని లోకభయంకరముగఁ
జనె నధోభువిఁ జేర చండదర్పమునఁ
జని దితిపుత్రుండు జలమధ్యమందుఁ
గనె నిన్ను సూకరాకారు గోవిందు

## వరాహమూర్తి హిరణ్యాక్షుని చంపుట :—

నీజలజోపమనేత్రవిస్ఫూర్తి
యాజాల్మతనుకాంతి నణగించి మించె

ఆవరాహాకృతి నతిమానుషముగ
నీవొనర్చినపనుల్ నేఁ దెల్పఁగలనె;

గిరిసప్తకముఁ దలక్రిందగునట్లు
విరజిమ్ముదువు మోర వేడుకమీఱ
వనరుహగర్భాండభాండమ్ము వగులఁ
గొనకొమ్ము తాటింతు కుతుకమింపార
శరధులు బురదలై చయ్యన నింక
ఖురముల మట్టాడి గునియుచుండుదువు
ఉడురాజదినరాజు లోకములఁ జేర
బిడిగి వాలముఁ ద్రిప్పి పొలయుచుండుదువు
ఱొప్పించుచుందువు కొప్పరించెదవు
తెప్పున భువిఁ ద్రవ్వి తిరిగిచూచెదవు
నీవిశృంఖలవృత్తి నీసాహసమ్ము
దేవారి గాంచి హృద్వ్యధి ధైర్యమ్ము 350
వీడక సూకరవేషని నిన్ను
తోడెమ్ముగా నెంచి దూఱె నీరీతి

"ఓరి సూకర వినరోరి నామాట
వేరిమి మానరా విడుర నీయాట
వారిజోద్భవదత్తవరవిశేషమున-
నీరసాతలగత మీభువియెల్ల
మదధీనమైయుండ మందమనీష-
వదనని తలఁచి యీయవని హరింప
వచ్చితివే మూర్ఖ వలవ దీపూన్కి
మచ్చరించితివేని వ్రుందింతు నిన్ను;
నాగదాహతిఁ జచ్చి నాకవాసులకు
పోగాలముం గూర్చుబుద్ధి నీకేల"

అని పెక్కురంజులనాడునాదైత్యుఁ
గనియు లెక్కింపక కమలాక్ష నీవు
భవదీయదంష్ట్రాగ్రభాగమందొప్ప
భువి కొంత ధరియించి పురుషాగ్రగణ్య
చనుదెంచుచుంటి వాశరుఁడు రక్కసుఁడు
నిను పంద, చోరుఁడు నీతిదూరుండు -
ఎని పెక్కువిధముల నపహసింపంగ
వనజాక్ష! నీకుఁ గోప మ్మెకుక్కవయ్యె; 360

అంత నీకొనకొమ్మునందున్నక్షోణి
వింతగ నీటిపై వెలయ నిల్పితివి
అదిగన నమరుల కయ్యె హర్షమ్ము
గుదికొని పడె వెందుఁ గుసుమవర్షమ్ము
సురదుందుభులు మ్రోగె సురభిళానిలము
చిఱువేగమున వీచె, చెల్లె గంధర్వ -
గాన, మచ్చరకన్యకలనర్తనమ్ము
మానితంబయ్యె శ్రీమానినీనాథ;

ఆహిరణ్యాక్షుఁ డాహవము నొనర్చు -
నీహతో నిక్క నీ కెదురురా నీవు -
నంత త్వదీయహేమాంబరాభరణ -
కాంతులు దివిఁబర్వఁ గదనసన్నద్ధ -
మేపార ఘనగద మెలయఁ జేఁబట్టి
దీపించు వర్మమ్ము దేహానఁగట్టి
కడు భీకరాకృతిఁ గనలుచు వచ్చి
గడుసరిరక్కసుఁ గాంచి యిట్లంటి;
"ఓరి క్రవ్యాద! నీ యుద్వృత్తి నణఁచి
దోరింతుఁ జూడురా దుర్మార్గ నిమ్న;

బలమున్న వాతోడ బవరమ్ముసేయ
నిలుము నీకోర్కెలన్నియుఁ దీర్తు నిపుడె 370
పోటరితనమున్నఁ బోరునఁగాని
మాటల నెప్పుడు మగటిమి రాదు''
అని పెక్కుమాటల నమరారిఁ గదిమి
యనికి సిద్ధమ్మయి యార్చితి వీవు

ఆహిరణ్యాక్షుఁ డహంకారధైర్య-
సాహసోద్రిక్తుఁడై చయ్యన గదను
సారించి నిను వ్రేయ చతురత నీదు-
ఘోరగదాహతిఁ గ్రూరుఁడౌవాని-
గద శకలమ్ములుగాఁ జేసి తీవు
కొదవ వానికిని, నీకు ముదమ్ము గలిగె;
అన్యోన్యజయకాంక్ష లమితంబు లగుట
జన్యమ్ము ఘోరమై సాగె నిద్దఱకు
మీరణమ్మును జూడ మించినవేడ్కఁ
బరమేష్ఠి సురమునివరులతోఁ గూడి
చనుదెంచి, ధరణికై జన్యము రక్క-
సునితోడఁ జేయు నిన్జూచి యిట్లనియె;

"స్వామి, వరాహరూపా! దేవదేవ!
కామితఫలదాయకా దివ్యభావ!
నావరమహిమమ్మునను వీఁడు మిగులఁ
గావరమంది లోకములఁ గారించు- 380
వీనిచుఁ బరిమార్ప కింక నుపేక్ష
పూనుట మేల్గాదు పొరిగొంట మేలు;
ఇది యభిజిల్లగ్న మిప్పుడ వీనిఁ
జదుపుట మేలగుఁ జదుపకయున్న-

నసురసంధ్యావేళయైనచో వానిఁ
గసిమసంగుట కడుఁగష్టమ్ముదేవ!
అని సరసిజగర్భుఁ డనినవాక్యములు
విని నీవు నీదు హృద్వీథి యోచించి
తలఁచితి చక్రమ్ముఁ దక్షణ మద్ది
వెలసె నీవలకేల విబుధులు మెచ్చ
అమ్మహానీయచక్రాయుధకాంతి
క్రమ్మె జగాన తోరమ్ముగా నెందు-
నాదానవునికటి నఱచేత నీవు
మోదితి వాతఁడు మువ్మారు దిరిగి
దిటచెడి నిలఁబడె దేవతల్ నవ్వ
కటకటాయనుచు రక్కసిమూఁక నొవ్వ;
మరియును గులిశసమమ్మైన నీదు-
కరమున నాదైత్యుకర్ణమూలమ్ముఁ
బగులఁగొట్టితివి; యాపలలాశి నేత్ర-
యుగళమ్ము వెలిఁబడ నుద్రేక ముడిగి 390
రక్తమ్ముఁ గ్రక్కుచు బ్రాణముల్ వదలె;
నక్తంచరజగమ్మునకు భీతి పొదలె

అవ్విధమ్మున హతుఁడైనసురారి-
నవ్వారిజోద్భవాద్యమరగణమ్ము
గాంచి, యోగీంద్రు లెపుడు తమమదిని-
నంచితభక్తి నిత్యముగ నిల్పుదురొ
ఆమహామహునికరాహతి నతని-
మోము గాంచుచు ప్రాణముల వీడినాఁడు;
ఈదానవునిభాగ్య మింతని చెప్పఁ
గాదుగా మనకని కడువింత నొంది;

నినుఁ బరమాత్ముని నీరజనాభు
ఘను యజ్ఞసూకరాకారు ముకుందుఁ
గని భక్తియుతనమస్కారముల్ చేసి
వినుతింప వారల వీడ్కొంటి వీవు;

దేవ! బ్రహ్మావర్తదేశమ్మునందు
నీవు వేగిరముగ నీశరీరమ్ము
జాడింప రోమముల్ జలజలరాలి
చూడ హరితవర్ణశోభల నెగడి
కుశకాశమయమయి గురుయజ్ఞతతికి
భృశముగా యోగ్యమై విఖ్యాతిఁ గనియె- 400
నందుండి పావకుఁ డావిర్భవించి -
నందున ఋషులకు నానందమయ్యె.

జలజాక్ష! భక్తవత్సల! క్రోడమూర్తి!
జలజాసనాదినిర్జరనుతకీర్తి
నీదివ్యలీలలు నిరుపమానములు
నాదుప్రార్థన విని నన్నేలుమయ్య.

## కర్దముఁడు భగవదనుజ్ఞ వడసి దేవహూతినిఁ బెండ్లియాడుట:-

శ్రీమనోహర! భక్తచిత్తవిహార!
కామితఫలదాయకా! పాపదూర!
నీయాజ్ఞఁ పాలించునీభక్తవరుల -
కేయెడ శ్రేయమ్ము లిమ్ముగా నెసఁగు.

కృతయుగమ్మునఁ బ్రజాసృష్టిఁ గావింపఁ
జతురాననుఁడు మునిచంద్రుఁ గర్దముని
నియమించె నాతఁడు నిందుమోదమున
నియమితమతి దశేంద్రియముల నణఁచి

తపము సరస్వతీతటమందు విష్ణుఁ
దపనీయకౌశేయధరు, నిన్నుఁగూర్చి
పెక్కేండ్లు గావించె ప్రియమంది నీవు.
చుక్కలతెరువున సుందరాకృతిని
దరిసెన మొసఁగ, గర్దముఁడు నిన్గాంచి
ధర వ్రాలి సాష్టాంగదండప్రణామ- 410
శతముల నర్పించి, చయ్యన నిలిచి
యతులితభక్తి నిట్లనియె నీతోడ ;

"ఓ కరుణానిధి, ఓ హృషీకేశ
ఓ కంధిగంభీర, ఓ పుణ్యమూర్తి
భవదీయసుందరపాదపద్మముల-
ప్రవిమలదర్శనభాగ్యమ్ము గల్గె ;
నానోము పండె జన్మము తరియించె
నానేత్రములకు విందయ్యె గోవింద;
భవదీయమాయలోఁ బడినట్టివారు
ప్రవిమలమగునీదుపదసేవ మఱచి
కామాదితుచ్ఛసౌఖ్యముల ముఖ్యముగఁ
గామించి, సేవించి, కడకు దుర్గతినిఁ
గాంతు రైనను వారి కాంక్షలుదీర్తు;
వింత నీసంకల్పవిధము సర్వేశ
అట్టి సకాములౌననయులఁ గాంచి
తిట్టుచుండుదుఁగాని దేవేశ నేను
పతిపాలివేలుపుఁబసరమ్ము, శీల-
వతి, సముల్లాస, త్రివర్గకారణియు
నగుసతిఁ బెండ్లాడ హర్షించి నిన్ను
నగధర సేవించినాఁడ నీవాఁడ ; 420

ఒకవిశేషము గల దున్నదున్నట్లు
సకలమ్ము వివరింతు సర్వేశ వినుము;
నీవె బ్రహ్మాత్మవు నీయాన వడసి
యీవిశ్వమున లోకులెల్లరుఁ గామ-
హతులైరి; వారి నే ననుసరించుచును
హితమని నీకు పెంపెసఁగునీయాజ్ఞఁ
గావింప నెంచితిఁగాని, యీకోర్కి
భావింప నాకామపరతకై గాదు";
అని కర్దముఁడు తనయభిరతి నిట్లు
మనవి సేయంగ నామౌనీంద్రుఁ గాంచి
యతిదయాసాదరాయత్తచిత్తమున
పతితపావన నీవు పలికితి విట్లు;

"మునినాథ! నీమనమ్మునఁగలకోర్కి
యనుకూలమగు సందియ మ్మొందఁబోకు
వినుము బ్రహ్మావర్తవిషయమ్ము నేలు-
మనువు స్వాయంభువు మహిమగలాఁడు
అతఁడు జే పీమార్గమందు పైనమ్ము
శతరూపయనుతనసతితోడ, భర్తృ
కామయౌ సుతతోడఁ గావించి నీదు-
ధామమ్ముఁ జేరు; ముదమ్మావహిల్ల 430
గుణశీలముల నీదుకొలఁదికిఁ దగిన-
తనపుత్రికను నీకు దారగా నొసఁగి
పరిణయ మొనరించు భవదీయకాంక్ష
నెరవేరు; నను భక్తి నెమ్మనమ్మందు
స్మరియించుచుండు నమ్మనుకన్య నిన్ను
వరియించి నీదయాభాగ్యంబువలన

సుతలఁ దొమ్మండ్రను సురుచిరరూప -
వతులను బడయు, నావధువులకెల్ల
మునులయనుగ్రహమునఁ బుత్రభాగ్య -
మొనగూడు దానఁ బ్రజోత్పత్తి వెలయు ;
నీవు నాశాసననియమమ్మురీతి
భావినీకర్మముల్ భక్తితో నాకు
నప్పనమొనరించి, యంత్యకాలమునఁ
దప్పక నను(జేరి తరియింపఁగలవు ;
మరి యొకవిషయమ్ము మౌనీంద్ర వినుము
పరగ నీవీర్యమ్మువలన నీభార్య -
గర్భమందునఁ జేరి కడుఁబ్రీతి మీకు -
నర్భకాకృతిని యే నవతరించెదను ;
పరతత్త్వమెఱిఁగెడుభావంబు మీకు
విరివిగా బోధింతు వేడుకగూర్తు" 440

నని కటాక్షించితి పమ్మునిచంద్రు
వనమాలికాధర వనధిగంభీర
కరుణాకటాక్షవీక్షణముచే మౌని -
వరుని కర్దముని సంభావించి నీవు
గాంచినతఱి నీదుకన్నులనుండి
యంచితముగ రాలినట్టిబాష్పమ్ము -
లవనిపై బిందువులైపడి పేర్చి
సవిధముగా సరస్వతిఁ జుట్టిపాఱె ; -
నందున నాతీర్థ మతిపూతమగుచు
బిందుసరస్సనుపేరున వెలసె -
నంత నీ వరిగితి వాకర్దముండు
స్వాంతమందున భావిఁ బడసెడుకోర్కె -

లన్ని యూహించుచు నలబిందుసరసి
దిన్నఁగాఁ జేరి తత్తీరమ్మునందుఁ
దిరుగుచు మది నీదు దివ్యరూపమ్ముఁ
దిరముగా నిల్పి భక్తిగఁ గొల్చుచుండె;
తనపత్ని తనసుత తనవెంట రాఁగ
మనువు స్వాయంభువు మణిహేమరచిత-
రథమెక్కి దేశపర్యటనమ్ము చేసి
పృథివినిఁ దనసుపుత్రికిఁ దగినట్టి- 450
వరునిఁ గానక వచ్చి పరబిందుసరసిఁ
బరికించి తత్తీరపరిసరభూమి
మునివరుకర్దమమున్యాశ్రమంబుఁ
గని యందుఁ జొచ్చి తాఁ గడుముదమంది
పరమతపోవృత్తి బ్రహ్మచర్యమ్ముఁ
బరగఁ దాల్చుటఁ గడుబడుగుదేహమ్ము
గలిగినవాఁడయ్యు కమలాక్ష! నీదు-
సలలితనామసంస్తవనామృతమ్ము
సతతమ్ము గ్రోలుట సత్వమ్ము కాంతి
యతిదృశ్యమానమై యలరు నమ్మౌనిఁ
గాంచి స్వాయంభువు కరములు మొగిచి
యంచితభక్తి నయమ్మొప్ప నిలిచె;

ఇమ్మాడ్కిఁ దనయెట్టయెదుట నిల్చున్న-
యమ్మనువుం గాంచి యమ్మునివర్యుఁ-
డిమ్ముగా నర్ఘ్యాదు లెలమితోఁ గూర్చి
సమ్మానముగఁ బెక్కుసత్కృతుల్ సేసి
సంతుష్టిపఱచి, నీసల్లాపములను
స్వాంతమ్మునందున సంస్మరియించి

మనువు స్వాయంభువు మదికి మోదమ్ముఁ
బొనరించి కడుఁబ్రియమ్మున నిట్టులనియె; 460
"మనుచక్రవర్తి! సమ్మానితకీర్తి!
యనఘమౌ నీదుపర్యటనము దేశ-
హితపురస్కృతముౖ యెసఁగుట మిగుల
స్తుతిపాత్రమై యొప్పు; సుచరిత్ర యిప్పు-
డిచటికి నీరాక కెయ్యది హేతు-
వెచటి కేఁగఁదలంచి, తెద్దికార్యమ్ము,
వినిపింపఁదగునేని విన నుత్సహింతు" -
ననఁగ నామనువు మహర్షి కిట్లనియె;

"సరసిజోదరుఁడు ప్రాఁజదువులనెల్ల
ధర వెలయింపఁగఁ దనమోమునుండి
మిము సృజియించె; నిమ్మేదిని క్షేమ-
సముపాత్తముగ నేలఁజాలఁగ మమ్ము
తనభుజమ్ములనుండి తగ సృజియించె;
వనజనాభునియాజ్ఞ పాటించి దానఁ
గ్రమముగ బ్రాహ్మణక్షత్రియాభిఖ్య-
లమరెనుగద మనయన్వయములకు;
మరి మనవంశముల్ మాధవాంగములు
కరము పవిత్రముల్ కర్దమమౌని!
కాన విష్ణ్వంశముగల నిన్నుఁగాంచి
యానందమంది కృతార్థుండనైతి; 470
మనవిసేసెద నొక్కమాట మౌనీంద్ర
విని నన్ను ధన్యుఁ గావింపంగవలయు;
మత్పుత్రి నిర్మలమతి, దేవహూతి
సత్పథగమన యీచక్కనికన్య

వరగుణులను పెక్కువరులను వినియు
వరియింప దేవరి వివాహమాడంగ;
నారదుబోధ నీ౯ బరిణయమాడఁ
గోరి వచ్చినది మాకూర్మితనూజ
ఈకన్యకాభిక్ష నెలమి గ్రహింప
నీకు నమస్కృతుల్ నేఁ జేయువాఁడ;
తనయంతఁ దనకుఁ బ్రాప్తంబగుశుభము
ఘనవిరాగులెయ్యైనఁ గాదనఁబోరు;
అర్థి లోభిని వేడ నగుఫలమేమి?
వ్యర్థమౌకోరిక, యశమును జెఱచు
భవదీయపరిణయవాంచ నే నెఱిఁగి
యవితథమగునస్మదాకాంక్ష నీకుఁ
దెలిపితి; మత్సుత దీనిఁ బెండ్లాడి
యలరింపుమా మమ్ము యతిలోకచంద్ర.''
అని తెల్పుమనువువాక్యమ్ముల కలరి
మునికర్దముం డిట్లు ముదముతోఁ బలికె; 480

“విను మనుభూప, యీవిమలాంగి యొక్క
దినమున, నిశిని, చంద్రికలచే ధవళ-
కాంతిసంయుతనిజకనకహర్మ్యమున-
నాంతరంగికవయస్యలతోడఁ గూడి
చరణమంజీరసుస్వనశోభితముగ-
నరయ బంతులయాట లాడుచునుండె;
అపుడు విశ్వావసుఁ డవెడిగంధర్వుఁ-
డపరాధమనక యీయన్ను మోహించి
దివినుండి భువిఁబడెఁ; దెలియరు గొంద-
అవివేకులు ప్రజామహత్త్వతత్త్వమ్ము

అట్టిసుశీల తానై వరియింప
చెట్టఁబట్టనివారు క్షితి మండఁబోరు;
ఇది గుణాదుల నాకు నీడగుకన్య
ముదమున వరియింతు మోహమ్ముఁ బెంతు
మనువర యొకయొడంబడికకు మీర-
లనుమతించుట లెస్స యదియెట్టులనిన-
నీనాతి తల్లిగా నేనాఁటి కగునొ
యానాఁటిదాఁక గృహస్థధర్మముల
వర్తింతు; నా మీఁద వనజాక్షు విశ్వ-
మూర్తి శ్రీవిష్ణుని ముదల యౌదలను
దాలిచి సన్యాసధర్మమ్ముఁ గొందుఁ
జాలింతు సంసారసంబంధములను''

అని వినిపింప స్వాయంభువమనువు
విని సతీసుతలయభిప్రాయములను
గమనించి, మోదించి, కర్దమమౌని-
సమయమ్మునకుఁ దనసంతృప్తిఁ దెలిపి,
యాయిర్వురకుఁ బెండ్లి యతివైభవముగఁ
జేయించి వారి కాశీస్సు లొసంగి,
ఆమంత్రితుండయి, యతివతోఁ గూడి
హేమశతాంగము నెక్కి తాఁ జనియె;

గోవింద నిను భక్తిఁగొల్చుసాధువులు
భావించుకోర్కెలు ఫలియించుచుండు;
దేవాదిదేవ నీదివ్యసంకల్ప-
మీవిధంబని యెవ్వఁ డెఱుఁగు సర్వేశ!
నినుఁ గూర్చి కొంచెమేని యెఱుంగలేని-
నన్నుఁ బ్రోచుటేగద న్యాయమ్ము దేవ

**కపిలునిజన్మవృత్తాంతము :**

నారాయణా జగన్నాథ ముకుంద,
సారసదళనేత్ర స్వామి గోవింద
నిను భక్తి సేవించి నీకృపఁబడసి
మనువారిచరితలు మహిమాన్వితములు 500
వారికోరికల నవారిగఁ దీర్తు -
వేరీతినైన లోకైకసంరక్ష

సకలసద్గుణపూత, సతి, దేవహూతి
యకలంకచరితు మహర్షికర్దముని -
చిత్తవృత్తి యెఱింగి సేవలుసేయు -
నెత్తఱినే భర్త నెడఁబాయకుండు
పతిసపర్యయె మహాభాగ్యంబుగాఁగ
మతినెంచు నామెనెమ్మది విభుపైన
భక్తితాత్పర్యముల్ పాయనికూర్మి
రక్తియు నానాఁటఁ బ్రబలుచునుండె
తనకు సేవలుసేయుతనకులపత్ని -
తనుకార్శ్యమునకుఁ గర్దముఁడు చింతించి
కరుణార్ద్రబుద్ధి యక్కామినిఁ బిలిచి
సరసమృదూక్తు లీచాడ్పున వినిచె;

"చెలువ నీచేయునాసేవచే నీకుఁ
గలుగును సకలభాగ్యములు, సౌఖ్యమ్ము
ఇంతి! యిచ్చెద దివ్యదృష్టిభాగ్యమ్ము
కాంతువు సకలమ్ముఁ గడలేక యిపుడు
కాని, తుచ్ఛసుఖాలఁ గల ఫలమేమి ?
మానితదివ్యసంభావ్యభోగములె 510

శ్రేయమ్ము; లపి నీదుశీలసంపత్తిఁ
బాయక నీకు సంప్రాప్తమ్ములయ్యె;
ననుభవింపుము వాని" యనుపతిహితము
విని దేవహూతి తా విభున కిట్లనియె;

"స్వామి! మీమహిమలు వర్ణింపఁగలనె
పామరమతిని యేఁ బ్రాజ్ఞుండ వీవు
నీయందు ననుపమనిఖిలభోగములు
శ్రేయముల్ గలుగుట సిద్ధమ్ము నిజము;
భవదీయసాంగత్యఫలముగా సకల-
ప్రవిమలభాగ్యముల్ వడయింగవచ్చు-
నైనను మనసమయమనియమముల
మౌనీంద్ర నీదునెమ్మదిఁ దలపోసి
మనకు సంతానసంపద గల్గుదాఁక
నను భవదంగసంగమునఁ దేల్చి
మన్నింపుమా నాదుమక్కువ దీర
విన్నపమిది నీకు విన్నవించితిని."

అని వేడ గేహినియభిమతసిద్ధి
పొనరించుట గృహస్థముఖ్యధర్మంబు
గద యని భావించి, కర్దమమౌని
ముదమంది తన సతిమోహమ్ముఁ దీర్పఁ 520
దనయోగబలమహత్త్వము తేటపడఁగఁ
గనకరత్నాంచిత ఘనసౌధములును
బహువర్ణశోభితపటగృహంబులును
విహరణయోగ్యపుష్పితవనంబులును
శయ్యాగృహంబులు చంద్రగృహంబు-
లెయ్యెడ నందమై యెసఁగెడు నొక్క-

దివ్యవిమాన ముద్దేశమాత్రమున
భవ్యంబుగాఁగఁ గల్పనసేసి, భార్య
మెచ్చనితీరు తా నిచ్చ గ్రహించి
యచ్చెలి వినునట్టు లతఁ డిట్టులనియె

"రమణి! యీబిందుసరమ్మును జూడు
కమలాక్షుచే నిది గావింపఁబడియె;
నిందుఁ గ్రుంకినవార లిమ్మగుశుభము -
లొందుదు; రభిమత మ్మొదగూడుఁ గాన;
నిజ్జలమ్ములయందు హితమతి నీవు
మజ్జన మొనరింపుమా" యన నామె
పతిసేయుముదలయె పడఁతికి మిగుల
హితమని మదినెంచి యింతి యాబిందు -
సరసి మున్కలువేయుసమయమ్మునందు
సురచిరరూపసంశోభితలైన - 530
తరుణులు వేవు రాతటినిమధ్యమున
స్థిరచిత్తదేవహూతికి గోచరించి
"అమ్మరో! నీకు మేమతిభక్తి సేవ -
లిమ్ముగాఁ జేసెద మిది మాదుధర్మ -
వర్తన, మమ్ముఁ గృపాకటాక్షముల
గుర్తింపుమా" యని కొమరొప్ప వారు
అభ్యంజనోద్వర్తనాదు లాయమకు -
నభ్యర్చితమ్మగునట్ల గావించి
మలయజ కర్పూరమయసౌసుగంధ -
జలముల మంగళస్నాన మాడించి
కురులార్చి, ధూపముల్ గూర్చి, కస్తూరి
యిరవొంద దేహాన నిమ్ముగా నలఁది

కనకచేలమ్ములు గట్టంగఁజేసి,
మణిభూషణమ్ములు మాల్యానులేప -
నాదు లొసంగి, మృష్టాన్నముల్ వెట్టి
మోదమ్ముతోడఁ గర్పూరనీరాజ -
నముల నివాళించి, నవరత్నపీఠ -
మమరంగఁ బెట్టి యం దాసీనఁజేసి
ముకుర మాసతికరమ్మున నుంప నందుఁ
బ్రకటనమౌ తనప్రతిబింబ మరసి 540
యాదేవహూతి నిజాంతరంగమున
మోదించి, తనవిభు మునివరుఁ దలఁప -
నాకర్దముఁడుఁ గన్యకలు వేవురును
బ్రాకటముగఁ దనపజ్జఁ గన్పింప -
నమ్మునియోగమాయకు దేవహూతి
సమ్మదాశ్చర్యముల్ చాలఁగా నొందె;

అంతఁ గర్దముఁడు నిజాంగనఁ గాంచి
స్వాంతానఁ దద్రూపసౌభాగ్యమునకు -
నరునమ్ము నొంది, యాయతివయు సకియ -
లరయ వేవురును తన్ననుసరింపంగ,
మనము లోకవిహారమమతఁ బెంపఁగఁ
దనవిమానం బెక్కి తరలె నాక్షణమ;

అటు చని కర్దమయతి మేరుశిఖరి -
తటకందరక్షితిఁ దన్వియు సకులు
దాను పిడిదిచేసి తత్ప్రాంతభూమి
జానగుపవనములు, జలపాతములును
సరసులు, ధీర్ఘికల్, ఝురులు, వాహినులు
విరులవనములు, విహరణసలులు

మనసారఁ గాంచి కామగవిమానమ్ముఁ
బొనర నారోహించి, భువనమ్ములెల్ల 550
దిరుగుచు దేవహూతికి నచ్చటచటి-
యరుదగుదృశ్యమ్ములన్ని చూపుచును
మరలివచ్చుచు నిజమందిరమ్మందు
మురువుగా సంసారముఖ్యధర్మములు
గావించుచును నిజకాంతాభిరతిని
భావానఁ గని రతివ్యాసాంగములను
పడఁతి సంతోషమ్మువడయఁ గాలమ్ముఁ
గడపుచునుండె ప్రాకటమహాత్త్వమున-

నమ్మౌని కా నూరేఁడు లెలమితోఁ గడపి
యమ్మౌని తనదుకాయ మ్మొకనాఁడు
నవవిధములుగ నొనర్చి తద్వీర్య-
మవహితమతిఁ దనయతివగర్భమున-
నునుప నాసాధ్వి చూలూని తొమ్మండ్రఁ
దనయులఁ గని మదిఁ దద్దఁ తోషించె;
అంతఁ గర్దముఁడు సన్న్యాసమ్ము నూన
స్వాంతాన నెంచ నాసతి దేవహూతి
పతిభావ మెఱిఁగి తాప మ్మగ్గలింప
గతమును దలపోసి, గండభాగమున
కరముంచి, తలవాల్చి, కాలివెన్వ్రేల
ధర వ్రాయుచును తనధవునితో ననియె; 560

“అనఘ। సంతానభాగ్యము గల్గువనుక
నినుఁగూడి వర్తింతు నే నని పలికి
తనయల నొసఁగి తీతరుణలు తమకు-
నమవగుపతులఁ దా మరయఁ గల్గుదురొ?

యమభీతి గల్గె మహాత్మ! వీరలకు
గుణశీలముల సాటి కొదలేనివారి
పరులను దెచ్చి వివాహముల్ సేసి
పరతత్త్వసంహిత బాగుగ నాకు
నెఱిఁగించు నొకసుతుఁ గృపఁజూచి యిచ్చి
పరమాదరమున న న్బాలింపవలదె;
కాలమంతయు నిట్లె కామాదివిషయ -
జాలవాంఛలఁ గడచనియె వ్యర్థముగ -
నీయిహసుఖవాంఛ లిఁకనైన మాని
శ్రేయామౌ పరసుఖసిద్ధికై పూని
తగుయత్నముం జేయఁదలఁచితి నాదు -
వగపు పోకార్పంగఁ బ్రాపు నీవౌదు;
సజ్జనసఖ్యమ్మె సత్ఫలమూల -
మిజ్జగమున మాకు నెఱిఁగింపవలెనె;
పతియని యతియని ప్రార్థింతు నిన్ను
గతి నీవె మఱి యేరు గలరు మౌనీంద్ర" 570
అని వేఁడు మనుపుత్రి నాదరబుద్ధిఁ
గని కర్దముండు శ్రీకమలాక్ష! నీవు
తనకుఁ దెల్పిన భాషితముల స్మరించి
వినుమని సతికిఁ దా వినిచె నీరీతి;

"ఓ దేవహూతి! నీవూరక యేల
వేదనాభరమున విసుగుఁజెందెదవు
అడ లింక మాను నీయభిలాష దీరఁ
బొడము శ్రీహరి నీకుఁ బుత్రరూపమున -
వచిరకాలముననె; యందాఁక విష్ణు -
నచలితభక్తితో నర్చించుచుండు"-

మన దేవహూతి యత్యానంద మొంది
తనవిభువచనముల్ దలఁదాల్చి నిష్ఠ
దేవాదిదేవ! నీదివ్యపాదముల-
సేవ సద్భక్తితోఁ జేయుచునుండె;
ఈవిధమునఁ గొన్నియేఁడులు జరుగ
దేవ! కర్దమమౌనితేజమ్ము నీవు
పొంది యమ్మునివరుపాలఁతుకగర్భ-
మందుండి పుట్టితి వరయంగ నగ్ని
జమ్మితొఱటనుండి జనియించినట్టు-
లమ్మునిదంపతు లానందమొంద;- 580
నాయదనున దివియందు వేలుపుల-
వాయిదముల్ మ్రోగె; వర్షించి రెలమి
పూలవానల సురల్; పొంగి యచ్చరలు
మేలుగా నాడిరి; మించె గంధర్వ
గానమ్ము; దిక్కులఁ గావిరి మాసె;-
నానందమునఁ దేలె నమరబృందమ్ము;
హోమాగ్నితేజమ్ము లొప్పారె; జగతి
క్షేమసంయుతమయి చెలువుతో మించె;

ఇట్టి మహోత్సవ మేపారుచుండఁ
బుట్టిన నినుఁజూడఁ బొడమినవేడ్క
పరమేష్ఠి సురమునివరులతో వచ్చి
దరిసించి, వినుతించి, ధన్యాత్ములైన-
మునిదంపతుల కర్దముని దేవహూతిఁ
గనుఁగొని భద్రవాక్యముల నిట్లనియె;
"మునిదంపతులు! మీరు పుణ్యాత్ములౌట
వనజాక్షుఁ గొలిచి తత్ఫల మందినారు

కృతకృత్యులైతిరి కీర్తింపనౌనె
మతిమంతులార మీమాన్యచరిత్ర''
మని కర్దమునిఁ గాంచి యజుఁడు ''మునీంద్ర
వినుము నీతనయల విమలవర్తనల 590
నాదగుమోనిజనమ్ముల కొసఁగి
మోదమ్ముతోఁ బెండ్లి పొసఁగఁ గావింపు
వారలమూలాన బహువిధంబులను
ధారుణి వేర్పడుఁ దగఁ బ్రజావృద్ధి
ఈనీదుపుత్రు దినేశతేజస్కు
శ్రీనాథుపరమేశచిన్మయమూర్తి-
గా మనమ్మున నెంచు కమలాక్షుఁ డితఁడు
సామాన్యుఁడే సర్వజగదవనుండు
ఘనసాంఖ్యయోగమ్ముఁ గరుణతో మీకు
వినిపించుఁ గపిలాఖ్య విలసిల్లఁగలఁడు.''
అనిచెప్పి యబ్జజుఁ డచ్చోటు వీడి
చనియెను నిజనివాసస్థలిఁ జేర;

అంతటఁ గర్దముఁ డబ్జజునాజ్ఞ
స్వాంతాన యోచించి సన్మునులైన-
అంగీరసాదిమహర్షివర్యులకు
శృంగారవతుల పుత్రికల నొసంగి
సాంగముగాఁ బెండ్లి జరిపించి, వారి
మంగళవస్తుసంభావ్యులఁ జేసి
యనుపఁగా, వార లాయతిని వీడ్కొనుచుఁ
జనిరి పతులతోడ సమ్మదమ్మొదవ; 600

వరద జనార్దన వారిజనాభ
గిరిధర నీ వాత్మగేహమ్మునందుఁ

బుత్త్రాకృతి జనించి పొదలుట కమిత -
చిత్ర మానందమ్ముఁ జెంది యా మౌని
యేకాంతమున నీకు నెఱఁగి ప్రార్థించి,
ప్రాకటభక్తితాత్పర్యమ్ము లొప్పఁ
దనమనోవీధినిఁ దగులుభావముల
వినుమని నీతోడ వివరించె నిటుల ;

"బహుజన్మ సుకృతసంప్రాప్తసద్వృత్తి -
నిహమున రోయుయోగీశ్వరులెల్ల -
నేమహాత్ముని జూచి యిచ్చఁ దోషింతు -
రామహాత్ముఁడ వీవె యానందమొంద
మును ప్రతిశ్రుతము లమోఘమ్ము లనుచు -
వినిచిన భవదీయవిమలవాక్యములు
తప్పకుండఁగ నాకుఁ దనయుఁడ వగుచుఁ
దప్పించితివి ఋణత్రయినుండి నన్ను
కపిలాఖ్యనెసఁగునీకమనీయరూప -
మెపుడు నానెమ్మది నేర్పడ నిలిపి
భజియించి తరియింప భావించినాఁడ
భుజగశయన సురపూజితచరణ ;" 610
అని యిట్లు వేఁడినయతివిన్నపముల
విని దయ నతనికి వినిపించి తిటుల ;

"నే వినిచినరీతి నీయింట జనన -
మీవిధి నెత్తితి ; నీ మునిరూప -
మును దాల్చు టిది నాకు ముదమని గాదు
ఘనులగుమునిలోకమునకుఁ దత్త్వమ్ము
బోధించుకొఱకు నేఁబొందినవ్యక్త -
సాధన దేహమ్ము సమ్మనిచంద్ర :

కడునిష్ఠ యోగమార్గమునఁ గర్మలను
విడువుము ముక్తికై వేఁడుము నన్ను
తనర మోక్షము నొందెదవు నిక్క మిద్ది''
యనుచు నామౌనికి నాజ్ఞచేసితివి;
నీప్రబోధము విని నీకుఁ బ్రదక్షి-
ణప్రణతుల నర్పణముసేసి మౌని-
వరసేవితంబైనవనమునఁ జేరి
కరము నిస్సంగుఁడై కడునిష్ఠఁ బూని
సకలభూతమ్ముల సమదృష్టిఁ జూచి
యకలంకమతి లోకమంతయు నీదు-
మయమని భావించి, మమతలు మాని,
నియమితేంద్రియబుద్ధి నినుఁ దలంచుచును 620
భక్తిపరత భాగవతతత్త్వ మొంది
ముక్తిసామ్రాజ్యసంపూజ్యుఁడై వెలిఁగె;

ఆవలఁ గపిలావతారుఁడ వీవు
పావనమగుబిందువనజాకరమున
వసియించియుండ సద్వ్రత నీదుమాత
వెస భవత్సన్నిధి వినయమ్ముతోడ
విచ్చేసి పరమేష్ఠివిమలవాక్యముల-
నిచ్చలోఁ దలఁచి తానీరీతిఁ బలికె;

''అనఘాత్మ! నామది నావృతమైన-
ఘనమోహ మేలాగు కడచనఁగలదు;
ఏభక్తి పాపసమృద్ధిఁ బోకార్చి
శోభిల్లుముక్తి నిస్తులముగఁ గూర్చు;
ఘటి తత్త్వలక్షణమహిమమ్ములెల్ల
గుఱితించు జ్ఞానము కూరి బోధింప''-

మని దేవహూతి నిన్నర్థింప నామెఁ -
గని జ్ఞానమార్గమ్ము గఱపఁగఁ దలఁచి
భవబంధముల కపవర్గమ్మునకును
మివుల జీవులచిత్తమే హేతువనియు -
నది త్రిగుణాసక్తమైనసంసృతికి
ప్రథమకారణమగు; భగవదాసక్త - 630
మైనచో ముక్తికి నాధారమగుచు
మానుగ మోహమ్ము మాన్పించుననియు
బోధించి భక్తికి మూఁడు మార్గములు
శోధింప గల; వవి సొరిది సాత్వికము,
మరి రాజసమును, తామసమను పేరఁ
బరగుచున్నవి యని, వానిభేదములు
తనరంగ వివరించి, తత్త్వలక్షణము -
లెనయంగ నెఱిఁగించి, యేర్పడఁ బిండ -
ముదయించి పెరుగుచునుండెడుదశలు
విదితముగాఁ జెప్పి విజ్ఞానమూల -
మగుసాంఖ్యయోగమ్మునంతయుఁ గూడఁ
దగఁగ బోధించితి తద్దయుఁగూర్మి
ఈరీతి నీబోధ నెఱిఁగినయోగ -
సారమార్గమున నాసతి దేవహూతి
నిన్నె తలంచుచు నిత్యమైయుండు -
సన్నుతదివ్యమోక్షప్రాప్తి నొందె;
మునిపత్ని మోక్షమ్ముఁ బొందినభూమి
తనరంగ సిద్ధపదఖ్యాతి వెలసె;

పరమపూరుష! జగత్పావనచరిత!
కరుణాకరా! లోకకల్యాణదాత! 640

భక్తులవాంఛలు పరఁగఁ గూర్చుటయె
రక్తి నీకు పరాత్పరా వాసుదేవ
మునిదంపతులు కర్దముఁడు దేవహూతి
మును పెట్టిసద్వ్రతములు చేసినారో
నిమఁ బుత్రకునిగఁ బొందిరి మాన్యులైరి;
వినుతికెక్కెను వారివిమలచరిత్ర
ఈపవిత్రచరిత్ర మెఱిఁగి నీభజన -
మేపారఁ జేయ నైహికకాంక్ష లడఁగు
నిను భజించుట యెట్లొ నేర్వనినన్ను
కనికారమునఁ బ్రోవగదయ్య! స్వామి.

—: ఇది తృతీయస్కంధము :—



# చతుర్థస్కంధము

## యజ్ఞపురుషావతారము :—

ఆదిపూరుష భవదవతారలీల-
లేదివ్యలేగాని యెఱుఁగంగలేరు.

స్వాయంభువనకును, శతరూప కెలమి
శ్రీయుతలైన పుత్రికలు మూవురును
ఇనసమతేజస్కు లిర్వురుసుతులు
జననమందిరి! వారు సంతృప్తినొందఁ;
దనదునంతానవిస్తరము వాంఛించి
మునుపడి యాస్వయంభువు తనసంతు-
నం దగ్రసుతయైన యాకూతియనెడు-
సుందరి రుచి కిచ్చె శుభముహూర్తమున-
నటు వివాహితులైనయాకూతి, రుచియుఁ
బటుసత్త్వగుణశీలవర్తనోదాత్త-
సుజ్ఞానులని నీవు చూచి వారలకు
యజ్ఞపూరుషరూప మమరఁ బుట్టితివి;
ఆదిలక్ష్మియును ని న్ననుసరించుచును
మోదముగ నిజాంశమున దక్షిణాఖ్య
యలర జనించె; స్వాయంభువు కూర్మి
పొలయంగఁ బుత్రికాపుత్రుని నిన్ను
తనగృహంబున నుంచె; దక్షిణాకన్య-
నొనరంగ రుచి తనయొద్దన నిలిపె; 10

అంతటఁ గొంతకాలానంతరమున
స్వాంతాన దక్షిణ సర్వేశ నిన్ను

పతిగాగఁ గాంక్షించి పరిణయమ్మాడె
క్షితి నెచటం జూడ శ్రేయమ్ము గూడె
ఆదిదంపతులు మీరగుట మీపెండ్లి
వేదబాహ్యముగాక వెలసె మహాత్మ
యామామరస్తోమ మంతయుఁ బుట్టె
మీమూలమునను లక్ష్మీశ ! దేవేశ !
శ్రీయజ్ఞపురుష సర్వేశ నిన్గొలువ
శ్రేయముల్ చెలఁగు వాంఛితసిద్ధి గలుగు.

## దత్తాత్రేయావతారవర్ణనము :—

శ్రీకర త్రిగుణభాసితదివ్యచరిత
లోకైకరక్షావిలోకననిరత
విడువనిభక్తి హృద్వీధి నివ్వలఁపఁ
బడయంగరానట్టిభాగ్యముల్ గలవె
అత్రిమహాముని యతిలోకవరుఁడు
ధాత్రీసమాన సద్వ్రతచిత్తయైన -
తనసతి యనసూయ తా వెంట రాఁగ
నినుఁగూరిచి తపమ్ము నిష్ఠతోఁ జేయఁ
దరలి ఋక్షకులాద్రితటమునఁ బాఱు -
వరనదీజీవనపరిపుష్టమైన - 20
కాంతారమునఁ జేరి కాంక్షల దూటి
స్వాంతమ్ము మిగుల నిశ్చలముగఁజేసి
పరఁగఁ బ్రాణాయామపరుఁడయి యేక -
చరణ మూఁతగ నిల్చి శ్వసనమ్ముఁ బీల్చి,
దేహమఱుగ నూరుదివ్యవర్షములు
సాహసమున తపశ్చర్య గావించె ;

ఆతప మొనరించునపు డత్రి తనదు -
చేతమ్ములో నిట్లు చింతించుచుండె;
"ఏవిభుఁ డీజగదీశ్వరుఁ డగునో
యావిభుఁడే శరణ్యమ్మని యెంతు; -
నతఁ డాత్మసమమయి యలరెడుపుత్రు -
నతికృపామతి నాకు నమరుచుఁగాత!"
అని తపమొనరించునతనితపోగ్ని
మునుకొని ముల్లోకములఁ గాల్చుచుండ
భవదీయత్రిగుణాంశభవులైనవాణి -
ధవుఁడు, మాధవు, డుమాధవుఁడు మూవురును
నేకకాలమునఁ దా మేతెంచి మునికిఁ
బ్రాకటదర్శనభాగ్యంబుఁ గూర్ప -
నాతఁ డామూర్తిత్రయమ్మును గాంచి
చేతమ్ము పొంగ జేజే లొనరించి 30
భయము భక్తియును సంభ్రమము దైవాఱ
నయమార్గమున ప్రార్థన మ్మిట్లుచేసె;

"ప్రతికల్పమునను ప్రపంచోద్భవమును,
స్థితిని, నాశమ్మును జేయంగ నెంచి
త్రిగుణమాయామయదేహముల్ దాల్చి,
తగ నజ, హరి, హరధన్యనామముల
వెలయుమీపాదారవిందమ్ములకును
సలిపెద బహునమస్కారముల్ భక్తి;
మీమూర్తులందున మేటియౌధీరుఁ -
డేమహాత్ముఁడొ వాని నే నొక్కవేల్పుఁ
బిలువ మీమూవురు వేంచేయ నాకుఁ
గలిగె నాశ్చర్యమ్ము గంటి మోదమ్ము;

అదిగాక సంతాన మర్థించి నేను
మదిని ధ్యానించితి మహనీయు నొకని''
నవిన వాముప్వ రాయత్రినిఁ గాంచి
యని రంద రేకవాక్యమ్ముగా నిట్లు;
''మునిలోకవర! మేము మూవురమయ్యు
విను మొకరూపమై వెలయుచుండుదుము;
నిరతము నీమది నిలిచినకోర్కె
కొఱఁత లేక ఫలించుఁ గుతుకమ్ముఁ గూర్చ; 40
మామహామాంశసంపన్నులై నీకు
ధీమంతులగు సుతత్రితయమ్ము పుట్టి
నీమంగళాన్వీత నిత్యయశమ్ము
శ్రీమహితమ్ముగాఁ జేయంగలారు."
అని వరములనిచ్చి యాజగత్ప్రభులు
మునిపూజ లంది యిమ్ముగ వీడుకొనిరి:
సర్వేశ! భక్తులసకలవాంఛలను
నిర్వహించుటెగద నీకభిమతము;

అనసూయ కత్రికి నబ్జాంశమునఁ
దనరఁ జంద్రుడు; మాధవునంశమందు
దత్తుండు; శివకళఁ దాల్చి దుర్వాసుఁ-
డుత్తముల్ పుత్రకు లుద్భవమైరి;
యందున ఘనుఁడు దత్తాత్రేయమౌని
పొందుగఁ ద్రిగుణసంపూర్ణుఁడౌకతన
నాయవతారమ్ము నత్యంతభక్తిఁ
బాయక కొలిచిన పాపముల్ దొలఁగుఁ
గామితార్థములు నిల్కడగ సిద్ధించు
నేమని!శేయముల్ చిరకీర్తి గలుగు

అమరపూజిత భవదవతారలీల -
లమితమాహాత్మ్యమ్ము లతిపవిత్రములు 50
నీలీలలెఱిఁగెడునేర్పు నొసంగి
పాలింపుమా నన్ను భవ్యచరిత్ర

## నరనారాయణావతారప్రశంస :—

శ్రీరమారమణ! హరీ! దయాభరణ!
నీరజదళనేత్ర నిగమసంస్తోత్ర
భువనకల్యాణ మిమ్ముగఁ గోరునీదు -
ప్రవిమలోద్దేశముల్ భావింపనగునె!

దక్షప్రజాపతి తనపుత్రికలకు
దక్షులౌభర్తలఁ దగఁ గూర్పనెంచి
మొదటిసుతల పదుమూవుర ధర్ముఁ
డెదఁ బొంగఁగా నిచ్చి, యెసఁగఁ గనిష్ఠ -
సుతలను మూవుర సొరిది వహ్నికిని,
పితృదేవతలకును, భీమదేవునకు
వేరువేఱుగ నిచ్చి పెండ్లిండ్లుసేయ
వారివారికి సంతు వర్ధిల్లె మిగుల -
ధర్మరాజుకనిష్ఠదారయౌ మూర్తి -
నిర్మలగర్భజనితుఁడవై నీవు
నాగశయన నరనారాయణాఖ్య -
లాగమవంద్యములై వెలయంగ -
నవతారమొందితి రమరులు మెచ్చ
భవిక ఋషిద్వయప్రథితరూపముల; 60

ఈరుసు లిల నుదయించెడువేళ
మారుత మొలసెఁ గమ్మగ విమలమ్ముగ

దిక్కులు తెలివొందె; దేవదుందుభులు
మిక్కుటమ్ముగ మ్రోసె మింటిమార్గమున;
నచ్చరసతులలాస్యమ్ములు మించె;
మెచ్చుగా విరివాన మేదిని గురిసె;
గంధర్వ కిన్నరగానముల్ చెలఁగె;
సింధుకల్లోలవిజృంభణ మడఁగె;
మునిజనమ్ముల మనమ్ముల నెమ్మి గలిగె;
ననుపమానందము లవనిలో వెలిగె;

నాసమయమ్మున నచటికి భక్తి
భాసిల్ల సురలతో బ్రహ్మ యేతెంచి
భవదీయభవ్యాంశభవుల నాబుపుల-
ప్రవిమలరూపదర్శనమునఁ బొంగి
వినుతించి తత్కృపావీక్షణభాగ్య-
మును బొంది తనలోకమునకుఁ దా నేగె;
ఆనరనారాయణాఖ్యసన్మునులు
మానుగఁ దపము నెమ్మదిఁ జేయుబుద్ధి
బంధురముగ లోకభద్రమ్ముఁ గోరి
గంధమాదనగిరికడఁ జేరఁ జనిరి; 70
వారె భూభారమ్ము వాపుటకొఱకు
ధారుణి ననయమ్ముఁ దగ జనియింత్రు;
అమ్మహామహులె కృష్ణార్జునులనఁగ-
నిమ్మహి జనియించి రెలమి ద్వాపరను;

ఈమునీశ్వరుల జన్మేతిహాసమ్ము-
నేమానవుండేని నేర్పడ విన్న
పాపదూరుండగు భద్రముల్ వొందు
నీపాదదాసుఁడై నెమ్మి జీవించు-

నట్టిభాగ్యమ్మె నా కమరుచుమయ్య
పట్టితి నీపాదపద్మముల్ దేవ!

## శివునకు దక్షునకు విరోధము సంభవించినవిధము :—

శ్రీవరయోగీంద్రచిత్తవిహార
లావణ్యపూర్ణలీలాశుభాకార
దైవాంశజుఁడెగాని, దైవమేగాని
భావవక్రతయున్నఁ బడు విచారమున.

మును నవబ్రహ్మలు మునుకొని సత్ర-
మనుయాగమును బ్రజలానందమొంద
జరిపించుచుండఁ దత్సవనమ్ముఁ జూడ
సరసిజోదర శర్వ సర్వసుపర్వ-
మునివర దిగధీశముఖ్యులెల్లరును
జనుదెంచియుండ దక్షప్రజాపతియు 80
విచ్చేయ, నాతని వీక్షించి లేచి
రచ్చటివా; రబ్జాభవుల్ దక్క
దక్షుఁ డజునకు వందనములు సేసి
దాక్షిణ్యమున సభ్యతతియిచ్చుపూజ-
లంది యర్హాసనమందుఁ గూర్చుండి
యందఱు తనుఁగాంచి యతిభక్తి లేవ
తనగద్దె దిగనిభూతపతిఁ గోపించి
కనులెఱ్ఱనయి యగ్నికణములు రాల్చఁ
గనుఁగొని సభ్యులు కడు భీతినొంద
విమఁడని వారి కివ్విధమున ననియె;

"నావచించెడుభాషణమ్ములు మోహ-
భావమత్సరప్రలాపమ్ములు గావు"

అని యాసదస్యుల కాశివుఁ జూపి
"యనయుఁ డితండు క్రియాశూన్యపరుఁడు
మర్యాదరహితుఁడు మానహీనుండు
దుర్యశస్కుఁడు కడుదుష్టవర్తనుఁడు
సజ్జనాచరితమౌ సత్పథంబెల్ల
నిజ్జడునకు చాలహేయమై తోఁచె -
తా శిష్యభావంబుఁ దాల్చి, పెద్దలస -
కాశంబునం జేరి కడు భక్తిఁగొలుచు 90
ననియెంచి యితనికి నతిప్రీతి నాదు -
తనయ నొసంగుట తప్పయ్యెఁ గడకు
ననుఁజూచి యెదురయి నతిసేయకున్న
మనిసిచ్చి యొకమాట మాటాడవలదె;
ఇతఁడు దిగంబరుఁ; డితఁ డస్థిభూషుఁ;
డితఁడు మత్తుండు; భూతేశుఁ; డుగ్రుండు;
ఇతఁడు భసితలిప్తహేయశరీరుఁ;-
డితఁడు మసనవాసి; యితఁ డతినింద్యుఁ; -
డితఁడు సద్వర్తన మేలాగెఱుంగు;-
నితనికి శివనామ మిచ్చుటఁ జూడ
వేదవిద్యల నపవిత్రున కిచ్చి
ఖేదమొందినయ ట్లకృత్యమై చెడియె"; -
నని నిష్ఠురముల గర్హణవాక్యములను
వినిపించి మరియును ద్వేషమ్ముఁ బెంచి
దూరదృష్టిని, శాంతి, దూరమ్ముచేసి
యీరీతి శివు శపియించె నతండు;
"ఇతఁడు హవిర్భాగ మెయ్యెడ దేవ -
తతితోడఁ గొననిదుర్దశ నొందుగాక!"

దక్షుఁడువల్కినదంభోక్తులెల్ల-
నీక్షితి నిందలై యేర్పడెఁగాని 100
త్ర్యక్షునిఁ జేరి స్తోత్రములయ్యె; దైవ-
వీక్షణమున నన్ని విమలముల్గావె;
శివునకు శాపమిచ్చినకారణమ్ము
సవనసదస్యు లసత్కృత్యమనుచు
దక్షు నాక్షేపింపఁ, దా గోపమొంది
యాక్షణమున నతఁడచ్చోటు వీడె;-
నంతట నీశానుననుచరసంఘ-
మంతయు కోపించె; నందఱిలోన
నందికేశ్వరుఁడు పినాకిని దక్షుఁ
డిందఱయెదుట గర్హించుట, మరియు
శపియించుటెల్లఁ దా సహియింపలేక
యపరాధి యితఁడు దండార్హుఁడటంచు

నిటులనె; "ఈదక్షుఁ డీశ్వరు మిగులఁ
గటువుగా దూషించెఁ గాన, నీమూఢుఁ-
డతిమోహవారిధియందున మునిఁగి
మతిమాలి పశువుసమానుఁడౌఁగాక;
అల్పుఁడై స్త్రీలోలుఁడై నిజమహిమఁ
గోల్పోయి మేషముఖుండగుఁగాక;
తనయెడంద నవిద్య దాల్చి యీశ్వరుని
కనలి తిట్టినదక్షుఁ గలసి వర్తించు- 110
వారు సంసృతికర్మపాశాలఁ జిక్కి
దోరుచుఁ బుట్టుచుఁ దురపింత్రుగాక;
మరి హరద్వేషులై మనుద్విజులెల్ల-
నెఱుకేది మూఢులై హృదయసంక్షోభ-

మోహితులై, కర్మముల నొనరించు
సాహసికులయి, భక్ష్యాభక్ష్యధర్మ -
హీనులై, యాత్మదేహేంద్రియపోష -
ణానురక్తిని భిక్ష మర్థింత్రుగాక!";

అని నందికేశ్వరుఁడన భృగుమౌని
విని ప్రతిశాప మివ్విధమున నిచ్చె;
"ధర శివవ్రతులును దదనుయాయులును
బరికింప సచ్ఛాస్త్రపరిహాసకులును
పాషండు లగుదురు; పంకజనాభు -
భాషణమ్మును జగద్భాగ్యదమైన -
వేదమ్ము నలతిగా వివరించుకతన
మీదైవ మభవుఁడు మేదినిలోన
మధ్యమపూజ్యసంపద నొందుఁగాక
తథ్యమిది"యని నత్తపసి శపించె;

పగశాపములు పరస్పరము పొందియును
భగవదనుగ్రహప్రాపకులగుటఁ 120
బాపభూషణు, దక్షుపక్షసంఘములు
తాపనాశమ్ము లొందకయుండె నెలమి;
విమనస్కుఁడై యటు విశ్వేశ్వరుఁడును
ప్రమథవరుల్ గొల్వ వయనమై చనియె;

ఏయజ్ఞమన్న నీ కెక్కుడుప్రియమొ
ఆయజ్ఞమును దీక్ష నచ్యుతా! యజుఁడు
గంగాయమునలసంగమమౌప్రయాగ
మంగళమొప్ప నెమ్మది వేయియేండ్లు
జరిపించె; నవబృథస్నానముల్ చేసి

నమలమతుల్ ముని లార్యులందఱును
తమతమవాసముల్ దగఁ జేరుకొనిరి;
ఎట్టి తపశ్శక్తి హెచ్చినవేమి!
ఎట్టి వేదార్థమ్ము లెఱిఁగినవేమి!
ఎట్టి దైవబలమ్ము లెనసినవేమి!
ఎట్టి పదవీభాగ్య మెసఁగినవేమి!
క్రోధగుణ మ్మొండు గూల్చు నన్నిఁటిని
క్రోధమే శత్రువు క్రోధి నశించు
శాంతమ్ము లేకున్న సౌఖ్యమ్ము లేదు
శాంతస్వభావులే జనలోకఘనులు 130
నాలోనిక్రోధమ్ము నశియింపఁజేసి
వాలాయముగ శాంతభావమ్ము గూర్చి
నన్ను నీదాసబృందములోనఁ జేర్చి
మన్నింపుమా రమామహిళాధినాథ.

## దాక్షాయణి దక్షయజ్ఞమును జూడ నభిలషించుట :—

సర్వజగద్రక్ష సన్మౌనిపక్ష
సర్వలోకక్రియాసాక్షిస్వరూప
ఏవేళ నీజగద్వృత్తి మెట్లగునొ
భావించువార లెవ్వరుగాని లేరు.
కాలచక్రమ్ము జగమ్మును ప్రాణి -
జాలమ్ము నాడించు చతురత వేరు;
అల్లుఁడుమామయునగుశివదక్షు -
లుల్లమునందున నూనినసూడు
లోలోన నిమిడి పెల్లుగఁ బెర్గుచుండె;
కాల మీరీతిగాఁ గడచుచునుండె;

అవని రుద్రవిహీనమౌ సవనమ్ము
సవరించ రెవరు; దక్షబ్రహ్మ శివుని -
పగఁ బెంచి బ్రహ్మఁ బలమున మించి
తెగి యీశ్వరాదుల ధిక్కృతిచేసి
పరగ నరుద్రక వాజపేయమ్ము
జరిపి, యాపయి, బృహస్పతినామకమ్ము 140
యజ్ఞమ్ముసేయంగ, నద్దానిఁ జూడ
విజ్ఞులౌమునివరబృందముల్ సురలు
మరి ప్రజాపతులు సంబరమున నాత్మ -
తరుణులతో వచ్చి దర్శించి దక్షు -

నాదృతి దీవించి, యతనిపూజలను
మోదమ్ముతోఁ బొంది పోవుచునుండ, -
నంతరిక్షమ్మున నరుగుఖేచరులు
స్వాంతాలఁ బొంగి దక్షప్రజాపతిని -
వాతనిమహిమల నగ్గించుచుండు
రీతి దాక్షాయణి ప్రీతి నాలించి
వినువీధి మోమెత్తి వీక్షించి, తనదు -
జనకుజన్నముఁ జూడ సంభ్రమమొప్పఁ
బతులఁతోఁ జనుదేవపత్నులఁ జూచి
మతి తన్ను జన్నంపుమహిమలఁ గాంచు -
నిచ్ఛ ప్రేరేపింప నీశ్వరుతోడ
నిచ్చకమొప్ప దా నిటు విన్నవించె;

“ఓమహేశ్వర! సర్వయోగీశవంద్య!
మామామ మత్పిత మేలుగా మఖము
చేయుచున్నాఁడఁట చెలఁగుచు నమరు -
లాయుత్సవముఁ జూడ నరిగెద రదిగో 150

నాయనుజాతలందఱు, వారిపతులుఁ
బాయక వత్తురు ప్రమదమ్ము మీఱ;
మనముఁ బోయిన నేను మనవారినెల్లఁ
గనఁగల్గుదును; నాకుఁ గడుముద మ్మొదవు;
జనకునింటను మహోత్సవసమయమున
మనమిర్వురముఁ జేరి మర్యాదలొంది
భూషణాంబరములఁ బొందుభాగ్యమ్ము
శేషభూషణ నాకు చేకూరనిమ్ము;
నాయక్కసెలియండ్ర నాతల్లిఁ జూడ
నాయిచ్ఛగించుట నాయమ్మగాదె
జనకుగేహమ్మున జరుగుశుభాలు
గనకున్న స్త్రీలకుఁ గలవె మోదాలు;
పిలువలే దందువా పెద్దలు, ప్రభులు,
తలిదండ్రు లాప్తులు తముఁ బిల్వకున్నఁ
గనలునొందనిమతిఁ గడుభక్తితోడఁ
జనుచంద్రు సజ్జనుల్; శంకరా! నీకు
నర్థాంగినైన నాయభ్యర్థనమ్ము
వ్యర్థమ్ముసేయకుమా మహాదేవ"

తనసతిచేయుప్రార్థనమును శివుఁడు
విని మందహాసశోభితముఖుఁడగుచు 160
మును జగత్స్రష్టలముందు దక్షుండు
తనునిందచేసినదంభోక్తులెల్ల
మనమునఁ దలఁచి యామానిని వినఁగ-
ననునయపద్ధతి ననియె నీరీతి;

## శివుడు దాక్షాయణికి దక్షయజ్ఞదర్శనము వలదని చెప్పుట:—

"ఇందునిభాస్య నీహితవాక్కు లెస్స
బందుగులిండ్ల కాహ్వానమ్ము లేక -
యున్నను పోవుట యుచితమే కాని,
మన్ననపోనాడి, మదమెక్కి నింద
లారోపణముచేసి, యధికరోషమున
క్రూరమానసులయి ఘోరాపకృతినిఁ
బొనరించుచున్నట్టిమూర్ఖులౌ బంధు -
జనులగేహమ్ములు చనఁగ నర్హములె?
విద్యాతపోవయోవిత్తాన్వయములు
సద్యశంబును గూర్చు సజ్జనతతికి—
నవియె దుర్జనులకు నమితగర్వమ్ము -
నవివేకమును గూర్చు హానికల్గించు; —
నట్టి దుర్మార్గజనావాసములకు
చుట్టరికమ్మని సుజనులు చనరు;
చనిరిపో యాక్రూరజనులు బందుగులఁ
గనుఁగొనుచుంద్రు భీకరవీక్షణముల 170
అరివీరసాయకాహతుల శరీర —
మఱుగుచున్నను మనోవ్యథ గల్గఁబోదు;
ఇష్టబంధుదురుక్తు లెడదలో నాట
శిష్టుల కవి కడుసిలుగులఁ గూర్చు
నీవు దక్షసుతవు నిజము నాసతివి
కావున నతఁడు నిఁక గౌరవింపండు
"మత్పితకును నీకు మత్సర మెట్టు —
లుత్పన్నమయ్యెఁ దదుద్దేశమేమి?"
యందువా "విను సతి యార్యులసుగుణ —
సందోహములఁ గాంచి సహియింపలేని -

కపటవర్తను లహంకారచిత్తమున
విపరీతచేష్టల వేరమ్ముఁ బెంత్రు;
అనవసరముగ మహావిఘ్నుఁ గూర్చి
దమజులు శత్రుతత్త్వముఁ బెంచునట్లు;"
"మాతండ్రినిం గాంచి మర్యాద లేచి
జోత లర్పింపవు; చూపవు భక్తి;-
నందున ధిక్కృతి నతఁడు గావించె'-
నందువేమో. విను మబ్జదళాక్షి
అవనిఁ బ్రజానీక మరయ నన్యోన్య-
మవలోకనముతోడ నభినందనాదు- 180
లొనరించుకొని తృప్తి నుందురు; దీని
మనమున నెఱుఁగు సామాన్యధర్మముగఁ;
బరమాత్ముఁ డఖిలాత్మవర్తియై లోక-
పరిపూర్ణుఁడై యుంట పండితు లెఱిఁగి
తద్దేవుఁ దలఁచి స్వాంతమున దర్శించి
దద్ద ప్రణామముల్ తగ నాచరింత్రు;
వాసుదేవసుశబ్దవాచ్యుఁడై సత్య-
భాసురుఁడైన శ్రీవాసుదేవునకు
నేనును భక్తి నాహృదయమ్మునందు
మాన కెప్పుడు ప్రణామముల నొనర్తు;
మును నవబ్రహ్మలు పూనినసత్ర-
మున సురవరులును మునులున్నచోట
నిరపరాధిని నన్ను నీజనకుండు
నిరసించె నిందించె నిష్ఠురవణితి-
నమితపరాభవమయ్యె నా కచట;
కుమతి నీతండ్రి నాకుం గడువైరి

ఆతఁడును నాతనియనుచరులెల్లఁ
బతితులు చూడంగ వారలు తగరు
వినుము; నావల్కులు వినకుంటివేని
చని, యవమానాగ్ని సంతప్త వగుము; 190
బంధుతిరస్కృతిఁ బడయుటకన్న
బ్రమందుట మేలని మహనీయు లంద్రు"
అని వినిపించి "యాయభవుఁడు సతినిఁ
జనుమన్న నటు తిరస్కారమ్మువలన -
నగు నమంగళము; నీ వరుగరాదన్న
వగ మనోవేదన వాటిల్లు నిచట" -
నని తలపోయుచు నవును గా దనుచు -
ననక యూరకయుండె; నంతట నామె

తనవారిఁ జూడ తాఁ దలఁప నాటంక -
మెనయుట దుఃఖాన నెడఁద గలంగఁ
గన్నీరు కాల్వలై గండభాగములఁ
జెన్ను నడంచుచుఁ జెదలుచుఁ బాల
పేరురమ్మునఁ గలపేరులు వేఁడి -
యూరుపుగాడ్పులయుడుకుచేఁ గందఁ
గ్రోధరోషాన్వితక్రూరగుణాల
బాధితమై యంగవర్గమ్ము వడఁక -
నాత్మదేహార్ధమ్ము నర్పించినట్టి -
యాత్మేశు విడనాడి యతిమూఢవృత్తి
జనకునిఁ జూచెడిసంభ్రమదృష్టిఁ
జనుచుండె నొక్కతె సరభసగతిని; 200

ఆరీతిఁ జనుచున్నయాసతీదేవిఁ
బారిషదుల్ యక్షవరులు పెక్కండ్రు

గాంచి యామెధరించుకమనీయవస్త్ర-
కాంచనభూషలు కరముపభోగ్య -
వస్తుసంచయములు వావిరిఁ గొంచు
నిస్తులభక్తి గన్పింప వృషేంద్రు
మున్నిడుకొని చని ముదముగా నామె
సన్నిధిఁ జేరిచి, శంఖాదివివిధ -
మంగళవాద్యముల్ మ్రోగుచుండ
నంగీకృతోక్షవాహనగాఁ జేసి
యక్షీణవైభవ మమరంగ నరిగి
దక్షమహామఖస్థలిఁ జేర్చి రంత
దాక్షాయణీదేవి తత్క్రతుశాల
వీక్షించి ప్రీతిఁ బ్రవేశ మొనర్చె;

## దాక్షాయణీపరాభవము - అగ్నిప్రవేశము

పతియింటఁ దన కెన్నిభాగ్యమ్ములున్నఁ
బతి యెంత తన్ను సంభావించుచున్నఁ
బతి లోకమాన్యుఁడై పరఁగుచునున్నఁ
బతిపైననే తనప్రాణములున్న
సతికిఁ బుట్టినయిల్లె సంతోషమూల-
మితర మెద్దియుఁగాని యెడ కప్రియమ్ము; 210
ఇవి లోకధర్మమ్ములే యంద్రు గాని;
వివరింప సర్వేశవిధివిలాసములు;

అతికుతూహలమున నాసతీదేవి
క్రతుశాలఁ జేర, సంభ్రమమున నామె -
సోదరుల్ జననియుఁ జూచి సంప్రీతి
నాదరించిరిగాని, యన్యులెవ్వరును

దక్షునిభీతి యాతన్విమోమైన
వీక్షింపరైరి వివేకమ్ము మాలి;
సోదరుల్ తనకు నత్సుకత సత్క్రియల-
నాదరమునఁ జేసి యతిప్రియమొప్ప
క్షేమవార్తల వినఁజేయుమం చడుగ-
నామె మార్మాటల నాడకయుండె;
మరి కన్నతండ్రి యామగువ నవ్వేళఁ
జురుకుఁజూపులతోడఁ జూచెనేగాని
సరసకుఁ జేర్చఁడు సాదరబుద్ధి
మురిపెమ్మఁ జూపఁడు ముచ్చటపడఁడు;
ఆరీతి తండ్రిచే నవమానపడిన
యారమణీమణి యతిఖేదమొంది
శివునిఁ బిల్వనితిరస్కృతియును, మరియు
నవ మరుద్రకముగ జరిపించుటయును, 220

గని కోపవహ్ని జగంబుల మాడ్చు-
నమువన జృంభించి; "యభవవిద్వేషిఁ
గ్రతుకర్మగర్విష్ఠిఁ గడుదోషి దక్షు
హాతముసేయుదు" మని యార్చెడుభూత-
గణముల నాఁపి, దక్షప్రజాపతినిఁ
గని, రోషపరుషవాక్యముల నిట్లనియె,

"సర్వభూతంబుల సమదృష్టిఁ జూచు
సర్వేశునకు జగత్సర్వమ్ము సమము
అరయంగఁ బ్రియమని, యప్రియమనియు
గురువని లఘువని గుణితించఁ డతఁడు;
అట్టి నిర్మత్సరుఁడగురుద్రునందుఁ
గట్టితి కక్ష దుష్కర్ముఁడ వగుట;-

ననఘులగుణముల నల్పమ్ము లనుట
నినువంటివారి దుర్నీతిలక్షణము;
శివనామ మొకపరి చిత్తమ్మునందుఁ
బ్రవిమలభక్తితో భావించి పలుక
సకలజీవులపాపసంఘముల్ దొలఁగు -
నకలంకసంతోష మాత్మకుఁ గలుగు; -
నామహితాత్మునియందు ద్వేషమ్ము
నీమది జనియించెనే యది వింత 230
మసనగేస్తుఁడు, బసుమముఁ బూయువాఁడు
కసుమాలమగుఁనెమ్ముకలదండవాఁడు
బూచులదొర తోలుపుట్టమ్మువాఁడు
యాచింపఁ బుట్టెఁ జే నమరుచువాఁడు
పెద్దలబంతిలో వెలిపడ్డయల్పుఁ -
డెద్దుపై నెక్కువాఁ డేటిమగండు
అని యమంగళముగా నభవు నెవ్వార -
లనరు; నీ వంటివి; యబ్జాసనాది -
సుర లామహేశ్వరు సుందరపాద -
సరసిజములఁ గొల్చి సన్నుతియింత్రు;
చెవియొగ్గి వినరాదు శివదూషణముల
శివుదూఱుఖలునాల్క ఛేదింపవలయు
మానవుఁ డజ్ఞానమతిఁ దిన్నయట్టి
కానియన్నంబును గ్రమ్మఱఁ గ్రక్కి
పరిశుద్ధుఁడైనట్లు, పరమేశు దూఱు
దురితాత్ముఁడవగు నీదుహితయనంగఁ
బెరిగిన యీమేను విడిచి వేరొండు
పరిశుద్ధదేహంబుఁ బడయ నెంచితిని;

రాగ, వైరాగ్య, కర్మలకు నతీతు-
నాగమవంద్యు క్రియాశూన్యుఁడంచు 240
నిందింపఁ బాడియే, నీదు విభూతు-
లిందు యజ్ఞాహూతబృందమ్ముచేత
స్తుతియింపఁపడుట నస్తోకంపుగర్వ-
మతివైతి నేన సంభావ్యుండ నముచుఁ-
నస్మదీయంబులౌ యణిమాదులెల్ల
విస్మయంబులు లోకవిశ్రుతభూతు-
లవి నీకు సంప్రాప్తమౌనె దరిద్రుఁ-
డవు నీవె శివుఁడౌ గాఢముగ యోచించు
నను 'దక్షసుత' యని నర్మ మాదరము
పొనర శివుఁడు పిల్వ పురపుతఁ బొక్కి
వెలికి మెల్లనినవ్వు వెలయ మేలముగఁ
బలుకును మఱతు నాపరిభాషణమ్ము;
నీనందనయనెడినెంజిలికంటెఁ
బ్రాణముల్ వదలుటే భావ్యమ్ము నాకు."

అని యాశదస్సున నందఱు వినఁగ
వినిపించి యెల్లరు వీక్షింప నామె
జలములఁ బట్టి యాచమనమ్ముచేసి
తలఁపులుమాని యుదఙ్ముఖియగుచు
మౌనమ్ము ధరియించి మహినిఁ గూర్చుండి
ప్రాణముల్ యోగమార్గమ్మున విడువఁ 250
దలఁచి నిజేశపాదస్మరణమ్ము
వెలయంగఁ జేయుచు, విభురూపు దక్క-
నితరమ్ముఁ జూడక యెసఁగుయోగాగ్ని-
నతిదీక్ష వహియించి యట దగ్ధయయ్యె;

అదృశ్యముం గాంచి యమరులు మనుజు-
లాదిసదస్యులు "హా! యెంత ఘోర-
కార్యమ్ము జరిగె నీకమలదళాక్షి
నిర్యాణమొందె పన్నినతండ్రిపగయ
కారణమ్ముగ; తనకన్నసుపుత్రి
పోరామి తనచేతఁ బొంది కాయమ్ముఁ
దనయెట్టయెదుటనే త్యజియించుచుండఁ
గనుఁగొనుచున్నాఁడు కడుఁఖలుం డితఁడు
దుష్టుఁడు బ్రహ్మబంధుఁడునైనయితఁడు
కష్టుఁడై పడిని, దుర్గతిని బొందెడిని."
అని పలుతెఱఁగుల నంద ఱాదక్షు-
ననయు దూఱుచునుండి రాసమయమున

సతితననెమ్మేను చాలించఁ గాంచి
యతిక్రోధమూర్తులై యభవుపార్షదులు
ద్రోహి దక్షుఁడు వానిఁ ద్రుంగింతుమనుచు
సాహసోద్రిక్తులై శస్త్రముల్ దాల్చ- 260
నాకలకలము మహర్షి భృగుండు
పోకార్తునని క్రోధపూర్ణచిత్తమునఁ
గడువేగ నభిచారకమను హోమంబు
బెడిదమ్ముగాఁ జేయ వింతదోఁచంగ
ఋభునామధేయులౌ త్రిదశు లందుండి
ప్రభవించి యుల్ముకప్రతతులఁ దాల్చి
హరుభృత్యులౌ ప్రమథాదులనెల్లఁ
దరుమఁగొట్టిరి. వారు తద్ద భీతిల్ల;

## దక్షయజ్ఞధ్వంసము :—

ఈరీతి పితృతిరస్కృతయయి సతి శ-
రీరమ్ము వదలుట, ఋభులచేఁ బ్రమథ-
వార మపజయమ్ముఁ బడయుట, శివుఁడు
నారదువలన నంతయుఁ జక్కనెఱిఁగి.
దంతముల్ గీటుచు దష్టోష్ఠుఁడగుచు
దంతిఘీంకారశబ్దశ్రవణమున-
నదరి గర్జించుసింహముపోల్కి జగము-
లదలంగ వికటాట్టహాసమ్ము చేసి
విద్యుదగ్నిచ్ఛవి వెల్గెడుజటను
సద్యోజనితకోపసంభ్రమబుద్ధి-
నటునిటుఁ జూడక యాయుగ్రమూర్తి
పటపటమని త్రెంచి పడవైచె భూమి;- 270

నందుండి యతిదీర్ఘమై నీలవర్ణ-
మొంది మేఘభ్రాంతినొనరించుమేను,
జ్వలితపావకశిఖాజాలాభమగుచు
తులకించులోహితాస్తోకకేశములు
గజతుండసమములై ఖడ్గముల్ దాల్చి
విజయధ్వజమ్ములౌ వేయిబాహువులు
తళతళకాంతులఁ దళ్కొత్తి, చూడ-
నలవిగాకుండెడునట్టినేత్రములు
క్రకచకఠోరవక్త్రములు దంతములు
ప్రకటకీకసమాల్యబహుళముల్ దనర-
నతిభయంకరమూర్తియై కృత్తివాసు-
ప్రతిరూపమోయనఁ బ్రభవించె వీర-

భద్రుండు శత్రులపాలికాలుండు
రుద్రుకోపాగ్నిప్రరోహ మ్మవంగ ;

వేయిచేతులు మోడ్చి వీరభద్రుండు
పాయనిభక్తి యీశ్వరునకు మ్రొక్కి,
"యే నేమిసేయుదు నెఱుఁగంగ నాకు
నానతియిమ్మన్న నభవుఁ డిట్లనియె ;
"బాహువిక్రమ ! వీరభద్ర ! నాబలన -
మూహంబునకు నీవు మొనకాఁడ వగుచు - 280
నరిగి దక్షునిఁజంపి యజ్ఞమ్ముఁగూడఁ
జెఱచి రమ్మిదియ నాచేసెడు నాజ్ఞ ;
అందు బ్రాహ్మణతేజ మనివార్యమేమొ
యందువా, నీవు మదంశసంభవుఁడ -
వౌట నీకు నసాధ్యమనునది లేదు
పోటరివెందును, పొమ్మింక '' యనుఁడు
"అటుల గావించెద" నని వీరభద్రుఁ
డట శివు వలగొని యంజలిచేసి
మణినూపురధ్వని మ్రోగ దిశల -
ననివార్యజవమున నవని గ్రక్కదల
భీతిదమౌ కాంతివెలయుశూలమ్ము
చేత ధరించి యాశివునిసైనికుల
వెనువెంట నిడుకొని వేవేగ నతఁడు
చనుచుండె దక్షుయజ్ఞస్థలిఁ జేర

అరుద్రసైన్య పాదాహతోద్ధూత
భూరేణుయుతధూళి పుడమియు నింగి
నిండి ఘోరముగఁ గన్పింపగా మౌని -
మండలి దక్షుండు మరి యజ్ఞభూమి -

నుండెడువార "లోహో భయ, మిద్ది
మెండుచీఁకటి గాదు; మృత్తికాధూళి 2
యీదుమ్ము రేగంగ హేతు వెయ్యదియొ
యేదుర్గతులు జనియించునో యెఱుఁగ'';-
మని భయపడుచుండ నటనున్నపుణ్య-
వనితలు కొందఱు వలికి రీరీతి;

"తనదుసుతల నొక్కతను శివసతిని
ననయుఁడై తక్కిన యాత్మజల్ సూడ
ననపరాధనుఁ గడు నవమతిచేసెఁ
దనకడ్డులేదని దక్షుండు; దాని-
ఫలమిది తప్పదు వాయదు ముప్పు;
తెలియఁ డీతఁడు భావితెఱఁ గేమిచెప్ప
తనసుతయెడ విరోధమె గాదు; శివుని
తనకు శత్రువుగాఁగ దలఁచియున్నాఁడు;
ఆమహేశ్వరుఁడు కల్పాంతమ్మునందు
భీమత్రిశూలాన భేదించు నొకట
నెనిమిదేనుంగుల, నెనిమిదిదిశల
స్తనితఘోరాట్టహాసస్ఫూర్తి భిన్న-
ములు సేయు, వక్త్రవిస్ఫురితదంష్ట్రాగ్ర-
చలనాహతుల ఋక్షసంతతి రాల్చుఁ;
గరవాలవిపులప్రకాశసంయుక్త-
దరకరదీర్ఘదోర్దండాఢ్యుఁడగుచుఁ
బ్రచలితభ్రూకుటీద్వయ ఫాలుఁడగుచు-
నచలిత దుర్నిరీక్ష్య విభాసియగుచు
సకలలోకంబుల సంహరించుటకుఁ
బ్రకటభీకరమూర్తిఁ బరఁగ నర్తించు;-

నంతటిఘను త్రిపురాంతకు భర్గు -
స్వాంతమ్మునందు కోపము కల్గఁజేసి
శ్రేయముల్ పొందంగఁ జెల్లునే యాది
తేయాదులకునైనఁ దెలియఁ డీతండు''
అని వల్కుచుండెడునాసమయమున
మునుకొని యుత్పాతములు వేలకొలఁది
కడుభీకరముగ దక్షప్రజాపతికి
నెడద గలంగ నాయెడ గానుపించె;
అంతట పార్షదు లభవునిభటులు,
కుంతమ్ము లాదియౌ క్రూరాయుధములు
ధరియించి, కపిల పీతచ్ఛాయలొప్పు -
కురుచమేనులు, గ్రాహకుక్షి వక్త్రములు
గలిగిన వారలై క్రతుశాలఁ జేరఁ
బిలపిల పరువులువెట్టి యేతెంచి
మఖవాటమెల్ల తార్మారు గావించి
యఖిలమ్ము వమ్ముసేయఁగ విజృంభించి, 310
వివిధయజ్ఞక్రియల్ వేర్వేర సలుప
సవరించియున్నట్టిసర్వవేదికలఁ
గూలంగఁద్రోసి, యగ్నుల నార్చి, పాత్ర -
జాలముల్ విసరి, యజ్ఞపుగుండములను
మూత్రముల్ విడిచి, తృప్తులుగాక మునుల -
గాత్రమ్ములకు బాధఁ గలిగించి, దేవ -
తతికి నెయ్యెడ నిరోధమ్ము గావించి,
క్షితిదేవతలను హింసించి, రామీఁద
మౌనియౌభృగు మణిమంతుఁడు; దక్షు -
ప్రాణముల్ గొన వీరభద్రుండు; పూషుఁ

జండీశుఁడును; భగుఁ జదుప నందీశ్వ-
రుండును బట్టిరి; క్రుద్ధులై యచటి-
సదసునను న్నిర్జరుల ఋత్విజుల
విదళింతుమని రాల పిసరి, మోకాళ్లఁ
గ్రుమ్మి, లోచేతులఁ గొట్టుచుఁ, గూర్ప-
రమ్ములఁ బొడువ, వారలు తలకొక్క
దిక్కుగా వారిదుస్థితికిఁ జింతిలుచుఁ
గ్రక్కున బఱచి రాక్రతుభూమి వదలి;

మునుపు బ్రహ్మలు యాగమును చేయుసమయ-
మున దక్షుఁ డభవుని పొడిచి యాడంగఁ
గనుగీటెనని భగుకన్నులు వెఱికె
మునుకొన్న ఘనకోపమున నందిరాజు;
గిరిశుని దక్షుండు కేరి శపింప
పరిహసించినపూషుఁ బండ్లూడఁగొట్టె
చండీశ్వరుండు; తత్సభ నాఁడు శివుని
గండఁడై దక్షుండు కరము తిరస్క-
రించినవేళ హసించి మీసములు
మించినగర్వాన మెలిద్రిప్పినట్టి-
భృగునిశ్మశ్రువులను వీరభద్రుండు
పగదీఱఁ బెఱికె; నాపయి మరి వీర-
భద్రుండు దక్షునివక్షంబుఁ ద్రొక్కి
రౌద్రంబు హెచ్చ, పార్షదులెల్ల మెచ్చ,
ఘనశితాసిని వానికంఠమ్ముఁ గోసి
కినుకమై దక్షిణాగ్నినివేసి వేల్చె;-
నారీతి జన్నమునంతయుఁ జెఱచి
వీరభద్రుఁడు నిజవేషమ్ముఁ జేరె.

## బ్రహ్మాదిసురలు శివుని దర్శించుట :—

విశ్వమయాత్మకా! విశ్వేశ! దేవ!
శాశ్వతరూప! కేశవ! వాసుదేవ!
ఇంతకుమున్నె మీ రెఱుఁగుదు రిట్టి -
వింత యేర్పడునని విధియు నిట్టిదని; 330
కావున దక్షుమఖంబుఁ జూచుటకు
నీవు! బ్రహ్మయు రాక నిలిచితిరయ్య;
నీవిశ్వమయతయు నీదుసంకల్ప -
మేవార లెఱుఁగ రోయిందిరానాథ;

హరభటవర్గ ఘోరాయుధాహతుల
కరము జర్జరితవిగ్రహులయి సురలు
భీతచేతస్కులై వేవేగ పద్మ -
సూతి డాసి శరణుచొచ్చి తత్పాద -
ములకుఁ జాగిలిమ్రొక్కి భూతేశభటుల -
వలన తామొందిన బాధలన్నిటిని
వినయమ్ముతోడుత వివరించి చెప్ప
వనజగర్భుఁడు విని వారి కిట్లనియె;

"వినుఁడు దేవతలు! వివేకమార్గంబు
మను లపరాధముల్ గావించియున్నఁ
జనదు ప్రత్యపకృతి సల్ప వారలకుఁ;
గనరు సల్పినవారు కల్యాణములను
క్రతుభాగమునకు నర్హత గల్గినట్టి -
శితికంఠు నీశ్వరు శివుని శంకరునిఁ
గాదని సవనమ్ము గావించు మీర —
లే దుష్ట, లపరాధు, లిది నిక్కవమ్ము; 340

ఈదృశ్యమానమౌసృష్టి సమస్త-
మేదేవుకోపాగ్ని కింధన మగునొ
యాదేవతావంద్యుఁ డతిభీమమూర్తి
మీదురుకృత్యత్రకంపితచిత్తుఁడయ్యెఁ ;-
దనప్రియావిరహచింతాక్రాంతుఁ డయ్యె ;
ఘనుని యాదేవు శంకరుఁజేరి మీరు
శరణమ్ము వేడ నాశర్వునికరుణ
కరము మీయజ్ఞమ్ము కడతేరఁగలదు ;
ఆమహాదేవు డాయఁగ వెఱయేని
నేమును మీతోడ వేతెంచఁగలము ;"
అని యబ్జసూతి యింద్రాదిదిక్పతుల
మునుల భయస్థులై పొగులుదేవతలఁ
దనవెంట నిడుకొని తరలి కైలాస-
ముకు జేరఁ జనిచని ముందుగాఁ గాంచె
శూలినివాసమౌ సుందరరజత-
శైలమ్ము ననుచరసంఘమ్ముతోడ ;
బహువిధసౌభాగ్యబంధురమగుచు-
నహరహశ్శోభల నలరారుచుండు-
కైలాసమును దాఁటి కమలగర్భాదు-
లౌలోకపాలకు లమరు లందఱును- 350
నలకాపురము మించి యప్పురిముందు
జలజాక్ష నీపాదసరసిజయుగ్మ-
రజముచేఁ గడుపవిత్రములు జేజేల-
వ్రజమున కతిసుఖప్రదములునైన-
నందయు నలకనందయు ననునదుల-
యందముల్ గనుగొని యానందమొంది

యానదులను దాఁటి యావలినేల
మానసౌగంధికమయవనిచెంత
వేలయోజనముల విరివియుఁ బొడవుఁ
జాలినయెత్తును సమకూడి యెల్ల-
పట్టుల తమచోటు వదలకయుండు-
దట్టమౌనీడలఁ దనరి, యాకులును
కొమ్మలు గుబురులై, గొనబుగా మాని-
కమ్ములసాటిగాఁ గనఁబడుపండ్లు
గలిగి భక్తజనాళికల్పకం బగుచు
వెలసెడునొకవటవృక్షమ్ముఁ గనిరి;
ఆతరుమూలమ్మునందునఁ గుశల-
నాతతమైనబృస్యాసనోపరిని-
నెడమపాదముఁ గుడియెడతొడమీఁద-
నిడి, సవ్యబాహువు నెసఁగగా సవ్య-
జానువుమీఁదుగఁ జక్కగాఁ జాఁచి,
మానుగ రుద్రాక్షమాలికఁ దనదు-
వలపలిముంజేత వలనొప్పఁ దాల్చి,
తలఁపున బ్రహ్మతత్త్వమ్ము నెంచుచును-
నాసీనుఁడై యోగులందఱు వినఁగ
భాసురవదనుఁడై, బ్రహ్మాత్మకుండు
నారదమౌని యానందమ్ము నొంద
కూరిమి భాషించు గురుతత్త్వవేది,
పన్నగాధిపభూష, భక్తసంతోష,
క్రొన్నెలతాలుపు రుద్రు శంకరునిఁ
గని, మునుల్ సురలు దిక్పతులు సద్భక్తి

వనజమ్ములకు మ్రొక్కి ప్రార్థించుచుండ,
వనజజునకు నతుల్ భవుఁ డాచరించెఁ;
దరువాత రుద్రుసద్భక్తులు సిద్ధ -
వరులును మునిజనుల్ పంకజగర్భుఁ -
గని మ్రొక్కి రంత నాకమలభవుండు
మనము పొంగార త్ర్యంబకున కిట్లనియె;

"జగతికి యోని బీజమ్ములు నీవ;
నిగదింప నీవెకా నిర్వికారుఁడవు; 370
విశ్వోద్భవమ్మును విశ్వరక్షణము
విశ్వనాశమ్మును వెలయింతు వీవ;
జీవులసుకృతదుష్కృతముల కీవు
భావుకనిరయముల్ పరగఁ గూర్చెదవు;
సకలధర్మంబులు సాధింప నెంచి
యకలంకపుణ్యకార్యములు ప్రజల -
చే నడపింతువు; చెడుఁ గొన్ని; కొన్ని
మానుగ శుభపరంపరలఁ జేకూర్చుఁ;
దారకాణమెగద దక్షుయజ్ఞమ్ము
తీరినతెఱఁగు వందితసురలోక
భవదీయరోషవిపర్యయ మరయ
సవనవిధ్వంసబీజమ్మనఁజాల -
నన్నిభూతమ్ములయాత్మలలోనఁ
గన్నార నిను నీవె గాంచుచుండుదువు;
కావున క్రోధంబు గలదె నీలోన
శ్రీవామదేవ! సుస్థిర శాంతభావ!
పురుషోత్తముని మాయ, మోహమ్ము నిన్నుఁ
బొరయవు సర్వజ్ఞమూర్తి వీవౌట;

మాయచే మోహితమతులైనవారి
పాయక కాపాడవలదె సర్వేశ!
కావున యజ్ఞభాగము నీకుఁ జేర్ప-
భావింపనికతానఁ బాడైనయట్టి-
జన్నము దయతోడ సాగింపఁజేసి
క్రన్నన దక్షుని బ్రదుకంగఁజేసి
యంగవిహీనుల నందఱఁ గృపను
సంగతాంగప్రాప్తి సంతోషపఱచి
సవనశేషమ్మును సంపూర్తిచేసి
భవదీయభాగమ్ముఁ బడయు మోదేవ"

## శివానుగ్రహము :—

అని వినయమ్మున నబ్జభవుండు
మనవిచేయఁగ నిందుమౌళి సంతుష్టి-
నెనసి చిర్నగవుతోఁ గృప తొంగలింప-
ననె ధాత వినఁగ నెయ్యము చెంగలింప;
"హరిమాయ మునిఁగినయట్టిపామరులు
కరము మోహమ్మునఁ గావించినట్టి-
యపరాధముల నాదుస్వాంతమ్మునందు
నెపుడుగాని గణింప, నేను యోచించి
బలియురశిక్ష, దుర్బలజనరక్ష
సలుపుట విజ్ఞుల సద్ధర్మమగుటఁ
గలుషాత్ము లొనరించు కడిఁదిదోషముల-
కొలఁది, వారలకెల్లఁ గూర్తు దండనము"

అని మరి యిట్టులననె శంకరుండు
వనజాసనాది దేవతలు హర్షింప;

"భాగశీర్షమున దక్షబ్రహ్మ వెలసి
రాగాదులగువికారమ్ములఁ బాయు;
భగుఁ డగ్నిసంబంధభాగముల్ గలిగి
తగ మిత్రనామనేత్రమ్మునఁ జూచు;
యజమానదంతసాహ్యమునఁ బూషుండు
భుజియించు పిష్టమ్ము భోనమ్ముగాఁగ;
సవనభాగము నాకు సమకూర్తు గాన,
దివిజు లవయవపూర్ణతృప్తి నందెదరు;
వికలాంగులైనఋత్విజులాదిజనులు
సకలాంగపూర్ణులై సంతసించెదరు;
తపసి భృగుండు బస్తశ్మశ్రువులను
విపులమ్ముగా నొంది వెలయునుగాక";

ఈరీతి నానతినీయ నందఱును
మీరినసంతృప్తి మృడునిఁ గీర్తించి-
రంత చతుర్ముఖుఁ డాశివుకృపకు
స్వాంతమ్మునం బొంగి సమ్మునీశ్వరులు-
నమరులు తనవెంట నరుదేర శంభు-
సముచితప్రార్థనాసంయుతస్వాగ- 400
తమ్ముగఁ దోడ్కొని దక్షుమఖస్థ-
లమ్ముఁ జేరెను మంగళ మ్మొదఁగోరి;

## దక్షునియజ్ఞము నెరవేరుట:—

శర్వదర్శనమాత్ర సర్వాంగములను
పూర్వవిధమ్మునఁ బొంది రెల్లరును;
అంత మేషముఖమ్ము నంది దక్షుండు
వింతదోఁపగ నిద్రవీడిన మనుజు-

వలె లేచి, నిలిచి, యీశ్వరుని దర్శించి
కలఁకమానినశరత్కాలంపుసరసి -
భాతి రుద్రద్వేషభావంబులెల్లఁ
జేతమ్మునందుండి చెదఱగా, విమల
మానసంబున శివుమహిమలఁ బొగడఁ -
బూని, నిజాత్మజ పొందినమృతినిఁ
దలఁచి ప్రేమానుబంధ సముద్గతాశ్రు -
జలపూర్ణనేత్రుఁడై చాల దుఃఖించి
డగ్గుత్తికగుట మాటలురాక కొతికి
యగ్గలమౌవంత నతిప్రయత్నమున
నణఁచి విశ్వేశ్వరు నభవు శంకరునిఁ
గనుగొని వినయమ్ము గదుర నిట్లనియె;

"శంకర! భక్తవశంకర! లోక -
సంకటనాశ; యీశా! స్వప్రకాశ,
నీకపరాధమ్ము నే నొనరింప
నాకుఁ గూర్చితివి దండన మీవు దేవ;
ఇది దండనముగాఁగ నేను భావింప
మదినెంతు భవదీయమహితరక్షణగ;
నీతత్త్వ మెఱుగంగనేరనినేను
నీతిహీనుఁడనయి నిను దురాలాప -
శరబాధితునిఁ జేసి సల్పితి దోష -
మరయమి సకలదుఃఖైకమూలమ్ము;
భర్తరక్షణమె నీవ్రతము సర్వేశ
వ్యక్తమ్ముగాదు నావంటిమూఢునకు
నాపప్పిదముల మానసమున నెంచ -
కాతతసత్కరుణాదృతి, నన్ను

మన్నించి గాచినమహనీయు నిన్ను
సన్నుతిసేయంగఁ జాలుదునయ్య!
నీకుఁ బ్రత్యుపకృతి నేఁ జేయగలనె
నాకు నిన్నెఱిఁగెడు జ్ఞానమ్ము గలదె
దానునితప్పులు దండమువరకె
దాసుని నను నేలు త్రైలోక్యరక్ష'';

అని క్షమింపఁగ వేఁడి యాదక్షుఁ డభవు-
కనికరమ్మును బొంది కమలజునాజ్ఞ 420
క్రతు వతిశ్రద్ధమై గావించుచుండ
చతురాననాదినిర్జరులును, మౌని-
తతియు, శివుండు సదస్యు లెల్లరును
పతితపావన నిన్నుఁ బ్రార్థింప, నీవు
ముదమొంది కేశవ! మురహర! పాప-
విదళన! మాధవ! విశ్వస్వరూప!
వేంచేసి తంత నవిఘ్నమై మఖము
కాంచనాంబర! శుభంకరమయి చెల్లె;

భవదీయదర్శనభాగ్యమ్ము నొంది
భవచతురాననబర్హిర్ముఖాదు-
లవనీసురులు దక్షుఁ డార్యులు మునులు
ప్రవిమలచిత్తులై ప్రణతు లర్పించి
వేరువేరుగ నిన్ను వేవిధంబులను
గారుణ్యవార్నిధిఁ గడుభక్తి వెలయ
వినుతింప విని తద్వివేకసంస్తుతికి
మనము పొంగగ వారి మన్నించి, దక్షుఁ
గనుఁగొని మఖవాటిఁ గలవారలెల్ల
వినుచుండ నిట్లంటి వేదనిశాన్త,

"దక్షప్రజాపతీ! ధన్యాత్మ! వినుము
త్ర్యక్షుండు మరియు పితామహుం డేను 430
నీజగంబులకెల్ల హేతుభూతులము
రాజిల్లుదుము భేదరహితభావమున
మఘు నేలుగా మూఢమనుజుండు దలంచు
మము వేఱుసేయని మనుజుండు ఘనుఁడు;"
అని పెక్కువిధముల నాత్మతత్త్వమ్ము -
ననఘ దక్షునకు నీ వతిప్రీతిఁ దెల్ప
నతఁడు తెల్వొంది యహంకృతి మాని
పతితపావన నీదుపాదసన్నిధిని
క్రతుపూర్తి గావింప, కమలాక్ష నీవుఁ
జతురాననుండును శంభుండు సురలు
మునులాదిప్రజలు సమ్మదమొంది దక్షుఁ
గనుగొని సుఖవృత్తిఁ గాలమ్ము గడుపు -
మనిచెప్పి మీరంద అటనుండి చనఁగఁ
దనిసెను దక్షుఁ డధ్వరపూర్తి కంత-
నెలమిని మేనకాహిమవంతులకును
జలజాక్షి సతి మఱిజన్మ జన్మించి
పార్వతీనామమ్ముఁ బడసి మేల్దెలిసి
శర్వునిల్లాలయి సౌఖ్యమ్మునొందె;

వనజాయతాక్ష శ్రీభార్గవీనాథ!
మునిలోకవంద్య ముముక్షుసంధాత! 440
ఈజగన్నాటక మెన్నితీరులనొ
యేజనుఁడేనియు నెఱుఁగనియటుల -
నాడించుచుందు నీయభిమతమేమొ;
రూఢిగాఁ దెలియు సూగుణుఁ డెవ్వఁడయుం -

దక్షుఁ డెవ్వఁడు వానితత్వ మదెద్ది?
త్ర్యక్షు డెవ్వఁడు వానిధర్మ మదెద్ది?
అంతయు నీమాయ; యది గానలేక
పెంతు రహంకారవీరముల్ ప్రజలు
ఫలమేమి? జగతికి భీభత్స మొండె
నిలుచు నద్దాన; నోనీరజనాభ
భవదీయకారుణ్యఫలమె లోకమ్ము -
ప్రవిమలసౌఖ్యమ్ము వడయ మూలమ్ము;

ఈయుపాఖ్యానమ్ము వేనరుఁడేని
పాయని భక్తితోఁ బాడిన, విన్న -
నాయురారోగ్యభాగ్యములు సంపదలు
శ్రేయముల్ వొందు త్యజించు పాపముల
నట్టిభాగ్యంబు నాకమరంగఁ జేసి
యెట్టులైనను బ్రోవవే యిందిరేశ.

## ధ్రువోపాఖ్యానము :—

శ్రీమహిళాలోల! శ్రితజనపాల!
సామగానవిలోల సత్త్వసచ్ఛీల 450
నిను స్మరింపఁగ వయోనియమమ్ము వమ్ము
కనుఁగొన భక్తియే కడుఁబ్రధానమ్ము.
రాగమ్ము మాని వైరాగ్యమ్ముఁ బూని
త్యాగశీలుండైనయతఁ డెవ్వఁడేని
నీభక్తవరుఁడయి నిఖిలజగాలఁ
బ్రాభవోద్దీపితపదవి మోదించు.

స్వాయంభువునకును శతరూపవలన
ధీయుతులగుసుతద్వితయము గలిగెఁ;

దనరుప్రియవ్రతోత్తానపాదాఖ్య -
లెనసినఘనులు విస్తృతకీర్తిధనులు ;
నొగి సునీతి, సురుచియును గృహిణులుగఁ -
దగ వరియించె నుత్తానపాదుండు ;
కనె సునీతి ధ్రువాఖ్యగన్నపుత్రకునిఁ
బొనర సురుచి గనె పుత్రు నుత్తముని; -
నరయ ధ్రువునితల్లియన నప్రియమ్మ
సురుచియన్నను రాజు చూపుఁ బ్రియమ్మ,
మానవకృతిమమానససరణి
మానించుప్రేమ, సమాజమ్ముఁ జెలఁచు ;

## సురుచి ధ్రువుని పరాభవించుట:—

ఉత్తానపాదరా జొకనాఁడు ప్రేమ -
నుత్తముఁ బిలిచి నిజోరువులందుఁ 460
జేరిచి లాలనసేయుటఁ జూచి
చేరువనుకండి హెచ్చినకోర్కి ధ్రువుఁడు
తాను తండ్రితొడలఁ దగ నెక్కఁదలఁచి
పూన, నాతండ్రి యాపుత్రుమోమైనఁ
జూడ కుపేక్షించుచొప్పుఁ దా నెఱిఁగి
క్రేడించి మరియు గర్వించియు సురుచి
సవతిబిడ్డను ధ్రువు చక్కవీక్షించి
మివులఁ గటూక్తుల మిడిసి యిట్లనియె ;

"ఓరి నిర్భాగ్యుఁడా! యుత్తముఁ జూచి
కోరితే నీతండ్రికురువు నెక్కంగ -
నట్టిభాగ్యమెయున్న నాఁనాడె నీవు
పుట్టియుందువు నాకుఁ బుత్రుఁడవగుచు -

నన్యగర్భజుఁడ వీ వాకోర్కి నీకు
మన్యవే గూర్చు నిమ్మళముఁ బోకార్చుఁ
గావున వేఁగి శ్రీకమలాక్షు పాద-
సేవ గావింపు మాశ్రీహరికరుణ
నాయుదరమున జన్మము గాంచగలవు
నీయభిమతసిద్ధి నెగడంగఁగలదు";
అని పినతల్లి తన్నవమానపఱుపఁ
దనతండ్రి వినుచుండ దర్పించి యనిన-
పరుషవాక్శరపాతబాధితుఁ డగుచుఁ
గరుణమాలినతండ్రికడఁ బాసి దుఃఖ-
జలధిమునింగి వేఁ జని తల్లియొడిని
పలవించుచు ధ్రువుండు వ్రాలె దైన్యముగ;

## సునీతి ధ్రువుని యోదార్చుట:—

ఆసునీతి నిజాంకమందున ధ్రువుని-
గాసి, శోకము వోవగాఁ జేర్చి, వాని
యొడలు నిమిరి పుత్రుఁ డుమ్మలికమ్ము
వడసినతెఱఁగు సర్వమ్మును స్త్రీలు
నగళులవారు విన్నగఁ దా నెఱింగి;
వగనొంది కనుల బాష్పములు గ్రమ్మంగ
వేఁడినిట్టూర్పులు విడిచి సపత్ని
యాడినమాటలయంపపోటులకుఁ
గ్రుంగి, తనకుఁదాన కుందెల్ల లోన
క్రింగి, బాలునకు నెమ్మిగ నిట్టులనియె;
"ఓయీ కుమార! నీయుమ్మలికమ్ముఁ
బాయుము దెగేము వడయుము లెము:

ఒరు లొరులకుఁ గీడు లొనగూర్పఁగలరె
యరయఁ బురాకృతమైనదుష్కర్మ -
ఫలితమ్ము వెనువెంట వదలకనంటి
మలిజన్మమున వేఁచు మానవతతిని 480
గాన నాసురుచిపైఁ గనలు వెంచకుము
మానుగా నీదునెమ్మది శాంతి గనుము;
ననుఁ బెండ్లమనిగాదు నాదుమగండు
కినిసి దాసిగనైన కిట్టి పిల్వండు;
అట్టిదుర్భగురాలనగునాదుకుక్షిఁ
బుట్టితి వందునఁ బొలఁతి యాసురుచి
యాడినవన్ని సత్యమ్ములే యయ్యె
గోడేల నాదుసూక్తులు వినుమింక;
జనకు నంకమునెక్కుసంకల్పమున్న
వనజాక్షుపాదసేవ యొనర్పు మన్న;
ఆమహాత్మునికంటె నన్యదైవమ్ము
నీమన్య నణఁచలేనిది నిజ మన్న,
నారాయణునిపాదనలినముల్ గొలిచి
యారయ బ్రహ్మ బ్రహ్మపదమ్ము నొందె;
మీతాత మనువు లక్ష్మీపతిఁ గూర్చి
ఖ్యాతిమై పెక్కుమఖమ్ము లొనర్చి
శాశ్వతదివ్యమోక్షసుఖమ్ము నొందె
విశ్వాత్మ నీవు సేవింపుమా భక్తి";
అని తల్లి బోధింప నబ్బాలకుండు
తనకుఁదా నియమతత్పరుఁడయి, రాగ - 490
మును మాని, జననికి మ్రొక్కి వేగముగఁ
జనుచుండె పురి వీడి శాంతభావమున;

## ధ్రువుఁడు నారదోపదేశమును బడయుట:—

అంత నారదముని యావార్తను విని
స్వాంత ముప్పొంగఁగా సరభసగతినిఁ
జనుదెంచి ధ్రువునిపజ్జను జేరి, వాని -
మనమునఁగలకోర్కి మదిఁ దా నెఱింగి,
కలుషమడఁచుతనకరతలమ్మునను
బొలుపార నాతనిమూర్ధమ్ము నంటి,
మానభంగము సహింపనిరాజవరుల
పూనికల్ దలఁపు లద్భుతములం చెంచి,
పినతల్లి యాడినబిఱుసుమాటలను
మనసున నుంచి యామాణవకుండు
చనుచుంటఁ దెలిసి యాశ్చర్యమ్ము నొంది
వినుమని వాని కివ్విధమునఁ బలికె;

"బాలకా! సకలసంపత్సమృద్ధములు
పోల నీనివసించుపురమందిరములు
వానిని విడిచి నీవ యొకండ వెచటి -
కేనిమిత్తమ్మున నేఁగుచున్నావు?
స్వజనకృతపరిభావమున నీయెడఁద
గజిబిజియైనట్లు గానవచ్చెడిని"; 500
అన బాలుఁ డద్దిసత్యమ్మగు స్వామి
వినుము "సవతితల్లి వినిచినపలుకు -
లనుములుకు లెద గాడి లావైనక్షతము -
లను జేసె; వాని శ్రీలక్ష్మీహృదీశు -
ధ్యానామృతాస్వాదనాతిభాగ్యమున
మానిపికొన నాదుమది నెంచినాఁడ."

అని యిట్లు తననిశ్చయమ్ము ధ్రువుండు
వినిపింప దేవర్షి విని వాని కనియె;

"అనయంబు నాటల కాసక్తమైన-
మనములఁ దిరిగెడు మాణవకులకు
మానావమానముల్ మదిఁ దోఁచ వెందుఁ
గాని, నీ కావివేకము గల్గు టరుదు;
అరయ మానవులు స్వయంకృతకర్మ-
పరిపాకమునకగుఫల మెద్దియేని-
ననుభవింతురు; ప్రాప్తమైనదుఃఖమ్ము
గనుచుండ్రు దైవయోగమ్ముగా మదిని;
నీవు నీతల్లివాంఛితమట్లు దేవు
సేవించి వడయు మాశ్రీశుసత్కరుణ-
నాదేవుమార్గమ్ము నరయంగలేరు
సాదులైనను పెక్కుజన్మాలకేని-
నతఁడు నసాధ్యుఁ డీయత్నమ్ము తదకు
పతనమేయగుఁగాని ఫలమీయఁబోదు;
కావున మోక్షమ్ముఁ గాంక్షింతువేని
భావమ్ము విజ్ఞానభద్రమ్ము చేసి
దైవికసుఖదుఃఖదములలో నొకటి
యేవేళ కేరీతి నెటు ప్రాప్తమగునొ
దాన మిక్కిలిగ సంతసమందుచుండు;
జ్ఞానివై జగతి మన్నన లందఁగలవు;
మరియు గుణాఢ్యుడౌమనుజునిఁ జూచి
యరయ సంతోషించి, యవివేకియెడలఁ
గరుణ చూపి, సమానుఁగాంచి స్నేహమ్ము
నెరపెడువాఁడు మానించు తాపముల;" 510

అని విని ధ్రువుఁ డమ్మహర్షితో నిటుల -
ననె "యనఘా! యీశమాఖ్యగుణంబు
మహనీయులకు సుగమంబు నావంటి -
యిహసుఖలోలున కెట్టులు గుదురు?
సురుచిదుర్భాషణాశుగభిన్నహృదయ -
పరితప్తుఁడను శాంతిఁ బాటించఁగలనె?
కావున మూఁడులోకముల శ్రేష్ఠమ్ము -
వేవారుఁ బొందంగనేనసాధ్యమ్ము -
నగుపదంబును బొంద నాశించినాఁడఁ;
దగినమార్గం బొందు దయఁ దెల్పుమయ్య
బ్రహ్మయూర్పులనుండి ప్రభవించి తీవు
బ్రహ్మవిజ్ఞానమ్ముఁ బడసియున్నావు
రవివోలె లోకభద్రముఁ గోరి యెపుడుఁ
దివుట ముల్లోకముల్ దిరుగుచుండుదువు
ననుఁ గరుణించుట న్యాయమ్ముగాదె;"
అనివేడ నారదుఁ డతని కిట్లనియె;
"అర్భకా! నీవు ధన్యాత్ముఁడవయ్య
నిర్భరానంద మనింద్యమై నెగడు -
శాశ్వతస్థితి నీకు సమకూర్ప నిన్ను
విశ్వాత్ముఁడౌ హరి ప్రేరేఁచె నిటుల;
మోక్షసామ్రాజ్యమ్ము పొందంగ నొక్క -
సాక్షాన్మహావిష్ణుచరణమే దిక్కు;
వర యమునాతీరభాగమ్మునందు
వరలు మధువనమ్ము పరమపావనము
అటకేఁగి తన్నదీయమృతమ్ములందు
పటుభక్తిఁ గ్రుంకి శ్రీపతిపాదములను

చిత్తమందున నిల్పి స్థిరమతితోడ -
నత్తాపసశరణ్యు హరిని ధ్యానింపు; - 530
మామహాత్ముని మంగళాకారమెల్ల
నీమనోదృష్టికి న్దెలియంగ నగును;
ఆరూప మెపుడు నీయాత్మలో నిలుచుఁ
గారుణ్య మొలయ సాక్షాత్తుగా నీకు
నారాయణుఁడు దర్శనంబిచ్చు నీదు -
కోరికలన్నియుఁ గొనసాగు ముందు;"
అని నారదమహర్షి యాయర్భకునకు
వినిపించి మరియు సంప్రీతితో నపుడు
ద్వాదశాక్షరమంత్రవర మాత్మలోనఁ
బాదుకో నేర్పె నబ్బాలున కంత;
ధ్రువుఁడు భక్తిగ నారదుని వలగొంచు
ప్రతిమలభక్తితోఁ బ్రణతు లర్పించి,
ప్రథితమై మునుల కాశ్రయమైనయట్టి -
మధువనంబునకు నెమ్మదిఁ జేరుకొనియె;

## నారదుఁ డుత్తానపాదు నోదార్చుట :—

ఉత్తానపాదనృపోత్తముఁ గాంచఁ
జిత్తమ్ముఁ దవుల వేంచేసి నారదుఁడు
ఆరాజుచే వివిధార్చన లంది
కూరుచుండి వినోదగోష్టి సల్పుచును,
"ఓరాజ! నీదు మోమున్నతెఱంగు -
నారయ మిగుల దైన్యముగఁ దోఁచెడిని 540
కారణ మేమో యాకలరూపు నాకుఁ
దీరుగాఁ దెల్పరాదే"; యన నతఁడు

“మునినాథ వినుము నామూర్ఖకృత్యమ్ము -
ననఘుఁ డస్మత్పుత్రుఁ డైదేండ్లబాలుఁ -
డనయుఁడ, నదయుఁడ నైననావలనఁ -
గనె పరాభవము తాఁ గదలెఁ గానలకు -
నట నెట్టిబాధల నందుచున్నాఁడొ;
దిటవు చెడియె నెద; దిగులు నెక్కొనియె;
నాయంకపీఠమ్మువను గూరుచుండ
నాయండఁ జేరిననాముద్దుసుతుని
నారీవిలోలమానసమునఁ జెంతఁ
జేరంగనీయక చెదరఁగొట్టితిని;
అట్టినాదౌరాత్మ్య మరయంగ నాకు
నిట్టివగపుఁ బొరయించె మునీంద్ర;”

నావిని మునిపతి నరపతి కనియె;
“భూవర నీదుసత్పుత్రునికొఱకు
దిగు లొందకుము వాఁడు దేవాదిదేవు
నిగమవందితు లోకనేత శ్రీవిష్ణు
పాపవిదూరు సద్భక్తమందారు -
ప్రాపున సుఖములఁ బడయనున్నాఁడు; 550
అతిభక్తి నతఁడు శ్రీహరి నాత్మఁ నిలిపి
వెతమాని తపము నిర్విఘ్నమ్ముగాఁగ -
నొనరించి సురలైన నొందఁగరాని -
ఘనపదవినిఁ దృప్తిఁ గని నీదుకీర్తి
జగములనెల్ల శాశ్వతముగ నింపు;
వగ మాను మతనికై వసుధాధినాథ;”
అనిపల్కి నారదుఁ డచ్చోటు విడిచె
మనుపుత్రునకుఁ గొంత మది శాంతి నిలిచె;

పురుషోత్తమ పురాణపూరుష నీదు -
పరమరహస్యసంభావ్యసంకల్ప -
మరుదయ్య తెలియంగ; నటు మనుపుత్రుఁ
గఱకు మానిసిఁజేసి; కన్నకుమారు
నెడదలో రోషమ్ము నెక్కించి, వాని -
కడవి నారదుచేత నాత్మతత్వమ్ము
నొనరంగఁ దెల్పించి, యుత్తానపాదు
మనమునఁ గలచింత మాన్పించి తీవు;
ఇవి నీకు లీల లోయిందిరానాథ
ప్రవిమలాఖిలశుభప్రద జగన్నాథ;

## ధ్రువుని తపము:—

మధువనంబునఁ జేరి మాణవకుండు
మధువైరి! నీభక్తమాన్యుండు ధ్రువుఁడు
యమునానదిం గ్రుంకి యతినియతుండు
శమితేంద్రియుండువై సర్వేశ నిన్ను
ధ్యానమ్ము సేయుచు, నరయంగ రెండు
మూనాళ్ల కొకపరి ముఖ్య కపిత్థ
బదరీఫలములు సాపడి శరీరమ్ము -
పదిలమ్మునుంబట్టి భక్తితో మొదటి -
మాసమ్మునందు నెమ్మదిఁ గొల్చి, యవలి -
మాసమ్మునందు నిమ్మడి మూఁడునాళ్ల -
వ్యవధి జీర్ణతృణదళాదుల మెసవి
భవదీయపూజ సద్భక్తి గావించి,
పదపడి ప్రతినవవాసరాల్ గడవ -
నుదకమ్ము నొకపరి నోర్పునఁ ద్రావి,

మూఁడవనెల నీకు మ్రొక్కి పూజించి,
వీడనిభక్తి యావెన్క బాలుండు
ద్వాదశవాసరవ్యవధితో వాయు -
ఖాదనమునఁ దృప్తిఁగని శ్వాసములను
బిగియంగఁబట్టి గోవింద నీపాద -
యుగళమ్ము భజియించి, యుత్సాహమతిని -
నవల నిరుచ్ఛ్వాసుఁడై యేకపాద -
మవని మోపుచు నిల్చి యచ్యుతా నిన్నుఁ 570
దలఁచు నచేతనస్థాణువువోలె
మలయుచు నైదవమాసమ్ము గడపె;

నీరీతిఁ గడుశమితేంద్రియుఁ డగుచుఁ
గోరికల్ పోనాడి గోవింద నీదు -
రూపమే గను చన్యరూపమ్ముఁ గనని,
యేపాపమేని తా నెఱుఁగని ధ్రువుని -
తపమునఁ ద్రిజగముల్ దద్ద కంపించె;
విపరీతముగ కాలి పెనువ్రేలి మోపు -
నొత్తిడిచేత నీయుర్వీతలార్ధ -
మొత్తిల్లె సాధ్వస ముప్పతిల్లంగ;
మరి నితరముఁ గంట మాని ధ్రువుండు
ధరఁ జరాచరదేహధారణస్థితినిఁ
గలయట్టి నీలోనఁ గడకతోఁ దనదు -
విలసితజీవముల్ వెలయంగ నిల్పి -
యేకాంతభక్తి నిన్నీక్షించుచుండ, -
నాకారణమ్ము నీకవరోధ మగుటఁ
కంపమొందితివి జగమ్ములుగూడ

నీపజ్జ కరుదెంచి నిర్గాంచి మ్రొక్కి
యాపదుద్ధరణ సంప్రార్థించి రిట్లు; 580
"జలజాక్ష! ధరఁ బ్రాణిసంతతియెల్లఁ
గలఁగె శ్వాసనిరోధకష్టమ్ము నొంచె; -
నీవింత నేకాల మెందునఁగాని
యీవిశ్వమందున నెఱుఁగము స్వామి;
ఈయార్తి హరియింపవే దేవదేవ
శ్రీయుతాకార! ఆశ్రితజనోద్ధార!"
అని వేఁడ వారల కభయ మ్మొసంగి
వినిపించి తిటుల "దివిజవర్యులార!
ఉత్తానపాదపుత్త్రోత్తముం డొకఁడు
చిత్తమ్ము నాలోనఁ జేర్చి తపమ్ము
గావించుచున్నాఁడుగాన మీకిప్డు
భావింపరానట్టిబాధ యేర్పడియె;
వానితపమ్ము మాన్పఁగ మది నెంతు -
మానుఁడు మీవగ మరలుఁ డిమ్ములకు" -
నంటి వాపల్కుల కాత్మలఁ బొంగి
మంటిమంచని వారు మరలిరి క్కలకు;

## మహావిష్ణువు ధ్రువునకు దర్శనమిచ్చి వరములు ప్రసాదించుట:-

పద్మనాభా! ధ్రువుఁ బాలింప నీదు -
సద్మమ్ము వదలి తార్క్ష్యస్కంధ మెక్కి
మధువనమున కేఁగి మదిలోనఁ బొంగి
ప్రథితయశస్కుఁ డబ్బాలుముంగలిగ 590
నిలువ, వాఁడు నిజాత్మ నిల్పినరూపు
ఒందు తోఁచుట చూచి,

పులకితగాత్రుఁడై పొంగి యానంద -
జలపూర్ణనేత్రుఁడై చయ్యన లేచి,
నీమూర్తిఁ గనులతోనే ద్రావునటుల,
మోముతోఁ జుంబనముం జేయురీతి,
భుజముల నాశ్లేషమును జేయుకరణి,
దండనమస్కృతుల్ దగ నాచరించి,
మెండగుభక్తి నెమ్మిగఁ జక్కనిలిచి
నిను స్తోత్రమున్ జేయు నిశ్చయబుద్ధి,
మునుకొని, తాత్కార్యమునుఁ జేయుటెట్లొ
తెలియకుండఁగ, వానితివుట నీ వెఱిఁగి
వేదమయంబయి వెలయునీశంఖ -
మాదరంబున వానియమలమౌగండ -
తలముఁ దాకించితి; దాన నాతండు
నిలసితవేదాంతవిజ్ఞానఫణితి
సకలజగద్భద్రసంధాత నిన్ను -
బ్రకటితభక్తిభావన నిట్లు పొగడె;

"దేవ! సమస్తశక్తిధరుండ వీవు
పావనరూప సర్వప్రవిష్టుఁడవు
నాదలంచినయట్ల ననుఁ గృపఁజూడ
వేదోద్ధరణ సర్వవిధశుభాంగేంద్రి -
యాదులఁ జైతన్య మమరంగఁ గూర్చి,
వేదవాదులెయ్యైన వీక్షింపలేని -
మంగళాకృతిని యస్మచ్ఛరీరమ్ము
వొంగ దర్శనభాగ్యమును గూర్చి తీవు;
పరమపురుష భగవంత వైకుంఠ
హరి నమస్కృతులు నీ కరిగింతునయ్య;

సకలలోకములను సంవర్తవేళ
వికలమ్ము గానీక విశ్వాత్మ నీదు -
నుదరమ్మునందుంచి యురగతల్పమునఁ
గుదురుగా యోగమ్ము గుఱిగాఁగఁ బండి
నిదురించి, భవదీయనిర్ణయవేళ
ముదమున మేల్కాంచి, పొల్పార మరల
జగముల సృష్టించు సంకల్పబుద్ధి
నిగమవేద్య జనింప నీబొడ్డుఁదమ్మి -
యందుండి పరమేష్ఠి నమరఁ బుట్టించి,
పొందుగా సృష్టికి మూలమైయొప్పు -
నవ్యయచారిత్ర యబ్జాతనేత్ర
దివ్యస్వరూప మందీకృతపాప! 610
నిన్ను నుతించెడువేర్పు నాలోన
నున్న, యర్థించెడుచొప్పును దెలియ;
భవదీయకరుణకుఁ బాత్రుని నన్ను
నవరించుటెట్లొ నీసంకల్పమయ్య;''
అని వేఁడ నీవు మహానంద మొంది
వనజనాభ! మహాత్మ! వాని కిట్లంటి;

"క్షితినాథతనయ నీచిత్తమ్మునందు
సతతమ్ము మసలుకాంక్ష నెఱింగినాఁడ; -
నది పొందరానిదే యైన నీ కిత్తు
ముదమొంద నద్దాని పొందెద వీవు;
వినుము సప్తర్షులు వివిధనక్షత్ర -
గణము జ్యోతిశ్చక్రకశ్యపాదులును
వలగొను దివ్యమౌపదము ధ్రువాఖ్య
వెలయు నద్దాని ప్రాప్తింతువు నీవు;

అరువదియారుసహస్రవర్షముల -
పరిమితికాలవ్యవధి యనంతరము-
నందాఁక నీతండ్రి యటవికిఁ జన్న -
సందర్భమందు రాజ్యమ్ము నేలుదువు;
మృగయకై యడవికి నేఁగి యుత్తముఁడు
తెగు; వాని వెదుకంగఁ దెంపున సురుచి 620
వనిఁ జని దావాగ్నిఁ బడి మరణించు;
నను నీవు సేవించి నాకృపామహిమ -
నందెదు ధ్రువపదమ్మని సెలవిచ్చి
యందుండి యరిగితి వమరులు వొగడ ;

ధ్రువుడు నిజపురమునకుఁ జనుట —

అంతట ధ్రువుఁడు తా హరినిఁ గాంచియును
స్వాంతానఁ బినతల్లిపల్కులే నిలువ
ముక్తిఁ గోరమికి వమ్ముగఁ దనదైవ -
భక్తి విఫలముగా భావమం దెంచి
"నారదువచన మెన్నఁగ తథ్యమయ్యె
నేర మామాట మన్నించకపోతిఁ
గడుఁబేద నృపు ఫలీకారమ్ముఁ గోరు -
వడువయ్యె; ముక్తిసంపద నిచ్చునట్టి -
జలజాక్షుఁ గాంచి సాంసారిక మర్థిఁ
దలఁచి కాంక్షించితిఁ దప్పొనేసితిని;"

అని యిట్లసంతృప్తి నంది ధ్రువుండు
తనపురమ్మును జేరఁ దరలె; నాలోనఁ
దనపుత్రుఁడు ధ్రువుండు తామరసాక్షు
వనజనాభుప్రసాదభాగ్యమ్ము నంది

వచ్చుట నుత్తానపాదుండు దెలిసి
హెచ్చినసంతోష మెడదలో నిండఁ
జతురంగబలములు సద్బంధుజనము
హితభృత్యవర్గమ్ము వృద్ధగణమ్ముఁ
దనవెంట రాఁగ, వాద్యరవమ్ము మ్రోగ,
మునుకొని శుద్ధాంతమున గలస్త్రీలు
సురుచి సునీతియు శోభనం బెసఁగ
నరుదేర, నుత్తముఁ డతిమోదమొప్పఁ
గదలిరాఁ దనదునగరముప్రాంతమున
ముదముతోడుత ధ్రువుముంగలఁ జేరి,
యాతనిఁ గౌఁగిటియందునఁ జేర్చి
యాతతానందాబ్ధియందు మునింగె;
జనకుదీవెన లంది చయ్యన ధ్రువుఁడు
వినతులు తండ్రికి వెలయఁ గావించి,
సురుచికిఁ బ్రియముతో జోత లర్పించి
మురిపెమ్ముతోడఁ దమ్మునిఁ గౌఁగిలించి,
జనని సునీతికి సాగిలి మ్రొక్కఁ
దనయునిఁ గౌఁగిలిఁ దారిచి యామె
యానందభాష్పాల నాతనిశిరము
మానుగాఁ దడిపి వెమ్మది హాయినొందె;
పౌరజనమ్ము లాబాలునిదివ్య-
చారిత్రమును నుతిసల్పి రామీఁద - 6

నుత్తానపాదుఁ డత్యుత్సాహమొప్ప-
నుత్తము ధ్రువుని గజోత్తమవాహ-
నారూఢులుగఁ జేసి యరయంగ సకల-
పౌరులు బంధువుల్ పరివారజనము

## చతుర్థస్కంధము

జయజయధ్వానముల్ సల్పంగఁ గదలి,
నియమితరాజచిహ్నితలక్షణములు
వెలయఁ బట్టణముఁ బ్రవేశించి, సౌధ -
ములనుండి స్త్రీజనమ్ములు విరుల్ సల్ల
దేవేంద్రవిభవమ్ము దీపింప నగరు -
నావిభుఁ డానంద మందుచుఁ జేర;

తనసతీద్వయమును తనసుతద్వయముఁ
బెనగొనుచున్నట్టిప్రేమానుబంధ -
మొదవర్తనులౌట పొంగి యుత్తాన -
పాదుండు హాయి భూపాలన కొన్ని -
సమలు సాగించి విశ్రాంతి లోనెంచి -
యమనియమాదు లభ్యసనమ్ము సేసి
పరము సాధించంగ భావించి రాజ్య -
భరము ధ్రువునకు నర్పణ మొనరించి,
పట్టాభిషేకోత్సవము వేడ్క జరిపి
పట్టణమ్మును వీడి వనభూమి కరిగె;

అంతట శింశుమారాఖ్యుఁడౌ బ్రహ్మ -
సంతున భ్రమియనుసతిని ధ్రువుఁడు
పరిణయమయి కల్పవత్సరులనెడు -
వరగుణులగుసుతద్వయమును బడసి
పవనుసుతను నిలఁ బరిణయమాడి
ప్రవిమలమతియగువరసుతు నొకని
గురుగుణయగు నొకకూతును గాంచి
పరమాప్తి నిజరాజ్యభర మూనియుండె;

## ధ్రువుఁడు గుహ్యకులతోఁ బోరుట :—

మృగయావినోదియై హిమవదద్రికిని
తగుబలగముతోడఁ దరలి యుత్తముఁడు
చని, యందు నొక్కయక్షవరుచేఁ గూల,
వినఁబడి యావార్త వెతఁజెంది సురుచి
సుతువిక్కై వనిఁజేరి శోకమ్ము హెచ్చి
హతమయ్యె దావాగ్ని యందునఁ జొచ్చి;
తనపినతల్లియు తనసోదరుండు
హననమ్ము చెందుట కతిదుఃఖ మొంది,
ధ్రువుఁడు గుహ్యకులపై రోషమ్ము పూని
జవసైంధవాన్వితస్యందన మెక్కి
చని హిమవంతమ్ముసవిధప్రదేశ-
మునఁ జేరి, ధననాథుముఖ్యపత్తనము- 660
నలకను గాంచి మహోగ్రహమెత్తి,
చలమునఁ జెలరేఁగి శంఖమ్ము నొత్త-
నానిదమ్ము గుహ్యకవధూతతికి
మాననిభీతి-కంపమ్ములఁ గూర్చె;
యక్షసైనికు లంత నతిధైర్యమొప్ప-
నాక్షణమున వచ్చి యడ్డిరి ధ్రువుని;
ఔత్తానపాది యాయక్షబలమ్ము
తత్తరపడ బాణతతిఁ బ్రయోగించి
బాధింప వారును పటుశరాహతుల
వేధింపసాగిరి వింతగా ధ్రువుని;
వార లీవిధి పరస్పరవిజిగీషఁ
బోరాడ ధనదుచమువు చాల నొచ్చి

సారవిహీనమై సమరాంగణమున
ఘోరమృత్యువునకు గురియగుచుండ
స్వాయంభువుఁడు ఋషివర్యులతోడ -
నాయుద్ధభూమికి నరుదెంచి, ధ్రువునిఁ
గాంచి యిట్లనియె; "యో కారుణ్యరూప!
యెంచవా యీరణహేతువువలన -
నెందఱఁ జంపితో యెంత రోషమున;-
నిందుకు నీ భ్రాతమృతియెగా మూల - 670
మొకనికై యిందఱ నూరక చంపు -
టొకధర్మమే యింక నుడుగుము రణము;
ఈనీదుచేత ధనేశునియెడల
మానని దోష; మా మహనీయునకును
నతులొనరించి విన్నపములు వలికి
కుతుకంబుఁ గూర్పుము కోరుము మైత్రి"
అని మనుమనికి దా నాదేశమిచ్చి
చనియె మనువు ఋషిసంఘమ్ము తోడ;

## కుబేరుఁడు ధ్రువు ననుగ్రహించుట :-

అంతట తనదుభృత్యామాత్యసంఘ -
మెంతయు భక్తి సేవించి వెన్వెంట
రాఁ గుబేరుఁడు మహాప్రాభవమొప్ప
శ్రీ గరుడాంక నీసేవకుధ్రువుని -
చెంతకు వేంచేయ స్థిరభక్తి నతఁడు
స్వాంత ముబ్బఁగ నమస్కారముల్ సేయ -
నరుసమ్ము నొంది ధనాధిపుఁ డతనిఁ

"వత్స! మీతాత చెప్పఁగ నాలకించి
మత్సరాదికములు మానితిగాన
నీకుఁ బ్రసన్నుఁడ, నీదు సోదరునిఁ
బోకార్చినది యక్షముఖ్యులుఁ గాదు
నాదుభృత్యులఁ జంపినది నీవు గాదు
కాదనఁజాలనికాలమే యిట్టి -
దురవస్థలను గూర్చు; దుఃఖమ్ము విడువు;
వరము గోరుము నిత్తు పరమాదరమున -
ననవుఁడు ధ్రువుఁడు నేనజ్ఞానమందు
మునుఁగని సత్పథమ్మును బ్రీతి నాకు -
నెఱిఁగించి, తచ్ఛుద్ధి కేహరిస్మరణ -
మరయంగ మూలమో యాహరిస్మరణ -
మచలితంబుగ నాకు నమరిచి, దేవ
నిచయంబు మెచ్చ మన్నింపు మటన్న
నతిప్రీతి యక్షేశుఁ డాధ్రువుమదిని
సతముగా శ్రీశ నీస్మరణమ్ము నిలుచు
వరము ప్రసాదించి వాని వీడ్కొనుచు -
నరిగెను తనపురి కచ్చోటు వీడి -

ధ్రువుఁడును పౌలస్త్యుతోరంపుదయకు
మివులఁగ దనమది మెచ్చి హర్షించి
యచ్చోటు వీడ్కొని యాత్మీయపురికి -
నిచ్ఛమై చనుదెంచి యొనఁగినధర్మ -
పరిపాలనమ్మునఁ బ్రజల కెవ్వేళ
గురుతరసౌఖ్యముల్ గూర్చుచు ధరణి
నిరువదియారువేలేండ్లు పాలించి;
మరియు నాలోన శ్రీ మహిళాధినాథ

6

జలజాక్ష నీదుసంస్మరణ మేమరక
తలఁపున నిలిపి విస్తారదక్షిణల -
నొసఁగుచు నిసుఁగూర్చి యుత్తమోత్తమము -
లౌసవనాదు లత్యంతము భక్తి
పెక్కు గావించి, యీ విశ్వమ్ముపైని
మక్కువ మాని, కుమారుని పట్ట -
భద్రుఁ గావించి యావల పురివీడి
భద్రమౌమార్గంబు పరికింతు ననుచుఁ
జనిచని పుణ్యభూస్థలిఁ జేరి బదరి -
వనిఁ జొచ్చి యందు పావనమౌ 'విశాల'
యను నదీతీర్థమ్మునందునఁ గ్రుంకి
ఘనమతి పరిశుద్ధకరణుఁడై పవను
బిగియించి, కూర్చుండి, విశ్వేశ నిన్ను
నిగమసంచారు ధ్యానించుచునుండ

## వుఁడు ధ్రువపదమ్ము నొందుట :—

దశదిశలెల్లఁ జంద్రముఁబోలి మిగుల -
విశదమౌరీతిని వెలుఁగఁ జేయుచును
దివినుండి యొక్కందు దివ్యవిమాన -
మవతరించి ధ్రువునియండగా నిలిచె -
నందు చతుర్భుజు లసితవర్ణులును
సుందరాకారులు సురుచిరాభరణ -
ధారులు పటుగదాధరులైనవారి
ధీరు లిర్వురఁ గని దిగ్గన లేచి
వారు భవద్భృత్యవరులని ధ్రువుఁడు

వారు మందస్మితవదనులై ధ్రువుని
పేరిమిఁ గాంచి యివ్విధమున ననిరి;

"వసుధేశ! ఐదేండ్లప్రాయమ్మునందె
విసువక తపము శ్రీవిష్ణునిఁ గూర్చి
చేసి యాదేవునంచితకటాక్షమ్ము
వాసిగాఁ బడసినభక్తుఁడ వీవు
ఆదేవదేవునాజ్ఞానువర్తులము
నీదుదేహముతోడ నిన్నుఁ గొంపోయి
రవిచంద్రతారకగ్రహమండలమ్ము -
లవిరత మేపద మనుదిన మర్థి
వలగొని తిరుగు; నీవసుమతియందుఁ
దలఁపంగ నెట్టిసత్త్వము లెవ్వడేని
యేపదమ్మును బొంది యెఱుఁగరో యట్టి -
శ్రీపతిపదమునఁ జేరిచి రాఁగ
వచ్చితి మిదియ దివ్యవిమానమయ్య;
మచ్చిక నిందెక్క మనవి నీ కయ్య"
అని వారు విన్నిన యమృతోక్తులెల్ల
విని, పెద్దలకు నతుల్ వెలయంగఁ జేసి
వారి దీవనలంది పరమాత్మ నీదు -
చారుల కెఱఁగి సత్వరమె యానమ్ము -
చెంతకుఁ జని పూజచేసి యందెక్క
స్వాంతమ్మువందెంచి, చయ్యనఁ దల్లి
తనతలంపునఁ దోఁచఁ దా నొక్కరుండె
జననిని దిగనాడి చనుటెట్టు లనుచు
వెనుకాడుచుండ నీప్రియభృత్యు లతని -
మనసు నెఱిఁగి శంకమాన్ప ముంగలఁగ

మరియొండు దివ్య విమానమ్మునెక్కి
పరమమోదమ్మునఁ బయనమై చనెడు -
జననినిఁ జూపిన సరియని ధ్రువుఁడు
ఘనవైభవమున నాకాశవిమాన -
మారోహణ మొనర్చె నమరులు విరులు
కూరిమి వెలయంగ గురియించి రంత;

ఆవిమానమ్మున నటఁ జని ధ్రువుఁడు
దేవాధిదేవు నిజ స్థిరచిత్త మొప్ప 720
బుద్ధిఁ దలఁచుచు విబుధసేవ్యమైన -
యిద్ధమౌనీపద మెలిమినిఁ బొందె;-
నట్టియచ్యుతపద మంది నీభక్తుఁ -
డెట్టిమహాత్ములకేని పూజార్హ -
నక్షత్రమై ధ్రువనామశబ్దార్థ -
మక్షయముగ వెల్గు నందియున్నాఁడు.

ఈ భక్తవర్యుధ్రువేతిహాసమ్ము
శోభనకరము యశోభాగ్యదమ్ము
ఆయురారోగ్యద మఘమర్షణమ్ము
శ్రేయస్కరము సర్వ సిద్ధికరమ్ము
ఈపవిత్రచరిత్ర మెవఁడేని భక్తి -
నేపుణ్యదినమునందేనియు మరియు -
నేవేళనేగాని యెక్కుడుప్రీతి
భావించి చదివిన భక్తితో విన్న -
నెనయు శ్రేయములని యెల్లరు వినఁగ
ముని నారదుఁడు వేడ్క మునిఁగి కీర్తించె.
పీతాంబరా! రమాప్రియమూర్తి! నీదు -
నేఁత [illegible] చెప్పఁగలేము

నీదాసదాసుఁడ నేను నన్నెట్టు -
లాదరింతువో కరుణాన్వితరూప.

## పృథుచక్రవర్తిచరిత్రము :—

శ్రీయచ్యుతా సదాశ్రితపారిజాత!
సాయుజ్యసంధాత సకలాధినేత!
నీజగన్నాటకనియమరహస్య -
మేజీవియేనియు నెఱుగంగఁబోదు ;
మంచిచోటనె చెడ్డ, మరి చెడ్డచోట
మంచియే గలదను మహిత సూత్రమ్ము
జనులవర్తనముల చాటుచుండుదువు
కనజాల రద్దాని కలుషమానసులు.

మున్ను ధ్రువునివంశమున నంగుఁడనెడు -
సన్నుతచరితుఁడు జనియించి రాజ్య -
మెన్నంగ పూర్వుల కెనయగురీతి
విన్ననువుగ నేలె విబుధులు మెచ్చ ;
నతనిభార్య సునీథ యతిపూతచరిత
పతి కనుకూలయై వర్తించుగరిత ;
ఆయంగరాజర్షి యశ్వమేధమ్ము
శ్రీయుతంబగునట్లు సేయించెఁ గాని,
విబుధు లెవ్వరును హావిస్సుఁ గొనంగ
నుబలాటపడి రాకయుండిరి ; దాని -
హేతు వెఱుంగ మహీపతి పెద్ద -
లౌ తాపసులఁ దెల్పుఁడని వేఁడికొనంగ 7
వార లిట్లనిరి "యో వసుమతీనాథ !
ఆరహస్యము విను, మనపత్యు సేయు -

యాగభాగముఁ గొన రమరు లేవారు -
నాగమములయంతరార్థమే యిద్ది;
కాన నిప్పుడు పుత్రకామేష్టి నీవు
పూని కావింపుము పుత్రుఁ బడయుము
పదపడి తమయాగభాగముల్ సురలు
కొదలేకఁ గొంద్రు నీకును హెచ్చు సిరులు;
హరిభజనమున నీ కన్నికార్యములు
నెరవేరు" నన ధరానేత యారీతి
హెూమమ్ము సేయ నందుండి యొక్కండు
హేమాంబరాద్యలంకృతుఁ డుద్భవించి
పరమాన్నసంపూర్ణపాత్రమ్ముఁ దెచ్చి
నరులెల్లఁ బొగడ నానరపతి కిచ్చె; -
నాపాయసాన్నమ్ము నత్యంతప్రీతి
భూపతి తనకీయ భుజియించి రాణి
గర్భమ్ము ధరియించె కనె నొక్కసుతుని;
నిర్భరానందాన నెగడె నారాజు
కాని, యాహర్షమ్ము కడదాఁక లేదు;
వేనుఁ డాసుతుఁడు గర్వియు దుష్టుఁడగుట 750
తనయీడువారి నిర్దయఁ జావనొంపు
ఘనశరాహతుల మృగంబులఁ జంపు;

అంగుఁ డా బాలకు నతిదండనముల
కుం గుటిచేసియు కొంతమార్పేనిఁ
గలిగింపఁజాలక కడకు నాసుతునిఁ
గలసి వానికిఁ దంఁడ్రిగా నుండ రోసి,
యొకనిశి కదలి తా నొకడ తెగించి
వికలమనస్కుఁడై వెడలె నెచ్చటికొ;

ఆరాజువృత్తాంత మంతయు నెఱిఁగి
పౌరులు సచివులు బంధువర్గములు
కడుదుఃఖమున నుండగా భృత్యు లరిగి
పుడమియెల్ల నెమకి భూపతిఁ గనక
తమప్రయత్నమ్ము వ్యర్థమ్మౌట మరలి
శ్రమమె లాభముగ పురముచేరి రంత;
పరిపాలకుఁడు లేక ప్రజ పశుప్రాయ-
పరిణతి నవినీతిపా లగుచుండఁ
గని, యమాత్యులు మునిగణము, వృద్ధులును
బొనర ప్రజారక్ష ముఖ్యమంచెంచి
తమవాంఛితము సునీథకుఁ దెల్పి, యామె
సుమనస్కయయి కడుశుభమన వారు 760
పూనిన సంతోషమున మంచివేళ
వేనుని ధరణికి విభుఁ జేసి రంత;

అతఁడు దుర్ణయుఁ డయ్యె; నతివేలమయ్యె
నతనియక్రమచర్య లవని నెల్లెడల;
మునివరుల్ కొంద ఱామూర్ఖునిఁ జేరి
యనునయముగ హిత మర్థి బోధింప,
వినక వాఁ డుగ్రుఁడై విమతుఁడై వారిఁ
గనుగొని యీరీతి కటువుగాఁ బలికె;
"ధరణీశుఁడన దేవతారూపుఁ డగుట
యెఱుఁగరా; యిపుడేని యెఱుఁగుఁడు నన్ను
దైవముగాఁగ; మీతపము జపమ్ము
భావింప మీరిచ్చు బలివిధానమ్ము-
నిఁక నాకువై చేయుటే యుచితమ్ము
వెకలులై మానిన విడువ నిజమ్ము;"

అనవుడు మునులెల్ల రాగ్రహమ్మొంది
యనయుఁడు వీనిని హననమ్ము సేయు -
టురవని యూహించి హుంకారమాత్ర
పరిమార్చి రాక్రూరవర్తను వేను;
సుతుమరణమ్మునుఁ జూచి సునీథ
యతిశోకతప్తయై, యామీఁద పుత్రు - 770
తనువును మమతతోఁ దనయోగశక్తి
తనరంగ నొకట భద్రముగాఁగ దాఁచె;

మునివరు లొకనాఁడు పావన సరస్వ -
తినిఁ గ్రుంకిఁ, భక్తి తత్తీరమ్మునందు -
నగ్నిహోత్రమ్మును నర్చించి, ధ్యాన -
మగ్నులైయుండి పిమ్మట నీదుకథల -
కథన మొనర్చుచు, కడుభక్తి వినుచు
ప్రథితసంతోషమ్ముఁ బడయుచునుండ
భయదంబులగుమహోత్పాతముల్ దోఁచె
రయముగా పాంసువర్ష మ్మొందుఁ గురిసె;
మరికొన్నియిడుములు మహి నెందుఁ జూడ
విరివియై జనులకు భీతిఁ గల్పింప,
"రాజ్య మరాజకప్రాబల్య మొంది
వ్యాజ్యముల్ ప్రజలలో ప్రభవించి, వారు
కపటవర్తనులయి కలఁగి యన్యోన్య -
మపకారకులయి న్యాయము దప్పియుంట
దీనికారణ"మని తెలిసి సన్మునులు
మానుగ నాకీడు మాన్పంగఁ దలఁచి;
అంగరాజాన్వయ మంతమ్ముగాక
మంగళకరముగా మరల వర్ధిల్లఁ 780

జేసిన రాజ్యమ్ము నిలుగులు వాసి
భాసిల్లఁగలదని వార లూహించి
మృతుఁడగు వేనుశరీరమ్ము డాసి
కుతుకమ్ముతో వాని కుఱువు మథింప, -
నందుండి యొకవికృతాకారుఁ డుదయ -
మంది నిషాదుఁడై యరిగె నెచ్చటికొ;
పదపడి తత్కళేబరము బాహువుల
కుదురుగ మునివరుల్ గూడి మథింప; -
నందుండి స్వామి! నీ యంశాన నొక్క -
సుందరుఁడౌ పురుషం డుద్భవించె;

మరి నిమ్న విడనిరమాదేవి యంశఁ
బరగిననొకదివ్యభామ జనించె;-
నతఁడు పృథుశ్రవుఁ డగుట నాతనికి
సతమయ్యె పృథువనుసంజ్ఞ చక్కనగ;
ఆపడంతియు నర్చియనుసంజ్ఞ నొప్పి
శ్రీపతీ! పృథుని వరించె భవ్యముగ;

అర్చిపృథులు రమాహరులను బోలు -
వర్చస్సు గలవారు; వారె యావేల్పు -
లని నిశ్చయించి మహానందమొంది
మునిజనమ్ములు పృథుభూపతిఁ జక్ర - 790
వర్తిగ మునుకొని పట్టమ్ము గట్టి
కీర్తించి రతనిసత్కృత్యముల్ మిగుల; -
నామహోత్సవవేళ నమరగణమ్ము
ప్రేమ దైవార వేర్వేరువస్తువులు
కానుకల్గా నిచ్చి కరము దీవించి
మానుగా మిగుల సమ్మానించి రతని; -

నీరీతి పృథుఁ డమరేశ్వరవిభవ -
మారంగ నభిషిక్తుఁడై రాజ్యభార -
మూని సుతులవోలె నుర్వీజనమ్ము
మానుగఁ బాలింప మహి శాంతినొందె;

## పృథుచక్రవర్తి గోరూపముననున్నపృథ్వినుండి ఓషధులఁ బిండుట

అంతట నొకసమయమ్మున భూమి -
యంతయు నీరసమగుట బోనమ్ము
దొరకమి, ప్రజ లిట్టిదుర్దశనుండి
కరుణించి మమ్ములఁ గాపాడుమనుచు
విన్నవించిన విని పృథుచక్రవర్తి
క్రన్నన వారల కష్టముల్వాపు -
సదుపాయమును తనస్వాంతమం దెంచి
పొదలుకోపమునఁ దూఁపును వింటఁ జేర్చి
త్రిపురముల్ గాల్చినత్రినయనుపగిది -
నవరాధయనుచుఁ గాశ్యపిని వీక్షించె; 800

ధారుణీదేవి భూధవు నుగ్రుఁ గాంచి
గోరూపమున వడంకుచు భీతినొంది
మృగయునిఁ గని పాఱుమృగివోలె మిగులఁ
దెగి పరుగిడసాగె దిగ్భ్రాంతిఁ జెంది;
అటు పరువిడుచున్న, నతఁడు భూదేవి
యెటువోవ నటువోయి యెద్దుచునుండ -
నతిభీతచిత్త యనన్యశరణ్య
వితతార్తయైనపృథ్వీమాత రాజు -
వినుచుండ నవె నిట్లు; "పృథుచక్రవర్తి!
అనఘాత్మ! ఆర్తజనావనదక్ష!

అనపరాధను, దీననైనట్టినన్ను
వెనుకొనుచున్నావు భీష్మరూపమున
నాదోషమేమియో, నా కెఱింగింప-
రాదొ, యీ క్రూరవర్తనమేల నీకు!"

అనవుడు భూసతి కనియె నారాజు;
"విను ధరిత్రీ! నీవు వినవు నాయాజ్ఞ
క్రతువుల యాగభాగముఁ గొందు; కాని
వితతధాన్యాదుల వితరణ చూప-
వనయమ్ము గోరూపమంది తృణాదు-
లను దిందు కాని, పాలను బిండ వీవు; 810
కమలజుచే మున్ను కల్పింపఁబడిన-
విమలమౌ యోషధీబీజవ్రజమ్ము
నీయందె దాఁచి నిందితవైతి; వాని-
నీయకుండుట దోష మెఱుఁగు మింకైన-
నింతటి యపరాధ వీవు; నిన్జంపి
స్వాంతాన క్షుత్పిపాసలఁ జింతనొందు-
ప్రాణికోటికి నీదుపలలమ్ముఁ బంచి
మానిపించెద వారి మానసికార్తి;"
ఆవల్కులను విని యచల పెల్లలికి
భూపాలకునిఁ గని మ్రొక్కుచు నయము
వినయమ్ము గన్పడ వేవిధంబులను
వినుతించె నీరీతి విమలచిత్తమున;

"ఓ నృప నీవు లోకోద్ధారదీక్షఁ
బూనిన హరివి శ్రీపురుషోత్తముఁడవు;
నీమాయ నీవె యంది యనేకరూప-
నామమ్ముల జనించి నానావిధక్రి-

యాదుల లోకమ్ము నరసి రక్షింతు;
నీదయాతత్త్వమ్ము నే నెన్నఁగలనె
ఆదివరాహంబవై బలిభూమి
నేదరిఁ గానక యేనుండువేళ 820
కృపఁజూపి నన్నుద్ధరించితి విష్ణు-
డపరాధివైతివే యనఘ నాయందు
నివసించు ప్రజఁ బ్రోవ నీవు పృథుఁడుగ-
నవతారమొందితి వచ్యుతా! నీదు-
తలఁపు పయోనిమిత్తముగాఁగ నన్ను
పాలియించుటే? మహాద్భుతమగు నిద్ది
బమ్మచే సృజియింపఁబడ్డయోషధులు
వమ్ముగా దుష్టస్వభావానుభోజ్య-
మానమ్ములయ్యె; నేమాత్ర మాస్థితిని
మానుపఁబూనరు మనప్రభు; లేను
ప్రాపుగానక చోరబాధల నొంది
యేపాటిసత్కర్మ లెందు లేకుంట
సవనాదిసత్క్రియాచరణ మూహించి
తివిరి తదీయౌషధీపితతులను
గ్రసియించితిని యవి కరము నా యందు
వెస జీర్ణమయ్యె; నావివిధౌషధులను
గ్రమ్మఱఁ బడయంగఁగల దొకమార్గ-
మిమ్మెయిఁ గ్రోధింప నేమిఫలమ్ము
నరనాథ వినవయ్య నావచనములు
సరవి నా కొండువత్సము, ననురూప- 830
మగునొకదోహన, మటు దోగ్ధ నొకనిఁ
దగినవానినిఁ గూర్పు తద్దయుఁ బ్రాణి-

తతికి నభీప్సితార్థములైనవస్తు -
వితతిఁ బిదికి నీకు వేడ్కఁ గల్గింతు;
మరి యొండుమనవి యోమనుజవరేణ్య
కరము సమస్థలిగాక నిమ్నోన్న -
తములుగా నేనున్నదాన సమస్థ -
లముగాగఁ జేసి జలమెల్ల యెడల
నిలుచున ట్లొనరింపు నిఖిలసస్యములు
బలువునఁ బండి యేర్పడు సుభిక్షమ్ము;"

అని యవనీసతి యాడినమధుర -
వినయోక్తులకుఁ గడు వేడుకఁజెంది,
కలయ మనువు దూడగాఁ, దనపాణి -
తలము దోహనముగఁ దా దోగ్ధగాఁగ
పృథుఁడు గావించి, యావివిధౌషధులను
బృథులమ్ముగాఁ బిండెఁ; బృథిని నెల్లరును
దమతమకోర్కెలఁ దనుపుగాఁ బొంది
ప్రముదితానందసంభరితులై; రెండు -
నాని తీరున జగత్రయమ్మున నున్న -
భూతజాలమ్మెల్ల మునుకొని తమకు - 840
ననుకూలవత్సదోహన దోగ్ధజాతు -
లను వేరువేరుగ లక్షించి కూర్చి
తమతమకామితార్థములను బిదికి
క్రమముగ నిజధర్మగతిఁ బెంపుఁ జెందె;

అఘదూరుఁడగు వైన్యుఁ డాసర్వకామ -
దుఘయనఁదగుభువి దుహితగాఁ జేసి -
కొని తనకోదండకోటిచే గిరుల
నెనయ పిండియొనర్చి యెందును భూమి

సమతలముగఁ జేసి సస్యసమృద్ధి -
నమరింపఁ నాప్రాంతమం దచ్చటచట
జననివాసమ్ములు చక్కనై వెలసె;
ఘనపృథుయశము నల్గడలందు బెరసె;
దేవాధిదేవ, నీదివ్యసంకల్ప -
మే వసుంధరకు నమేయభాగ్యంబు
పృథుచక్రవర్తివై పృథివి సంపదలు
ప్రథితమౌవట్లు సంభావించి తీవు; 848

## పృథుచక్రవర్తి యధ్వరములు సేయుచుండ నింద్రుఁ డవరోధము గల్గించుట:-

నీ యంశమునఁ బుట్టి నిఖిలధర్మములు
పాయక పాటించి ప్రభువు పృథుండు
తివిరి బ్రహ్మావర్తదేశమ్మునందు
ప్రవిమలమైనసరస్వతీతీర - 850
మున శ్రీమనుక్షేత్రభూభాగమందు
మునుకొని యధ్వరమ్ములు సేయఁబూని
భూమాత గోరూపమున జన్నమునకు
ప్రేమ సమస్తముఁ బిదుకుచునుండ
తరులతల్ మకరందద్రాక్షాదిరసము -
లరయ సంద్రములు రత్నాదులు నాల్గు -
తెఱఁగులౌ యోదనాదికముల గిరులు
కొఱలేక సర్వదా కురిపించుచుండ,
లోకపాలురు ప్రజలు నుపాయనములు
ప్రాకటముగ సమర్పణసేయుచుండఁ,

బరిపూర్ణవిభవసంభరితుఁడై యతఁడు
సరవిగా సవనముల్ సాగించుచుండె;
తొంబదితొమ్మిది తురగమేధమ్ము-
లింబుగా జరిపి యానృపుఁడు వైన్యుండు
నూఱవయాగమ్మునుం బూని నిష్ఠ
సారసలోచను సర్వలోకేశు
శ్రీరమానాథు యజించుచునుండ-
నారమణీయమౌ యాగోత్సవంబుఁ
గని సహియింపక, కష్టుఁడై యింద్రుఁ-
డనయపద్ధతిని నయ్యజ్ఞహయమ్ము 860
హరియించి చనుచుండె నాకాశమునకు;
ధరణీశుమఖము వ్యర్థమ్ము గావించు-
నయ్యింద్రుచోరకృత్య మ్మత్రి దెలుప,
చయ్యన శరశరాసనములు పూని
పృథునిపుత్రుఁడు శక్రు వెనుకొని రాఁగ
పృథులమాయాకృతి వెలసె నతండు;
రాకుమారుండు సుత్రామునిఁ గదిసి
పోకుపోకని యార్చి భూరిజటాస్థి-
కలితమాయామూర్తిఁ గాంచి యారూపు
విలసితసద్ధర్మవిగ్రహమంచు
మదినెంచి బాణముల్ మఘవునిపైన
వదలి జయించి యశ్వమ్మును బడయఁ
గొతికెడునారాచకొమరునిఁ జూచి
జితవీర్యుఁ డత్రి "యోజింపకుమయ్య
యితఁడె సవనహంత, యితఁడె సురేంద్రుఁ-
డితఁడు కపటరూప మెత్తియున్నాఁడు;

తెగి వానిపైఁబడి తేజమ్ము సూపి
పగమాన్పి విజయమ్ముఁ బడయుమా" యనుచు
మున్మారు నమ్మెయి బ్రోత్సాహపఱుప,
పమ్మినకోపాన వాఁ డరిపైనఁ 870
గవియంగఁ వెఱ తురంగము నట్టె విడిచి
దివిజేంద్రుఁ డప్పు డదృశ్యమ్ము నొందె;
నంత నవ్వీరుఁ డయ్యశ్వమ్ముఁ దెచ్చి
సంతసమ్మున తనజనకున కిచ్చె; -
నతనియద్భుతకర్మ కలరి మునీంద్ర -
వితతి జితాశ్వాఖ్యఁ బెట్టె నాతనికి; -

సంతటఁ బోక నయ్యజ్ఞభూభాగ -
మంతయు తిమిరమయమ్ముగఁ జేసి
తను నొరుల్ గననిపద్ధతి యజ్ఞహయముఁ
గొనిపోయె మరల శక్రుఁడు క్రూరబుద్ధిఁ
గ్రమ్మఱ నింద్రుదుర్ణయ మత్రి దెలుప -
పమ్మినకోపాన వైన్యసూనుండు

బలమున నరిగి కపాలఖట్వాంగ -
ములఁ దాల్చి చనెడువిబుధపతిఁ గాంచి
మునుపటివలె నొంపఁబూనక మరల
మునివరుఁడత్రిచే పురుహూతుమాయఁ
దెలిసి య మ్మరివోయ దివిపతి గాంచి
యులికి గుఱ్ఱమువిడి యుఱికెఁ గన్పడక;

పిదప జితాశ్వుఁడు పితృమఖస్థలికి
ముదమున యజ్ఞాశ్వమును తెచ్చి విడిచె; 880

పవనాశ్వమునకు వాసవుఁ డూనినట్టి -
వివిధమాయోపాయవేషాల మూర్ఖ -

జను లనుకరణమ్ము సలిపి యధర్మ -
మున మున్గి, యాచిహ్నముల సంప్రదాయ -
మని ధరియించుట కధిపుఁడు పృథుఁడు
కనలి శరమ్ము సంక్రందనుమీఁద
విడువనుంకింప ఋత్విక్కులు రాజు -
కడక మాన్పంగ వక్కాణించి రిట్లు;
"మనువిభ వ్రతదీక్షమై నుండువారు
పనిగొవి జన్నంపుఁబశువును దప్ప -
నితరప్రాణమ్ముల హింసింపరాదు;
క్షితిప! యీనీతి భాసిలు వేదరీతి
యగుట పాకారి సంహారమ్ముసేయఁ
దెగకు మానుము; వాని దివ్యమంత్రముల
నామంత్రితునిఁ జేసి యగ్నికాహుతిగ
నీమనోభీష్టంబు నెరవేర్పఁగలము;"
అని ఋత్విజులు పృథు నాఁపి, స్రుక్స్రువము -
లను సేకరించి వేల్వఁగ సమకట్ట,

## ఇంద్రుఁడు పృథుచక్రవర్తితో మైత్రిచేయుట:-

నలువ యా సమయమ్మునన వచ్చి మునులఁ
దిలకించి యిట్లనె; "దేవేంద్రుఁ డెవఁడు? 890
భగవదంశంబునఁ బరగెడు వాఁడు;
తెగఁడు మీచే; మఖస్థితిఁ బాడుసేయ -
నతఁడొనరించునన్యాయకర్మలకు
ప్రతిసేయు టొప్ప దూరక సుండవలయు;
క్షితిపతిఁ బృథురాజుఁ జెందు నేకోన -
శతయాగఫలములు శంకింపవలదు;"

అని రాజుతోడ నిట్లనె నబ్జభవుఁడు
"మనుజేంద్ర మోక్షధర్మములతెఱంగు -
వెఱుఁగుదు వీవు నీకేల జన్మములు -
జరుపుకోరిక ? యింక చాలింపుమయ్య ;
పాకశాసనుతోడి వైరమ్ము మాని
మేకొని మైత్రిమై మెలఁగుట మేలు -
శక్రుఁ డాగ్రహవృత్తిఁ జరియించుకొలఁది
వక్రమై ధర్మంబు పాడుగుచుండు
వేననిదోషముల్ విరివియై లుప్త -
మైననానాసమయానుధర్మముల
న్యాయమార్గమ్ముల నడిపింప నతని -
కాయమ్మునందుండి కమలాక్షునంశ
జనియించి తీవు; నీజన్మ సార్థముగ
ఘనకార్యములు కొన్ని కడతేరవలయు 900
గాన సర్వేశుసంకల్పమ్ము నీవు
మానక పాటింపు మనుజాధినాథ ; "

అని పద్మసంభవుఁ డానతి యీయ
విని పృథురాజు విద్వేషమ్ము మాని
సవనమ్ము చాలించి శతమన్యుతోడ
ప్రవిమలసఖ్యసంపదఁ దృప్తి వడసె ;

## పృథుచక్రవర్తి ముక్తి నొందుట :—

అవభృథానంతర మవనిదేవతలు
మివుల దక్షిణల సంప్రీతినిఁ గనిరి ;
దివిజులు వరములఁ దృప్తి నొందించి -
[illegible] జేర్కొనిరి :

ఆసమయంబున నచటికి వేద -
వాస, శ్రీలక్ష్మినివాస, సర్వేశ
పరమపూరుష నీవు బలుభేదితోడ -
నరుదెంచి పృథుఁగాంచి యతని కిట్లంటి;
"అవనీశ! నీయీమహాధ్వరమునకు -
నవరోధ మొనరించె నమరేశుఁ; డిపుడు
మన్నింపఁ గోరెడు మాన్యుఁ డితండు;
మన్నింపఁదగు నీకు మానవనాథ
దేహాభిమానంబు దెలియరుగాన
ద్రోహము సేయ రెందున నితరులకు; 910
చేసిరివో వారు సేయుసత్సేవ
కాసుకైనను సాటిగా చెల్లఁబోదు
సుఖదుఃఖముల నీవు చూతు వొక్కటిగ -
నఖిలలోకావన మధిప చేకొనుము;
ప్రజలఁ బాలించుటే రాజధర్మమ్ము
ప్రజపుణ్య మతని కాఱవపాలు చేరుఁ
బ్రజ రక్ష సేయనిప్రభువు తా నొందుఁ
బ్రజసేయుసర్వపాపఫల మంతయును;
జనులు మెచ్చంగ రాజ్యమ్మేలు నీకు
సనకాదిఋషులదర్శనము చేకూరు
ఘనతాపసులకేనిఁ గన్పడ నేను
నిను మెచ్చుకొంటిని నీకుఁ గన్పడితి
వరమిత్తుఁ గోరు మోప్రార్థివ;" యంచు
కరుణించితి వతనికాయ ముప్పొంగ

భవదీయకారుణ్యభాగ్యమ్ముకతన -
నవిరతానందమ్ము నంది యారాజు

తనపాదములకు వందనము లర్పించి
తనయెడఁ జేసిన తప్పిదములకుఁ
గలఁగి సిగ్గులుశ్రుకు కరుణ మవ్వించి,
కలుచ మాని తనదుకౌఁగిటఁ జేర్చె; 920
పిదప పృథుండు నీవిమలరూపమ్ము
గొదదీరఁ గాంచుచు గోవింద నిన్ను
స్మరియించుటెట్లొ యర్చనసేయుటెట్లొ
వరమడుగుట యెట్లొ యరయ కానంద -
మున మునుంగుచు నీదుమోము గాంచుచును
వినిచె భక్తిగఁ దనవిన్నప మిటుల;

"అనవరతమ్ము నీయనుపమచరిత
వినుబుద్ధి నాయందు వెలయింపుమయ్య
నిను భజియించక నిరుపయోగముగ
మనుమూఢులను జ్ఞానమార్గానఁ ద్రిప్ప -
ఘనశక్తి, శ్రీలక్ష్మికరణి నిన్గొలుచు -
ననురక్తి నాలోన నమరుచుమయ్య;
కూనఁడౌకొమరునికోరిక లెవియొ
తాన యెఱింగెడుతండ్రివిధాన
నావంటియజ్ఞానవరులకు శుభము -
లావహింతువు నీవె యఖిలశరణ్య;"
అని విన్నవించిన యారాజువాక్కు -
లను గలభావమ్ములను విశ్వసాక్షి -
వగుట నీ వెఱిఁగి మహానందమొంది
నగధర యా రాజునకు నిట్టులంటి; 930
"నరవర! నీ బుద్ధి నాయందు నిలిచె
స్థిర మిఁక నీభక్తి చెదర దెన్నఁడును

దాన నామాయను దరియింపఁగలవు
పూన వేనాఁటికి మోహంపుఁబనులు
నాదునాదేశాన నడచితివేని
ప్రోదిగా శుభములుఁ బొందు దెప్పుడును;
నాభక్తులకు స్వర్గనరకముల్ సమము
నీభావ మింతియ నే నెఱుంగుదును
నాయాన శ్రుధ మాని నన్నె నమ్మితివి
నీయందుఁ గృప నాకు నిశ్చలమయ్యె"
అని యిట్లు రాజర్షియైనట్టిపృథుని
యనుమోదముగఁ జాల నభినుతి చేసి
కరుణతో నందఱఁ గాంచి వీడ్కొనుచు -
నరుగుదెంచితివి నీ వాత్మీయపురికి;
అంతట పృథునృపుఁ డతిభక్తి మీఱ
స్వాంతాన నిను నిల్పి సన్నుతుల్ సేసి
పరివారయుతముగా పయనమై తనదు -
పురిఁ జేరె బుధజనమ్ములు పొంగుచుండ;
తదనంతరమున నాతఁడు పౌరజాన -
పదులచేఁ బూజింపఁబడి తాను వారి 940
వివిధవిధాలఁ దృప్తినిఁ గనఁజేసి
దివిజులు మెచ్చుసత్కృతు లెన్నొ చేసి
ధరణి సద్ధర్మవర్తనముగ నేలి
పరమపదము నొందె పరమ మోదమున.

గరుడవాహన జగత్కల్యాణమునకు
పరిపరివిధముల భావించి, తదను -
గుణముగ నిజమాయ గొని భువిలోన
జనియించుచుందువు సర్వశరణ్య;

భువి నీరసస్థితిఁ బొంది మానవులు
మిపుల నాకటఁ గ్రుంగ మేదినినుండి
సకలావసరవస్తుచయముఁ బిండితివి
యకలంకదీక్ష పృథ్వవతారమెత్తి;
యట్టి నిన్ భజియింప ననుపమసౌఖ్య -
మిట్టిలమ్మగుఁగాదె యిందిరానాథ:

నీసేవ చేయనినిర్భాగ్యు నన్ను
శాసించి సద్గతి సమకూర్చుమయ్య
కడఁద్రోయవలదయ్య కంజదళాక్ష
కడతేర్చుచుండుటేగద నీదుదీక్ష.

## ప్రచేతసుల చరిత్ర:—

శ్రీవత్సలాంఛనాంతదివ్యదేహ
పావనచిత్రావ పక్షిరాడ్వాహ 950
నీమహామహిమలనికురుంబములను
సామాన్యు లెఱుఁగంగజాల రోదేవ;

పృథువంశమున జనియించె నొక్కరుఁడు
ప్రథితయశోధని ప్రాచీనబర్హి
యతనిపుత్రకు లరయఁగ తుల్యమైన -
వ్రతనామధరులు, ధర్మపరీతమతులు —
నరయ ప్రచేతసులన వారు పదుగు -
రురుగుణాఢ్యులు కడునూర్జితయశులు
వారలు పితృతాజ్ఞ పడసి తపమ్ముఁ
గోరి సేయఁగబూని కుతుకమ్ముతోడఁ
దమనివాసము వీడి తనరంగ పశ్చి —
మమునకుఁ జనిచని మహితమై జలధి -

కన్నను బఱపయి కడుశోభ నొవ్వ -
తిన్ననౌనొకదివ్యసరసిని, మరియు -
నందున నొక్కమహాత్ముని( గాంచి
పొంది రానందసంపూర్తి డెందముల; -
ఆమహాత్ము(డు భవదంశసంభవు(డు
శ్రీ మహాదేవుండు శ్రితరక్షకుండు
ఆసరస్సుననుండి యభవు(డు వేడ్క
భాసిల్ల వచ్చె సుపర్వులు వొగడ; - 960
నావృషధ్వజు( గని యాప్రచేతసులు
భావముల్ పొంగ సద్భక్తి చెలంగ(
దత్పదనీరజద్వయమున కెఱ(గి
హృత్పీఠములను నాశ్రీకంఠు నిలిపి
ధ్యానింప, నాప్రచేతసుల మన్నించి
సానురాగముగ నీశ్వరు( డిట్టు లనియె;

"నృపసుతులార మీస్పృహ నెఱింగితిని
తపన మాను(డు మీరు ధన్యాత్మలౌట
మిము(గన నామది మెచ్చయ్యె(గాన
ప్రమదమ్ము మీకు వేర్పడ( గాన(బడితి
వాసుదేవునిభక్తవరులెల్ల నాకు
వాసిగా( బ్రియతముల్; వారికి నేను
కడు(గూర్చువా(డనుగాన మీయెడను
బొడమె కారుణ్యంబు పుణ్యాత్ములార
జలజాసను(డు మున్ను సనకాదిమునుల
కెలమి( దెల్పినయట్టియిందిరానాథు -
శ్రీహరిస్తోత్రమ్ము శ్రేయస్కరమ్ము
మోహవిదూరమ్ము ముక్తిప్రదమ్ము

నెఱిగింతు" నని వారి కెఱిఁగించె నీదు -
దురితహరమ్మనౌ స్తోత్రరాజమ్ము. 970
మరి యిట్టు లనియె నుమాపతి వార -
లరుసమ్మునొంద "యోగాదేశనామ -
కమ్మగుస్తోత్రపుష్కల మిద్ది దీని
నమ్మి పఠింప నెన్నవులు శుభాలు
నృపతనయులు మీరు నిశ్చలత్వమునఁ
దపనీయకౌశేయధారు శ్రీవిష్ణు
చిత్తమ్ములందు సంస్థితుఁ జేసి, దీని -
నుత్తమస్తోత్రమ్ము నోపిక జపము
సేయుచుఁ దపమొనర్చిన మీకుఁ గలుగు
శ్రేయము, లీప్సితపృథులభాగ్యములు;"
అని యిట్లు బోధించి యభవుండు వారు
తనుఁ గొల్చుచుండ నంతర్ధానుఁ డయ్యె;

అంతఁ బ్రచేతసు లబ్ధిమధ్యమున
స్వాంతమ్ము లుప్పొంగఁ జయ్యన నిలిచి
నారాయణా! భవన్నామస్తవంబు
పారాయణమ్ముగాఁ బదివేలయేండ్లు
జపియించుచుఁ దపమ్ము సలుప వారలకుఁ
గృప దర్శనంబిచ్చి యిట్లంటి వీవు;
"తాపసులౌ ప్రచేతసులార వినుఁడు
మీపవిత్రస్మృతుల్ మిగులశ్లాఘ్యములు 980
మీసుహృద్భావముల్, మీయైకమత్య -
మీసర్వజగతికి నెందు సేవ్యమ్ము
మిము మదినెంచి నెమ్మిగ నిద్రవోవు -
విమలుఁడు సుఖముల వెలయు నీజగతి;

ఈ స్తవరాజమ్ము నెవఁ డనుదినము
నిస్తులభక్తి వర్ణించి కీర్తించు
వానికి నభిమతవరముల నిత్తు
మానుఁగా బ్రజ్ఞయు మానక యిత్తు
జనకాజ్ఞ పాలించుసజ్జనుల్ మీరు
వినుతమై మీకీర్తి వెలయు జగాన;
మునికండునకును బ్రమ్లోచయచ్చరకు
తనయ 'మారిష' యను తన్వంగి, మీరు
మీతండ్రియాన బ్రేమించి వివాహ-
మాతతలోకవిఖ్యాతమ్ముగాఁగఁ
జేసికొనుండు మీచిత్తమ్ము లలర;
వాసియు వన్నెయు వైభవ మమర-
న'మ్మారిష'యును మీకనుకూలవతియు
నెమ్మి మీసుఖముల నెమ్మది గోరు-
కాంతయగుట మీరు కలఁక నెమ్మదుల
సుంతయేనియు లేక సురుచిరభౌమ- 990
భోగముల్ పెక్కేండ్లు పొంది ప్రేమాను-
రాగముల్ వెలయ పుత్రకుఁ బడయుదురు;
అంత నాభక్తిచే నన్నిభోగములు
స్వాంతాన నిరయమ్ము సమముగా నెంచి
వైరాగ్యమంది సర్వమ్ము త్యజించి
నారమ్యపదముఁ బొందగలారు మీరు
కోరుఁడు వరములు గొదలేక యిత్తుఁ
బారమ్ము ముట్టు మీభవ్యాశయమ్ము"-
లనుచు నాదృతులును నభిమానములును
గనుపట్టు నీదువాక్యసుధారసమ్ము

తనివిదీరగ నాని, తాపమ్ము మాని,
వనజాక్ష తమహస్తపద్మముల్ మోడ్చి,
శిరములఁ గీలించి శ్రీధర నీకుఁ
గరము మనవి వారు గావించి రిట్లు;

“కరుణాసముద్ర నిన్గాంచితి మిదియ
పరమభాగ్యము వేరువరమేల మాకు
నిన్ను నర్చించెడునియతికి మించు -
కన్నాకుకోర్కెలు గలవె సర్వేశ;
సకలార్థదుఁడవు నీసత్కృప మాకు
సకలమ్ము; వేరుకాంక్షలు గోరవేల? 1000
దగగొన్నవటుఁడు సంద్రముఁ జేరి నీరు
మిగులఁ గ్రోలునె తనమితికి మిక్కిలిగ -
నైన మాయభిమత మచ్యుతా నీకు
మాననిభక్తితో మనవిచేసెదము;
భవబంధములు దీఱువఱకు మాజన్మ -
లవని నుండునుగదా! అంచాఁక నీదు -
భక్తులసంపర్కపదవి మాయందు
త్యక్తముగానట్లు దయఁజూడుమయ్య;
సర్వభూతములందు సమదృష్టి, సత్య
నిర్వహణాదిమానితసద్గుణములు
మాలోన వెలయించి మముఁబ్రోవుమయ్య
శ్రీలలనాసమాశ్రితదివ్యవక్ష”
అని ప్రచేతసులు నిన్నతిభక్తి వేఁడ
విని సంతసించి దీవించి వారలకుఁ
గోరినవరములు కొఱలేక యొసఁగి
చేరితి నీవు వసించుస్థలమ్ము;

తదుపరి నాప్రచేతసులు నీయాజ్ఞ
మదినెంచి సంద్రంబుమధ్యమ్మునుండి
భువిఁ జేరి యందఱు బుధసమ్మతముగఁ
దపిలి పెండ్లాడిరి ధన్యమారిషను; 1010
పదుగురునృపులకు భార్య నొక్కతెగఁ
గుదిరిచి తిది వింతఁగూర్చె జగతికి; -
నైన నీసంకల్ప మది యెట్టిదేని
మానుగ లోకధర్మముగాఁగ నిలుచు
నీజగన్నాటక నియతికి పెక్కు -
జేజే లొనర్చెద శ్రితపారిజాత!
మును ప్రజాసర్గమ్ము పూనిన దక్షుఁ -
డనఘుఁ డాపూర్వదేహమ్మును విడిచి
ఘనులు ప్రచేతసుల్ కడుమోదమంద
కనకాంగి మారిషగర్భమ్మునందు
జనియించి తనకాంతి జగతిని నింపి
పొనర ప్రజాసర్గమును బూనియుండె;

శ్రీసముత్కరతులసీదళమాల్య -
భాసితదివ్యశుభంకరదేహ
దామోదరా! ప్రచేతసులు నీబోధ -
నామృతోక్తుల హృదయమ్ములఁ దలఁచి
తమసతి నాత్మనందనుచెంత నునిచి
విమలమనస్కులై వేగంబ యపర -
వారిధితీరభూభాగమ్ముఁ జేరి
నీరజదళనేత్ర నీదుసన్నిధిని 1020
జేరఁదలంప, విచ్చేసె నారదుఁడు
వార లానందమ్ము వడయ నచ్చటికి
దేవర్షి నారదుదివ్యదర్శనము
భావమ్ములకుఁ గడుఁబ్రమదమ్ముఁ గూర్ప, -

సతని బ్రచేతసు లభినుతిసేసి,
"యతిలోకచంద్ర! సర్వాత్మకుల్ మాకు
హరిహరుల్ సెప్పినయాత్మతత్త్వమ్ము
నెరయ మాలో నేడు నిభృతమై వెలుగ
బరమాత్మసన్నిధి బ్రాప్తించునట్లు
కరుణ సద్గతి మాకు గాన్పింపుమయ్య"
అని వేడ దేవర్షి యాప్రచేతసుల
కనికరమున జూచి, కమలాక్ష నిన్ను
భజియించుతెఱగు, బ్రపంచతత్త్వమ్ము,
వృజినాపహరము నివృత్తితత్త్వమ్ము
వినిపించి చనియె; నావిమలమానసులు
ఘనులు ప్రచేతసుల్ కమలాక్ష నిన్ను
నిరుపమభక్తి ధ్యానించి నీపదము
చిరకీర్తియుతముగా జెంది రందఱును.
శ్రీసముల్లాస భాసితచిద్విలాస,
వాసుదేవా! సురవందితచరిత 1030
భక్తజనమ్ముల పక్షమే నీకు
రక్తి; వారల కీవు ప్రత్యక్షమగుచు
హిత ముపదేశింతు; వెసగ రక్షింతు; —
వతులితదివ్యపదాప్తినిం గూర్తు
నీదునామధ్యాననిరతి నాయందు
బాదుకొలిపి నన్ను భవరహితమ్ము
పాపవిదూరమ్ము భద్రమ్మునైన
నీపాదసన్నిధినిం జేర్చుమయ్య
జేజేసహస్రముల్ జేసెదనయ్య
నాజన్మ తరియింప నను బ్రోవుమయ్య.

—: ఇది చతుర్థస్కంధము :—

# పంచమస్కంధము - ప్రథమాశ్వాసము

భక్తజనావన పాహి మాం పాహి
ముక్తసంగజనానుమోద మాం పాహి
నీభక్తవరులమానితమహిమములు
ప్రాభవములు కడుభద్రంకరములు

## ప్రియవ్రతుని వృత్తాంతము :

స్వాయంభువుఁడు మోహజాలంబు విడిచి
శ్రేయమౌముక్తి చేకొనఁదలఁచి
వనిఁ జేరఁజన, ప్రియవ్రతుఁడు తత్తనయుఁ -
డనఘుఁడు రాజయి యవని నేలుచును,
భవదీయసురముని ప్రజపూజ్యమైన -
ప్రవిమలపాదాబ్జభజనమే తనకు -
నానందశేవధియని యెంచి, రాగ -
మానకామాదులు మమతలు మాని,
ప్రజల బిడ్డలవోలెఁ బాలించుచుండె;
నిజకీర్తి వసుమతి నింపుచునుండెఁ;

అతఁడు బర్హిర్మతియనుభార్యవలన
సుతదశకము నొక్కసుతను సంతతిగఁ
బడసె; మూవురుసుతుల్ బ్రహ్మపదంబుఁ
గడుఁదత్త్వవిదులయి గనిరి; యాకూఁతు -
నూర్జస్వతిని శుక్రుఁడుద్వాహమయ్యె; -
నార్జవమయ్యె ప్రియవ్రతుచరిత ; 10

మేరువువలగొనుమిహిరున కపర -
ధారుణిఁ బర్వుధ్వాన్తముఁ బాపఁబూని

భవదీయసద్భక్తిబలవిశేషమున
సవితృరథసమానజవము తేజోమ -
యమ్మునౌరథ మెక్కి యామినులెల్ల -
నిమ్ముగా దినము లట్లే నొనరింతు -
నని సప్తవారము లపరసూర్యుండౌ
యనఁ; దేరుఁ బఱపె; నా యరదమార్గమ్ము -
లేడుసంద్రమ్ము లాయెడము భూసంధు -
లేడుద్వీపమ్ములై యెసఁగె నబ్రముగ;

ఆయేడుదీవుల కధిపులుగాఁగ -
నాయవనిపుఁడు ప్రియవ్రతుఁ డాత్మ -
తనయుల నేడ్గురఁ దగ నియమించి
ఘనముగా పట్టముల్ గట్టి, భూసౌఖ్య -
ములు భాగ్యములు భోగములు సర్వభూతు -
లలతు లశాశ్వతాలని మది రోసి
నిజగురునారదు నిర్మలబోధఁ
బ్రజలను సతులను భాగ్యసంచయము
వదలి, గోవింద! భవత్పదాబ్జముల
మది నిల్పి. నీదునామధ్యానమహిమ 20
నీకుఁ బ్రియుండయి, నిత్యకైవల్య -
ప్రాకటపదవీవిరాజితుఁడయ్యె;

హరి నీదుభక్తుల కరయ సాధింపఁ
దరముగానిది యెందుఁ దడవిన లేదు;
జగతికి శ్రేయంబు సమకూర్పఁగలరు
సుగతిని సాధించి సుఖియింపఁగలరు
భవదీయభక్తసంపర్కమ్ము నాకు
నవరించుమా దాసజనలోకరక్ష.

## ఋషభావతారకథ :-

శ్రీసముజ్జ్వల తులసీదళదామ -
భాసమానవిలాస భవ్యస్వరూప
ఆదిదేవా! భవదవతారలీల
లాదరములు జగదాప్తివిస్తృతికి.

మును ప్రియవ్రతువంశమున నాభియనెడు -
ఘనుఁడు రాజర్షి యొక్కరుఁడు జనించె -
నతఁడు నిష్కంటకమగునట్లు రాజ్య -
మతికృపామతి నేలు నార్యులు వొగడ;
ఆనరపతి వివాహమ్మాడె మేరు -
సూన నిర్మలగుణవ్రతత మేరుదేవి -
యనుపేరఁబరగుకన్యను బంధు లొప్ప -
ననుకూలదంపతు లాపుణ్యమతులు;
మరియు నీపాదపద్మముల సేవించు -
నిరతి వారలకు పెన్నిధి వాసుదేవ;

నరపతినాభి సంతానమ్ముఁ బడయ
పురుషోత్తమా! తనపాలఁతియుఁ దాను
నిను యజ్ఞపురుషుని నియమనిష్ఠాదు -
లనుసరించినసవనాదిసత్క్రియల -
నొజ్జలసాహాయ్య మొంది గావించి,
ముజ్జగంబుల ఖ్యాతిఁ బొసఁగ నిండించె;
ఎట్టిమహాత్ములకేఁ గానరాని -
యట్టిదేవుఁడవు కంజాక్ష! యారాజు -
నెడద గోచరమయి యెసఁగునీరూపుఁ
గడుఁబ్రీతి నాతనికనుల కానంద -

కరముగఁ జూప నాకాంక్షించితేమొ
యరుదరుదని బుధు లానందమొంద
హస్తచతుష్టయ మందమైయుండ
శస్తసువర్ణవస్త్రము ధరియించి
శ్రీవత్సకౌస్తుభశ్రీరమాచిహ్న -
భావుకవిస్తృతవక్ష మొప్పార
కంబురథాంగశార్ఙ్గగదాదిసాధ -
నంబులు కరములం దనరారియుండ 40
హారకంకణకిరీటాదులకాంతి -
వారమ్ము నల్దిశల్ ప్రబ్బుకొనంగ
నిత్యశోభవమైన నిరూపుతోడ
ప్రత్యక్షమైతివి పరమాత్మ నీవు;
భవదీయదర్శనభాగ్యంబుకతన -
నవనీపతికి నాభి కధికహర్షమ్మొ
పొడమ, నిన్నేరీతి పొగడుటో తనదు -
నెడద కేమియుఁ దోఁచ కేమాట రాక
అజ్ఞానమనుజునియటు లతఁ డుండ,
విజ్ఞానులైనఋత్విజు లానరేంద్రు
మున్నిడుకొని భక్తి పొదలుచునుండ
నిన్నిట్లు పొగడిరి నిగమసంస్తుత్య;
"శ్రీమనోహర భక్తచిత్తవిహార
సామగానవినోద సజ్జనామోద
నీమహామహిమలు నీదుతత్త్వములు
సామాన్యములె! వానిఁ జక్కఁగా నెఱిఁగి
యేమానవుండేని యేర్పడ నిన్ను
నేమమ్మున స్తుతింపనేర్పఁడు స్వామి

నెల్లప్రాంతమ్ముల వృష్టిపాతమ్ము
పెల్లుగాఁ బడజేసి భీతి మాన్పించి
పురణించుక్షామమ్ము పోఁగొట్టఁజేసి
నిరుపమమహిమచే నెగడితివయ్య;
సకలవిధంబుల సామర్థ్యమున్న -
ప్రకటితమహిమలఁ బరగుచున్న
నిను రాజుగాఁ జేసి నీ తండ్రి నాభి
ఘనయోగసిద్ధిచేఁ గైవల్య మొందె;
శ్రీవత్సచిహ్న నీవృషభావతారం -
భావంబులెల్లను భద్రముల్ దేవ. 80

భవదీయపాలనఁ బరఁగునీభూమి
మివులంగ కర్మభూమిగఁ దలంచితివి;
వేదముల్ పఠియించి విశ్రుతకర్మ -
లాదరమ్మునఁ బ్రజ లరయ నేర్పితివి;
శతమన్యుసుతను సచ్చరిత జయంతి -
నతిప్రీతిఁ బెండ్లాడి యాయింతివలన
భరతుఁ డాదిగ పుత్రవరుల నూర్వురను
పరమముదంబునఁ బడసి గృహస్థ -
ధర్మంబుఁ బాటించి తద్దయుభక్తి
నిర్మలమతి క్రతునిచయమ్ము చేసి
ప్రజలలో నైహికభావముల్ వాపి
ఋజుపద్ధతులు కడుఁగృప బోధచేసి
తనయులు విన పెక్కుధర్మముల్ దెలిపి
తనరు నీఋషభావతారకాయమ్ము
విడనాడి ప్రత్యక్షవిష్ణుఁడవగుటఁ
బడసితి తాదాత్మ్యభావమ్ము దేవ.

శ్రీరమానాథ యీఋషభావతార
కారణోద్దేశముల్ కడురహస్యములు
ఈకర్మభువి జనియించిననరుఁడు
చేకొన్నగార్హస్థ్యజీవిత మెట్లు 90
సాగించవలయు తత్సద్ధర్మ మెద్ది
రాగవైరాగ్యవర్తనము కుటుంబి
యేలాగు జరిపించు; నిట్టిసంసార
పాలనవిధులెల్ల ప్రజల కాదర్శ -
ముగఁ జూప నీభూమిఁ బుట్టితి గాని,
నగధర వీకు భ్రాంతమ్మె చిత్తమ్మె
నీపాదములఁ బట్టి నిను భజియింతు
నాపాపముల నెట్టి ననుఁ బ్రోవుమయ్య.

## భరతోపాఖ్యానము :—

శ్రీ కమలాలయచిత్తాబ్జభృంగ
ప్రాకటనీలనీరదశోభనాంగ
కర్మవాసనలన్ని కడఁద్రోసి నిన్ను
నిర్మలమతితోడ నిశ్చలభక్తి

ధ్యానించుపురుషుఁడే ధన్యుండు; మోహి
మానంగ జాలునే మరుపుట్టువులను
మును ఋషభనరేంద్రుపుత్రులలోన -
ఘనఘుండు జ్యేష్ఠుఁడునగుభరతుండు
జనకునిపిదప రాజ్యమ్మును దాను
మనుధర్మపద్ధతి మానక యేలు
ఆమహీపతియేలునజినాభమవెడి -
భూమండలమ్ము తగ్గాపతిపేగ 100

భారతవర్షాఖ్యఁ బరగెఁ దదన్య –
ధారుణి వర్షాలఁ దగఁ బేరుఁ బెంచె
భరతరాజేంద్రుఁడు పరిణయమాడె
చరితార్థయగు "పంచజని" యనుకన్య; –
నీధన్యులకుఁ బుట్టి రేగురుసుతులు
మోదాన పితరుల ముంచెడుఘనులు
తనదుపూర్వులవలె ధరణిని భరతుఁ –
డనఘుఁడు ధర్మాత్ముఁడై యేలు; మరియు
కర్మయోగమె ముక్తికారణమనుచు
నిర్మలమతి యజ్ఞనిచయముల్ వ్రతము –
లన్నియు నీకు సమర్పణమనుచు
నిన్ను ధ్యానించుచు నియతి గావించు;
ఈ రీతిగాఁ దనయేల్బడి ముక్తి –
కారణసత్క్రియల్ కడుదీక్షఁ బెక్క –
వత్సరాల్ సలిపి యాభరతుఁడు తనిసి
వాత్సల్యమున సుతపంచకమునకు
పైతృకమెల్లను బంచి యిల్విడిచి
పూతమతిం జేరె పులహాశ్రమంబు

## భరతుఁడు పులహాశ్రమంబుఁ జేరి తపమొనరించుట: —

ఆయాశ్రమస్థుల నచ్యుతా నీవు
పాయక ప్రోతువు ప్రత్యక్షమగుచు 110
వినుతసాలగ్రామవిసరసంయుక్త –
ఘనగండకీతరంగక్లిన్నమైన –
పులహాశ్రమపవిత్రభువి భరతుండు
తలఁపు నీపై నిల్పి తా నొకం డొక్క –

విజనప్రదేశాన విగతమోహుండు
వృజినదూరుండవై విష్ణుని నిన్ను
గూర్చి ధ్యానించుచు, కుసుమముల్ గొంచు
నర్చించు చానంద మందుచునుండె;

## హరిణ పోతము :—

అంతట నొక్కనాఁ డాభరతుండు
స్వాంతమ్మునందు సజ్జనరక్ష! నిన్ను —
దలఁచుచు గండకీతటినీపవిత్ర —
జలములఁ గ్రుంకి తజ్జలమధ్యమందు
గణక నెమ్మదినిల్చి కనుఁగవ మోడ్చి
ప్రణవసన్మంత్రజపమ్మున నుండె;

ఆతటి నట కొక్కహరిణి యేతెంచి
యాతరంగిణి నీర మానుచునుండ
మృగరాజొకండు గర్జించి లోకమ్ము
బెగడొందునాదమ్ము వెల్లుగఁజేయ
భీతస్వభావ గర్భిణి యాకురంగి
యాతరంగిణీతీరమందున్నహరిణిఁ 120
గని గుండె ఝల్లన కంపమ్ము నొంది
ఘనభయమ్మునఁ జేసి గగనాని కెగసి
నదినిదాఁటెడుతరుణానఁ దద్గర్భ —
మదరి యోనిద్వారమందుండి జారి
పడె నీట; మృగియు నా ప్రాంతాద్రిదరిని
బెడిదమ్ముతోఁ బడి విడిచె ప్రాణముల;
హరిణపోతము ప్రవాహమునందు నీటి —
తరగలవరుసలఁ దగఁ దేలియుండె;

ధ్యానమ్ము ముగిసె నేత్రమ్ములు విప్పి
భూనాయకుఁడు మృగపోతమ్ముఁ గాంచె
గతము నెమ్మనమునఁ గనె కృపాయత్త -
మతియయి యా రాజు మాతృవిహీన -
యైన యాశిశువు నిజాశ్రమమునకుఁ
దాన గొంపోయెఁ దద్దయుఁ బ్రీతిచేసి

## భరతుఁడు హరిణపోతముం గొంపోయి నిజాశ్రమమునఁ బెంచుట :—

భరతరాజర్షికి పరమాత్మ! నీదు -
పరమపూజాదికవ్రతములపాటి
హరిణపోషణలాలనాదికకర్మ -
లరయ నొక్కొక్కటి యభివృద్ధియయ్యె; -
ననుదినభవదర్చనాదికార్యముల -
ననుపమభక్తితో నాచరించుచును 130
నడుమ నామృగము మనమ్మునఁ దోఁచఁ
గడుమోహమున నిజాంకమునందు దానిఁ -
జేరిచి లాలించు శీర్షమ్ము నిమురు
కూరిమి ముద్దాడుఁ గోరిక నతఁడు
హరిణకారణముగ నాత్మయోగమ్ము
కరము భంగమ్మౌట గానఁ డారాజు;

“అక్కటా! యీకురంగార్భక మటుల
దిక్కఱియుండ నేఁ దెచ్చితి నిదియు -
నెక్కువప్రేమ నాయెడఁ జూపు దీవి
మక్కువఁ బ్రోచుటే మరియాద నాకు

శరణన్నజంతువు సరసనఁ జేర్చి
కరుణించి ప్రోచెడుకర్జముకన్న
పున్నెమ్ము లభియించుపూజ్యమౌకార్య -
మెన్న లేదని పెద్దలెల్లఁ బల్కుదురు."
అని యాతఁడామృగమం దనురాగ -
మును బెంచి ప్రేమతోఁ బోషించుచుండె;

హరిణమ్ముగూడ నాయాశ్రమమందు
గురువులువాఱు; దిగ్గున దివికెగురు;
కొమ్ములతో రాజుఁ గూరిమిఁ గ్రుమ్ము; -
నిమ్ముగా ఖురముల నెంతయు గీఱు; - 140
నూరువుల జేరి యొనర నిద్రించు;
గారాబమున నఱకడ నెక్కి యాడు;
ఈరీతి సంతస మేపార జింక
పేరిమిఁ జూపుచు పెక్కువిధాల -
నాడుచునుండ నాయధిపుఁడు మమత -
నీడులేనంత నామృగముపైఁ బెనిచె;

కాల మీరీతిగాఁ [illegible]డచుచునుండె
నాలేడి యొక్కనాఁ డాశ్రమభూమిఁ
బాసి కన్పడకుండె; భరతరాజర్షి
గాసి యెక్కుడు వొంది, కటకటా యనుచు
"హా! మృగపోతమా ఆశ్రమభూమి -
వేమాత్రమేగాని యిడుములఁ బడక
నాపజ్జఁ బెరుగుచు, నాకు ముదంబుఁ
జేపడఁజేయుచుఁ జెలఁగి యాడుచును,
దల్లిగా నను నెంచి, తనిసి యీప్రాంత -
మెల్ల నాడుచునుంటి వెందుపోయితివి?

ఈతపోవనభూమి నెదిగినతృణము
మేఁతగాఁగొని పుష్టిమించిననిన్నుఁ
బట్టి యేమృగరాజు బాధించి తనదు –
పొట్టఁబెట్టెనో, యెట్లు పొగిలితో నీవు ;”
అని వేదనాభర మతిశయ మగుట
మనమున నారాజు క్రుఁగ్గుచునుండ
చనుదెంచె మృగము ; నుత్సాహమ్ము రాజు
గనె ; కాల మీరీతిఁ గడచుచునుండె ;
వరయోగులైనఁ బూర్వకర్మఫలము ;
లరయ విడువనేర రన్యుల కగునె
ఈరీతిగ మమత్వ మెంతయో పెంచి
భూరమణుం డిట్టిఁ బోషించుచుండె ;

భరతుఁడు హరిణమై పుట్టుట :—

అటులుండ నొక్కనాఁ డంత్యకాలమ్ము
తటుకున నాభరతధరాధిపతికి
దాఁపురమయ్యె ; నత్తఱి కురంగమ్ము
భూపతి నాసక్తిఁ బుత్రునివోలెఁ
గనుచుండె ; నతఁ డామృగమును రాగమునఁ
దనయాత్మలో నిల్పి తమవును బాసి
మరువనిపూర్వజన్మస్మృతితోడ
హరిణిగర్భమునఁ దా హరిణమై పుట్టె ;
హరిణరూపమునఁ దా నవతరించియును
హరి ! నీదు సేవామహత్వంబుకతన
భరతుఁడు తనమృగత్వమునకు హేతు –
వరసి పశ్చాత్తాపమంది చింతించె ;

## హరిణ రూపముననున్న భరతుని పశ్చాత్తాపము :–

"అక్కటా! నను రాజులందఱు పొగడ -
నెక్కువవైభవ మెసఁగ నింద్రునకు
సరియన మంటి; భూస్థలికి పుత్రులను
దొరలుగాఁ జేసితి తోడిసమ్మనులు
రాజర్షి యనఁగ పేర్గంటి; నారీతిఁ
దేజమ్ముతోడ సుదీర్ఘజీవితముఁ
గడపి, యాజింకపైఁగలమోహబుద్ధిఁ
జెడితి యోగిజనం 'బిసీ'యననైతి
హరిణపోతస్మరణానురాగమ్ము
హరిచింతనకుఁ దెచ్చె నంతరాయమ్ము
దాన యోగము చెడెఁ దత్కారణమున
పోనైతి మోక్షమ్ముఁ బొందుమార్గమున ;"
ఇట్టుల నిర్వేద మెక్కుడు వొంది
యెట్టకేలకు తాఁటియెలుకచే నచొటు
వాసి, క్రమ్మఱి భగవత్క్షేత్రమైన
వాసిగా మునులనివాసమ్మునైన -
పులహాశ్రమముఁ జేరి బుద్ధినిశ్చలతఁ
దొలుతటియజ్ఞతఁ దొలగించి తనదు -
తలఁపు తన్మృగతనుత్యాగమ్మునందు
నిలిపి సంగమ్ముల న్విడిచి; యేకాకి 170
యగుచు నిరంతర మచ్యుతు నిన్ను
నగదగు భక్తిధ్యానము సేయుచుండి

## హరిణ రూపముననున్న భరతుఁడు ఆంగీరసుఁడను - బ్రాహ్మణునకు పుత్త్రుఁడై జన్మించుట :—

హరిణదేహముఁ బాసి ఆంగిరసనెడి -
పరమపవిత్రుని బ్రాహ్మణోత్తముని -
తనయుఁడై జనియించి, తగులముల్ దొలిచి
ఘనకర్మజాలముల్ ఖండించు నీదు
నిను శ్రవణాదుల నియతి నాభరతుఁ
డనుదిన మతిభక్తి నర్చించుచుండె.
భక్తజనావనపరతంత్ర! భుక్తి -
ముక్తిప్రదాత! త్రిభువననిర్ణేత
భవదీయభక్తులు భ్రాంతి మోహమునఁ
దవిలి, యజ్ఞానవర్తనలయ్యు, మరలఁ
దమతప్పిదమ్ములఁ దాము గుర్తెఱిఁగి
విమలమార్గమ్ముల వెలసిరయేని
వారల గమనించి, వారికోరికలఁ
దీరుచుచుండు నీదివ్యకారుణ్య -
గుణవిశేషమ్ముల గురితింపలేరు
గణుతింపలేరు లోకమున నెవ్వారు ;

ఆంగిరసునిద్వితీయలలోనఁ బెద్ద -
యంగన కాత్మజు లరయ తొమ్మండ్రు, 180
చిన్నభార్యకు జనించిరి సుతుం డొకఁడు
కన్నె యొక్కతె, యందుఁగలబాలకుండె
దురితదూరుండు నిస్తులతత్త్వవిదుఁడు
భరతాఖ్యఁ బరగెడువరభాగవతుఁడు
అన్యులతోడి స్నేహానురాగములు
మన్యువుఁ గూరుచు, మరుపుట్టువుఁ కు

హేతువులగునని యీజన్మమందు
భీతిచే భరతుఁ డావిప్రునియింట -
బెరుగుచు బంధముల్ విడిపించునీదు -
స్మరణసేవాదికసత్కర్మ లెపుడు
మనమునఁ జేయుచు, మౌనము దాల్చి
మనుజసాంగత్యమ్ము మాని, "యీతండు
మందుఁడో, బధిరుఁ డున్మాదియో లేక
అంధుడో మూకయో" యని లోకులెల్లఁ
దనుఁగని హాససంతాపముల్ వొందు -
ననువున తనవర్తనము చూపుచుండె;

## భరతుని బాల్యము :—

ఆంగిరసుండు నిజాత్మజు భరతు
సంగడిఁ జేర్చి వాత్సల్యమ్ము పేర్చి
నిజసత్కులాచారనియమసత్క్రియలు
త్యజియింప కోజ నాతనికిఁ గావింపఁ 190
దన కట్టివిధుల నాదరములేకున్న
జనకునికై వాఁడు సమ్మతిఁజూపు;
వివిధశాస్త్రార్థవివేకవంతునిగఁ
బ్రవిమలాచారప్రవర్తనయుతుగ
సుతునిఁ దీర్చంగ భూసురుఁ డాంగిరసుఁడు
కుతుకమ్ముతోడ నెక్కువజతనమ్ము
లొనరించెనేగాని యోగిభరతుఁడు
జనకునకు ముదమ్ము సమకూర్పకుండె;

ఈరీతిఁ గొడుకు నెన్నేనిమార్గములఁ
దీరుపలేక సంతృప్తిఁ దాఁ బడక

తనదుసంసారపద్ధతి చెడనీని -
మనుగడతోడ బ్రాహ్మణుఁ డాంగిరసుఁడు
మనుచుండి యంత్యసమయము ప్రాపింప
తనువు సాలించె; నాతరుణమ్మునందె
భరతునితల్లియు భర్తతో నగ్నిఁ -
జొరబడి మరణించి సుగతికిఁ జనియె;

## తలిదండ్రులులేని భరతుని బాల్యజీవితము:—

తల్లిదండ్రులులేనితనయుఁడై భరతుఁ -
డుల్లమ్మునందున నుమ్మలికమ్ము
మాని నెమ్మదినుండ, మత్సరబుద్ధి
పూని సవతితల్లిపుత్రు లాతనిని 200
వేదపురాణాదివిద్యలఁ జదువ -
రాదని, గేహకర్మలఁ జేయుమంచు
నియమింప, వానినన్నింటి నాతండు
ప్రియములేకున్నను విధియని సేయు
మందుఁడ! బధిర! ఉన్మత్తుఁడా! యనుచు
గొంద అజ్ఞానులు గూడి వేర్వేరఁ
దనుఁ బిల్వ వారలతలఁపులు నిజము -
లన, వానికిం దగునట్లు వర్తించు; -
నెవ రెట్టియాదేశ మిచ్చినఁగాని
నవరించు వారికర్జముల భృత్యుఁడుగ
వారిడునన్నమ్ము వరమొ, గదమ్ముఁ -
గూరుచునట్టిదో గుర్తింపఁ డతఁడు
ప్రాప్తమైనట్టిదే పరమాన్నమనుచుఁ
దృప్తిఁ సాపడు గాని తెలియఁడు రుచులు;

అతఁడు నిత్యానంద మాత్మలో నొంది
యితరలౌకికముల నిచ్చగింపండు
సుఖము దుఃఖమ్మనుచొ ప్పెఱుఁగండు
సఖులు వైరులునను జాడఁ దాఁ బోడు
మానావమానసంబంధముల్ దెలియఁ -
డూనఁడు శీతవాతోష్ణకష్టములు 210
మలినాంబరముఁ దాల్చు మంటిఁ బఱండు
కలఁగడు జందెమ్ము కడుమాయుచున్నఁ
దనవారు పెరవారు తన కొగిరముగ
కనికారమును మాని కడుమాడినదియొ
పులిసినచలిదియొ, పొట్టున్నకూడొ
తెలికపిండియొ తౌడొ తినుమని పెట్ట, -
నమృతమ్ముగా నెంచి యారగించుచును
బ్రమదమ్ము నొందు నాభరతుఁడు మఱియుఁ
దనసోదరులయాజ్ఞ తల వహియించి
చనుచుండు కాపుండనసిపొలమ్ములకు;

## పొలముకాపరిగనున్న భరతుని వృత్తాంతము :-

ఆరీతి నొక్కనాఁ డాబాలయోగి
చేరియుండెను పంటచేనికాపరిగ;
గిరుడవాహన యెట్టిఘనయోగియైన
నిరసించఁగలఁడె పన్నినకర్మఫలము ;

భరతయోగీంద్రుఁడు వసియించుభువిని
పరిపాలనమొనర్చు ప్రభువగువృషలుఁ -
డరయ సంతానార్థమై కాళి కర్థి
నరబలి యీయ మనమ్మునఁ దలఁచి

యానతి యొసఁగ భృత్యజనాళి యొక్క -
మానవుఁ గొనిరాగ, మార్గమధ్యమున 220
వాఁ డేమఱచి చనె; వాని నారాత్రి
వీడక వెదకి యాభృత్యజనమ్ము
కానలేక పొలమ్ముఁ గాచుచుమండు
జ్ఞానియౌ భరతు నాశక్తికి బలిగ
నిచ్చుట మేలని యెంచి యాతనిని
దెచ్చిరఁ గొనిపోయి చేర్చి రాలయము.

ఆకాళికాదేవియాలయమ్మందు
భీకరాకారు లాభృత్యులు విప్ర -
యోగియౌ భరతున కొగి మజ్జనమ్ము
సాగించి, క్రొత్తవస్త్రముఁ గట్టనిచ్చి,
చందన మలఁది, పూసరులను జుట్టి,
పొందిక నన్నంబు భుజియింపఁబెట్టి,
వివిధపూజాద్రవ్యవితతిఁ జేకూర్చి,
యవిరత వాద్యమహాధ్వనితోడ
నార్చుచుఁ గొనిపోయి యాదేవిముందు
కూర్చుండఁబెట్టిరి ఘోరంపుఁబనికి; -
నంతట వృషలరా జానంద మొంది
"సంతసపఱతు నీశక్తిని కాళి
నరపశురక్తమ్మునన" యని లేచి
కఱకుఖడ్గము కాళికామంత్రయుతము - 230
నగుదాని నొండు చేనమరచి హింస
తెగువఁ జేయంగఁ దాఁ దివుర నాక్షణమ
సకలభూతములకు సఖుఁడు నిర్వైరి
యకలుషబ్రహ్మతేజోభిరాముండు

భవదీయభక్తుఁడౌ భరతునిఁ గాంచి
మిపుల భయంబంది మేన్వడకంగఁ
గనలునఁ గాళి హుంకారమ్ముచేసి
కనులెఱ్ఱనయి నిప్పుకల రాల్చుచుండ
పాపులు దుష్టస్వభావులు సజ్జ -
నాపచారులు నరహత్యావినోదు -
లైనరాజభటుల నవనిపు వృషలు -
నూనినకోపాగ్ని యుజ్జ్వల మగుట,
తలలన్ని నఱికి సాధ్వపరీతి నామె
ప్రలయభీకరతాండవముఁ జేయఁదొడఁగె ;

భక్తజనావన పద్మాక్ష, శ్రీశ
భక్తులహృదయాలఁ బాయ వెప్పుడును
గాన, నీభక్తుల కహితమ్ముఁ గూర్పఁ
బూన రుత్తములు సంపూజ్యచరిత్ర
పూనిన వారలే పొందుదురయ్య
ప్రాణభీత్యాదిసర్వానర్థములను ; 240

బలికని తనుఁగొనివచ్చినభటులు,
బలిగొన నుత్సాహపడుచున్నకాళి,
బలినిడి శుభములఁ బడనెంచురాజు,
బలినిఖండించెడి పనిముట్టు కత్తి,
మొదలగురూపముల్ పొడగట్టినపుడు
మది నిన్నెఁ గనుచుండుమహిమాత్ముఁ డగుట
భరతయోగీంద్రుఁ డాపలురూపులందు
నిరుపమ చారిత్ర నీరజనాభ
నీభావమే యుంచి నీదురూపమ్మె
శోభాయుతమ్ముఁ దాఁ జూచుచుండె ;

తదనంతరంబ యాతత్త్వార్థవేది
మొదటిరీతిని పంటపొలమునఁ జేరి
కావలికాయుచు గరుడతురంగ
యేవికారములేక యెలమితో నుండె;
గోవింద నీదుభక్తులు భౌతికముగ
నేవిధమగుబాధ లేర్పడఁగాని
యవి మేనికేగాని యాత్మకుఁగాని —
వపుట యేమాత్రమ్ము నందరు చింత;

## భరతుఁడు పొలముకాపరిగ నున్నపుడు మరియొకవిశేషము:-

భరతునిపొలముకాపరిజీవితమ్ము -
తటి నొకనాడు సత్వగుణియౌ సింధు - 250
వరజనపదనరపతి రహూగణుఁడు
పరమార్థతత్త్వమ్ము బాగుగా నెఱుఁగ
దలఁచి కపిలయోగి దర్శింపఁగదలె;
నలువగుపల్లకిం దగఁ గూరుచుండి
నడుత్రోవలోన నందలమువాహకులు
జడమతివలెఁ దమస్వాంతమ్ములకును
దోఁచుచుఁ బొలముఁ గాచుచునున్న భరత -
వాచంయమిని విప్రవరుఁ గాంచి, యతనిఁ
గొనివచ్చి భూపతి కూర్చుండియున్న -
ఘనమగుపల్యంకికాదండ మొండు
పొనర నాతత్త్వజ్ఞుమూపురమందు
నునిచి మోయించుచు నుల్లాసపడుచు
నడపింప, నాయోగి నడచుచునుండె -
నెడఁదఁ గుందక శక్తి కేలోటులేక

ఆందోళికావహనాదికృత్యముల —
కెందు నబ్బెస మించుకేనియు లేని -
యోగి మోయుచునుండ నొడుదొడుకులుగ
సాగుచుండెను రాజుచనుచున్నశిబిక ;
ఆయసమగతిప్రయాణమ్ము తనదు —
కాయమ్మునకు బాధ గలిగింపఁ రాజు 260
శిభికావహుల కనె "చెప్పంగవలయు
సబబు నే నడుగుప్రశ్నకు మీర లిపుడు ;
ఇంతదనుక గమన మెలమిఁ బేర్చెడిని
వింతగా నిప్పుడు విసుఁగు గూర్చెడిని ;"
అనవుడు బెస్త లాయవనీశుతోడ -
ననిరి "మహారాజ! యవు నిట్టి విషమ —
గమన మేర్పడియె నాల్గవవాఁడు వీఁడు
క్రమముగా నడువనేరనికారణమున
నీతనియుద్ది మా కెట్టును చెట్ట
మాతప్పు గాదిది మన్నింపు దేవ!
వీనితో నడువ మా కెవ్విధి పొసఁగు
వీనిచెయ్దియె కూర్చె వింతగా విసుఁగు"

## రహూగణుఁడు భరతుని తూలనాడుట :—

ఆపల్కులను విని యారాజు తాను
పాపవర్జితజనోపాసకుఁడయ్యు
బలవద్విరోధోత్థకోపము నాఁపలేక
కలఁక నొందుట బావిఁగనుసూహలేక
నివురుగప్పినయట్టినిప్పువిధాన
నవరైన బ్రహ్మతేజము గుఱుతింప —

రానియట్టుఁడు నాబ్రాహ్మణుఁ గఠిన-
హీనదురుక్తుల నిట్లు గద్దించె; 270

"అలసితే, వృద్ధువే, ఆఁకట జాల
సొలసితే, దేహమ్ము సొంపదె, మిగుల
బడుగువాఁడవె, చాల భారమా శిబిక,
కడుదూరవహనమా కష్టమా నీకు"
అని హేళనముగూడ నామాటలందుఁ
గనఁబడు రీతిఁ బల్కఁగ వానినెల్ల
మనమున నెంచక మౌనమ్ము విడక
తనకడపటిదగుతనువుపై మమత
పూనక, పల్లకి మోయుచునుండె
జ్ఞాని భరతుఁడు సజ్జనలోకనుతుఁడు;
తరువాతఁ గూడ నందల మొడుదుడుకు-
లరయఁ దోపించుచు నరుగుచుసుండ-
నారాజు కుపితుఁడై యాయోగిఁ గాంచి
"ఓరి! దుర్మద! వినుమో నడపీన్గ!
నాయాజ్ఞ తప్పించి నడచుచున్నావు
నీయమార్గమ్ము లన్నిఁటి నణఁగించి
నయమార్గమున నిన్ను నడపింతుఁ జూడు
భయము భక్తియులేనివర్తన తగదు"
అని తమోగుణపూర్ణుఁడై యవినీతిఁ-
దనుఁ దూలనాడు భూధవుఁ జూచి శాంత- 280
శమదమాదిగుణప్రశస్తుఁడై సర్వ-
సముఁడయి బ్రహ్మతేజమున వెల్గొందు-
భరతుండు యోగి సద్వర్తనాధిక్య-
పరయనిరాజుతో నసియె నీరీతి

## భరతుండు రహూగణునకు చేసిన హితోపదేశము :—

నరనాథ! నీ వచనములు సత్యములు
బరువు మేనికె, నాకుఁ బరికింప లేదు ;
బలము, కార్శ్యమో, రోగబాధయో, ముదమొ,
కలనొ, సుస్నేహమో, కష్టమొ, సుఖమొ,
జననమో. మరణమో సర్వానుభూతు -
లనుసరణముగ దేహముతోడఁ బుట్టుఁ
గాని, యట్టివి నాకుఁ గలుగ వెన్నఁటికిఁ
బూన నాయనుభవములపైన బుద్ధి ;
జీవన్మృతుఁడవని చెప్పితి నన్ను
జీవమ్ము మృతి లేనిజీవి యెవ్వండు
అందఱయందు నాద్యంతముల్ గలవు
చెందవు నన్ను నాజీవమృత్యువులు
తరతమభావముల్ తనువుకేగాని
పరికింప నాత్మ కేపట్టున లేవు
రాజు నే ననెడిదుర్మానమ్ము గలిగి
తేజుతో నన్ను నాదేశింపఁదలఁతె
నీగుణ మద్ది పోనిమ్ము, నావలన
కాఁగల కార్యంబు కలదె విన్పింపు ; -
మనవీశ ! స్తబ్దమూకాంధభావముల -
నవిరతంబుగఁ దాల్చి యజ్ఞానివోలెఁ
దిరిగెడునేను పొందెడునీదుశిక్ష
కరము వ్యర్థము గాని కాంచదు ఫలము ;"
అని యిట్లు పలికి యాయవధూత తనదు -
మునుపటికర్మమ్ము పొరయించినట్టి -
వహనతదుఃస్థితిఫలముగా శిబిక

## రహూగణుని పశ్చాత్తాపము :—

పాపనిర్మూలతత్త్వజ్ఞాన మెఱిఁగి
తాపత్రయాదిబాధ లణంచఁ గోరి
చనునరపతి, తనసంశయచ్ఛేద -
మొనరించునవియును యోగశాస్త్రార్థ -
సమ్మతములును ప్రశస్తమ్ములైన -
యమ్మునియమృతోక్తు లాలించి శిబిక
దిగి భరతుని చుట్టుఁదిరిగి సాష్టాంగ -
ముగ వందనమ్ములు పొనరఁ గావించి
నిలిచి, కరమ్ములు నిటలమం దునిచి
తొలఁగినగర్వమ్ముతో నిట్టులనియె ; 300

“ఆర్య! మహాత్మ! నిన్నరయఁగలేక,
మర్యాద విడిచి, భూమండలాధిపతి -
ననుగర్వమునఁ దూలనాడితి ; నన్నుఁ
గినిసి దోషముల లెక్కింపకుమయ్య ;
భవదీయవచనశ్రవణమహిమమున -
నవలేపమంతయు నణఁగె నాలోన ;
ధరదేవుఁడని నిన్నుఁ దలఁచితి నీవు
తిరిగెదు సన్న్యాసితీరునవేల ?
ననుఁ గృతార్థునిఁ జేయ నా కెదురైన -
ముని కపిలుఁడవేమొ, మూర్ఖుఁడనగుచు
నీయెడ సల్పితి నింద్యవర్తనము
వాయదు నిష్కృతి వడక యాయఘము
అరయ నే వెఱవను యమునిదండనకు
వెఱచెద నుత్తమవిప్రవాక్కునకు
కపిలమహాముని కడకేఁగి యతని -
కృప బ్రహ్మవిద్య మిక్కిలిభక్తిఁ బడసి

యామూలమున మోక్షమందంగనెంచు-
నామనోరథము నెన్నఁగ నీవె తీర్చి
నను ధన్యుఁజేయ వందనములతోడ
నిను వినుతింతు ననింద్యచరిత్ర ;”

ఆవినయోక్తుల కలరి యోగీంద్రుఁ -
డావసుధేశున కాత్మవిద్యార -
హస్యము లెఱిఁగించి యాత్రని పూజ -
లాస్యజనితమందహాసమ్ముచేత
నంగీకరించి, పో నాజ్ఞ యొసంగి
సంగరహితవృత్తిఁ జరియించుచుండె ;

భరతుండు క్షత్రియవంశానఁ బుట్టి
ధరనేలుచున్నట్టితరుణానఁగాని -
హరిణపోతమును ప్రేమానుబంధమున
పరిరక్షణము సేయుపట్టునఁగాని,
హరిణమై పుట్టి స్వయంకృతదోష -
మరసి చింతించెడునప్పుడుగాని,
ద్విజజన్మమున నవివేకి వీఁడనఁగఁ
బ్రజలచేఁ బలుపాట్లు పడువేళఁగాని,
సిరిపతీ నీనామచింతన మెపుడు
మరువలే దాధ్యానమహిమమ్ము వలన
నీనిరుపమఁ కృపానియతి నిబొంది
తాను జీవన్ముక్తధన్యతఁ గాంచె -

భరతయోగీంద్రునిభవ్యచరిత్ర -
మరసి పొగడజాల రమరులేయైన ;
ఇవ్వసుంధరలోన నీయోగిచరిత -
మెవ్వరు సెప్పిన నెవ్వరు వినిన -

యనుకీర్తి వహియించె నారాజు ; నీదు -
ననితరమహిమ మేమనవచ్చు దేవ
నీకృపామహిమచే నెగడినవారు
లోకపూజ్యులు ; బుధలోకసంస్తుత్య
భవదీయకరుణకుఁ బాత్రుఁగా నన్నుఁ
సవరించి యేలుమా సర్వశరణ్య. 340

## నవవర్షములు - ఆరాధ్యదైవములు :-

సర్వప్రపంచప్రజాప్రేమమునను
సర్వశుభంబుల సమకూర్పనెంచి
సర్వభూభాగవర్షముల నెంచెనఁగ
వేర్వేరురూపాల వెలయుదు వీవు
ఆరూపముల భక్తులర్చించి నీదు -
కారుణ్యమహిమసౌఖ్యములఁ జేకొంద్రు :
నవవిభజనపరిణతి ప్రపంచమ్ము
నవవర్షములుగ నెన్నఁబడుచునుండు ;
పరఁగనిలావృతవర్షమ్మునందు
పరమేశ్వరాకృతిఁ బడసి వెలుగుదువు :
భద్రాశ్వవర్షభూభాగమ్మునందు
భద్రహయగ్రీవపరదైవ మగుదు :
హరివర్షభూభాగమందునఁ బ్రజలు
నరహరిరూపమ్మునను గొల్చుచుంద్రు :
వరకేతుమాలాఖ్యవర్షమ్మునందు
వరలుదు కామదేవస్వామిపేర ;
మచ్ఛరూపమున రమ్యకవర్షభూమి
నిచ్చుచుందువు సిరు లెచ్చుగాఁ బ్రజకు

వర హిరణ్మయవర్ష వసుధఁ గూర్మాఖ్యఁ
బరఁగు దైవముగాఁగ వెలయుదు వీవు; 350
కురువర్షభూమిఁ బ్రకృతి సేవ గొనఁగ -
వరయ వరాహదేవాఖ్య వెల్గుదువు;
ఆరయఁ గింపురుషాఖ్యవర్షమున
శ్రీరామచంద్రాఖ్యఁ జెలువొందుచుందు;
భారతవర్షాన బదరికావనిని
నారాయణాభిధానమున నుండుదువు;

ఇన్నిభూభాగాల నిన్నిరూపముల
కన్నులపండువుగా భక్తతతికి
దరిసెనభాగ్యంబుఁ దగఁ గూర్చి వారి -
పరిచర్యలం గొని ప్రమదమ్మునొందు -
భవదీయకరుణాప్రభావంబుఁ బొగడ -
నవునె సామాన్యుల కఖిలలోకేశ;
కావున నానుతి కడుస్వల్పమంచు
భావింప కధము నన్బాలింపుమయ్య
నీపాదములె నాకు నీరజనాభ
ప్రాపన్య మటుఁగ శ్రీపతి వాసుదేవ.

అనంతు (శేషు)ని ప్రభావము :-

ఏదేవుసంకల్ప మీసర్వజగతి
ప్రాదుర్భవస్థితిప్రళయకారణము,
ఏవిభుతలఁపున నెందు జగాల
భావింప త్రిగుణముల్ పరగుచునుండు 360
ఏపరమేశు ననేకరూపములు
ప్రాపయి జగముల పరిరక్ష సేయు

ఏదివ్యనామమ్ము లెఱిఁగి చింతింపఁ-
గా దూరమౌచుండు కలుషసంచయము
అట్టియనంతుని నయ్యాదిశేషు
నట్టిసంకర్షణు నతిదివ్యరూపు
భవదీయ నిస్తులపరమాంశభవుని
ప్రవిమలతత్త్వంబు భావింపనౌనే;

ఆ యనంతాఖ్యశేషావతారమ్ము
పాయక పాతాళవసుధ నెవ్వేళఁ
బెక్కుయోజనముల విరివిగా వాల-
మక్కజమ్ముగఁ జుట్టి, యచ్యుతా నీదు-
నుగ్రమైనశరీర మొనరఁ దా నగుచు
నిగ్రహాశక్తిమై నిజభోగ మందు;
ధరణినంతయును రత్నమువోలె దాల్చి
భరియించుచుండు శశ్వత్ప్రభతోడ;
నాయనంతస్వామి యఖిలలోకముల
మాయింపఁగోరి భీమక్రోధబుద్ధి
విదళితారుల రౌద్రవిస్తృతమతుల
పదునొకండ్రను రుద్రవరుల సృజించు;
నారుద్రమూర్తు లయ్యాదిశేషునకు
సారశిరోరత్నసంచయదీప్తి
నీరాజనంబుల నిచ్చుచెవ్వేళఁ
గోరి సేవింతురు గురుతరభక్తి
మరి నాగకన్యలు మహనీయరూప-
గరిమతో వచ్చి సంకర్షణుఁబ్రేమ
కుంకుమగంధసంకుమదసమ్మిళిత-
పంకమ్ముచే మేను బాగుగ నలఁది

పూవులఁబూజించి పూవిలుకాని -
భావముల్ వెలయంగ బంధురమైన -
చిరునవ్వు లొలయంగఁ జేయుదు రెలమి;
పరిచర్య లానందభరితాత్మ లగుచు -
నారుద్రమూర్తుల యర్చనల్, నాగ -
నారీమణులసేవ లరసి యాశేషుఁ -
డానందమున మున్గి యాక్రోశ ముడిగి
మౌనులు సురలాదిమాన్యజనమ్ము
లోకకల్యాణప్రలుబ్ధులై చేయు -
ప్రాకటనుతులకుఁ బరితోషమంది
సరససంగీతరసమ్మునుగ్రోలి
యరమోడ్పుఁగన్నుల నానందమొంది 380
పరివారజనుల నాప్యాయనదృష్టి -
నరసి సంరక్షించు, నామోదభరిత -
వనమాల ధరియించు, వరనీలవస్త్ర;
మును దాల్చి శ్రీ హలమ్మును చేతఁబట్టు -
నీతఁడు హరుఁడొ, భూమీంద్రుఁడో యనుచు
నాతతముగఁ బ్రజలందఱు వొగడ
వెలయుచు, మోక్ష మపేక్షించుప్రజల -
కెలమి మహానంద మిచ్చుచునుండు;

ఆ రీతి లోకత్రయమ్ముఁ గాపాడు -
కోరిక సాత్త్వికగుణభావమొంది
పెక్కుగతుల లోకవితతికి శ్రేయ -
మక్కజంబుగఁ గూర్చునయ్యాదిశేషు -
నాకస్మికమ్ముగనైన నాపదల -
నాకులపాటొందు నపుడదేయెన.

స్మరియించినం జాలు సకలదుఃఖములు
పరిహారమగు సర్వభద్రముల్ గలుగు;
ఆవిభుభోగమ్ములందున భూమి
భావింప నణుమాత్రఁ బరఁగుచునుండు
నారాయణా! నీయనంతరూపమ్ము -
నేరీతి నే భజియింపంగవలెనో
ఆరీతి నాకబ్బునట్లు మన్నింపు
శ్రీ రమణీలోల శ్రితజనపాల.

ఇది పంచమస్కంధ ద్వితీయాశ్వాసము



# షష్ఠస్కంధము

**అజామిళోపాఖ్యానము :-**

శ్రీ సచ్చిదానంద జేజే ముకుంద
వాసవార్చిత దివ్యపాదారవింద
నీనామ మొకండు ధ్యానించినఁజాలు
మానవుఁ డేయిడుమయుఁ బడఁబోఁడు
దురితవితతినుండి తొలఁగగలండు
పరమపావనముక్తిఁ బడయఁగలండు
ఆసన్నమృత్యువునైన జయించి
వాసిగా నీభక్తవరుఁడు కాఁగలఁడు

మునుపు కన్యాకుబ్జపురమున నొక్కఁ -
డనయుఁ డజామిళుఁడను బ్రాహ్మణుండు
గలఁడు; వాఁ డమితదుష్కార్యాభిరతుఁడు
కులమున కపకీర్తిఁ గూర్చెడివాఁడు,
జూదరి, జారుఁడు, సురఁ గ్రోలువాఁడు
వేదవిద్వేషి, పాపి, దురభిమాని
వనితావిమోహియై వాఁ డొకతొత్తుఁ
దనకాత్మపత్నిగాఁ దద్ద బ్రేమించి
వరియించి సుతులను బదుగురఁ బడసి
కరము సంతృప్తితోఁ గాలంబుఁ గడపు.
చాలకాలము మోహజాలానఁ జిక్కి
బాలల లాలనపరిపోషణాది -  10
మురిపెంపుఁగార్యాలముద్దుముచ్చటలు

ఈరీతి కాలమెంతేఁ జన నతని -
శారీరదార్ఢ్యమ్ము స్వల్పమౌచుండె
వెఱులు తెల్లగనయ్యె నిండుమొగాన
వలపయ్యె ముడుతలు వంగెదేహమ్ము;
ఒడలికండలు వ్రేలుచుండె శిరమ్ము
వడకఁజొచ్చెను దృష్టిభాగ్యమ్ము తగ్గె
దంతమ్ము లూడెను దగ్గెక్కువయ్యె
కొంతగా మాటలఁ గొతుకేరుపడియె;
ముసలితనము తన్ను ముంప నాతండు
పసచెడి పడియుండె; వయసువెన్బదిని
దాఁటె; మనమ్ము భ్రాంతమ్మయ్యె; దిగులు
గాటమై, మంచిమార్గము దోఁచకుండె;

అతఁ డాత్మసంతానమందుఁ గనిష్ఠ -
సుతుని నారాయణు సుందరరూపుఁ
గనుఁగొంచు, వానిపైఁ గడుఁదమకమ్ము
మనమునఁ బెనఁగొన మాటిమాటికిని
ప్రతికార్యమునకు "నారాయణా" యంచుఁ
గుతుకమ్మతోఁ బిల్చుఁ గూరిమిఁ బెంచు - 20
ననుదినస్నానపానాదులు గూడఁ
బొనరంగ నాబాలుపొత్తునఁ జేయు -
నారీతి పుత్రమోహముఁ బెంచెఁ గాని
నేరఁడు మృత్యువు నిక్కమం చతఁడు;

## అజామిళుని మరణ వృత్తాంతము:—

ఎఱుక యావంతేని యెఱుఁగనిమూఢ -
చరితుఁడై యటు లాయజామిళుఁ డుండ,

చావు సమీపించెఁ జకితుఁడై యతఁడు
వేవిధంబుల చిత్తవృత్తి మార్పొందఁ
దలఁకిశమనమునఁ దనపుత్రుఁ దలఁచి
ప్రలపింపసాగె నారాయణా యనుచు –
నంతఁ గన్పడిరి కృతాంతునిభటులు
వింతరూపముల నావిప్రాధమునకు
వారలఁ జూచి యాబాపండు వెఱచి,
"నారాయణా! యిటు ననుఁ జేరరార
నారాయణా! యెందునను డాగితీవు
నారాయణా! యేల నాకుఁ గన్పడవు
నారాయణా రోయ నావశమగునె
నారాయణా భీతి నను ముంచెగదర
నారాయణా నీవు నామాట వినర
నారాయణా నిన్నె నమ్మితిఁగదర"
అని సుతు మఱువక నాయజామిళుఁడు
తనతనుత్యాగసందర్భమ్మునందు
నారాయణాయనునామమ్ము పెక్కు –
మారులు దీక్ష సంస్మరియించుచుండె;

## విష్ణుదూత యమదూతల సంవాదము:-

మరణించువేళ నిన్ స్మరియింప, నచటి –
సరస వర్తించునీసద్భక్తజనులు
నారాయణస్మరణము సేయువిప్రు
చేరువఁ జేరి తజ్జీవముల్ గొనెడు –
యమభటులను గాంచి యదలించి వారి
(కమదర)చరః సాగనియటు సేయ

వారలు తమ్ముడువార లెఱుఁగని
ధీరులై సత్యమ్ము దెల్పె నీరీతి

"ఎవ్వరయ్యా! మీర లిట్లు మాతోడ
జివ్వకు మొదలిడ జెలఁగుచున్నారు
మాకుఁ జిక్కినవాని మరలింపఁబూని
మీకుఁ దగదు జముమేల్మిశాసనము
నవ్వులకా? యిది న్యాయదూరమ్ము
దవ్వుగాఁ దలఁగుట ధర్మమార్గమ్ము
మీరూపముల్ చూడ మించె నాశ్చర్య-
మారయ మీరు దేవాంశజులంచు 40
మాకుఁ దోఁచెడిని; యీమణికిరీటములు
శ్రీకరసీతకౌశేయముల్, కనక-
భూషణంబులు, భూరిపుష్కరమాల్య
భూషితవక్షముల్, పురుడింపరాని-
రూపముల్ ఘనచతుర్భుజములు దివ్య-
చాపాదిశస్త్రాస్త్రచయము ధరించి
త్రిభువనరక్షాధురీణులో యనెడు-
విభవసంపత్తితో విలసిల్లుమీరు
ధర్మపరాయణతత్వమ్ము మాని
ధర్మశాసనమును దప్పింపఁదగవె!"
అన నీదుదూతలా యమకంకరులను
గని యిట్టులనిరి పంకజదళనేత్ర

"కాలునిభృత్యవర్గమె మీరు చాల
మేలయ్యె; ధర్మసామీచీన్యమెల్లఁ
గరతలామలకమ్ముగద మీకు; మాకు
వెఱిఁగింపుఁడయ్య! సుకృతదుష్కృతముల-

తీరును దండంబుతెఱఁగును; దండ్యు-
లేరో; యీ బ్రాహ్మణుం డెట్లు కృతాంతు-
దండనమును బొందఁ దగియెనో వీని
దండించుతీరెట్లొ తప్పకుండగను:
ఆవాక్యములను విని యమభటుల్ నీదు-
సేవకుల్దెలియంగఁ జెప్పి రీరీతి

వేదనిగదితముల్ విశ్వమంతయును
మోదించు సద్ధర్మములుగాఁగ నొప్పు
వేదబాహ్యములు భావింప నధర్మ-
వాదములై పుణ్యపద్ధతి దప్పు
శ్రీహరిరూపమే చెన్నొంగ వేద-
మాహరి మోదించు నామ్నాయ సరణిఁ
బ్రతిజన్మమున దేహి పాయక కర్మ-
వితతి గావించు; నావివిధకృత్యముల
సుకృతదుష్కృతముల చొప్పును బట్టి
ప్రకటితపుణ్యమో పాపమో పొందు
ఈ విధి ప్రజచేయ నెసఁగుకర్మలకు
భావింపఁ బొందెడు సాక్షులనును -
నంచితచంద్రసూర్యాదిగ్రహములు
పంచభూతమ్ములు ప్రభాతసాక్ష్యములు
మానవుల్ మాన్యకర్మము లొనరించి
మానుగ నుత్తమనారకము - [illegible]

అజామిళుని జీవిత వృత్తాంతము :-

ఇతఁడును పూర్వసుకృతములఁ బట్టి
అతిపవిత్రబ్రాహ్మణాన్వయమునందు

జనియించినాఁడు; శాస్త్రముల వేదములఁ
బొనరఁ బఠించి సద్బుద్ధి గడించి
గురువుల నతిథుల గురుభక్తిఁ గొలిచి
పరమశాంతస్వభావము నొందినాఁడు
సకలభూతములను సమబుద్ధిఁ జూచు-
నకలంకవర్తనుఁడై వెల్గినాఁడు
నిత్యనైమిత్తికనియమముల్ విడక
సత్యసంభాషణాసక్తి నేమరక
సతత సదాచారసంపత్తి నార్య-
వితతిపొగడ్తల వెలసి, సుజ్ఞాన-
మును బొందఁగా మనమ్మును ద్రిప్పుతఱిని
మునుకొని యాతని ముంచె యౌవనము;
జవ్వనమనుకల్మి సమకూరుకొలఁది-
నివ్విప్రులోఁజాల నేర్పడె మార్పు;
మదిలోన నుద్రేకమద మెక్కఁ దనకు-
నెదురులేదనహంకృతి పేరుకొనియె;
కామవికారమ్ము కాయాన మించె
మోమున చిఱునవ్వుపొలుపు విన్పించె
వాడలు స్నిగ్ధంబయ్యె నురము విప్పయ్యె;
నిడుమీసములమెలి నెఱిఁ గానయ్యె-
నీమాడ్కి నీవిప్రుఁ డెసఁగుప్రాయమున
కామినీజనలోకకాముఁడై యుండె;

అంత వసంతర్తు వరుదెంచె సృష్టి-
యంతయు నవశోభ నలరారుచుండె;
పల్లవపుష్పసంభరితమై భూజ-
వల్లీతతుల్ కనుపండువౌచుండె;

సుమసుధాస్వాదనఁ జొక్కి మత్తెక్కి
భ్రమదాళి గీతముల్ పాడుచునుండె;
మలయానిలము పుష్పమంజరీగంధ-
విలసితమై మెల్ల వీచుచునుండె;
కామినీకాముకకామానురక్తి
నేమమ్మితీరును నిందించుచుండె;
అయ్యవసరమున ననయుఁ డీబాపఁ-
డయ్యయాదేశమ్మునంది తా వనికిఁ
జని, సమిత్కుశసుమస్వాదుఫలాదు-
లను గైకొనుచు నిజాలయముఁ జేరంగ
వచ్చుచు, నొకలతాభవనమ్మునందు
విచ్చలవిడి నొకవృషలితోఁ గూడి
మరుకేళిసల్పెడుమనుజుని విటునిఁ
బరికించి చూచి, యీపాపి బ్రాహ్మణుఁడు ౮౦
ఆవృషలీసంగ మాత్మ మోదించి
పావననిజధర్మపరత నిందించి
పైతృకార్థము దానిపాలు గావించి,
శ్రుతిచర్చచేసెడుచొప్పు చాలించి,
కులసతి నొల్లక కూటవర్తనము-
నలవాటుచేసి, గృహాన వర్తించి,
బందుగుల్ రోయ నాపడఁతి యిల్ సేరి
పొందిక కాఁపురమ్మును జేయఁజొచ్చె;

మరియు నీతనియధర్మక్రియల్ వినుఁడు
దురితాత్ముఁడౌనొ కాదో మీ రెఱుఁగుఁడు
త్రోవలు గొట్టి సాధుల బాధవెట్టి
యేవేళ దీనుల వేడ్పించి తిట్టి,

సడికోర్చి గడియించు సకలమ్ముఁ దనదు -
చెడిపపాల్చేసి మచ్చిక పెంపుచేసి,
యాపడంతికి దాసుఁడై దానికృపయ
ప్రాపని మదినమ్మి వర్తించుచుండె;
చిరకాల మిట్లు దాసిని కుటుంబినిగ
మరగి తా నాకుటుంబము నిర్వహించెఁ;
బరమపాపాత్ముఁడు భ్రష్టుఁడు వీఁడు
సరిగానివీనిచేష్టలు ప్రతిమించె 90
కాన మే మీధూర్తు కాలునికడకు
పూని కొంపోవుటే ముఖ్యధర్మమ్ము;
యమదండనమున నీయనయుఁడు ధన్య -
తముఁడు గాఁగలఁడు సత్యమ్ము వల్కితిమి;

## విష్ణుదూతలు దెల్పిన భాగవతధర్మము

అటు వల్క నాపల్కు లాలించి నీదు -
భటవర్గ మాయమభటుల వారించి
భవదూర! శ్రీపతీ! పద్మాక్ష! వారి -
నవహేళనముసేయు చనిరి యీరీతి;-
“నవు నవు ధర్మశాస్త్రార్థముల్ మీకె
యవగతమైనట్టు లాడుచున్నారు
మీధర్మనైపుణి మీక్రమచర్య
సాధుబాధకమని చక్కఁదోఁచెడిని;
ఎవరు దండార్హులో యెవ్వారు గారొ
వివరింపలేనట్టివిజ్ఞులు మీరు
వినుతధర్మాధర్మవిజ్ఞత లేని -
పనులచే లోకమ్ము పాడుగాకున్నె;

తల్లిదండ్రులె సంతుఁ దపియింపఁజేయఁ
బిల్లలకగుగోడు వినువార లెవరు;
ఎఱుకగల్గినవార లెద్ది గావింత్రు
పెరవార లద్దాని విధిగ భావింత్రు;
తలపంగ పెక్కులు ధర్మమార్గమ్ము -
లలవియే యెఱుఁగ మీ కారహస్యములు
ఈతఁడు జన్మమ్ము లెన్నియో యెత్తి
పాతకజాలమ్ముఁ బాఱంగఁదోలె;
ఏపగుపూర్వసుకృతముతోఁగూడ -
నీపుట్టువునఁ దాను మృతినొందువేళ
హరిని నారాయణాయని పిల్చెఁగాన
పరిపూత మీతని భవ్యజన్మమ్మ;
హరినిఁ గీర్తించు భక్తాళిపెంపెన్న
హరిభక్తులే యర్హు లన్యులకన్న -
నరయంగ పంచమహాపాతకముల
హరియించు జూవె శ్రీహరికీర్తనములు;
శమితేంద్రియులకే నశక్యమౌ ముక్తి -
నమరుచఁగలవు శ్రీహరికీర్తనములు;
నిత్యాపవర్గసంతృప్తమోదశకు
సత్యలోకానందసౌభాగ్యమునకు
మహితబ్రహ్మత్వసంపత్సౌఖ్యమునకు
బహుకాలకృతతపఃఫలలాభమునకు
హరికీర్తనమ్ములే యగును మూలములు
హరికీర్తనమ్ముచే నలరు లోకములు;
తనపుత్రుఁ బిలిచె నీతం డందురేమొ
వినుఁడు మీసంశయ విచ్ఛిత్తికొఱకు

హరినామ మేరీతినైనఁ బల్కినను
గరుడవాహనుఁ డందుఁగలఁ డెల్లెడలను
బిడ్డపేరున హరిఁ బిలిచిననేమి?
విడ్డూరమా యది విష్ణుసంస్తుతికి -
నాటలయందున నలసటయందుఁ
బాటలపద్యాలపఠనమ్మునందు
శ్రమవేళయందు విశ్రాంతియప్పుడును
కమలాక్షుఁ దలఁచిన కలుషముల్ దొలఁగు;
ఉరగ ఘోరమృగ గ్రహోపద్రవముల
దరరోగచోరబాధామయస్థలులఁ
బరమాత్ముఁ దలఁప నావ్యథలన్ని తలఁగు
నిరయమ్ము తొలఁగు పున్నెమ్ములు గలుఁగు
హరినెఱుంగనియట్టియర్భకుఁడైన
హరిదాసవరులసఖ్యముగలాఁడైన
హరిహరీయనఁ జాలు నన్నిదోషముల
పరిహరించి శుభంబుఁ బడయంగఁగలఁడు;
నిరవద్యమై సత్యనిత్యమైనట్టి
హరినామభజన మీయనఘుండు తనదు - 120
మరణాంతసమయాన మనసారఁ జేసెఁ
బరికింప నింతటిభక్తుఁ డెందుండు'';
అని నీదుదూత లాయమునిదూతలకు
పనివడి శ్రీభాగవతధర్మమెల్ల
వినిపించి మెప్పించి విప్రుని యామ్య -
ఘనపాశముక్తునిఁ గావించి రంత;
ఆకాలకింకరు లటు నీదుభటుల -
వాకుల కడ్డంబు వల్కంగలేక

పరికింప శాంతస్వభావులై మరలి
హరి! నీదుతత్త్వంబు నరసెడుకాంక్ష
హృదయాల బెరయంగి నచ్చోటు విడిచి
కదలిరి సమవర్తికడకు నందఱును;

కాలపాశవిముక్తిఁ గని సాధ్వసమ్ముఁ
జాలించి ప్రకృతిని చక్కగాఁ బొంది
సర్వమ్ముఁ బరికించి సంతోషమొంది
నిర్వికారమ్మున నీదాసవరులఁ
గని నతుల్ సేసి పల్కగ నజామిళుఁడు
మునుకొన నాతనిపూన్కి సర్వమ్ము-
నెఱిఁగి నీదాసు లదృశ్యులై నీదు-
చరణపద్మమ్ములసరసఁ జేరొ్కనిరి; 130

## అజామిళుని పశ్చాత్తాపము :-

హరి వాసుదేవ నీయనుచరభృత్య-
వరులకు యముని సేవకులకునైన
వాదముల్ వినినట్టివాఁ డజామిళుఁడు
ఖేదముల్ పాపముల్ కడముట్ట దుల్చి
యాగమశాస్త్రములందున్నవిమల-
భాగవతమహాత్వపరిణతి నెఱిఁగి
తనదుష్కృతమ్ములఁ దలఁచితలంచి
వనజాక్ష! శ్రీరమాపతి! పరమాత్మ
శరణుశరణని పశ్చాత్తాపబుద్ధి
పరిపరివిధముల పలవించెనిటుల;
"అక్కటా! నేఁజేసినట్టిపాపముల-
కెక్కడనేని నిష్కృతి గలదొక్కొ

పరమపవిత్రమౌ బ్రహ్మవంశమున
గురుగౌరవమ్మునెక్కొనుకుటుంబమున
బుట్టితిఁ; దద్వంశమున కపకీర్తి -
పట్టంబు గట్టితి; భ్రష్టుఁడనైతి;
కులమతాచారముల్ గోదారిఁ ద్రోసి
పలుగాకియనుపట్టభద్రుఁడనైతి;
కామాంధకారము కన్నులు గప్ప
భామినీలోలుపత్వమ్మున వృషలిఁ
గామించి, భోగించి కంటి బిడ్డలను;
నేమమ్ములన్నిట నిప్పువెట్టితిని;
చదువులఁ జట్రాళ్లు, శాస్త్రాల మన్ను;
గుదిగొనఁ గొట్టితిఁ గ్రూరుండనైతి;
సద్ధర్మవర్తన స్వప్నమై తోఁచె
బుద్ధి పశువు మేసె పున్నెముల్ మాసె;
తల్లిదండ్రులును సద్బంధుజనాలుఁ
దల్లడపడెడువర్తనమున మంటిఁ
గులసతినెత్తిపైఁ గొఱవితో గోఁకి
పలువలనెత్తిపై పాలువోసితిని;
కులటలఁ గూడంగ కుక్కనైమరగి
చెలికాండ్రు నిందింప శిరము వంచితిని;
ముదుకడనయ్యు నామూర్ఖంపుఁబనులు
వదల నేనాఁడు నెవ్వరు వలదన్న -
నీరీతిఁ బెక్కు దుష్కృత్యముల్ సేసి
నారకమునఁ బడు ననుఁ గరుణించి
యాపదలకుఁ బాపి యాదరమొప్పఁ
బ్రాపుగానుండి నన్ రక్షించినట్టి -

యాపుణ్యపూరుషు లరయంగ నెవరొ
యీపాపి రక్షించి యెట కేఁగినారొ; 150
నన్నటు పాశబంధముల నీడిచిన-
పెన్నుద్రగులు మహాభీకరాకృతులు
తమపూన్కి మానసత్యస్థితి యెదియొ;
గుమిఁగూడి రిపు డొక్కఁడునుఁ గానఁబడఁడె;
ననుఁ గాచినట్టిసుందరులదర్శనము
మును నేనొర్చిన పుణ్యకారణము;
ఆమహాత్ములదర్శనాధిక్యమహిమ-
మేమనవచ్చు నాహీనజన్మంబు
పావనమ్మయి పాపపరిహారమయ్యె;
దేవదేవునుతించుదీక్ష నాలోన
ప్రారంభమయ్యె నారాయణా యనుచు
పారమార్థికబుద్ధి వడసి నిశ్చలత
ధ్యానింపఁగల్గితి ధన్యుండనైతి;
మానసంబున శ్రీశుమహిమలు గంటిఁ
గాకున్న దుష్టుఁడఁ గష్టుండనైన-
నాకు నింతటిమహాజ్ఞాన మెట్లబ్బు
సంసారబంధముల్ చాలించి యింక
కంసారిభజనమ్ము గావించువాఁడ;
పంచేంద్రియమ్ముల ప్రాబల్య మణఁచి
పంచాయుధుని మది భావించువాఁడ; 160
మోహమ్ము, భ్రాంతియు, మూర్ఖత విడిచి
శ్రీహరి నెప్పుడుఁ జింతించువాఁడ
జూదవాదమ్ముల చొప్పెల్ల రోసి
శ్రీదయితునకు జేజేల్ చేయువాఁడ";

## అజామిళుఁడు ముక్తినొందుట:-

అవి యిట్లు బ్రాహ్మణుఁ డతిభక్తిమార్గ-
మున భవబంధముల్ మొదలంటఁ ద్రెంపి,
గంగాస్రవంతిచెంగటఁ జేరి యచట-
నంగవిజృంభణ మణఁచి నెమ్మదిగ,
దేహేంద్రియాదులతెరువులు మూసి
యైహికసుఖముల యభిరతి రోసి,
మదిఁ జక్కనిలిపి సమాధిఁ గూర్చుండి
పదిలమ్ముఁగూర్చుశ్రీపరమాత్మయందుఁ
జెదరక తనయాత్మఁ జేరిచి, ముదిమి
యొదవి జర్జరితమై యుండెడుకర్మ-
కాయమ్ముఁ ద్యజియించి, కడుపుణ్యమైన-
కాయమ్ము ధరియించి, కట్టెదురగుచుఁ
దనముందునున్ననీ దాసులఁ గాంచి
వినుతించి దండముల్ వెలయ నర్పించి
భవదీయదాసరూపమ్మును దాల్చి.
ప్రవిమలసౌవర్ణరత్నాంచితమ్ము
నీమాన్యకింకరానీతమ్మునైన -
వ్యోమయానము నెక్కి యుత్సాహమంది
వైకుంఠమునఁ జేరి వనజాక్ష! నిన్ను
ప్రాకటభక్తిసంపదలఁ గొల్చుచుండె;

## యమ, యమదూతల సంవాదము:-

ఘననీలనిభగాత్ర, కంజాతనేత్ర
అనుపమచారిత్ర, ఆగమస్తోత్ర

జముని దర్శించి ప్రశ్రయమున భటులు
సముచితముగ నమస్కారముల్ చేసి
వా రజామిళు పాశబద్ధుఁ గావించి
తేరనుంకించి పొందినపాటులన్ని
వివరించి, "పితృపతీ! విశ్వమ్మునందు
భవదాజ్ఞ కన్యమ్ము పరికింపఁ గలదె
దండధరుఁడ వీవు దండింతు జగతి
దండింపఁ దక్కొరుల్ ధరణి నున్నారె;
మాధర్మవిధులను మాన్పించినట్టి
యాధీరు లెవరు? మా కవగత మెట్లు?
దండనధర్మమంతయు మేము చెప్ప
ఖండించి రద్దాని కడుఁజులకనగ
వార లెవ్వరొ, ధర్మపద్ధతి యెదియొ,
వేరము మాధర్మనిర్వహణమునఁ 180
జేరెనొకో యిఁకఁ చేయంగఁదగిన
తీరెట్టిదియొ మాకుఁ దెలియఁజెప్పంగఁ
గోరెద" మని సేవకులు విన్నవింప,
శ్రీరమానాథ! పరేతవిభుండు
నీపాదకమలముల్ నెమ్మది నిల్పి
యేపారుభక్తితో నెఱఁగి, యామీఁదఁ
దనదుకింకరులు ఖేదము మాసి, మోద-
మును పూని, నీ తత్త్వము నెఱుంగునట్లు
భాగవతరహస్యపద్ధతులెల్లఁ
బాగుగ నిట్లు పెంపార బోధించె;
"ఏనుఁడు కింకరులు, శ్రీవిష్ణుమహిమ
లనుపమానములు మహావిస్మయములు

దిగధీశులైనను దేవతలైన
నగజాధిపతియైన నలువయేయైన
నామహాత్మునిలీల లరయంగలేరు
సామాన్యుల కవి గోచరములెట్లగును
పుట్టుట పెరుగుట పొలియుటయినెడి
కట్టడగల యీజగత్ప్రవృత్తి -
కాతండెకారణ, మజభవాదు -
లాతనిప్రతినిధు లంతమాత్రమ్మె.
పంచభూతములు నాపరమేశునాజ్ఞ -
మించి దాటవు తమమేరలెన్నటికి
నావిభు నాత్మమాయామగ్నమగుచు
నీవిష్టపత్రయ మ్మెంతయు నడచు
నదియవైష్ణవమాయయనఁనొప్పు దాని
వదలినవార లెవ్వారును లేరు
ఆ మాయలోఁబడి యవని నెల్లరును
కామాది వైరివర్గమునకుఁ జిక్కి
మంచిచెడ్డలబుద్ది మఱచి నిశ్శంక
సంచరింతురు దుష్టచర్యలఁబెరఁగి
హరిభక్తు లట్టిమాయకు లోనుఁగాక
పరమునే తమమది భావించుచుంద్రు
హరిదాసవరులు సత్త్వాశ్రయబుద్ధిఁ
బరమభాగవతాఖ్యఁ బరగుచునుంద్రు
భాగవతుల్ భగవంతుఁ దలంతు
భాగవతులఁజూచు భగవంతుఁడెపుడు
ఆయజామిళు మరణాంతమ్మునందు
మీగవిత్త ... [illegible]

నిర్వహణమ్ము మాన్పించి భాగవత
నిర్వచనమ్ము పొందికఁ దెల్పినట్టి 200
వారె నారాయణ పారిపార్శ్వకులు
మీరు ధన్యులరుసుమీ వారిఁగనుట
హరిపేరుపిలుచుట నాయజామిళుఁడు
పరమభాగవతసంభావ్యుఁడై యొప్పె
నెఱిఁగితిరిగద మీరీనాఁటికైన
పరమ వైష్ణవభాగవత మహిమంబు.
గాన భాగవతులకడకు మీరేగ
బూనకుఁడయ్య యెప్పుడు నెందువేని
హరినిఁదలంపని, హరిఁగూర్చివినని
పరమపాపులఁబట్టి బంధించితెండు
పరిహాసమునకైన పద్మాక్షుపేరు
పరగఁబల్కనియట్టి వదరుపోతులను
కలనైన హరిపాదకమలద్వయమ్ముఁ
దిలకింపనట్టి దుర్దృగ్వినోదులను
నగవులకైన శ్రీనాథువినంగఁ
దగులమొందని దుష్కథాప్రపణులను
యాత్రలనైన శ్రీహరిగుడిత్రోవ
పాత్రమంచని నడువని దుష్పథులను
భాగవత శ్రేష్ఠపాదరజమ్ము 210
యోగిజన స్తుతియోగ్య తీర్థముల
సారమంచు దెలియఁజాలని వారి
వారినిగూడెడివారిని వారి
వారలఁదెండు సేవకులారమీరు

వారె నాదండనపడయ నర్హులరు
మరియొకముఖ్యధర్మము మీరువినుఁడు

మరువక యాధర్మమర్యాదఁజనుఁడు
పరమాత్ముపైఁగల భక్తి యోగమ్మె
యురుపుణ్యదము, ముక్తియోగమ్మటంచు
మూలతత్వమెఱుంగు పుణ్యపురుషుల
జోలి మీకుపలదుసుమి, వారివారి
వారిఁగూడిన వారి పలనుకే మీరు -
పోరాదు కట్టడపోయిదిమీకు ''
అనితెల్ప నదిసుత యమరాజభటులు
చనరు వైష్ణవభక్తజనుల చక్కటికి
వైష్ణవజన మహత్వం బిట్టిదంచు
జిష్ణువేయైవను చెప్పఁజాలండు.

నారాయణా నీదునామమ్ము భక్తిఁ
గోరిభజింపఁజేకురు భుక్తిముక్తి
నీనామము జపించునిష్ఠ నాకొసఁగి
నానేరములవెల్ల నాశమ్మొనర్చి
నను నీదుభక్తబృందములోనఁజేర్చి
మనుపవే శ్రీరమామహిళాధినాథ
భక్తజనుల కొంగు బంగారమీవు
ముక్తిప్రదాతవు ముచికుందవరద
వారిదనిభగాత్ర వరమునిస్తోత్ర
వారిధిగంభీర, వరమేరుధీర

ఫలశ్రుతి :-

ఈయజామిళవిప్రు యితిహాసమెవఁడు
పాయనిభక్తితో పఠియించు వినను
వాఁడు పాపవిముక్తి వడసి, యామీఁద
[illegible]

ఘటుల చూపులకుఁ దోఁపని రూపుతోడ
వటపత్రశాయి! నిర్వాణసంపదకు
నెలవైన భవదీయనిలయమ్మునందు
తులలేని తృప్తినొందుచు హాయిఁబొందు
సకలలోకశరణ్య, జగదేకమాన్య
అకలంకచారిత్ర అబ్జాతనేత్ర

## ఇంద్ర వృత్రాసురుల వృత్తాంతము :–

### ఇంద్రుఁడు గురుతిరస్కృతిచే పదభ్రష్టుఁడగుట :-

హరి, వాసుదేవ, దయాసింధు, శౌరి,
పరమపావన, జగత్పతి, భవహారి,
గురురూపమే బ్రహ్మ. గురుఁడె విష్ణుండు
గురుఁడె శివుండు సద్గురుఁడె బ్రహ్మంబు 230
గురుని మాహాత్మ్యంబు గుర్తింపలేక
పొరపడి యిడుమలువడయు దృప్తుండు

### ఇంద్రుని గురుతిరస్కారము :-

ఒకనాఁడు దేవేంద్రుఁ డుత్సాహ మొప్ప
ప్రకటితైశ్వర్యగర్వమ్ము మిన్నంద
సకలామరగణంబు, సన్మునిబృంద
మకలంకబుద్ధి తన్ననుసరింపంగ
సురవారకాంతల సొఁగునాట్యములు
వరములౌ గంధర్వవారగానములు
తనరుచునుండ, సుధర్మాలయమున
ఘనకాంతిసముదయ కలితమైనట్టి

విమల చింతామణిపీఠమ్మునందు
సుమహిత వైభవశోభఁగొల్వుండి
తనయూరుపీఠి నాత్మసతిని శచిని
గొనబుసొంపు రహింపఁ గూర్చుండఁజేసి
యనలేని రాజసమాఢ్యవైభవము
తానరంగనుండె సభ్యులు గొల్చుచుండ

ఆయవసరమున నచటికివచ్చె
నాయజభవసము దుస్సహతేజుఁ
డమరగురుండు బృహస్పతి తాంటి
శ్రమమువఁదనదుధర్మము నిర్వహింప

ఆచార్యరాక నాయమరవిభుండు
చూచెవేగాని, విస్ఫురితసామ్రాజ్య—
మదరేఖ నవివేకమతి గద్దెనుండి—
కదలఁడు. లేవఁడు, కట్టెదురేగి
సాగిలపడి నమస్కారముల్ చేసి
స్వాగతమునిపల్కఁ డాసనమీఁడు
మరియాదచేసెడు మాటకేపోఁడు
నరపభాషణలఁ బ్రసన్నునిజేయఁ
డావిధంబున నమర్యాదగావించె
దేవతాగురునకు దేవవిభుండు
ఆవిపరీతచర్యలఁ జేసినట్టి
దేవేంద్రు గర్వంబుతీరును ధైర్య
భావంబెఱింగి గీష్పతి తనలోన
కేవల నిజమనఃఖేదమ్ముమ్రింగి
సందడిచేయ కాసభనుండి తనదు
మందిరమ్మునకు వెమ్మది జారుకొనియె

దక్కిన దేవబృందముగూడ గురువి
దిక్కైనఁజూడ దాదిన మేమికతము!

అంతట వాసవుఁ డా కొల్వుకూట
మంతయుఁజూచుచు, నమరగురుండు 250
ఆసభలేకుంట నరసి,యంతకును
దోసమూలము తన దుష్కృత్యమనుచు
నెఱిఁగి వెఱఁగు వెఱ నెనసి యీరీతి
గురుహేళనమ్మునుగూర్చి చింతించె

## ఇంద్రునిపశ్చాత్తాపము :-

అక్కటా! అస్మదీయాచార్యునెడల
నెక్కువమదమున నెంతటితప్పు
గావించితిని వివేకము దూరదృష్టి
భావమ్ములేని దుర్వర్తనహాని
యాచార్యవర్యుల కవమతిఁగూర్చు
నీచుల కశుభముల్ నెలకొనకున్నె
ప్రభుపదపీభాగ్య వర్ధిష్ణులైన
ప్రభువులెవ్వరికి లేవవలదం చార్య -
జనులు పల్కుదు; రది సత్యదూరమ్ము
మనుగడఁ జెడుగుగా మార్చుమార్గమ్ము
కాన మద్గురుని నికాయమ్ముఁజేరి
యా నిర్మలచరిత్రు నడుగుఁదామరల -
దోయిపై శిరమునిస్తులభక్తిఁజేర్చి,
నాయపరాధమెన్నక క్షమియించి
ననుఁబ్రోవుమనుచు విన్నపముతోఁగూడ
మునుమున్న వందనములు చేసి యతనిఁ 260

గడుఁ బ్రసన్నాత్ముగాఁ గావించువాఁడ
సడిఁ బాపికొని సంతసమునొందువాఁడ
వని యనిమిషపతి యాబృహస్పతినిఁ
గనువేడ్కఁ జనె శీఘ్రగమనమొప్పార

శతమన్యురాక గీష్పతి తా నెఱింగి
యతివిచిత్రమ్మగు నధ్యాత్మమాయఁ
బొంది యదృశ్యుఁడై పోయె నాతఱిని
బృందారకవిభుండు వేవేగవచ్చె
వచ్చియచట బృహస్పతిఁ గానలేక
యచ్చెరువంది నిజాత్మఁ జింతించి,
తనదు ప్రయత్నమంతయు వ్యర్థమగుట
పెను పరాభవమున వేఁగుచు మరలె

## అసురులదాడి, అమరులయోటమి :—

అమరశిష్యత్వమం దాంగీరసుండు
విమతుఁడై యెందుఁ గన్పింపకుండుటయు
దేవవిభుని చింత, దిగులును బూర్వ
దేవులు వేగులు దెలుప నెఱింగి
గురుబల మమరులకుం దప్పెననుచు
పరమసంతోషమ్ము వడసి యందఱును
తమగురు శుక్రుచెంతకుఁ జని మ్రొక్కి
విమలమౌ తత్కృపావీక్షణమహిమ
నిజబలసంపద నివ్వటిల్లంగ
వజహరాదులవేని నాటంకపఱచు
నుద్ధతి నాదితేయుల పైన దాడి
క్రుద్ధులై చనిరి విరోధమ్ము వేఁడి

అసురులదాడికి నడలకసురలు
వెస మార్కొనిరి వారు వెఱనొందునట్లు
క్రుధ యిరుతెగలఁ బ్రకోపమ్మునొందె
ప్రధనమ్ము ఘోరరూపమ్మునుబొందె,
విజిగీష ధైర్యమ్ముఁ బెంచుచునుండ
త్రిజగముల్ మెచ్చ పోరిరి వారువీరు.
శుక్రోపదేశ నిస్తుల మంత్రశక్తి
విక్రమించిరి రణవీధి దానవులు
గురున కసంతృప్తిఁ గూర్చినకతన
దురమున సోలి వందురిరి దేవతలు.
చివరకు విజయమ్ముచెందె దానవుల
నవమతిముంచె నయ్యదనుదేవతల.
దితిసుత శర భిన్నదేహు లాసురలు
వెతనొంది కేశముల్ పీడంగ చెదరి
పాఱిరి పసచెడి పలుదిక్కులకును
ఘోరరణమ్మునకుం జాల బెదరి
కాలమాహాత్మ్యంబుఁ గనఁజాలరెవరు
కాలమ్మును జయించు ఘనులు లే రెవరు.

## బ్రహ్మ దేవతలకు హితముఁదెల్పుట :-

అంత నాయనిమిషులందఱుగూడి
చింతాభరాయత్త చేతస్కులగుచు,
పరమేష్ఠికడ కేగి భక్తిఁ దత్పాద —
సరసిజములకు నంజలుల నర్పించి,
తమదుస్థితిం దెల్పి, " దయజూడుమయ్య
కమలాసనా. సంరగర్ష'' యటంచు

విమలమనస్కులై వేద దేవతల
సమయసందర్భముల్ చక్కయోచించి
యనుకంప నా బ్రహ్మ యభయంబొసంగి
యనునయమ్ముగ వారికనియె నీరీతి.

“ ఓయనిమిషనాథ, ఓసురలార,
మీ యహంకారమే మిమ్మిట్లు చేసె
మొదటినుండియు మీకు బుద్ధులు వేర్పి
ముదముం గూరిచి జగమ్ముల నేలునట్లు
పట్టమ్ముం గట్టిన బ్రహ్మజ్ఞ గురుని
మట్టుమీరిన శ్రీలమహిమలం గ్రొవ్వి
గురుతింప కవమతిం గూర్చితి రద్ది
పరికింప మీదోషవర్తనగాదె? 290
మీగురుద్రోహమ్ము మిము శత్రుబారి
నీగతి బాధించె నేమందురింక
అతి బలవంతులరైనట్టి మిమ్ము
నతి బలహీనులైనట్టి రాక్షసులు
తమగురు శుక్రమంత్రబలమ్ము చేత
శ్రమలేకయే గెల్వంజాలిరి చూవె.
సత్యలోకమ్మువే సాధించునంత
ప్రత్యయమ్మునమున్న ప్రబలదైత్యులకు
స్వర్గాపహృతి తృణప్రాయమ్ము సుమ్ము
భార్గవు మంత్రసత్త్వమ్మమోఘమ్ము.
గురుమీరువడయుండు ఘోరశాత్రవుల
నురుమాడి త్రిదివమునుం బొందంగలరు.
కనుక త్వష్టకుమారుం గడుతపోనిష్ఠు
వినుత బ్రహ్మజ్ఞాను విశ్వరూపాఖ్యు

సురఁగా బడసి భక్తిఁగొల్వఁ దతండు
కొఱలేక భద్రముల్ గూర్పంగలండు.
అనిచెప్ప దేవత లావిశ్వరూపుఁ
గనఁజని యమ్ముని గాంచి యిట్లనిరి.

## ఇంద్రుఁడు విశ్వరూపుని గురునిగా స్వీకరించుట:-

అన్న! విశ్వరూప! అగునీకుశుభము
పిన్నఁడైనను జ్ఞానవృద్ధుఁడవీవు
మనపూర్వులచరిత్ర మనప్రాభవమ్ము
మనవావివరుసలు మరువకెన్నఁడును
నీకుఁ దండ్రులవాని నెగడుదు మేము
మాకును పుత్రసమానుఁడ వీవు
సుతులకుఁ బితరుల శుశ్రూషశుభము
మితిలేనిపుణ్యమ్ము మిగులుచు పథము
కాన మాయభిమతకార్యమ్ముఁ దీర్చి
నీనిర్మలయశమ్ము నిలుపంగవలయు
నిను మాకు నాచార్యునిగ వరియించి
ఘన భవదీయ ప్రకర్షప్రభావ-
సాహాయ్యమున శత్రుసంఘమ్ముగెల్వ
నూహించివచ్చితి మో మునివర్య
మాపురోహితుఁడవై మామేలుగోరి
మాపరిభవమును మాన్పింపుమయ్య.''
అని యమరులువేఁడ నావిశ్వరూపుఁ
డనునయంబుగ వారికనియె నీరీతి.

"మీమధురోక్తులు మీప్రార్థనములు
నామదికిం గడునచ్చె, మెచ్చయ్యె.

సురలార! మీరలు చూడంగ నాకు
గురుసముల్ మీవంటి గురుజనంబెల్ల 310
నాగురుత్వమ్మంది, నాశిక్షనొంది,
నాగురుమంత్ర తంత్రములెల్ల నెఱిఁగి
నామెచ్చుశిష్యులై న్యాయపథంబు
నేమాత్రమును దప్ప, కెఱుకతోనుండ
నామహాభాగ్య మంతకుమించి యన్య
మేమియునుండఁబోదిది నాకుఁదృప్తి.
మీవేఁడికోలును మీశాసనముగ
భావించి మీగురుపదవి నొందెదను
మీయభీష్టముదీర్చి మీకుముదంబు
బాయకగూర్చెద భయమేమివలదు.''
అని నిర్జరపురోధయై విశ్వరూపుఁ
డనుపమ దివ్యమాహాత్మ్యమ్ము, భద్ర
కరము, నారాయణకవచమంత్రమ్ము
పురుహూతునకు నేర్పి పొంగెదివమ్ము.

ఆదివ్యమంత్ర మాహాత్మ్యంబువలన
నాదితేయాధిపుఁ డధికతేజమ్ము
జవసత్వభాగ్యమ్ము చాలసాధించి
బవరాన దైత్యుల భంగమొందించి
త్రిభువనంబులుమెచ్చ త్రిదివసామ్రాజ్య-
మభివర్ధితంబుగనంది పెంపొందె 320
గురునాగ్రహంబునఁ గూలు సర్వమ్ము
గురు ననుగ్రహమునఁ గొఱలుశుభమ్ము.

## ఇంద్రుఁడు విశ్వరూపుని చంపుట:-

వేలుపుల పురోధ విశ్వరూపునకుఁ
జాలుగా మూఁడుశీర్షము లొప్పియుండు

ఆమూఁడుతలలతో నతఁడొగి సురయు
సోమ, మన్నము గ్రసించును; దేవపంక్తి
మరియజ్ఞభాగ మమరులతోఁగూడి
కరము ప్రత్యక్షమ్ముగాఁ గొనుచుండు
ఈ విధి గురుశిష్య లెలమితో నుండ
నావిశ్వరూపున కాత్మలోఁబొడమె
చెడుగుణంబొంత, జేజేలతోఁదాను
బడయుచుండెడి యజ్ఞభాగమ్ము సురల
కనుఁబ్రామి జననిపైఁగలప్రేమఁ గొంచుఁ
జని దైత్యవరుల వశమొనర్చుచుండె
ఆరహస్యమెఱింగి యనిమిషరాజు
ఘోరాపచారమ్ముఁ గూర్చుచున్నాఁడు
ఈతఁడు సురలకు; నేమందుననుచు
భీతియుఁ గ్రోధమ్ము పెనగొన నతని
గురుఁడు బ్రాహ్మణుఁడనిగూడ తాననక
శిరములమూడింటిఁ జెలఁగి ఛేదించె. 330

## ఇంద్రుఁడు బ్రహ్మహత్యా దోషమునకులోనగుట - తన్నివారణము -

అంత సోమమ్ముద్రావు నామునిశిరము
వింతగా 'కము' జనువిహగమై తోఁచె
సురద్రావుశిరము 'పిచ్చుక' రూపమొందె
నరగ నన్నాదశీర్షము 'తీతు'వయ్యె
ఆలీల త్రివిధములౌ ఖగాకృతులఁ
దాలిచి బ్రహ్మహత్యాఘమేతెంచి
మముఁ జేకొనుమటంచు మఘవుబాధింప
నమరనాధుఁడు త్రిలోకాధ్యక్షుఁడయ్యు

దానిఁ దప్పుకొనెడు దారి గన్పడక
మానస ములుకున మగ్నమౌచుండ
నాచండ బ్రహ్మహత్యకు వందనమ్ము
లాచరించి భరించె నతఁడొకయేఁడు

పదపడి యింద్రుండు వరుసగా భువిని,
నుదకమును, దరుల, యువతులవేఁడి
“ మద్దురితమును సమంబుగా మీర -
లొద్దిక దాల్చి నాకూఅటనిండు,
అన ధనయందునవైన ఖాతమ్ము
తనకుగాఁ బూడెడుదశను గోత్రమ్ము;
సకలమ్ము తనయందు క్షాళనమైనఁ
బ్రకట పావనదశఁ బరఁగ జలమ్ము;
నఱుకఁబడుచునున్న నాశమ్ముగాక
మరిమరి చివురించు మహిమ వృక్షములు.
ఏమియు గొఱలేక యేవేళఁ దమకు
కామసుఖంబులు గలుగ స్త్రీజనము
వరములుగా గోర వాని నింద్రుండు
సరిసరియని సంతసమ్మునవిచ్చె.

అంతట బ్రహ్మహత్యాకలుషమ్ము
నంతను నాల్గుపాళ్లమర భాగించి
ధరచౌటినేలవిధంబున; జలము
నురుగుచాడ్పునను; బొందుగవృక్షజాతి
జిగురురూపమ్మున; స్త్రీలురజమ్ము
వగ, తలకొకపాలుపంచికొనంగ,
పాపభయమ్మునుబాసి యింద్రుండు
తాపమ్ముమాని సంతసమునునుండె.

## వృత్రాసుర జననము:-

తనసుతు మరణవిధమ్మునంతయును
జనకుండు త్వష్ట విశదముగానెఱిఁగి
యమిత దుఃఖోద్ధ కోపావేశవశత
శమదమయుక్త నిజస్వభావంబు
మఱచి యింద్రునిఁగూర్చి మారణహోమ
మరిభీకరమ్మగునట్లు సాగించె 350
అందుండి ప్రళయకాలాంతకుపగిది
నెందు నెప్పుడు నెవ్వరేఁ జూడనట్టి
భీకరరూపుఁడు వృత్రుఁడనంగ
లోకము లుడుకునట్లుగఁ బుట్టెనొకఁడు.

ఆతఁ డత్యాయత, మతివిస్తృతమ్ము
నౌ తనువమర, బ్రహ్మాండమ్ము మ్రింగఁ
గలవదన మ్మగ్నికణములురాల్చు
చలిత తామ్రాక్షు, లుజ్జ్వలితదంష్ట్రలును,
గలిగి, దిశాభిత్తికలువగులంగఁ
జెలఁగి యార్చుచు, భుజస్థిత గదాదండ
ముద్దండరీతి బాహువునఁ గీలించి
దిద్దిర, ద్రిప్పుచు దిట్టమౌ పాద -
ఘట్టన భువిక్రుంగఁ గదలి యాడుచును
బెట్టుగా నెల్లెడ వీరవిహార -
మొనరించి జగముల నుద్ధతిమెఱయ
తనవశంబుగఁజేసెఁ. దనతండ్రి త్వష్ట
ఘనతపశ్శక్తిచేఁ గడుఁబుష్టినొంది
యనయుఁడావృత్రాసురాఖ్య రాక్షసుఁడు

అట్టివృత్రునిమీఁద నలిగి నిర్జరులు
దిట్టలై, మూఁకలై, తెగి, చని, వాని
ముట్టడించి వివిధ ముఖ్యాయుధముల
బెట్టిదంబుగ వేయ భీతిలక తఁడు
గట్టిగా వానిని గరములఁబట్టి
చుట్టి మ్రింగుచునార్చె సురలదరఁగ.

## ఇంద్రాది దేవతలు మహావిష్ణు శరణుజొచ్చుట :–

అట్టి మహాశూరు నాదైత్యముఖ్యు
నెట్టియెదుటనుంట కేమాత్రమేని
తేఁకువయైనను తెఱకువయైన
లేక దేవేంద్రాది లేఖబృందమ్ము
తమ్మురక్షించెడు దైవమ్ములేక
పమ్మిన భీతునఁబఱువిడుచుండె
అటులఁ బాఱినయట్టి యమరబృందమ్ము
దిటవుచెడిన తమస్థితికి మిక్కిలిగ
వగచుచు నాదైత్యవరుఁడు దుర్దముఁడు
తెగఁ దస్మదీయ విస్తృత బాహుశక్తి
మరిమరి మనల నెమ్మది నుండనీక
గుఱిసేయుచుండు నెక్కుడుగ బాధలకు
క్రూరుఁడు వీనిని గూల్చుటే శ్రేయ –
మారీతి చేయుటెట్లంచు యోచించి –
" వీని జయించెడు విధమును దెల్పి
మానమర్యాదలు మనకెల్లనిల్పి
మనల రక్షించెడు మహనీయమూర్తి
వనజాక్షుఁ డాభగవంతుఁడేయుండ
మనకేలభీతి యామాధవుఁగొల్చి
మనదుస్థితినిఁగూర్చి మనవిసేయుదము

రండని" కదలి నిర్జరబృందమెల్ల
పుండరీకనయన! మోక్షప్రదాత!
సకలజగద్రక్ష! సజ్జనపక్ష
అకలంకచరిత! దుగ్ధాంబుధిదాసి,
యచటి శ్వేతద్వీపమందున వార
లచలమనస్కులై యందఱు నీదు
పదపద్మముల దమభావమ్ములందుఁ
గుదిరించి భక్తితోఁ గొనియాడిరిట్లు

"సర్వేశ్వరా! జగత్సాక్షిస్వరూప!
సర్వాత్మకా! మాకు శరణమ్ము నీవె
జగములుసృష్టించు చతురాననుండు
దిగధీశముఖ్యులు, దేవతలైన-
యేము నీసంకల్పమెట్టులో యట్లు
నేమముదప్పక నెఱపు త్వదీయ-
భటులము, మముఁబ్రోచు భారమ్ము నీది
వటపత్రశయన కృపాగుణాభరణ 380
మానేర్పు మాతీర్పు మాప్రాభవమ్ము
నీనిరుపమదయ నీరజనాభ
ఉత్తమగురునిగా కొరు నమ్మఁగొలుచు
మత్తుల కెట్లు క్షేమము లొదఁ గూడు
వృత్రాసురుఁడు మముఁబెట్టు కష్టములు
చిత్ర మెన్నం దేరిచేఁగాని పడము
సర్వశరణ్య నీశరణమ్ము నమ్మి
గర్వాంధుఁడైన యాక్రవ్యాదు దున్మి
యాపదలను బాసి యఖిలభద్రములఁ
జేపట్టఁదలఁచి వచ్చితిమి సర్వేశ"

## మహావిష్ణువు అమరుల ననుగ్రహించుట:

అని యిట్లు ప్రార్థించు నమరులయెడల
కనికరముంచి శ్రీకమలాధినాథ
నీదివ్యమంగళనిజవిగ్రహమ్ము
నాదృతి నాసురులందఱుజూడ
దరిసెన మొసఁగితి; తద్భక్తవరుల
నరసి యీరీతి సమాదరించితివి

“సురలార! మీభక్తిసుజ్ఞానములకుఁ
గరముమెచ్చితి మీకుఁ గల్గుశుభమ్ము
నాభక్తవరులు పొందగరాని యర్థ
మీభువి నొందులే దెందుఁజూచినను. 390
ఘనుఁడు దధీచినాఁ గలఁ డొక మౌని-
జనతిలకుండు సంస్తవనీయచరితుఁ
డతఁడు మదీయ విద్యావిశేషమున
నతిసారవంతమైయలరు దేహమ్ము
తనర నున్నాడు, వదాన్యుఁ డమ్మౌని
మునువెందఱికొ సాయముంజేసినాఁడు
ఆదాతకడకేగి యర్థింపుఁ డతఁడు
కాదనకిడు నిజకాయమ్ము మీకుఁ
దత్తనుశల్యాలఁ దగ విశ్వకర్మ
యుత్తమమైన యాయుధము నిర్మించు
అది శతధారల నతిశాతమగుచు
పొదలు నాతేజమ్ము బొంది యుగ్రముగ
వాయాయుధమున వృత్రాసురుఁజంపి
శ్రేయముల్ మీరలు చెందంగఁగలరు”
అని యానతినొసంగి తబ్జదళాక్ష
మనముల నుబ్బాయమర్త్యులకబ్బె

## దధీచి త్యాగ శీలము :—

అంత బృందారకు లందఱుఁగూడి
శాంతమూర్తి దధీచి సరసనజేరి
" మునిజనోత్తమ సుఖమ్మును బొందఁగోరి
యనయమ్ము దేహి దేహమ్ము భరించు 400
దేహి యెన్నండును దేహమ్మువిడువ -
నూహింపఁబోఁడు తా నుల్లమ్ములోన
దేహమ్ముపైన నాదేహికినెంత -
మోహమో చెప్పంగఁబోల దెవ్వరికి
నటులుండ నీదేహ మడుగవచ్చితిమి.
యటులిటులనక యీవయ్యమహాత్మ!
" ఎక్కడనెవ్వరే నిట్టి కోరికను
రక్కసబుద్ధిఁ గోరరు మునుపెపుడు
అడుగరానిదియిది యని మాదుకోర్కి
కడద్రోయక యొసంగి కరుణింపుమయ్య "
అని వందనములతో నర్థించు దేవ
గణమునుగని మునిగణ్యుఁడు తనదు
స్వాంతమ్మునందు తద్వాంఛారహస్య -
మంతయు నెఱిఁగి యిట్లనియె వారలకు

" సురలార! మీరలు సుఖియింపనెంత్రు
పరబాధలెట్టివో పరికింపఁబోరు.
ఇది యేమిన్యాయమో, యెవ్వరికేని
బ్రదుకంగనెంచిన ప్రాణముల్ తీపి
భగవంతుఁడేవచ్చి ప్రార్థింప మేను
తగుననియిచ్చెడు దాతగలండె? 410

అర్థమ్ముఁగాక దేహమ్మునుగోరు
నర్థి యెవ్వండు? కాయమ్మునొసంగు
దాతయెవండు తత్తనువుఛేదించు
ఘాతకుఁడెవఁ?డందుగల యెమ్ముకలను
పంచుకొనెడునట్టి పాపాత్ముఁలెవరు?
మంచిచెడ్డలఁగని మహిమతో జగము
రక్షించునట్టి నిర్జరులకు నిట్టి
పక్షపాతగుణమ్ము భావ్యమ్ముగాదు."
అన విని దేవత లమ్మహాత్మునకుఁ
బ్రణతులొనర్చి " ఓ వరగుణసాంద్ర
కారుణ్యమూర్తి! నీమనవదాన్యతకు
నీరానిదగువస్తు వెద్దియులేదు
అడుగరానిదియిద్ది అడుగరాదంచు
నడిగెడువాఁ డెప్పుడనుకొనండాత్మ
ఇచ్చువాఁడెప్పుడు నిచ్చెడివేళ
నిచ్చుప్రాణములైన నిచ్చించువాని"
కని దైన్యమునవేఁడు నమరులఁగాంచి
కనికారముంచి యాఘనుఁడిట్టులనియె

" దివిజులారా! భవదీయవాంఛితము
వివరింప ధర్మమ్మువిడిన మార్గమ్ము 420
ఐన, జగద్రక్ష యందుగుప్తమ్ము
కాన మీకోర్కె జగద్ధితమయ్యె
లోకకల్యాణమ్ము లోనెంచి చేయు
మీకోర్కె దీర్చెడు మేలిమికన్న
నాకు నదృష్ట మన్యములేదు వినుఁడు
మీకిచ్చువాఁడ నామెయి మీరుగొనుఁడు "

అని యాదధీచి దేహమ్మువదలె
ఘనసమ్మదము దివౌకసులలోఁ బొదలె

## వజ్రాయుధనిర్మాణము:—

అంతట సురశిల్పియగు విశ్వకర్మ
వింతదోప దధీచివిడిచిన మెని
యెముకలచే సృజియించె నాయుధము
సమద విజృంభితాశర భీతిదమ్ము
అది చాలవాడియౌ యంచులు నూరు
కుదిరి వెల్గులుజిమ్మ గొప్పయాయుధము
దానికి వజ్రాఖ్యతనరె లోకమున
నూనె నింద్రుఁడు తదాయుధము హస్తమున

## ఇంద్రవృత్రాసురుల యుద్ధము:—

అట్టి మహోత్కృష్టమైన యాయుధము
దిట్టయైచేఁబట్టి దివిజనాథుండు
ఐరావతారూఢుఁడై సర్వదేవ -
వారమ్ము తనవెంటఁబడి యరుదేర 430
సకల మునిజనమ్ము సంస్తుతియింప
నకలంకమగు నీదయాపశేషమున
ప్రకట ధైర్యోపేతభావమ్ము నొంది
వికసిత వదనారవిందుఁడై దండు -
వెడలె వృత్రాసురు పీచమడంచి
పుడమికి శోభనమ్మునగూర్ప నెంచి

శత్రుఁ డింద్రుఁడు యుద్ధసన్నద్ధుఁడగుట
వృత్రుఁడెఱింగి యాశీలబలము

దనవెంటఁగొని దేవతతి వెదురొ్కనఁగఁ
జనుదెంచెఁ దనుఁగని జగములుల్కంగ
నమరసైన్యమ్మున కసురసైన్యమున
కమితభయంకరాహవ ముప్పతిల్లె
ఇంద్రవృత్రులును జయేచ్ఛామనీషఁ
గ్రందుకయ్యమ్మును గావించుచుండి
వృత్రుఁ డింద్రునిగాంచి వెక్కిరింతలకుఁ
బాత్రునిగా నిట్లువలికెఁ జుల్కవగ
అమరుల దొరవు సుంతైనవిజ్ఞాన -
మమరదే నీబుద్ధి యబ్బురమిద్ది
నాకగ్రజమ్మఁ డెన్నఁగ నీకుగురుఁడు
లోకవంద్యుఁడు నిర్మలుఁడు విశ్వరూపుఁ 440
డతనిఁ బోకార్చితి వతిక్రూరబుద్ధి
పతితుఁడవైతి ; నీప్రాణజాలముల
నాపటుశూలమ్మునన హరియించి
పాపికొనెద నాదుభ్రాతృఋణమ్ము
జరిగిన దెద్దియోజరిగె నీవింకఁ
గరము దుష్కరముగాఁ గావింపురణము
నందియమేటికి జంభారి ధైర్య
మొంది వజ్రమ్ముఁ బ్రయోగింపు మద్ది
మురహరుతేజమ్ము, మునియౌ దధీచి
వరవీర్యమునుబొంది వరలుచున్నయది
నీవును శ్రీహరినియమ మొందితివి
భావింప నాదేవుపక్షమే జయము
అనలినాక్షుని నాత్మలోవెంచి
పూనితి నీతోడ పోరుసేయంగఁ

గానిమ్ము భిదురమ్ముగైకొమ్ము నన్ను
మానకమోదుము, మగటిమి గనుము.
అనివృత్రుఁ డాగ్రహాయత్తచిత్తమున
మునుకొని దుమికె నాపురుహూతుపైన
నామహావీరద్వయానీకమందు
స్థేమాభిరాముఁడై త్రిదశారి తనదు 450
భీమశూలమున నావిబుధేంద్రువైన
నేమాత్రమును జంకకింద్రుఁడాక్షణమ
తన వజ్రహతి వృత్రదానవు శూల-
మున్ద్రుంచి మరి వానిబుజమొండు నఱికె.
వృత్రుఁడత్యుగ్రుఁడై యేకహస్తమున
చిత్రమ్ముగా నొక్కశ్రేష్ఠాయుధమ్ముఁ
గొని యింద్రుహనువుమగొట్టి యేనుంగు
పెనుముందలనుబాఁది భిన్నమొనర్చె
నామహాసంగ్రామ మాభీలమగుట
నేమరుపాటున నింద్రువజ్రమ్ము
చేజాఱిపడియె నాసిగ్గుచే శక్రుఁ
డాజన్యభూమిఁ దానవమతి వలనఁ
దలవాల్చి నిలుచుండ దానవవీరుఁ
డలవోకగాఁ జూచి యతనికిట్లనియె.

## వృత్రునిధర్మగుణము :-

"ఆయుధహీనుపై నరివీరులెవరుఁ
జేయెత్త రేటికి చెందెదు భీతి
కులిశమ్ముఁజేఁబట్టి కూల్చుము వెర్రిఁ
గలఁతనొందుట కిది కాలమ్ముగాదు
అంతయు లక్ష్మీశు నాదేశమనుచు
స్వాంతమం దెంచుమా స్వర్గాధినాథ 460

అరయ జయాపజయమ్ములమాట
హరినిర్ణయమ్మని యరయు మింకైన
నొక్కకరమ్మ నాయుధములేకున్న
నక్కుచెడక నీదు నూపిరిదీయ
నిలుచున్న నను(గని నీజంకుమాని
కలను నాతో(జేయ(గద(గుమావజ్రి."
అనవు(డు శతమన్యు(డావృత్రు తత్వ-
మును బాగుగనెఱింగి, ముదమంది యతని
దైవమ్ముగానెంచి తన కుత్సితంపు
బావమ్ముమాని సద్భావమ్మునూని
దంభోళి(జే(దాల్చి దైత్యేంద్రుతోడ
దంభంబుమాని తథ్యముగనిట్లనియె
"ఓ దానవేంద్ర! నీయుత్తమతత్వ
మాదిత్యులకు(గూడ నబ్బురమయ్యె
హరికి, నజ్ఞాన్ఘున, కాద్యున కీవు
పరమభక్తు(డవౌట బాగుగ(దెలిసె
నెట్టితపమ్ము నీవెటులొనర్చితివొ
యిట్టి సాత్వికగుణ మెన(గె నీలోన
నింతటి సౌమ్యు(డ, వీక్రూరరూప-
మెంతయు(దగదు; వీవీరూపుమాని 470
పురుషోత్తముని రూపు పొలువుగన్పడెడి
పరమ భాగవతరూపమ్ము ధరింపు"

## వృత్రాసురవధ :-

మను నమునయభాషలాడెడి నింద్రు(
గను(గొని వృత్రు(డు కదనోత్సుకమ్ము
తమరే(ప, నామహస్తమ్మున(బరిఘ(
గొని యింద్రు(గొట్ట(గా( గోపించియత(డు

కులిశాయుధమున నాక్రూరాయుధమ్ము
నలినలిచేసి, దానవుసవ్యహస్త –
మిలఁబడ ఖండించె హెచ్చురోషమునఁ
గలఁతనెఱ్ఱొక్కనియె రక్కసబలగమున
నంత హస్తవిహీనుఁ డారాక్షసుండు
వింతగా ఱెక్కలువిరిగిన కొండ –
తెఱఁగునఁ గన్పడి తీవ్రకోపమున
ధరనుండి విష్ణుపదమ్ముఁదాకంగఁ
జెఱిగి విజృంభించి భీకరరీతి
నురుగర్జగావించి యుద్ధతి మెఱసి
వికృతమ్ముగా నోరువిప్పి యేనుంగుఁ,
బ్రకటవజ్రమ్మును బలభేదితోడ
చుట్టగా నాల్కతోఁజుట్టి దేవతలు
బిట్టులుకగా నొక్కవిడుతనె మ్రింగె. 480
నాపుణ్యజను గర్భమందున శక్రుఁ
డేపీడయునుబొంద కిమ్ముగానుండె
భక్తవత్సల నీదుపాదముల్ గొల్చు
ముక్తపాపులకేల ముప్పువాటిల్లు ?
ప్రముఖమంత్రమ్ము నారాయణకవచ
మమరేంద్రురక్షణకయ్యె మూలమ్ము
పరమేశ ! నీనామభజనఫలమ్ము
దురితవిదూరమ్ము దుఃఖనాశమ్ము
అంతట నీదు మహామంత్రయోగ
మెంతయుఁబొంది దేవేంద్రుండు వృత్రు.
నుదరమ్ము వజ్రాన నుద్ధతిఁజీల్చి
కుదురుగా నందుండి కుంభియుఁ దాను

పెలువడి యాతని భీమోత్తమాంగ
మిలఁబడఁ బవిధార వెసఁగ ఖండించె
నాదానవుఁడుగూల నఖిలజగమ్ము
మోదమందెను ప్రాణములు దక్కెనంచు
నాసురవైరి కాయమునుండి యొక్క
భాసురతేజమ్ము ప్రభవించి వచ్చి
శ్రీరమానాథ నీస్థిరనివాసమ్ముఁ
జేరి నీలోఁజొచ్చె జేజేలుమెచ్చ 490

## బ్రహ్మహత్య ఇంద్రుని బట్టుట :-

అంతట వృత్రహత్యాదోష మొక్క
యింతిరూపున నింద్రువెదుటఁ గన్పడియె
అది జాతిమాలెత యతివృద్ధ, కుష్ఠ
గదమును, వ్రణపూతిగంధమ్ము గలది
యగుచు వగుచుఁ గదునత్తరపడుచు
నగవైరివెన్నంటి "నమవీడనౌనె!
నాగుణంబులనెల్ల వాకలోకేశ!
భోగింప కెట్టులుఁబోవ నీకగును
అనెడు దానింగని యతిభీతినొంది
కనుమఱుఁగగు చోటుఁగానక వజ్రి
పరుగిడుచుండ నాపడఁతియు వెంటఁ
బరువులెత్తగ భువి బయలునఁగాని
దాఁగ మార్గములేక తరలి యీశాన్య -
భాగమ్ముఁజేరి యాప్రాంతమందున్న
మానససరసి నెమ్మది బ్రవేశించి
దాన కమలనాళతంతులఁగలసి

పాపమ్ము తొలఁగు నుపాయమ్ములేక
పాప మతఁడు వేయివత్సరాలుండె.
నది పరమేశ్వరునాశ యట్లగుట
ముదియ చండాలి యాపాంతఁబోకుండె 500
ధర్మమర్మజ్ఞు లుదాత్తులేయైన
కర్మఫలమ్మును కడ్రతోయలేరు
కర్మఫలమ్మును కర్తకుఁగూర్చ్చి
నిర్మలమూర్తివి నీవు సర్వేశ

## నహుషుఁడుగర్వితుఁడై పతితుఁడగుట :-

ఆలీల మఱుఁగయి యమరేంద్రుఁడుండు
కాలమ్మునందు స్వర్గము నహుషుండు
పాలించుచుండి సంపద్గర్వమెక్కి
బాలిశుఁడై శచి భార్యగాఁ గోరి
బ్రహ్మర్షివాహ్యమౌ పల్లకినెక్కి
బ్రాహ్మణమెల్లఁ బాపమ్మంచుఁ దిట్టి
మునియగస్త్యుఁడు కోపమునశాపమీయఁ
బెనుపాముగాఁబుట్టి పృథివియందుండె.
అధికారగర్వమ్ము హాని గల్గించు
అధమదశనుగూర్చు యశముమాయించు

## ఇంద్రుఁడు స్వర్గాధిపత్యమును బొందుట :-

వాసవుఁడారీతిఁ బద్మనాళమున
గాసిఁబడుచుడాగి కాలమ్ముద్రోయు -
సమయమ్మునందు విశ్వంభర! నీదు
విమల సారస పాదవినుతి వేమరక

భావమ్మునను నిల్పి భక్తిని విడక
గావించుచుండిన కారణమ్మునను, 510
తద్దిశాధిపతి భూతపతి శంకరుఁడు
తద్దయుఁగూర్మితోఁ దనుఁబ్రోచినట్టి
హేతువువలనను, వృత్రసంహార
పాతకతతి పటాపంచలుగాఁగ
నందుండి వెలువడి ఆదిత్యమౌని –
బృందమ్ము తను పరివేష్టింప దివికిఁ
జనుదెంచి త్రిభువనైశ్వర్యభోగమ్ము
లనుపమ వైభవమమర స్వర్లోక -
రాజ్యాధిపత్యమ్ము ప్రాభవమొప్ప
పూజ్యభావమ్మునఁ బొంది సుఖించె.
అమరేంద్రసంరక్ష ! అసురవిపక్ష !
కమలదళాక్ష ! జగత్క్షేమదీక్ష !
నీ నిత్యలీల లనింద్యముల్ సర్వ –
మానవాదర్శ సమ్మాన్య బోధనలు
శతమఖుఁడైశ్వర్య సమదచిత్తమున
నతిలోకమాన్య బృహస్పతినట్లు
ధిక్కృతిగావించి దివినుండి తొలఁగె;
రక్కసి రాయిడి భ్రాంతిచేఁ గుమిలి.
గురు విశ్వరూపునిఁగూల్చి తద్దోష -
పరిహారమునకుఁ దాఁ బలుపాట్లుపడియె 520
నాఁగక వృత్రసంహారపాపమ్ము
మూఁగ భీతిలి శివుమూలకు నేగి
మానస సరసిఁ బద్మమ్ము నాళమున
తానొక్కఁడతఁగుఁడై తలఁదాఁచుకొనియెఁ

గాని నారాయణ కవచమంత్రమ్ముఁ
బూనిక ధ్యానమ్ము పొనరించి, సర్వ
పాపవిముక్తిని బడసి స్వర్గమ్ముఁ
జేపట్టి ప్రాభవ శ్రీ చెలువొందె
అతిమదాంధుఁడు నహుషాఖ్యుఁ డజ్ఞాన –
మతిశచిఁగోరి, బ్రాహ్మణ్యమ్ముఁ దిట్టి
పతితుఁడై యజగరఫణియయి బువిని
గతిలేకపడి యెట్లుఁ గదలక యుండె.

దేవదేవ! మహాత్మ! దీన సంరక్ష
భావింపఁజాల నీ భావముల్ స్వామి
నను నవగుణము లెన్నడుఁ జెందనీక
మనుపుమా గుణిగాఁగ మంచి మార్గమున
దాసరక్షణమె నీ దాల్చిన బిరుదు
దాసుఁడ నన్ఁబ్రోవఁ దలఁచు మోదేవ!

**ఫలశ్రుతి: -**

ఈ సచ్చరిత్రమ్ము నెవఁడు నిత్యమ్ము
వ్రాసినఁ జదివిన భక్తితో విన్న 530
నాయురారోగ్య దివ్యైశ్వర్య ఫలము
శ్రేయమౌ సద్గతిఁ జెంది సుఖించు.

**చిత్రకేతూపాఖ్యానము :**

(వృత్రాసురుని పూర్వజన్మ వృత్తాంతము)

శ్రీ రమారమణ! హరీ! నిర్వికల్ప
వారిజభవ సేవ్య పాదారవింద
వనమాలి! నీభక్తవరులు శాంతమ్మె
ఘనభూషణమ్మంద్రు కలఁగరెన్నండుఁ

దమ కకారణముగఁ దారొ్కన్న కష్ట –
సముదయమ్ములనేని సహనమ్ముతోడ
భరియించుతురేగాని, పరుల కేకీడుఁ
బొరయింపఁబూనరు పుండరీకాక్ష !
ఆభక్తతతి త్వదీయాదర మహిమ
నీ భవ్యసన్నిధి వెలకొనుచుంద్రు.

చిత్రకేతుఁడు :

మును శూరసేన భూములయందుఁ గలఁడు
ఘనుఁడు విద్యాధరగణములఁబెద్ద
చిత్రకేత్వాఖ్యభాసిల్లుచు నతఁడు
ధాత్రిని బాలించు ధర్మమార్గమున
నతఁడతిపుణ్యాత్ముఁ డమరేంద్రసముఁడు
వితరణఖని ప్రజావినుతయశస్వి
యాసార్వభౌమున కతిరూపవతులు
వాసివన్నెయుఁగల వరకులసతులు 540
గలరు పెక్కండ్రిట్టి ఘనవైభవమ్ము
గలిగియు నొకకొఱ గన్పించుచుండె
స్వాంతమ్ము నానందభరితమ్ముసేయు
సంతతిసంపద సమకూరనట్టి
యానృపోత్తము చింత నన్యసంపదలు
మానుపకుండె నేమాత్రమ్ముఁగాని.

అంగిరసుఁడు చిత్రకేతునకు సంతానభాగ్యము గల్గించుట:

సంతులేని కొఱంత స్వాంతమ్మువేఁపఁ
జింతిల్లు నారాజుచెంతకు మౌని

అంగిరసుఁడు వచ్చి యాచిత్రకేతుఁ
డంగముప్పొంగ సముంచితభక్తిఁ
గావించినట్టి సత్కారముల్ వొంది
భూవిభుతోఁ బ్రేమ పాదల నిట్లనియె.
"నృపచంద్ర! రాజ్యమ్ము ఋజువర్తనమ్ము
నపనయింపదు గదా! హాయిగాఁ బ్రజలు
బ్రదుకుదురే! నీదు ప్రాభవమునకుఁ
గొదలేదుగద; యిట్టి గుఱివైభవముల
వెలకొన్నవాఁడవు, నీ మోమునందుఁ
దిలకింప దైన్యమ్ము తెల్లమై తోఁచె
హేతువెద్దియొ తెల్పవే" యన రాజు
"ఓ తాపసేంద్ర నీ యురుతపశ్శక్తి 550
కెఱుఁగ రానిది గలదే" యని తనదు
కొఱఁత నతఁడు దెల్పుకొన కూరకుండె.

ఆ రాజుడెందమ్ము నందలి వగకు
కారణమ్ము నెఱింగి మునిఁ డంగిరసుఁడు
కరుణాళుఁడై పుత్రకామేష్టి వేల్చి
వరయజ్ఞశేష మా వసుధేశ నగ్ర -
సతి కృతద్యుతికిచ్చి "చానరో నీకు
సుతుఁ డుదయించు, నా సుతుని మూలమున
నానందశోకమ్ములగు" నంచుఁ దెల్పి
మౌనీంద్రుఁ డతఁడు సమ్మానించి చనియె.
అంతఁబట్టపు రాణియగు కృతద్యుతికి
స్వాంతముప్పొంగ గర్భము వెలకొనియె
గర్భమునిండ, నా కాంతకు నొక్క
యర్భకుండుదయించె నందముప్పొంగఁ

బుత్రోత్సవంబు నపూర్వంబుగాగ
చిత్రకేతుఁడు సల్పి చెందె మోదమ్ము.

జననీజనకు లాప్తజాలముప్పొంగ
ననుదిన మభివృద్ధి నందు తనూజు
నెడ మోహముం బెంచి, యెక్కుడు ప్రీతి
పడఁతి కృతద్యుతిపైఁ జూపుచుండి 560
తక్కనిల్లాండ్రపై దాక్షిణ్యబుద్ధి
యొక్కింతయేఁ జూపకుండె నారాజు

## చిత్రకేతు పుత్రుని మరణము :

పతియనాదృతిఁ గడు పగఁజెందు సతులు
సుతుపైని ప్రేమ రాజును మార్చెనంచు
వానిఁ జంపిన మేలు వరలునటంచుఁ
బూనిన యీర్ష్య నా పాలతు లందఱును
విసముఁద్రావించి రా బిడ్డచే దాన
ననువులువాసె నా యర్భకుఁ డంతఁ
దనయుని మృతివార్త దాది చెప్పంగ
విని కృతద్యుతి పసవిడిపోయి చూచి
పుడమినిల్వనఁబడి పొరలుచు కురరి –
డువున బెగ్గిలి వాపోవుచుండె.
నారోదన ధ్వని నాలించి పుత్రుఁ
జేరి విభుండు మించిన శోకమందు
మునిఁగి బాలునిమోము మోమునఁ జేర్చి
వనరుచు నుండె ప్రపంచమ్ము మఱచి

## నారదాంగిరసులు చిత్రకేతునోదార్చుట :—

అతిశోకమున నున్న నా చిత్రకేతు
వెతఁ దొలఁగింప భావించి యంగిరస
మునిరాజు నారదముని వెంటఁగొంచుఁ
జనుఁదెంచి మృతపుత్రు చరణ సమీప — 570
మునఁబడి పీనుంగు పోలికనున్న
మనుజేశుతోడ నిమ్మాడిక ననియె.

"ఓ రాజ! చిత్రకేతూ! ఈ విధాన
నారాటమొందంగనౌనె దుఃఖానఁ
బుత్రశోకాబ్ధివి మునిఁగియున్నావు
చిత్రమన్యమ్ము యోచింపకున్నావు.
వీఁడు నీ కెవ్వండు? వీనికి నీకు
వీడని మైత్రి భావింపనెన్నటిది?
గతజన్మమున మీకుఁ గలదె సంబంధ —
మితఁ డెవ్వఁడగునొ, నీ వెవఁడవో చెపుమ
ఋణమును బట్టి యీ సృష్టి సంధించు
ఋణము దీరంగ వేర్వేరౌనరించు,
భూతములకు భూతములపైని మమత
యేతటి మాయగా నెఱుఁగు మోరాజ!
కావున మోహమ్ముఁగడ ద్రోసి విష్ణు —
దేవు గోవిందు హృద్వీధిని నిల్పి
యకలంక మగుమతి నానందమొంది
ప్రకట కైవల్యమ్ముఁ బడయంగరాదె."
అమ్మాటలను విని యారాజులేచి
యమ్మునీశ్వరులతో ననియెనీరీతి 580

"యతివేషములుపూని యరుదెంచినట్టి
యతిపుణ్యతములు మీరరయనెవ్వారొ
నాపశుత్వము మాన్పి, నాలోన జ్ఞాన –
దీపమ్ము వెలిగింప దివినుండిదిగిన
దేవతలో లేక దేవాంశభవులొ
భావింప మునిలోకవరులొ వేవెఱఁగ
మీతత్త్వబోధనామృతపానవశత
నాతుచ్ఛమోహమంతయు ననుఁబాసె
నింతటి ఘనులు మీరెవ్వరో నాదు
స్వాంత ముప్పొంగఁగా వచియింపుడయ్య!

అనిన నంగిరసుఁ డాయవనీశతోడ
ననె "నేను పుత్రభాగ్యము నీకునిడిన
ముని నంగిరసుఁడ, నీ పూజ్యయోగీంద్రుఁ
డితఁడు నారదుఁ డమరతపస్వి
సుతుచావునకుఁ గుడు స్రుక్కుచున్న
యతిమోహమతిని నిన్నరసి నీయందు
కరుణించి నీకున్న కళఁకనుదులిపి
పరమమౌ జ్ఞానమ్ము బాగుగఁ దెలుప
వచ్చితి, మీక్రియ వసరంగ నీకు
వచ్చెడిదేమి మా పల్కులు వినుము 590
జగతి సతీసుతుల్ సకలబాంధవులు
నెగడుచుండెడు భాగ్యనిచయముల్ రాజ్య –
భోగముల్, వైభవములును కామాది –
రాగకాంక్షలును సర్వము లనిత్యములు
మరియు జీవికి నవి మాననిదుఃఖ –
కరములేయగు సుఖకరములుగావు.

కావున నిహముపైఁగల భ్రాంతిమాని
శ్రీవాసుదేవుని స్థిరమానసమున
సేవించి మోక్షమ్ము చేపట్టి నీవు
భావింపుమయ్య తత్ఫలసిద్ధికొఱకు"
అని బోధగావించె నంత నారదుఁడు
కనికరమున రాజుఁగాంచి యిట్లనియె.

"ఓ మనుజేంద్ర! నేనొక్కమంత్రమ్ము
ధీమహితుఁడ! నీకుఁ దెల్పెద; దాని
నేడురాత్రులు పఠియించినఁ జాలుఁ
జూడఁగల్గుదు జగత్కర్తను శ్రీశ
సంకర్షణుని కాన; జగదేకరక్షు
పంకజనేత్రు నాభగవంతుఁ గొలిచి
యుత్తమ పదవి నీవొందుటశ్రేయ
మిత్తిరు దుఃఖింప నేమిలాభమ్ము? 600
ఇక్కుమారునకు నీకెందేని పొత్తు
నిక్కమేమో దాని నిజము గన్గొనుము"
అని దేవమౌని యా యర్భకు శవముఁ
గని, "జీవుఁడా! నీకు, గలిగెడు మేలు
ఇందుఁ బ్రవేశించి యీ తలిదండ్రు
లొందిన దుఃఖమ్ము నూడఁగఁజేసి
వార లానందమ్ము నెడయుఁగఁ బెరిగి
భూరి రాజ్యవిభూతిఁ బొందగదయ్య".

అనఁగ నబ్బాలుఁ డిట్లనియె "మౌనీంద్ర
విను కర్మవశమున వేర్వేర దేవ -
నరతిర్యగాది నానాయోనులందు
పరిపరిరూపాల ప్రభవించు నాకు

వీర లేజన్మలఁ బితరులైనారొ
నారదమౌనిచంద్రా! దెల్పుమయ్య
ఇట్టి వ్యామోహమ్ములెల్లను మాని
పట్టుగా తనుఁదాను బాగుగనెఱిఁగి
పరమాత్ముఁ గొలుచుటే భద్రమం" చెఱుక
పారయించు వేదాంత ముఖ్యభావములు
పరగంగఁ దెల్పి యా భవ్యజీవాత్మ
యరిగె నెచ్చటికొ వారరుదరుదనఁగఁ. 610

పుత్ర దివ్యజ్ఞాన బోధన మహిమ
చిత్రకేతుఁడుఁ దన సీమంతినులును
శోకమోహములవిస్ఫురణ నణంచి
యాకుమారునికి నంత్యక్రియలెల్ల
యమునానదీతీరమందునఁ జరిపి
విమలమానసమున వేగంబ వచ్చి
నారదమునికి వందనములర్పింప
కారుణ్యబుద్ధి శ్రీ కమలాక్ష నీదు
నారాయణాఖ్యమంత్రమ్ము నతండు
పారాయణము సేయు పద్ధతితోడ
సాంగమ్ముగాఁదెల్పి స్వస్తివచించి
యంగిరసునితోడ నంతఁదానరిగె

## చిత్రకేతుఁడు జ్ఞానియై సకల లోకములు దిరుగుట:-

దేవర్షి నారదు దివ్యోపదేశ
మావంతయును దప్ప కతినిష్ఠతోడ
నారాయణాఖ్య మంత్రముఁ జిత్రకేతుఁ
డారయ సప్తరాత్రాంతమ్ము భక్తి

నర్చించి విద్యాధరాధి పత్యంబుఁ
బేర్చిన మహిమల వెలయు రథంబు
గరుడ వాహన! భవత్కరుణఁ దాఁ బొంది
తిఱుగుచుండె నతండు త్రిజగమ్ములందు 620
కడలిశయన నీదు కారుణ్యమున్న
పడయంగరానట్టి భద్రముల్ గలవె

## చిత్రకేతునకు సంకర్షణస్వామి దర్శనము, అనుగ్రహము :-

ఆలాగతండు నీ యనుకంప మహిమ
లీలమై త్రిజగముల్ దిరిగెడు వేళ
సిత శరీరమ్ము నసిత వసనమ్ము
తత లనత్కాంతియుక్త విభూషణములు
సురుచిర కర్బురశ్రోణి సూత్రములు
కరము శుభ్రచ్ఛాయగల జన్నిదములు
పరమ ప్రసన్నమౌ వక్త్రాంబుజములు
తరుణవివృత్త సుందర నయనమ్ము
లొప్పార, సిద్ధ గణోపచారముల
మెప్పుగాఁ గొనుచు నంప్రీతితోనుండు
భవదీయ లావణ్య వదపద్మపీఠ —
మవు పన్నగస్వామి నా చిత్రకేతుఁ
డొక్కెడగాంచి నిజోరుపాపముల
యుక్కడగిచి, మహోత్సాహమొంది
యాయనంతస్వామి కతిభక్తితోడఁ
బాయక జోత లప్పనము గావించి
వేదాంతవేద్య! ఆ విద్యాధరుండు
మోదాన నమ్మహాత్ముని నిటుపొగడె. 630

"ఓ యనంతస్వామి, ఓ పన్నగేంద్ర
నీయురు మహిమ నెన్నినవారు లేరు
ఏవాని బ్రహ్మాదు లెక్కుడు భక్తి —
సేవించి సంతసస్థితి నొందుచుందు
రేవాని శిరమున నీ మహిచక్ర
మావగింజయొ నాగ యల్పమై తోఁచు
నట్టి సహస్రశీర్షానంతు నిన్ను
నిట్టి వాఁడనుచు వర్ణింపఁ జాలుదువె!
ఆదిపూరుషుని దివ్యాంశజన్మించి
వేద మయాత్మక విభవానమించి
సకలంబునకు నీవసాక్షివై యొప్పి
యకలంక మాహాత్మ్య మమరియుండుదువు
ఈ జగన్నాటక మెన్నంగ నీదు
పూజితలీల యో పుణ్యస్వరూప!
నిను స్తుతియింపఁగా నేర నోదేవ,
మనుపుమా నన్ను సన్మార్గంబు దెలిపి"
అని పెక్కువిధుల విద్యాధరనేత
వినుతింప పన్నగ విభుఁ డిట్టులనియె

"చిత్రకేతూ! నీ విశిష్ట వర్తనము
పాత్రమ్ము సుజన సంభావ్య సంపదకు 640
నారదాంగీరసుల్ నయవచనములఁ
దీరుగా తత్త్వమ్ముఁ దెలిపిరి నీకు
దాన నీ కబ్బె నా దర్శన నియతి
మానితమగు నాదు మహిమపై విరతి
నీ స్తోత్ర పద్ధతి నెమ్మినిఁ గూర్చె
నస్తోక మహిమ నీ కగుఁగాక యిట్టి

నిర్మల మార్గంబు నెట్టక ముక్త —
కర్ముఁడవై ముక్తిఁ గనుమయ్య" యంచు
నీరీతిఁ దెలిపి యదృశ్యమైపోయె
నారాయణా! నీ యనంతరూపమ్ము
ఆదిశేషుఁ డనంతుఁ డవ్యయమూర్తి
యేదిక్కునందు నదృశ్యుఁడై పోయె
ఆదిక్కుఁ గాంచి జోహారు లర్పించి
మోదపూరిత చిత్తమున చిత్రకేతుఁ
డరదమారోహించి యాకాశవీధి
సురలు మునులు తన్ను స్తుతియించుచుండఁ
దిరుగుచు పెక్కులౌ దివ్యస్థలములు
దరిసించు చమితసంతసమున నుండె

## చిత్రకేతుఁడు గౌరిచే శపింపఁబడుట :

అటు చిత్రకేతుఁ డత్యద్భుతశక్తిఁ
బటు మహిమాత్తసంపద భువనముల 650
హాళిమైఁ దిరుగుచు నభవువాసమ్ము
కైలాసగోత్రమ్ము ఖలనిరస్తమ్ముఁ
జేరి యానందమ్ముఁజెంది కట్టెదుట
గౌరీప్రియుని కొల్వుఁగాంచె నబ్రముగ

అది ప్రమథాదితేయాది సంసేవ్య
మది మౌనిసంస్తుత్య మందుండి వెడలు
నాది పూరుమని మాహాత్మ్యంబుఁ దెలియ
వేదాంతులు పఠించు వేదరవమ్ము
మము దయఁజూడు మమానాథయనుచు
నమరులు సేయు సంప్రార్థనారవము

అనఘ శివస్తోత్ర మానందమగుటఁ
బ్రణతు లర్పించెడి ప్రమథులరవము
మంగళకర వాద్యమయముగాఁ జేయు
భృంగి నాట్యోద్భూత విస్ఫారరవము
చామరమ్ములఁ గడుసద్భక్తివీఁచు
కామినీజన కరకంకణరవము
మెండయి హర్షమ్ము మివులఁ గూర్పఁగ
ఖండపరశుకొల్వు కనువందువయ్యె
ఇంతటిపరిపూత, మింతటివిభవ
మింతటి మాహాత్మ్యమెనయు తత్సభను 660
ఊరుపీఠంబున నున్న భవానిఁ
గూరిమిఁ గౌఁగిట గ్రుచ్చియున్నట్టి
పరమేశ్వరుం గాంచి పకపకనవ్వి
గిరిసుతవిన చిత్రకేతుఁ డిట్లనియె

"ఎంత విచిత్ర మీ దృశ్యమ్ముచూడ
నుంతధర్మమ్మేని చూపట్టదీడ.
ధర్మరూపుఁడు జగత్త్రాత గురుండు
కర్మవిరక్తుఁ డీషునుఁడు శంకరుఁడు
పరమయోగీంద్రులు బ్రహ్మవాదులును
సురలున్న యీసదస్సున లజ్జవిడిచి
మిథునరూపంబున మెలఁతతోఁగూడి
పృథులానురాగసంతృప్తినున్నాఁడు
ప్రాకృతుల్ దమతమ పడఁతులతోడ
నేకాంతమున నుండుటెంతయుధర్మ
మీలాగు సత్సంగమెనయుచోటులను
స్త్రీలతో ముచ్చటల్ సేయుచుందురె"

అనవిని యీశ్వరుఁ డతని నేమనక,
కినుకవహింపక కిలకిలనవ్వె
శ్రీభవానీనాథు చిత్తమ్ములోన
నేభావమున్నదో యెవ్వరికెఱుక 670
ఆనిండుసభనున్న ఆర్యులుగూడ
మౌనమ్మునూనిరి మఱుమాటలేక
తనదు జితేంద్రియత్వము కారణముగ
పొనరిన గర్వాన భుజగవిభూషు
నాక్షేపమొనరించు నాతని గౌరి -
వీక్షించి యందఱువిన నిట్టులనియె

"మాకులేదటలజ్జ మముదిద్దువేర్పు.
తేఁకువగలయట్టి దిట్టఁట వీఁడు
భృగునారదాది మునీశ్వరులేని
నిగమవేద్యులు యోగనిపుణులేగాని
త్రిగుణములకతీతు త్రినయనుఁగూర్చి
నగరు, వారెఱుఁగరో న్యాయమార్గమ్ము
సకలలోకారాధ్య, సర్వేశు నీశు
వెకలియై నిందించె వీఁడు ఖలుండు
ఈ దురహంకారి యిందిరానాథు
పాదసేవార్హుఁ డెప్పటికిని గాఁడు
కాన "నీమూర్ఖుఁడీకారణమ్మునన
మానుపరాని కల్మషరూపమైన
యసురయోనిజనించు" నని శపియించి
కసిమాని, "యిఁకనైన గర్వమ్మువెట్టి 680
యార్యులఁ దెగడకు మా" యని యతని
కార్య కృపామతి నాజ్ఞయొసంగె

## చిత్రకేతుని శాంత గంభీర గుణము:—

అంతట ఖేచరుఁ డరదమ్ము డిగ్గి
స్వాంతమ్ము సత్యమ్ము సత్వమ్ముఁ దెలుప
పార్వతీదేవికి ప్రణతు లర్పించి
"శర్వాణి! భవదీయ శాపవాక్యములు
భక్తితోఁ గైకొంటి, ప్రారబ్ధ కర్మ —
త్యక్తమ్ము గావింపనగునె యేరికిని
నారాయణుని దివ్యనామమ్ము భక్తిఁ —
బారాయణము సేయు భక్తులు తమకుఁ
బ్రాపించు సుఖ దుఃఖవర్గమ్ము నెల్ల
శ్రీపతి లీలావిశేషమ్మటంచు
భరియించి మోదించి భగవంతు కరుణఁ
దిరమగు సౌఖ్య సంస్థితి నొందుచుంద్రు
కాన, నీ శాపోక్తిఁ గలఁగ నెన్నడును
పూనిన దుర్మానమున మిమ్ములోక —
జననీ జనకులను సాభిమానమున
ననిన మాటలకు వేనాత్మఁ గుందెదను"
అని వారలకు మ్రొక్కి యరదమ్ము నెక్కి
చనె చిత్రకేతుండు చదలు మార్గమున 690

## శివుడు పార్వతికి భాగవతుల మాహాత్మ్యంబు దెలుపుట:-

తదనంతరంబ భూతపతి బ్రహ్మయును
ద్రిదశులు ప్రమథులు దేవర్షులాది
సదమున వారెల్ల సద్భక్తి వినఁగ
విదితమ్ము చేసె నివ్విధమున సతికి.
"గిరిజ! బాగుగ నెఱింగితె భాగవతుల
నిరుపమాన సహన నిశ్చయబుద్ధి

హరిదాసులకు వారి యనుచర తతికి
నరయ నీర్ష్యయలేని దాత్మీయగుణము
వారికి స్వర్గాపవర్గ సౌఖ్యములు
నారక బాధ లెన్నటి కంటఁబోవు
సకలమ్ము వారికి సమము భవాని
యకలంక చరితులు హరిదాసవరులు
ఇతఁడు శాంతగభీరుఁ డీ చిత్రకేతుఁ
డతిలోకసముఁడు శ్రీహరి భక్తవరుఁడు
ఈతని గూరిచి యేనేమి చెప్ప
నీతఁ డచ్యుతున కెంతేని ప్రియుండు
కావున నీలోని కలఁకను మాని
భావింపుమా హరిలీల మృడాని"
అనుఁడు నమ్మాటల నాలించి గౌరి
మనము శాంతింప నిమ్మళముగానుండె 700

ప్రతిశాపమిచ్చు ప్రభావముండియును
మతిమంతుఁడగుట నుమాదేవిఁ దిట్ట —
కతఁడు చిత్రకేతుఁ డటనుండి వెడలి.
యతి మహిమాన్వితుఁ డగుత్వష్ట సేయు
సవనమ్ము నందు రాక్షస రూప మొప్పఁ
బ్రభవించి వృత్రాఖ్యుఁ బరఁగి గోవింద!
భాగవతజ్ఞాన పరిణతి నొంది
యోగమవేద్య నీ యందునఁ జేరె.

శ్రీ భార్గవీనాథ చిత్రకేతుండు
ప్రాభవోన్నతుఁడు నీ భక్తవరుండు
తన విజితేంద్రియత్వము కారణముగ
ఘన గర్వమున మించి కలకంఠు శివుని

పరిహసింపంగ నోర్వక నీవు వాని —
కరయ దండనమె ముఖ్యంబని యెంచి
పార్వతీదేవి రూపమున శపించి,
సర్వశుభంబులు సమకూరునట్టి
మార్గమ్మునుం దెల్పి మన్నించి, తట్టి
మార్గాన నతని జన్మము తరియించె
నట్టి వ్యత్యస్తగుణాదులు నాకుఁ
బట్టనిరీతి కృపాదృష్టిఁజూచి 710
రక్షింపుమా నన్ను రాజీవనేత్ర
పక్షిరాడ్వాహన ప్రణుతింతు నిన్ను
కారుణ్యనిధి భక్తకల్పకాకార
క్షీరాబ్ధి కన్యకా చిత్తవిహార

మరుద్గణ వృత్తాంతము :—

శ్రీవత్సకౌస్తుభ చిహ్నోరు వక్ష
దేవనివహపక్ష దీన సంరక్ష
నరదేవ దైత్య బృందములలో వారి –
పరిణత పుణ్యపాపములను బట్టి
చెలిమినిఁ గూర్పింతు, చివ్వలు పెంతు
వలరింతు వేడ్పింతు వన్నివిధాల
చివరకు నీ దివ్యచిత్తమ్ము రీతి
సవరింతువన్నింటి సాక్షి స్వరూప

దితి ఇంద్రుని సంహరించునంతటి పుత్రుఁ బడయుటకై
వ్రతము చేయుట :—

దితి తన పుత్రులౌ దేవారులెల్ల
శతమన్యుచేఁబడి సమయుచునుండఁ

గనిశోకమున మున్గి కన లగ్గలింప
మనము శాంతించెడు మార్గమెఱుఁగక
యీను, నసూయయు నెసఁగ "నీ పాపి
వాసవుఁ డధముఁడు భ్రాతృహంతకుఁడు
వీనిఁ జంపక నాకు వెతతీఱిపోదు
నానందనులకు నానందమ్మ్రులేదు. 720
గాన వీనినిఁ జంపఁగాఁ దగువాని
సూను నొక్కనిఁ గందు సుఖముందు" ననుచు
దన భర్త కశ్యపు దాపునఁ జేరి
వినయ విధేయతల్ వెలయంగ, నతని
హృదయమ్ము సంతృప్తి నెనయంగ, మనను
చెదరని కడుభక్తి సేవించుచుండె.
సతి సపర్యల నిజస్వాంతమ్ము వొంగ
పతి కశ్యపుఁడు తన పడఁతి కిట్లనియె
"ఓ తన్వి, నీ భక్తియుత సేవ నాదు
చేతమ్మునకుఁ దృప్తిఁ జెందించె; నెందుఁ
బతిని సేవించిన పడఁతికి విష్ణు
నతిభక్తిఁ గొల్చు మహాపుణ్యమబ్బు
నుత్తమసతి కోర్కె లొనరగావించు
టెత్తఱినేఁ బతికించు ధర్మమ్ము
పేరిమి నీ యందుఁ బెరిగె నా మదిని
కోరుము వరము నీ కోర్కెలు దీర్తు"

అని భర్త కరుణింప నా భార్య యతని
గనుఁగొనియనె "స్వామి కడుమోదమయ్యె
వరము నా కొసఁగు భావము గలదేని
పరమమునీంద్ర నా వాంఛ వినుండు. 730

అమరత్వమునకర్హు, నతిబలవంతు
నమితతేజోవంతు హరిహయుఁద్రుంచు -
నంతటివీరు నాకాత్మజు నొకని
సంతసముననిమ్ము సమ్మనిచంద్ర."

అని దితిప్రార్థింప, నా పరుషోక్తి
మునికి నశనిపాతముగఁ జెవిఁబడ్డఁ
"గటకటా! యెంతటి కట్టిడివరముఁ
గుటిలమానసయయి కోరెనీదుష్ట,
మోహవశాన నీముదిత స్వభావ —
మూహించుకొననైతి నుత్సాహపడితి.
వరమొసంగితి నాదువచన మమోఘ
మరయ దానికి నడ్డమునదిలేదు.
మృత్యువుపాలుగాఁడెప్డు పాకారి
ఈ కఠినస్వాంత కేమి వచింతుఁ
గనుక నొక్కండుమార్గమ్ముఁ గల్పింతు
ననియెంచి కశ్యపుఁ డతివ కిట్లనియె.

"ఓ వనజాక్షి! నీవూహించినట్లు
దేవపతినిఁజంపు తెగువగలాఁడు
సుతుఁ డొకఁడుదయించుసుమ్ము, నీకొక్క
వ్రతముఁదెల్పెద దాని భక్తి నొకేడు 740
జరిపింపు మద్దాని నల్పువిధమ్ము
కరముకష్ట; మైనఁ గాపింపు మబల
శ్రీకరంబగు మార్గశీర్షమాసమున
ప్రాకటమౌ శుద్ధ పాడ్యమినుండి
పదిరెండుమాసముల్ భక్తితో నలిపి
పిదప నుద్యాపనవిధి సేయవలయు

పుంసవనమను నీ పుణ్యవ్రతమ్ము
హంసగమన! నీకు నతిశుభదమ్ము
కాని యీవ్రతవేళ కఠిననిష్ఠలను
బూనంగవలయుఁ దప్పకొనంగరాదు
వ్రతనియమముఁ దప్పి వర్తించితేని
యతివ నీపూనికి వ్యర్థమ్ముసుమ్ము"
అని వ్రతనియమమ్ము లమ్మునీశ్వరుఁడు
వినుమని పెక్కులు వినిపింప దితియు
మనమున్బ్బ పతిదెల్పు మార్గములన్ని
విని యతినిష్ఠ నవ్విధమున వ్రతము
సలుపుచు గర్భలక్షణములతోడ
వెలయుచుఁ దాఁ గడువేడ్కతోనుండె

దితితలంపును వ్రతదీక్షయు నెఱిఁగి
శతమన్యుఁడా వ్రతచర్యకు భంగ — 750
మొనరింపఁ దలఁచి యయ్యుపిధ మెచ్చంగ
ననుదిన మతిరహస్యమ్ముగు తనదు
పడవడి యొరులకెంతయుఁ దోఁపనట్లు
కడుభక్తి సేవలు గావించుచుండె
నతినిష్ఠతోడఁ వ్రతాచరణమ్ము
దితి నల్పుచుండుట దేవవిభుండు
ఆమెకు వేలాటిహాని గల్గించు
సామర్థ్య హీనుఁడై చలపట్టియుండె.
వ్రతవిధానమ్ముఁ దప్పక సేయుచుండి
దితి యొకనాఁడు పొందినశ్రమచేత
నొక నంజవేళ తా నుచ్ఛిష్టయగుచు
వికల మనస్కయై విధిప్రేరణమున

పాదముల్ గడిగెడు పద్ధతి వదలి
యాదమఱచి నిద్రనందె, నావేళ.

అతులాత్మయోగ మాయామహిమమున
దితియుదరమ్మున దేవవిభుండు
చొరఁబడి, యందుఁదేజో మూర్తి యగుచుఁ
బెరుగుచుండెడి బాలుఁవీక్షించి వాని
ఖరవజ్రమున సప్తఖండములట్లు
నఱక నాబాలుఁడు నాశమ్ముగాక 760
ప్రతిఖండమున నొక్కబాలుఁడై యొప్పి
యతికరుణముగ నాయర్భకుఁ డేడు
రూపులతోఁ గడు రోదించుచుండఁ
బాపమనక బలవైరి యొక్కొక్క
బాలుని నేడేడు వ్రక్కలుగాగఁ
జాలుగా ఖండించెఁ జలమెల్లనీఁగ
బాలఖండములు నల్వదితొమ్మిదియును
బాలురరూపముల్ వడసియొప్పారె
పాకారియెదుట నాబాలురు నిల్చి
ప్రాకటమగు భక్తి ప్రణతులర్పించి
యతిభయంకరుని నాయరివీరుగాంచి
యతగులై దీనులై యర్థించి రిట్లు.
"అమరేంద్ర! తోబుట్టులగుదుము నీకు
మముఁ జదిపెడు నుద్యమముఁ బూనబోకు
నీపారిషదులమై నీసేవలెల్ల
వేపాటికొఱలేక యేముగావింతు
మరయ మరుద్గణమనెడి సమాఖ్యఁ
బరఁగి నీవారమై వర్ధిల్లఁగలము.

శిక్షింపకుము మమ్ము జేజేలు నీకు
రక్షణ నీకుధర్మము సహస్రాక్ష" 770

ఆ సమంజసవాక్కు లట్టి యాలించి
వాసవుండు దయాస్వభావమ్ముతోడ
వారల సోదరవరులఁగానెంచె
క్రూరహింసనుమాని కూరిమిఁబెంచె.

## మరుద్గణముతో ఇంద్రుడు చెలిమి పాటించుట :-

ఆమరుద్గణము నయ్యమరేంద్రుతోడ
క్షేమాన మాతృకుక్షినిబాసి వెలికి-
వెలువడి కాంతులు వెలుఁగుచునుండ
మెలకువగని దితి మిగుల నచ్చెరువు
వడి వజ్రిజతనున్న బాలురఁగాంచి
యెడద తోషింపక, యింద్రునిఁగాంచి
"నినుఁ జంపఁగలయట్టి నేర్పున్న యొక్క
తనయుని బడయఁగాఁ దగిన వ్రతంబు
కడుదుస్తరమైయునఁ గడఁగి సల్పంగఁ
బొడమిరిందఱునాకు, పురుహూత! నిజముఁ
దెలుపుమా" యని తను దితికోర నామె
కలఁక దీఱంగమఘవుఁ డిట్టులనియె

## ఇంద్రుని సత్య వాక్కు-దితిసుస్వభావము :-

"తల్లి నీచేయువ్రతమ్మున నాదు
నుల్లమ్ము తల్లడమొందె, జంకితిని
నీవేమఱి వ్రతనియమమ్ముఁదప్ప
నే నేగిరముగ నీ కేర్పడకుండ 780

భవదీయ పూర్ణగర్భమ్మునఁ జొచ్చి
పవిధార నందున్న బాలు ఛేదింప
నా సకలములు మహాశ్చర్యమొప్ప
నీ శుభాకారమ్ము లెలమి ధరించి
నీకుఁబుత్రకులైరి నీరజనాభు
శ్రీకమలాక్షుఁగూర్చిన నీదుపూజ
వమ్మగునే! యిట్టి పాపకృత్యమ్ము
నెమ్మనమ్మున నెంచి నేనొనర్చితిని.
నను బుత్రుఁ గాపాడు నందనుతప్ప
జననిగా కెవ్వరు సహియింత్రుతల్లి"
అనివేడ నాదితి యమరేంద్రు సత్య
వణితికి మదిమెచ్చి వడసెశాంతమ్ము
దితి కరుణామయ దృష్టికి శాంత
మతికి దేవేంద్రుఁడు మదిలోనమెచ్చి
యాయమ పదముల కంజలిసేసి
శ్రేయమ్ములొందు నాశీస్సులుగొనియె

ఎలమి మరుద్గణ మింద్రునితోడి
చెలిమి కలిమి యను సేవధి గనియె
సురవరేణ్యుఁడు దివిజుల లోకమునకుఁ
గరము ప్రీతిగ మరుద్గణముఁ గొంపోయి. 790
వారల దేవతావారమ్మునందుఁ
జేరిచి మరి వారిచిత్తమ్ములలర
సురలకువలె హవిస్సును, సోమపాన
మరయ వారును బొందునట్టి భాగ్యమ్ముఁ
గలిగించి వారితోఁ గడుమైత్రిఁబెంచి
యలపు సొలపులేక హాయిగానుండె.

రాజీవనేత్ర నిర్జరపతిస్తోత్ర
భ్రాజితమూర్తి విరాజితకీర్తి
విధివిలాసము పెక్కువిధులు సర్వేశ
ప్రథితములవి జగత్పతి! ఇందిరేశ.

శతమన్యునకుఁ జావు సంఘటిల్లంగ
దితి కడుదుష్టబుద్ధిని ప్రవర్తించె
నాయమ గర్భమ్ము హతముఁగావింప
న్యాయమ్ము మాలి సునాశీరుఁ డమిత -
కపటచర్యకుఁబూనె కరుణమూనె
విపరీతములు వారి వింతభావములు
దేవతాజాతికీతిరొక మచ్చ
భావింప నిది విధిబలముగాఁబోలు
కాని, ముకుంద నీకరుణకుఁ బాత్రు
లైన భక్తాళి కీయవినీతిగుణము 800
తిరము గాదయ్య యుదీర్ణసంభావ్య
పరమ ధర్మగుణమ్మె పరఁగెడునయ్య
మును నింద్రుఁజంపింపఁ బూనెనేగాని,
తనసంతుఁ బోకార్పఁదలచినప్పటికి
సత్యసంధుండని శతమన్యుమీఁది
ప్రత్యయమ్మున వానిరక్షించి తనదు,
నకలంకమతిని దయాస్వభావమును
బ్రకటించె దితి సురవారమ్ము మెచ్చ
బలభేదిదితిచూలుఁ బరిమార్పఁగోరి
తలకొనెనేగాని తన్మరుజ్జాతి
నయమార్గ సంప్రాపనాధారమునకు
దయయు దాక్షిణ్యమ్ము తగనొంది వారి

కమరత్వము నొసంగి యాత్మయ మిత్ర
సముదయమ్మునఁజేర్చి సవనభాగాది
సురభోగములను మెచ్చుగఁగూర్చి తనదు
పరమదయాళుత్వభావమ్ము సమత
వెలయించె, దితి కడుఁబ్రీతిమన్నించ
దలఁకుమఱచి మరుద్గణముహర్షింప
నివి నీదులీలలో యిభరాజరక్ష
ప్రవిమలగుణ భక్తపాలనదీక్ష 810
అవగుణంబులపుట్టయైనట్టి నన్ను
భవదీయ కరుణకుఁ బాత్రుఁగాఁజేసి
గుణిగాగ దిద్ది నిఁకగొలుచుభక్తునిగ
గణియింపవే లోకకల్యాణదాత

ఫలశ్రుతి :—

పృత్రుఁడు రాక్షసాకృతి నొందినట్టి
చిత్రమౌ పూర్వప్రసిద్ధకారణము
మరిచిత్రకేతుని మహనీయచరిత
హరిదాసవరుల మహోశాంతగుణము
గలయట్టి యీపుణ్యకథ వెవ్వరేని
కలఁగని భక్తి ముఖ్యముగాగ విన్నఁ
జదివిన బహుళమౌ సౌఖ్యసంపదలఁ
బొదలుచు నానందముమబొందగలరు. 816

ఇది

షష్ఠస్కంధము - సమాప్తము.

——

# సప్తమస్కంధము

*****

శ్రీ మనోహర సాధుచిత్తవిహార
తామసగుణఖలదైత్యసంహార
జగదేకవంద్య నీసచ్చరిత్రములు
నిగమముల్ భవబంధనిర్మూలనములు
అలుకచేనైన స్నేహముచేతనైన
వలచియైనను బాంధవమ్మునవైన
దరముచేనైనను దగిలితలంప
సిరినాయకా నినుఁజేరంగవచ్చు
నట్టివారలకేని యాశ్రయమౌదు
కట్టిడిమనసుతోఁ గడద్రోయఁ బోవు
కామించిగోపికల్ కంసుండుభీతి
ప్రేమానపాండవుల్ ఋషులుసద్భక్తి
వైరమ్మతో శిశుపాలాదినృపులు
పేరిమి బంధులై వృష్ణివంశజులు
నినుఁగనఁగల్గిరి, నిజము నీనామ
మననమే నినుఁజెంద మంచిమార్గమ్ము

## హిరణ్యకశిపుని మానసిక తత్త్వము :

తొలియుగమునఁ గడుదుస్స్వభావుండు
కలుషాత్ముఁడు హిరణ్యకశిపుఁడు తనదు
అనుజన్ముఁడగు హిరణ్యాక్షుని నీవు
ఘనవరాహాకృతిఁ గడతేర్చితనుచు
నినుఁదనవైరిగా నెమ్మదినెంచి

తనమంత్రులను, భటతండమ్ముఁజేర్చి
కనులెఱ్ఱఁజేసి నిప్పుకలురాల్చుచును
మొనవాఁడిగల శూలమును చేతఁబట్టి
యతి భయంకరరూపుఁడగుచు దైతేయ –
తతినెల్ల వినుఁడని తానిట్టులనియె

“ వింటిరేయొక్కండు విపరీతవార్త
కంటిరే యంతటి కడుఘోరదృశ్య
మెంతకులేఁ డానికష్టుఁడు శౌరి
నుంతలెక్కింపఁడే, చోద్యమ్ము,మనల,
నాకుఁదమ్ముఁడు మీకునచ్చినహితుఁడు
ప్రాకట యుద్ధధర్మక్రమదక్షుఁ
డమరభయంకరుఁడగు హిరణ్యాక్షు
సమదకోలాకృతినవరించి, దనుజ
నారీమణుల శోభనమ్ములుసెడగ
దోరిచెనట కడుద్రోహియతండు

అతని సంజనవాదు, లాతనియునికి
యతనిజాడ లెఱుంగు టమితకష్టమ్ము
డాసినయట్లుండు,డాయిఁడు; మరియు
గాసిల్లఁజేయుఁ జిక్కకచిక్కినట్లు 20
మనములోఁబడక యామాయలవాని
మనకులోఁబడఁ బట్టు మార్గమ్ముగలదె ?
అతఁడు నాతోఁబోర నదలి సంద్రాన
నతగుఁడైదూకిన, నద్రికినడుగు
భాగానదాగిన, పాతాళభువికి
వేగంబుపాఱిన, విడువక పట్టి

వానికంఠమ్ము నీవాడిశూలాన
దానవుల్మెచ్చంగఁ దఱిగి తద్రక్త
ధారచే మత్సహోదరు నెదనెంచి
పేరిమి తర్పణవిధి నెరవేర్తు
వానిమృత్యువె యాసుపర్వనాశమ్ము
వానియంతమె మీకు భాగ్యమూలమ్ము 26

## హిరణ్యకశిపుడు విష్ణుడెచ్చటనున్నాడో వెదకి రండని భటుల నాజ్ఞాపించుట:

కాన దానవులారా కదలిపొండింక
మానక వానికై మహినెల్ల వెదుక
నరయ విష్ణువనంగ నతఁడెవ్వఁడనిన
నెఱిగింతు వినుఁడు మీరెల్లరివ్వేళ
వతఁడెయజ్ఞము, వేదమతఁడె మహర్షు
లతఁడె, ధర్మాదుల కాధారమతఁడె
యతఁడెబ్రాహ్మణమంత్ర, మతఁడెగోయూప
మతఁడెతపమ్ము స్వాధ్యాయమ్మతండె, 30
ఎచ్చట యజ్ఞాదు లేపారజరుగు
నెచ్చట భూసురు లిరవుగానుందు
రెచ్చట వేదము, లెచ్చటగోవు
లెచ్చటధర్మమ్ము లెలమిభాసించు
నచ్చోటులకు మీరలందఱునరిగి
విచ్చలవిడి వాని విధ్వంసనమ్ము
గావించి తత్కార్య కర్తలనెల్లఁ
గావర మణఁగగా ఖండించిరండు

అని పంపుసేయ నయ్యసురులమూఁక
మునుకొన్నయామున, మోదాన రేఁగి
వన గిరి గ్రామాలఁ బట్టణమ్ములను
మునినివాసమ్ముల పుణ్యతీర్థముల
శోధించి సాధులఁ జూచి బంధించి
బాధించి యజ్ఞాది పరమపవిత్ర
కార్యాల ధ్వంసమ్ముగావించి, మిగుల
క్రౌర్యాన భువి నల్లకల్లోల పఱుపఁ
ద్రిదివవాసము వాసి త్రిదశులెల్లరును
జెదరి వనమ్ములు జేరిరి భీతి

## హిరణ్యకశిపుడు హిరణ్యాక్షునికై దుఃఖించు తన తల్లి నోదార్చుట:—

అంతట నా హిరణ్యకశిపు దనుజుఁ
డంతరంగమున నిజానుజుని నిలిపి 40
యుదకప్రదానాదు లొనర నాతనికిఁ
గొదలేక గావించి, కుమిలెడు వాని
తనయుల దనదుచెంతకుఁ జేరఁబిలిచి
వనటదీరెడునట్లు వారినోదార్చి
పనవు నాకనకాక్షు పడఁతులనెల్లఁ
దనయునకై యేడ్చు తల్లిని దితిని
తనపజ్జజేర్చి యోదార్చుచు జనని
గనివారు వినుచుండఁగా నిట్టులనియె.

అమ్మ! నీసుతునికై యడలకుమమ్మ
యిమ్మహిధర్మ మీ వెఱుఁగుదువమ్మ

చలిపందిరుల బాటసారులవోలె
నిలను సంసారాల నెలమితోనుండు
వారు వత్తురు, కూడి, వదలిపోవుదురు.
తీరనిబంధ మేతీరునలేదు
వినుము నీపుత్రుఁడు వీరులువోవు
ఘనమార్గమునఁ బోయెగద, తద్వియోగ
మునకేలవగచె దీభువి నివియెల్ల
ననఘు నీశ్వరునిమాయలు నిక్కవమ్మ
ఆలింపుఁ డొకయుపాఖ్యానమ్ము దాన
మీలౌకికభ్రమల్ మిముఁ బాసిపోవు 50

## సుయజ్ఞోపాఖ్యానము :—

మును సుశీనరదేశమున సుయజ్ఞాఖ్యుఁ
దనరిన రాజుండెఁ దన యభాగ్యమున
నతఁ డొకదురమున హతుఁడయ్యె శత్రు –
తతిచేత, నంత నాతనిభార్యలెల్ల
మృతుఁడగు తమభర్త మేనిపై వ్రాలి
యతిదీనవాక్కుల "హాప్రాణనాథ!
మమ్ములఁ బుత్రుల మఱచి స్వర్గమున
కిమ్ముగాఁజనితె మాకే దిఁక దిక్కు
అని మిక్కుటముగ శోకాక్రాంతలగుచు
పనవుచునుండిరి; బంధుగుల్ గూడి
వారిదుఃఖమ్మును వారింపనేర
రైరి, దివాకరుఁ డస్తాద్రిఁజేరె.

అప్పుడు యముఁడు విప్రార్భకరూప –
మొప్పఁగాఁ జనుదెంచి, యుర్వీశు శవము

చుట్టున నుండు నాచుట్టాలతోడ
నిట్టుల ననియె నాయింతులు వినఁగ

"మట్టుమీరెను వీరిమరులెన్న దేహి
పుట్టుట చచ్చుట పొడగాంచుచుంద్రు
చావుమానినవారి చందాన నితని
చావునుగని శోకజలధి మున్గుదురు 60
చావుదప్పించు టసాధ్య మేరికిని
జీవి యెచ్చటఁబుట్టుఁ జేరునచ్చోటఁ
జచ్చినవారికై సంతాపపడుట
పిచ్చియౌ నీభ్రాంతి వీడుట మేలు
అవని నెవండు భూతాళి సృజించు
నెవఁడు సంరక్షించు నెవఁడు హరించు
నావిశ్వవిభుఁడె లీలావిలాసమున
నీవిధమ్మున మంచు నెసఁగఁగ బెంచు
ననదమనును కాన యందు క్షేమముగ
మనఁడు రక్షితుఁడైన మందిరమ్మునను
దేహిదేహమ్ములు తెలియవేర్వేరు
దేహిచెడదు: కాని దేహమ్ముచెడును
దారువులందగ్ని, తనువునగాలి
తీరున వేర్వేరు దేహిదేహములు
ఎందొక దేహమ్మునెనయునోయాత్మ
యందాఁకనేకర్మ మటుపైనలేదు
కాన మాయాయోగకలనమ్మిదేల
మానుఁడీ యారిత్తముసుకారమెల్లఁ
దనయులాదిగ బంధుతతియు సంపదలు
ఘనకర్మవశమునఁ గలియును వీడుఁ 70

గలలోనఁ గన్నట్టి కలిమినిజమ్మె
తెలియుఁడు లోకముతీరీవిధమ్మె

## కుళింగ మిధునంబుల కథ:

వినుఁడు మున్నొకబోయ వేఁటాడుకోర్కి
మనముప్రేరేఁప సంభవసమ్మదమున
విలునమ్ములాదియౌ వేఁటసాధనము
లెలమిఁ గైకొని కానకేగి వేఁటాడి
చిక్కినపక్షులఁ జెచ్చెఱఁ దనదు
చిక్కమ్ములోపలఁజేర్చుచునుండి
లీలమైఁదిరుగు కుళింగద్వయమ్ము
కాలవశతఁ దనకన్నులఁబడఁగ
దాన పెంటిని నురిఁదగిలిచిపట్టి
యానందముగఁ జిక్కమందుననుంచె
శిక్యమందు కుళింగి చేడ్పాటుఁగాంచి
శక్యముగాని విచారమ్మునొంది
కడుదీనముగ కుళింగము పెంటివినఁగ
విడరానిరాగమ్ము వెలయ నిట్లనియె

"మేఁతకై యడవుల మెలఁగుచునుందు
మేతటి నన్యుల కెగ్గేమిసేయ
మట్టులనున్న బోయనిచేతఁబడఁగ
కట్టిడివిధి వ్రాసెఁగాఁబోలునుదుట 80
ఛీ! పాపిదైవదృష్టికి మనబ్రదుకు
తాపంబుఁ గూర్చునంతటి బరువేమొ
మనలనందఱ నొకేమారు కిరాతు
పెనువలఁద్రోయక ప్రియురాలి నొకత

నిను వాగురను ద్రోసెవే! దైవ మెదిరి
మనవిధిఁగూర్చి కోమలి యేమనందు
ఱెక్కలు రాని పరిస్థితిలోన
నక్కయున్నవి గూడునం బిల్లలెల్ల
వెల్లినుండియు మేత యెట్టులు లేమి
వల్లాడు, చారాటమందుచు నెగసి
పోఁజాల, విప్పుడు మున్ను మా తల్లి
యీజాడనుండి తానిచటికి వచ్చు
ననుచు నా జాడకై యన్ని దిక్కులను
కనుదృష్టులను ద్రిప్పకయ నిక్క నిక్క
కనుచున్న నా దుఃఖకరమగు దృశ్య
మును జూచి భరియింపఁ బొసఁగునే మనసు"
అని యాలు బిడ్డలకయి వగనొందు
వన విహంగము బోయవాఁడొక్క కోలఁ
గూలంగ నేసె; నే గుణవంతుఁడేని
కాలంబు దీఱినఁ గడ తేఱకున్నె. 90

కాన నోరాణులు! కలకాలమిట్లు
మానక శోకాబ్ధి మగ్నులరైన
ఫలమేమి? మీరు మీ ప్రాణేశుతోడఁ
గలియంగఁ బోలేరు; కడకు మీ చెంత
కరుదెంచి మీ కింక నతఁడు గన్పడఁడు
మరణ మొందినవారు మరిగారునమ్మ"

అని బాలకాకృతి నలరు జముండు
వినిపింపఁగా నా పవిత్ర వాక్యములు
విని సుయజ్ఞుని బంధు వితతి ప్రపంచ
మున సర్వము ననిత్యముగ మదినెంచి

యారాజు శవమున కంతిమక్రియలు
దీరిచెఁ జనియెఁ బితృపతియుఁ జనియె"
అని సుయజ్ఞుని యుపాఖ్యాన మంతయును
కనకకశిపుఁడు వల్కఁగ విని దితియుఁ
దనదు కోడండ్రతోఁ దాను శోక
మునుమాని నిజతత్త్వమును బాగ నెఱిఁగి
కొడుకు మరణమును గూర్చిన చింత
విడిచె నెమ్మదిని వివేకమ్ముతోడ

## హిరణ్యకశిపుఁడు బ్రహ్మను గూర్చి తపమొనరించుట:—

ఆవల నా హిరణ్యకశిపుఁ డాత్మఁ
జావు ముదిమిలేక జరఁగెడు బ్రదుకు 100
మూఁడు లోకముల ప్రభుత్వమ్ముఁ దనకు
నీడేరులేకుంట నెందున జయము
గజరిపు బలమును గాంక్షించి, వెడలి
విజనమౌ మందర పృథ్వీధరమ్ముఁ
జేరి యాగిరిలోయఁ జెదరనియెడద
ధారుణి తనదు పాదము పెనువ్రేలి —
మోపి నిలిచి హస్తములు మీఁదికెత్తి
యేపు మీఱఁగ దివినెపుడు గాంచుచును
పరులెవ్వరును జూడ వలను గానట్టి
పరమ దారుణమౌ తపము చేయుచుండె.
నా సమయంబున నమరులెల్లరును
ద్రాసమ్ము వాసి స్వర్గముఁజేరుకొనిరి.

ఆ హిరణ్యకశిపుఁ డతి భీతిదముగ
సాహసవృత్తిమై జరపు తపోగ్ని

తాసంబుచే జగత్త్రయము మహీధ్ర
కూపారవన భూతకోటితో మిగుల
నా కులంబయి కడు నడలుచు నుండ
నాకనివాసులందఱు సత్యలోక
మునకు వేచని చతుర్ముఖుని దర్శించి
వినతిసేయుచు మొఱవెట్టి రీరీతి 110

## దేవతలు హిరణ్యకశిపు తపోగ్నికిఁ దాళజాలక బ్రహ్మతో మొరవెట్టు కొనుట :-

"దేవ! సురజ్యేష్ఠ! దితి పెద్దకొడుకు
గావించు తపము సెగల్ భరియించి
యమరావతీపుర మం దుండలేము
మము కరుణింపుమ, మాకీవె దిక్కు
జగముల పాడు, నిర్జరులకుఁ గీడు,
నిగమనాశము మదినిల్పి యా తపము
సలిపెడి యాకూళ సంకల్పమునకు
గలిగింపుమా ప్రతీకారమ్ము వేగ
నవతుగానని తపశ్శక్తితో నీవు
భువన నిర్మాణమ్ము పొలుపొందఁజేసి
యమరులలోన ముఖ్యపదంబుఁ గొంటి
వమర విరోధి యా యసురయు నట్లె
తపమొనరించి మహత్తర శక్తినొంది
విపరీత బుద్ధితో విశ్వనాశమ్ము
గావించి వేరు జగత్తు సృష్టింప
భావించినాఁ డబ్జభవ! నిక్కవముగఁ
దలఁచియున్నాఁడు నిత్యత్వంబు తన్ను
వలచెడునట్టుగ, వాని దురూహ

లపకార హేతువులయి లోకములను
దపియింపఁజేయు నెత్తఱివేనిఁ గాన 120
వాని తపమ్మును వారించి సృష్టి
కానందమును గూర్పుమా పరమేష్ఠి!"

## బ్రహ్మ హిరణ్యకశిపునకు సాక్షాత్కరించి వరము లొసగుట:

ఆమొఱ్ఱ లాలించి యబ్జభవుండు
తామసింపక భృగు దక్షాదు లపుడు
తన వెంటరాఁగ మందర శైలమునకుఁ
జనుదెంచి యందు నిశ్చలచిత్తవృత్తిఁ
దనమేనుఁ దొలిచి రక్తమ్ము మాంసమ్ము
వనదంశములు చీమ బారులు దినినఁ
దృణవేణు నాకు పరిచ్ఛన్నుఁ డగుచుఁ
దనదు తపో మహత్వ ప్రభావమున
జలదముల్ చాటున జలజాప్తువోలె
వెలయు నాదైత్యేంద్రు వీక్షించియనియె.

"ఓ సురవైరి! యహెూ, యసురేంద్ర!
నీ సాటి యే రిట్టి నియమోగ్రతపము
చేసిరి మున్నింక చేయువా రెవరు?
నీ సమాధినిఁగని నే మెచ్చినాఁడ
నీ యభీష్టములెల్ల నే నిచ్చువాఁడ
నాయాసమేల మహాత్మ లేలెమ్ము
ఏయెడఁగన చీమలీగలు మూఁగి
కాయమ్ముఁదొలిచి రక్తమ్ము మాంసమ్ముఁ 130
దినుచుండఁ గృశియించి తృణవేణునికర
మునఁ గప్పబడియున్నఁ బుట్టలో నెట్లు

నిలువంగ జాలితో, నీదు ప్రాణములు
నిలిచెనెట్టులు? జితేంద్రియుఁడవు నీవు
నీ రోగిరములు మానియు దివ్యసమలు
నూరు దాఁటినను మేనున వాయువులను
నిలుపు వారెవ్వరు? నినుఁ దిలకించి
పులకించితిమి మాకుఁ బొడమె సంతసము.
తపమున మముగెల్చి ధన్యుఁడవైతి
తపియింప కిఁకలెమ్ము దానవనాథ"

అని చతురాననుఁ డా దితిపుత్రు
ఘనతపోనియమమ్ముఁగని చాలఁ బొగడి
తన కమండలు పవిత్రజలమ్ము వాని —
తనువుపై నాదృతిదనరఁ బ్రోక్షింప
నత్తీర్థసంస్పర్శనతఁడు తపమ్ము
నత్తటి సాలించి, యాపుట్టనుండి
జవసత్వతారుణ్యసౌందర్యయుతుఁడు
బ్రవిమలతేజోవిరాజితుఁడగుచు,
వెలువడివచ్చి విన్వీధిఁ గన్పడెడి
జలజసంభవునకు సాష్టాంగమెఱఁగి 140
యానందమున పులకాంకితుఁడగుచు
మానవిభక్తి నమస్కృతుల్ సేసి
తనదు వీక్షణము లాతనిమీఁద నిలిపి
వినయమొప్పారఁగా వినుతించె నిట్లు.

"ప్రళయకాలానంతరమ్ము ధ్వాంతమ్ము
పొలసియుండెడి జగమ్మును నేఘమందు
వెలిగించు, త్రిగుణముల్ వెలయ విశ్వమ్ముఁ
గలిగించు, రక్షించు, కడకు హరించు

వెవఁడు నిఖిలహేతు వెవ్వఁడౌనాద్యు
డెవఁడు కాలాకారుఁ డెవ్వండు ప్రభుఁడు
ఎవఁడు సమయమైన నెట్టియాకార
మవసరమోయట్టి యాకృతితోడ
నవతరించునోయట్టియవఘుని నిన్నుఁ
బ్రవిమలభక్తితో భజియించువాఁడ."
అని పెక్కుభంగుల నాదిదేవునిగఁ
గనకకశిపుఁడు వాక్పతిని నుతించి,

"వనజాసనా! అర్థివాంఛలు కరుణ
నినుఁబోలి కూర్పంగ వేరరెవ్వరును,
ఇచ్చెదనంటి, నాయీప్సితమ్ములను
విచ్చలవిడిగ నేవివరింతు వినుము. 150
ధాత! యీపంచభూతమ్ముల, దిశల
రాతిరింబవళుల, ప్రభలఁజీఁకటుల
సకలజంతువుల, రాక్షసదేవమనుజ
నికరసంగరముల, నిఖిలాస్త్ర శస్త్ర
తతులను మృతి నాకుఁదగులనిబ్రదుకుఁ
బ్రతియుద్ధమందునఁ బ్రతిలేనిశౌర్య,
మాశాధిపతులకు నధికమౌమహిమ
ధీశక్తి భుజశక్తి దిగ్విజయమ్ము
దయవరములుగాఁగఁ దగగూర్పుమయ్య
యయుతవందనములయ్యా! పద్మయోని!

అనికోరఁగా బ్రహ్మహర్షమ్మెసంగ
దనుజేంద్రునకు నవి దయఁబ్రసాదించి
"అన్న కశ్యపపుత్ర యన్యులెవ్వారు
మున్నితెఱఁగు వరమ్ములఁ గోర రివ్వి

యతి దుర్లభమ్ములేయైన సంతోష
మతి నీకునిచ్చితి మనుమింక బుద్ధి
మంతుఁడవై " యని మన్ననఁ జెప్పి
యంతర్హితుండయ్యె నాయబ్జభవుఁడు —

వనజనాభా ! నీలవర్ణసుగాత్ర
మునిజనవంద్య ప్రఫుల్లాబ్జనేత్ర 160
వానిసోదరు నీవు పరిమార్చితివఁట
పూనె నీపై దితిపుత్రుండు వైర
మా హిరణ్యకశిపుఁ డంతటరేఁగి
ద్రోహియైచేసిన దుష్కార్యములను
అవియివి యని చెప్పనౌనె సర్వేశ !
భువనమ్ములను కష్టములపాలొనర్చె

## హిరణ్యకశిపుడు ముల్లోకముల జయించుట :-

ఒక్కొక్కదినము తానొక్కొక్కయెడకు
నుక్కుమిగిలి చని, యుగ్రుఁడై మెలఁగి
యమరుల విద్యాధరాది దేవాంశ
సమితి గరుడ నర సందోహములను
పాతాళవాసనర్ప సమూహములను
ప్రేతభూతాదుల మృగ సంచయముల
గ్రహసమూహముల వాక్పతులను గిట్టి
సహియింపరాని దుశ్చరితుఁడై పట్టి
క్రోధాన దుష్టవాక్కుల చాలఁదిట్టి
బాధించి, విసిగించి, పరిమార్చుచుండు
నీ కరణిని దనుజేంద్రుండు తనకు
లోకాల మూడింటి లోబడఁ జేయఁ

బుడమియు నీరు నిప్పును గాలి మిన్ను
మిడుకు నాతనియాన మీఱంగలేక 170

## హిరణ్యకశిపుని ప్రాభవసంపత్తి:-

అంతట నా హిరణ్యకశిపుఁడరయ
స్వాంత ముప్పొంగ గర్వమున స్వర్గమ్ము
నం దమరావతి నమరెడు నింద్రు
మందిరమ్మున సుధర్మాలయపీఠి
నాసీనుఁడై త్రిలోకాధిపత్యమ్ము
వాసిగాఁనొంది యవారణనుండె
వేఁడెవరి పయిఁగినియునో నెవ్వారిఁ
గెడపునో యెవరి చిక్కించునో యేడ
దాడికై చనునో, యీ దనుజేంద్రుఁడంచుఁ
గూడి యింద్రాదులు కుములుచుం ద్రెపుడు
కప్పురపుం దావిగలిగి యమృతము
చొప్పున మధురమై సొగియు మైరేయ -
పాన జనిత మత్తపరివృత బుద్ధి
నూనియశాంతితో నున్నవాఁ డసుర
మీ మీ పదవులందుఁ మీ సేవలెల్ల
నేమరక యొనర్పుఁ డీ యంచుఁ జూరు
లెచ్చరించుచునుండు రింద్రాది సురల
అచ్చరలాది దేవాంశ సంభవులఁ
దవనుల ననయమ్ము దర్పమ్ము మెఱయ
విపరీతమా దైత్య విభు రాజసమ్ము 180
మైరేయముం గ్రోలి, మత్తిలి యెట్టి
వాటి, యా వృత్తము భయదమౌ వేత్ర

యుగళి, లీలావతీ యుక్తుఁడై, మోద
ముగ నుపవన భూమి పొదరిండ్లలోన
నింబుగనుండు వా యింద్రారిమెచ్చ
తుంబురుఁడును నారదుఁడు పాడుచుంద్రు
యాగములను హవిస్సంతయు నాతఁ
డేగొను నిడఁ డించుకేని వేల్పులకు

సకలలోక శరణ్య, జ్ఞాన ప్రదీప
యకలంకచరిత మహానందరూప
యా హిరణ్యకశిపు నాజ్ఞయు నదపు
సాహస మతిలోక సామాన్యమయ్యె

సర్వదిక్పాల ప్రశస్తాధికార
నిర్వహణము తాన నెఱవేర్చు కతన
నాసురవైరి నియామ సంబద్ధ
మై సర్వజగతి మహైశ్వర్య మొప్ప
భూమిదున్నక పండు, భువి నర్థిజనుల
కామంబులన్నియు గగనమ్ము గురియు
జలనిధుల్ వాహినుల్ స్వచ్ఛరత్నముల
నలలచేతుల తోడ నందిచ్చు ప్రజకు 190
సకలర్తు గుణములఁజాలి భూజమ్ము
లొకకాలమందె యింపొలయంగ వెలయు
నిండుగాఁ బాఱు దోనెలవోలె కొండ -
లెండని సెలయేళ్ళ వేపారుచుండు
ఈరీతి సకలలోకైకాధినేత
యై రాక్షసపతి రాజ్యము సేయుచుండె

తనవారి మోహమ్ముఁ తలగంగ ప్రకృతిఁ
గనుఁగొనసగు సత్త్వమన తత్తఁమెలఁ

బోలంగఁ జెప్పె, నీ భువన వర్తనను
మూలమెవ్వండొ యా పురుషునిఁ జెప్పె
కాని, నీపైఁ గత్తిగట్టి యాపైన
వాణీశుచే లోకభయదములైన
వరములుగొని త్రిభువనములనెల్ల
నరచేతఁ బట్టి మహాసంకటములఁ
గలిగించె నా హేమకశిపుఁ డతండు
బలశౌర్యయుతుఁడు తత్వజ్ఞుఁడేగాని
కామాది శత్రు షట్కము గెల్వలేక
సామాన్యుఁడై మోహజాలానఁ బడియె
నన్నియు నీ మాయ లచ్యుతా! వాని
నెన్నటి కెవ్వరే నెఱుగంగలేరు. 200

## దేవతలు భగవంతుని శరణుజొచ్చుట, అభయప్రదానము:-

కనక కశిపు భయంకర శాసనములు
కనికారమేలేని కఠిన దండనలు
భరియింపలేక సాధ్వసమానసులును
బరితాపతప్తులు భగ్నాశలగుచు
"అక్కటా! మాకు దిక్కగువారలెవరు?
రక్కసుఁడొనరించు రాయిడి తీఱు
తెఱఁగెద్ది? శుభములందెడుదశ మాకు
నరయఁగలదొ లేదొ" యనిదేవతలును
దేవాంశజులుఁ గడుదీనులై వగచి
యావల నొక రహస్యస్థలమందుఁ
జేరి "సర్వావనశీలుఁ డాద్యుండు,
కారుణ్యమూర్తి శ్రీకాంతావిభుండు

ఏడనున్నాఁడొ మాకెపుడుదిక్కగునొ,
చూడఁడామ మ్మింక, చూపఁడా కరుణ"
అని యహోరాత్రమ్ము లాహారనిద్ర
లనుమాని జోహారులను సమర్పించి
వనజనాభుని నిన్నుఁ బ్రార్థింప వారి
మనవిని విని దృశ్యమానమ్ముగాని
తీరుననుండి యాదివిజులకీవు
కారుణ్యపూర్ణవాక్యమ్ము లిట్లంటి 210

"ఓనిర్జరులు, భయమొందకుఁడయ్య
ఆనందభద్రమ్ములమరెడు మీకు,
ననుగొల్చు భూత సంతతికిఁ గష్టములు
పొనరవు సుఖములు పొలుపారుచుండు
నెఱుఁగుదు దితిసుతునేపు దౌష్ట్యమ్ముఁ
దఱియైన వాని వధమ్మునేఁ జూతు
సురలను సాధుల, శ్రుతుల గోవులను
ధరణీసురుల నన్ను ధర్మమ్ముఁ గినిసి
వాఁడు గావున వాఁడు నశియించునింక
వీడుఁడీ మీభీతి వేడ్కగనుండి
తనపుత్రు నాభక్తు దాంతు ప్రహ్లాదుఁ
గినిసి వాఁడేనాఁడు కెరలి బాధించు
నానాఁడె వాని వేహతముగావింతు
మీనెమ్మనముల సంప్రీతిగూర్పింతుఁ
గమలగర్భుని వరగర్వాన వాఁడు
మిము నలయించుచు మించుటయెల్ల
నెఱుఁగుదు నేసహియించితి వద్ది

చనుఁడు మీమీ నివేశములకు మీరు
దనుజునకున్మృత్తి దాపురమయ్యె" 220
అని సెలవిచ్చి తాయభయవాక్కులను
విని ముదమునఁజనె విబుధసంఘమ్ము

ఖలచిత్తుఁడు హిరణ్యకశిపుఁడువెట్టు
తలముగానట్టి బాధలనోర్వలేక
అమరగణమ్ము నీయండ నర్థించి
విమలమనస్కులై వేఁడ వారలకు
నభయం బొసంగితి వార్త శరణ్య
యిభరాజవరద నిన్నేగొల్చు దాస
వరుల రక్షించు నీవాత్సల్యగుణము
తరమె నాకు నుతింప తామరసాక్ష
అల్పజనుండ నా యఘము లన్నింటి
దుల్పగావవె నన్ను దురితవిదూర.

---

# ప్రహ్లాద చరిత్రము

పరమపూరుష చక్రపాణిరమేశ
మురదానవవినాశ ముక్తిలోకేశ
నీమహామహిమలు నీతత్వవిధులు
సామాన్యలోక ప్రశస్తధర్మములు
తామెఱింగియును గొందఱు క్రూరమతులు
కామాది శత్రుషట్కము గెల్వలేక
తమకర్మఫలములు తమ్ముబాధింప
ఏమతులై దాని కీవే హేతువనుచు 230

నిను వైరిగా నెంచి నీభక్తవరుల
కెనలేని బాధలెన్నేనిఁ గల్పింత్రు
కడకు నీభక్తుఁడు గను విజయమ్ము
పడయు నీశత్రుఁడు వనట నిజమ్ము

## ప్రహ్లాదుని బాల్యము :—

అమరారియగు హిరణ్యకశిపునకును
కొమరులు గలరు నల్గురు వారిలోన
ప్రహ్లాదుఁడనువాఁడు బాలుండు నీకు
నాహ్లాదకరుఁడు భక్తాగ్రణి యతఁడు
తనవలె నఖిలభూతమ్ముల నెంచు
వినతి నతుల్ సేయు పెద్దలఁగన్నఁ
బరకాంతలను మాతృభావానఁ జూచుఁ
గరుణదీనులఁ గావఁగా మదినెంచుఁ
దలఁచు మిత్రులను సోదర వరులంచుఁ
గొలుచు దైవములుగ గురువులఁ గనిన
పరిహాసమునకేని పలుకఁడు బొంకు
గురుతర గౌరవ గుణము గలాఁడు
ఇంచుకేనియు నహంకృతిలేని వాఁడు
పంచేంద్రియములఁ జేర్పడనట్టివాఁడు
వైరిషట్కమణంచి వరలెడువాఁడు
క్రూర వ్యసనములఁ గోరనివాఁడు 240
వేదమయా! నిన్ను వేఁడెడి యాతఁ
డాదైత్య విభుసుతుఁ డమలగుణుండు —
వాసియౌ గుణములాబాలకుఁ జేరి
వాసి చనవు నిన్నుఁ బాయని యటులఁ —

బగరెయైవను దేవవరు లాకుమారు
సుగుణాలఁ గీర్తించుచుందురు నభల

తను నీవు చేరుచందము తోఁచెనేని
యనుఁగు వారలఁజేర నరుఁగఁడతండు
తనప్రోల నీవు నృత్యము చేసినట్లు
కనఁబడ, నాడఁడు కలిసి యన్యులను
మీరు ముచ్చటలలో మునిఁగినట్లున్న
మారువల్కఁడు పెరల్ మాటాడుచున్న
తనయాత్మ నీ రూప దర్శనంబైనఁ
మనమునఁజొక్కి సమస్తమ్ము మఱచు
నీ చింతనమ్మె పెన్నిధివలెనుంట
నే చింతలేక సహిష్ణుఁడై యుండు
నాతఁ డవస్థాత్రయమునను దనదు
చేఁతలయందు నీ శ్రీకర దివ్య —
పాదస్మరణసుధాస్వాదనా నియతి
మోదించు నీ జగమ్మును విస్మరించు 250
నీ నామచింత మానిన చేష్టతోడ
తా నొకం డొకట రోదనసేయుచుండు.
బాగుగ నిను మది భావించి యుబ్బి
రాగిల్లి యొకటిఁ గీర్తన సేయుచుండు.
హరి రహస్యము తెల్లమయ్యె నా కనుచు
కొఱలేని తృప్తి వెక్కుడు నవ్వుచుండు
వనజాక్షుఁడవెడి సేవధిఁగంటి ననుచు
వెనమిఱి యొక్కట నెగురుచనుండు
వానందజనిత బాష్పంబు నేత్రములఁ
శ్రీనాథ! నీకు జేజేలను నొకట

ముకుళిత లోచనమ్ములతోడ నిలిచి
యొకచోట నెమ్మది నూరకయుండు
తనపూర్వ జన్మ భక్తజన సంసర్గ
ఘన భాగ్య లబ్ధ శ్రీకర భవదీయ —
చరణసేవ తనకు శరణమ్మటంచు
నిరత మా రీతిని నినుఁ గొల్చుచుండు

తనపుత్రుఁ బ్రహ్లాదు దైత్యవల్లభుఁడు
గని వాని నడవడికకుఁ గడువగచి
"అచ్చెరువయ్యె వీఁ డసుర సామ్రాజ్య —
మిచ్చ గుర్తించినట్లేమియు లేదు 260
తెగువయు తెలివి బొత్తిగఁ గానరాదు
మిగుల మందమతిగ మెలఁగు చున్నాఁడు.
గురుశిక్షనొంది యెక్కుడు శాస్త్రవిద్య
లెఱిఁగిన గాని, వీఁడీ మందబుద్ధి —
మానజాలఁడు తీవ్రమతిగాఁ డటంచుఁ
దానూహచేసి పుత్రకున కిట్లనియె.

ప్రహ్లాదుని విద్యాభ్యాసము :—

చదువని వార లజ్ఞానాన నుంద్రు
చదివినవారు విజ్ఞానమ్ముఁగంద్రు
చదు వెల్లరకు నవసరమగుఁ గానఁ
జదివింతు గురులొద్ద చదువురా తండ్రి!"
అనుచు చండామార్కులనఁబడు శుక్రు
తనయుల దనదు చెంతకు బిలిపించి
"గురువరులార! ఈ కుఱ్ఱఁడు మిగుల
నరయమి నున్నవాఁ డస్మత్ప్రతాప —

గరిమ యేమాత్రమ్ముఁ గనఁడు పల్కుండు
కరుణాళులరు మీరు గౌరవాన్వితులు
నన్నుఁ బాటించి మన్నన వీనిచేత
మిన్నగ్రంథముల మేల్మిగఁ జదివించి,
నీతిశాస్త్రకుశలునిగఁజేసి నాకుఁ
బ్రీతిఁగూర్పుఁడి" యంచుఁ బ్రియముగాఁబల్కి 270
మేలుమర్యాదల మిగులంగఁజేసి
బాలకు వారల వశమొనరించె.
ఆదైత్యగురుపుత్రు లా యమరారి —
వేదన వెఱిఁగి, తద్విజ్ఞాపనమ్ము
ముదలగా భావించి ముదముతో బాలుఁ
జదివింతుమని గొంచుఁ జని, వాని వసుర
బాలురజత రాజభవనమందొకటఁ
జాలుగాఁ బెక్కుశాస్త్రములు బోధింప,
వాని గురుల్ నేర్పు వైఖరియెట్లొ
తాను నావైఖరి తప్పక నేర్చెఁ
గాని, మనంబునఁ గమలాక్ష నీదు
ధ్యానమ్ము భక్తి నెత్తఱి మానకుండె.
గురువుల బోధనల్ గొఱగానివనుచు
నెఱిఁగియుండియును దానెప్పుడేగాని,
యదియిట్టు, లిదియట్టులని, యడ్డుపల్కఁ
డది వృథాశ్రమయని యా బాలకుండు

## హిరణ్యకశిపుఁడు ప్రహ్లాదునివిద్యావిశేషములఁబరీక్షించుట:

అంతఁ గొన్నిదినమ్ము లరిగినపిదప
స్వాంతమ్మునందు రాక్షసరాజు తనదు

తనయున కెట్టిపద్ధతి గురుపుత్రు
లనుసరించుచును విద్యల నేర్పువారొ 280
వాఁడెట్లునేర్చెనో, వానిని బిలిచి
నేఁడెఱిందగెనని నిశ్చయమ్మొంది,
నీదాసు, సుజను, నింద్రియసౌఖ్యదమను
నాదిస్వరూప! ప్రహ్లాదుఁ బిల్పించి,
భాసుర రత్నప్రభాయుతపీఠి
నాసీనుఁడై వాని నాదరమొప్ప
"రార! నాముద్దుపుత్రా!" యని యొడిని
జేరిచి యిటులఁ బ్రశ్నించె నుత్కంఠ

"సకలశాస్త్రంబులు చదివితే, వేద
నికరమ్ము నెఱిఁగితే, నేర్పరివైతె
తనయుల మాటలు తల్లిదండ్రులకు
ననుపమానందదాయక కారణములు
నీవు నేర్చిన శాస్త్ర నిచయమ్ములందు
భావింప నీ కెద్ది భద్రమై తోఁచె
వినిపింపు'' మని తండ్రి పేర్మితో నడుగ
వినిపించె నీ రీతి ప్రియనందనుండు
"ధరణి నెల్ల శరీరధారు లిల్లనెడి
కరము బెట్టిదపు చీఁకటి నూతఁబడక
మీరు మే మనుమాట స్మృతికి రానీక
ధారుణి సకల మాతని దివ్యమహిమ 290
గా నెంచి శ్రీవిష్ణు కమలాక్షునందు
మానసముంచి కామముల నడంచి
తా మడవిని నుంట తద్ద మే లంచు
నా మది నేనెంచినాఁడ దైత్యేంద్ర"

అని యిట్లు శత్రుపక్షాను రూపంబు —
లనఁనొప్ప పల్కుల నాత్మజుండాడ
విని దానవేంద్రుండు వికవిక నవ్వి
యనియె నాశ్చర్యమగ్నాత్ముఁడై యిటుల
"నెటుల నెవ్వరుసెప్ప నితరుల శిశువు
లటులె సెప్పుదురు తా మటులిటు లనరు
కాని విరోధి పక్షంబైన బుద్ధి
వీనికేవారు నేర్పించిరో యెఱుఁగ

## హిరణ్యకశిపుని విచారము-ప్రహ్లాదుని మనోనిశ్చలత్వము :

అనిపుత్రుతోడ నిట్లనియె నతండు
"నమగన్న నా తండ్రి నాకు నాశ్చర్య
మును గూర్చెనయ్య యీ బుద్ధి నీలోన
జనియించెనా! మన శత్రువు లవిర!
గురుపుత్రు లేమైనఁ గొంక కేకాంత
ధరణి నిన్జేర్చి బోధనచేసి రొక్కొ
హరి దానవాళికి నపరాధి వాని
న్మరియింప నీకేల? చాలింపు పుత్ర
దేవతలను గణదేవతాదులను
భావింప నాగ నభశ్చరాదులను
మునిజనాదులఁ బట్టి ముప్పుతిప్పలను
బొనరింప కీరీతి మోహజాలములఁ
బడి హరి గిరి యని పలుకుచు నిట్లు
చెడిపోయెదేల యో చిన్నికుమార!"
అను తండ్రి పలుకుల నాలించి, గురులఁ
గనుఁగొని వాఁడనె కడు నిమ్మళముగ,

300

"ఎఱుక గల్గినవారి కెవ్వండుగాని
వరులుతామను భేదభావంబులేదు
అట్టి యెఱుకకు నాద్యమగు దైవమ్ము
నిట్టలమగు భక్తి నెఱిఁగి సేవింతు
వేదజ్ఞులైనట్టి వేధాదులేని
యాది పూరుషుని నయ్యనఘుఁ జెప్పంగ
వేర, రితరులు చెప్పవేర రెన్నటికి
ధారుణీ సురలార! తత్త్వమ్ము వినుడు.
ఇనుమయస్కాంతమ్ము వెటుసేరు, నటులె
వనజాక్షుఁజేరె నా స్వాంతమ్ము గరగి
మందారపుం దేవె మరగిన తేఁటి
యెందు నుమ్మెత్తకై యెటకేనిఁ జనునె 310
సురనదీ వీచులఁ జొక్కు తూఁగాడు
వరహంస చిట్టేళ్ల సజ్జకుంబోనె
తియ్యమావి చివుళ్లఁ దిను కోకిలమ్మ
యియ్యకొనునె యెప్పుడేఁ గుటజముల
వించువెన్నెల మఖియించు చాతకము
మంచుదిబ్బలఁజేర మదివెంచునెక్కొ
యా విధమ్మునవ శ్రీయంబుజోదరుని
పావన పాదాబ్జభజనామృతమ్ముఁ
ద్రావెడు నాదుచిత్తమ్మన్యములను
భావించునే! వేయి వల్కంగవేల!"
అనవిని రోషించి యా పురోహితులు
వనజనాభా! నీదు భక్తున కనిరి

"వైరిని బొగడుచు వంశమ్ముఁదెగడు
క్రూరతత్వమ్ము నీకుం దగదయ్య,

ఐదేండ్ల బాలుర వహహా! మాతోడ
వాదించెదే తర్కవాక్యముల్ పెక్కు
కలపిన శాస్త్రముల్ గంగలో గల్పి
శిరములు వంపజేసితి విభువెదుట"
అని మరి యిట్టుల ననిరి యావిప్రు
"లనయుఁడుపీఁడు; మురారి కితండు 320
తనయుఁడుగాఁడు, శాత్రవుఁడు శ్రీగంధ
వని ముళ్లవృక్షమ్ము వలెఁ బుట్టినాఁడు
దండనకేగానితగఁడు మన్నింప
దండింతమిఁక కొట్టుదము దయమాలి
దనుజేంద్ర పీనిని దండించి విద్య
లను చక్కనేర్పఁగలము నీదుపాద —
ములయాన, నీ కోపమును మానుమనుచు
బలుదెఱంగుల బాల ప్రహ్లాదునకును
వెఱపు చూపుచు వాని వేవేగ రాజు
పరసను దొలఁగించి చక్క దోడ్కొనుచుఁ
జని యొక యేకాంత సదనమ్ము నందు
మునుకొని పలుశాస్త్రములు నేర్పిరెలమి

ప్రహ్లాదుని రెండవతూరి హిరణ్యకశిపు రావించి పరీక్షించుట :—

అటులఁగొన్ని దినమ్ము లరిగిన పిదప
వటువు మిక్కిలి గుణవంతుఁ డయ్యెనని
చేతమ్ములమనమ్మి చెలఁగి యా శిష్య
మాతకు, దైత్యేంద్రు మహిషికిఁ దెల్పి
బాలు ప్రహ్లాదు నా బార్గవపుత్రు
లాలోకనము చేసి "అన్న! మామతము

వే మాత్రమే నసురేంద్రుని యెదుట
వేమరి త్రిప్పకు మెప్పుడేఁగాని, 330
మా నేర్పినవి యన్ని మట్టిలోఁ గలిపి
శ్రీనాయకుం గూర్చి చెప్పకుమయ్య
అని బుజ్జగించి యా యసురల గురులు
వనజనాభ! సురేంద్రవందిత చరణ!
అడుగద్దునను మాధవాయని నిన్ను
విడువక ధ్యానించు విబుధసన్నుతుని
పరమేష్ఠికే నలభ్యంబైన భక్తి
పురుషాకృతింబలెఁ బొలుపొందువాని
నీమీఁద చిత్తమ్ము నిల్పినవాని,
నీమయ మీసృష్టి నిజమనువాని
మతిమంతుఁ బ్రహ్లాదు మాన్య గొంపోయి
యతి వీరుఁడగు హిరణ్యకశిపుముందు
నిలిపి తండ్రికి మ్రొక్క నియమించి దైత్యుఁ
దిలకించి, దనుజపతీ! యసురేంద్ర!
నీతనయుండు దుర్నీతులుమాని
నీతిపారగుఁడయ్యె నిక్కంబుదేవ,
పరపక్షములుమానె భద్రంబుదెలిసె
నరయుమా వీని విద్యావివేకములు."
అవవిని రాక్షసుఁ డానందమొంది
తనకు నతుల్ సేయు తనయుని బాహు 340
దండంబుసాచి చెంతకుఁజేర్చి యొడిని
నిండుప్రేమునిడుకుంచి నెమ్మినిట్లనియె.

"చాలనచ్చెరువువత్సా! నిన్నుఁజూచి
కాలమెంతో యిట్లుగడచెగదయ్య,

శోధించి యెట్టి నిమ్మల శాస్త్రములను
బోధించిరో నీకుఁ బూజ్యులీగురువు
లెటుల వానిఁ బఠించి యెఱిఁగితోనీవు
పటుతర ధర్మ ప్రవర్తనాదులను
పద్యమొక్కండు తాత్పర్యమ్ముతోడ
హృద్యమ్ముగా పఠియింపుమా విందు
దనుజబాలకులు విద్యల నిమ్నమించు
మనులనివిందు నగ్గన్న నాతండ్రి,
నీవు నేనాఁటికి నీతికోవిదుఁడ
వై వెలయుదొయమనాశ మన్నాఁడ
నాకోర్కె దీర్పుమన్నా! ” యను తండ్రి
కాకుమారకుఁ డిట్టులనె యథార్థమ్ము

## ప్రహ్లాదునిమతము :

“ చదివించిరీగురుల్ చక్కఁగానన్ను
చదివితి ధర్మాదిశాస్త్రముల్ వేను
చదివినయట్టి యా చదువులలోని
సదమలధర్మముల్ చదివితితండ్రి. 350
చెలిమియు, వినికియు, సేవ, యూడిగము
తలఁపునెనెుకయు ధ్యానమ్ము, పూజ
నతి పొగడికయను నవవిధభక్తి —
యుతమార్గముల హరి నల్లమ్మునందు
వమ్మటమేలని నామదిఁ దోఁచె
వమ్మగాదిది సత్యవచనమ్ముతండ్రి
హరిభక్తి లేని గృహస్థధర్మమ్ము
కరము వ్యరమ్మగుగద దైత్యనాథ.

అరయంగ నరు కరాద్యంగ సంఘమ్ము
హరియర్చనాదుల కలవడెనేని
యప్పుడయని కరాద్యాఖ్యలనొప్పు
దప్పినఁ గర్మసాధన లనఁబడును.
దేవదేవునుతించు దినమెదినమ్ము
గోవిందుఁజెప్పెడి గురుఁడె గురుండు
తామరసాక్షు విద్యయె మంచి విద్య
దామోదరునిఁదెల్పు తండ్రియే తండ్రి.
మరి వినుజనక నామాటలుకొన్ని
సిరినాయకునిపూజ సేయకయున్న
కాయమ్ముతోల్తిత్తి కనులు జాలములు
చేయి గరిటె నోరు చెడవాగుథక్క 360
వింఁదుజన్మమ్మేని నీటిపైబుడగ
పండితుఁడు ద్విపాదపశువగుసుమ్ము.
తాపత్రయము లాపదల పరంపరలు
పాపముల్ సంసారబంధనములును,
జలజాక్షు పదసేవ సలుపకయున్న
తలఁగ వెంతటి వేదధర్మికినైన
హరిభక్తి లేకున్న నజునకునైన
పరమశాశ్వతముక్తిఁ బడయంగరాదు"
అని యిట్లు వెఱమాని యనుచున్నతనదు
తనయు భావములు శ్రోత్రముల బాణముల
వలెనాట రాక్షసేశ్వరుఁడు భూసురులఁ
దిలకించి యిట్లనెఁ దీంద్రకోపమున

## హిరణ్యకశిపుడు గురుపుత్రుల బెదరించుట :

ఓ విప్రులార! మీరుద్దండనీతి
కోవిదునిగ మరి గుణిగాగఁ దీర్త

మని నినిఁగొనిచని హరినిరతమ్ము
వినుతింపఁగలయట్టి విద్యనేర్పితిరి
బ్రాహ్మణులనిమిము భావించినాఁడ
బ్రాహ్మణులరె మీరు బ్రాహ్మణాకృతులు
"కలుషవర్తనులు రోగమ్ములపాలు
పలువలౌమనుజులు పాపాలపాలు" 370
అని హిరణ్యకశిపుఁ డాగ్రహావృత్తి
నన, విని బ్రాహ్మణు లనిరివ్విధమున
"దానవనాథ! శాత్రవునిశాస్త్రమ్ము
లేవాడు బోధించియెఱుఁగము మేము.
పగఱుఁదెల్పరు భవత్పాదమ్ములాన
నిగదింప నిద్ది వీనికి సహజమ్ము
నీపురోహితులము వేస్తులమయ్యు
నీపుత్రుఁజెఱుపంగ నీకు శత్రులమె,
దీనికిఁ బ్రతిచింత తెలియుటమేలు
మానుమ మావయి మలయు కోపాలు"
అను గురు నుతులపై నలుకను మాని,
తన పుత్రుఁగాంచి దైత్యపతి యిట్లనియె
"గురువరు లెన్నఁడీ కొఱగాని విద్య
గఱపరుగద! యేమ గన్నట్టినీకు
నెవరునేర్పఁగ నిద్దిహృదిఁబట్టువడియె
వివరింపు మాతని వినియెద నమఁడు
హరివాసుదేవ యా యమరారితోడ
నరమరలేక ప్రహ్లాదుఁ డిట్లనియె.

## ప్రహ్లాదుని మనోనిశ్చయము :—

"సంసారమునఁ బడి సత్పథంబులను

లిచ్చమెయిం బొంది యెపుడుఁ బుట్టుచును
జచ్చుచు నుండెడి జమలకు నొరులు
చెప్పినవైన స్వచింతవవైనఁ
దెప్పన శ్రీహరి దివ్యబోధనలు
మనమునఁబుట్టునే మరి వారిగుణము
పసిమన్న వారిని వదలదు తండ్రి
గ్రుడ్డిని నూఁతగాఁ గొనుచు వేరొక్క
గ్రుడ్డి యేమియును గన్గొనఁ జాలనటుల
కొందఱు కర్మముల్గొని కర్మబద్ధ –
మందజ్ఞులై విష్ణుమాధవుఁగాన
రటుగాక కందురాహరిఁ గొందరెపుడు
పటుతర వైష్ణవభక్తిభావమున
కర్మజాలముమాని, కలుషమ్ములేని
నిర్మలమతులయి నిఖిలాసురేశ
సకలశాస్త్రంబుల సారాంశమెల్ల
నకలంకబుద్ధి నేనరసితినయ్య
వేయిగాథలిఁకేల వెన్నునియడుగు
దోయి కొలువుతేప తోడ్పాటులేక
చెడుబుద్ధి సంసారసింధువుదాఁట
నొడికమౌత్రోవ వేరొండునేఁగాన" 390
ననిపల్కు కొడుకుపై నాగ్రహమ్మొంది
తనయూరువులనుండి తద్బాలుఁద్రోసి
కనులెఱ్ఱచేసి రక్కసరాజు మండి
తనమంత్రులంజూచి తానిట్టులనియె

"ఘనవరాహాకృతిఁ గడతేర్చె తనదు
పినతండ్రినమచుఁ గోపింపక వీఁడు

పగతు హరిని భక్తిభావాన మిగులఁ
బొగడుచుఁ దనప్రాణములనేని విడువ
నోడక నాతోడ నొంటమిఁబూనెఁ
గడు క్రూరుఁడౌ జనకద్రోహి నిట్టి
యనయుఁగంటిరె మీర లవని నెందేని"
అని యతఁ డసురుల కవల నిట్లనియె

"ఐదేండ్లవయసువాఁ డప్పయౌనన్నఁ
గాదని, భయ మించుకయులేక శత్రు
దలఁచుచున్నాఁడు వల్దన్నను వినఁడు
తెలిసె పుత్రుఁడను వ్యాధి జనించెనాకు
నంగమ్ములందు దుష్టాంగమ్ము నటికి
సిగాంర మొప్పంగ శేషాంగములను
దిద్దెడి వైద్యుని తీరున నిప్పు
డిద్దురాత్ముని, గుణహీను, గోవింద 400
పక్షపాతిని, కులపాంసను వీని
శిక్షింప కింకఁ జెచ్చెరను జంపించి
రక్కసకొలము నిర్మలివమ్ముచేసి
యెక్కువవిఖ్యాతి నెసఁగెడివాఁడఁ
గాన దానవులార! కాదనకింక
మాణవకుండను మాటికేఁబోక
కనికరింపక వీనిఁ గడతేర్పుఁడయ్య"
అని యతం డసురుల కాజ్ఞనొసంగె

## హిరణ్యకశిపునాజ్ఞవడసి, రక్కసులు ప్రహ్లాదుని బాధించుట:—

ఆరాక్షసేంద్రుని యాజ్ఞనుబొంది
ఘోరాకృతులనొప్పు క్రూరరాక్షసులు

పెనుబొబ్బలిడుచును భీతిఁగొల్పుచును
కినుకతోఁ బ్రహ్లాదుఁ గిట్టి యాతనిని
'బాలుఁడు, రాచపాపఁడు, లోకమాన్య
శీలుఁ'డనక క్రూరుచిత్తులై, కరుణ
చూపక యతిశాతశూలాయుధముల
పాపాత్ములయి వాని ప్రత్యవయవముఁ
బొడువ కనకకశిపుఁడు చూచుఁగాని,
విడుఁడింకయని యొక్కవిడుతయే ననఁడు
శూలముల్గొని రక్కసులు పొడ్చుచున్న
బాలుతనువు రవపాటియేఁగాని 410
యొలియదు, నల్పుగా, దుబ్బదునెత్రు,
నలియవెమ్ములు, దృష్టినష్టమ్ముగాదు,
మోమువాడదు, సొమ్మపోడమదు, దైన్య
మేమాత్రమునుదోఁచ దేమిచిత్రమ్మొ!
తను నిశాచరు లాయుధములతోఁబొడువ
'వనజనాభా! దీనబంధు! సర్వేశ!
జలజాక్ష! భక్తవత్సలయని నిన్ను
పలుమరు నెమ్మదిఁబ్రార్థించుఁగాని
కమల నీర్గార్చుఁడు కళవళపడఁడు
చనఁడుపర్విడుచు దిశల్చేరభ్రాంతిఁ
గరములొడ్డఁడు, బంధుగణముమాటునకు
నరుగఁడు, దుష్కృత్యమనితిట్టఁడయ్య
నముఁగులఁ బిలువఁ 'డమ్మా' యని తనదు
జననిగేహమునకుఁ జనఁడు, సద్భావ
రే 'యని యనఁడు, పరితాపడఁడు
నీయందు చిత్తమ్మునిల్పి శ్రీనాథ

కనకకశిపు క్రూరకర్మదండనలు
ఘను నీదుభక్తునికడ వమ్ములయ్యె

తానుచేయించెడి దండనల్ తనదు
సూను బాధింపనిచొప్పు( దా(జూచి 420
దనుజేంద్రు( 'డహహ! ఈదానవు లిసప
మొనలశూలమ్ములు పూని దేహమ్ము(
బొడుచుచున్నను వీ(డు భూమిపై(బడ(డు
జడిసి పర్వెత్త(డు జనకుని నన్ను
గదిసి "గోవిందు పక్షముమానితనుచు(
బదములవ్రాల( డపాయమ్మునొంద(''
డని విస్మయమ్మొంది యా యమరారి
తనసుతు మరిమరి దండింప(బూనె

కరులచే( ద్రొక్కింప( గాలాహితతుల(
గఱపింప, నగ్ని శిఖలను వేయింప,
కడలిని ముంపంగ, గట్లపై నుండి
యడుగునకుం ద్రోయ హాలాహలమ్ము(
బెట్టింప( బంపులు వెట్టి( దనూజు
గిట్టింప దేవారి కింకరావళికి(
గ్రూరు(డై మరియు పుత్రునిజంప( దంత్రి
మారణహోమ కర్మములు సేయించె
వెండల వానల విషమున గాలి
నుండ(బనిచె, నూర్పులుబ్బ( బట్టించె(
బుడమిని( బాలించె, బోనమ్ము నీరు
నిడకుండ(జేసె నిట్లెన్ని చేసినను 430
ఆ రాక్షసేంద్రు హత్యా ప్రయత్నములు
బీఱువోయెను నీదు ।ప్రియభక్తు నెడల

తన జతనములు వ్యర్థములౌట చూచి
కనకకశిపుఁ డాత్మఁ గడుచింతనొంది
“ఈ కులపాంసను నీ కులద్రోహిఁ
బోకార్పఁ బలు మార్గమ్ముల బెక్కుపాట్ల
నలయించితిని కడు నాశ్చర్యమయ్యె
పొలియఁడే యొక్క మార్గముననేని వీఁడు
మందులు నహి కాచు మనుజులులేరు
కందఁడు, కుందఁడు కడుదేజుతోడ
నున్నాఁడు వీఁడెట్టు లుక్కునో! వీనిఁ
గన్న, మహాత్ముండుగాఁ దోఁచె మదికి,
వీనికి హాని యెవ్విధమున లేదు
వీని పగయె నన్ను వెన్నాఁడు మిత్తి”
అని నిర్ణయించి యయ్యమరారి దైన్య
మునఁజాల ఖిన్నుఁడై మోమునువంచి,
చింతించు చుండ వీక్షించి యద్దనుజ
పొంతకుఁజని శుక్రు పుత్రు లిట్లనిరి.

## గురుపుత్రులు మరల ప్రహ్లాదుని గొనిపోవుట :-

“దైత్యేంద్ర! నీదు ప్రతాపమ్ము జగతి
నత్యుత్కటము, ఖ్యాతి యతి విపులమ్ము 440
కనుచూపునన త్రిలోకముల లోఁగొన్న
ఘనుఁడవు వీని లెక్కకుఁ గొనఁబోకు
ఈ రజ్జుపల్కుల కితని దుర్గుణమె
కారణమ్మగు, చింత కడద్రోయుమయ్య.
వక్రబుద్ధులు గురువరు సేవచేసి
సక్రమబుద్ధులై చరియించుచుంద్రు

వీఁడును శుక్రుసేవించి యామీఁద
వీడును తనమనోవిభ్రాంతివెల్లఁ
గాన శుక్రుఁడు వచ్చుకాలమ్ముదనుక
మానుమా వీనిపై మత్సరబుద్ధి"
అను గురుపుత్రుల యాప్తభాషణము
లను విని దనుజకులప్రవరుండు
తనమదిఁ గొంత శాంతముమాని, గురుల
తనయులతో "మీరు తగ నీవటునకు.
గేస్తితాన్వృపులు కాంక్షించి, పఠించి
నిస్తులమౌ రాజనీతి గ్రహించు
ధర్మార్థకామశాస్త్రముల మూఁడింటి
మర్మార్థములతో సమంచితరీతి
బోధింపుఁడీ'' యని ముదల యొసంగ
బోధకుల్ బాలుగొంపోయి యామీఁద 450
నల చతుర్విధ పురుషార్థమ్ములందు
తొలి మూఁడుశాస్త్రముల్ తుదిదాఁక విపుల
భాష్యమ్ముతోడఁ దప్పక వేరువేర
శిష్యున కేర్పడఁజెప్పి రక్కఱగ.

## ప్రహ్లాదుఁడు రాక్షసబాలురకు సత్యము బోధించుట :—

ఆపురుషార్థత్రయ మ్మనురాగ
కోపమాత్సర్యాది గుణబద్ధులగుచు
బాహ్యప్రపంచవిభ్రాంతులౌ ప్రజకు
గ్రాహ్యమ్ము; తనకునగ్రాహ్యమ్మటంచుఁ
దలఁచి ప్రహ్లాదుండు తనగురుబోధ —
నల ప్రశస్తములని నమ్మండుమదిని

ఆయొజ్జలు తమ గృహంబులఁ జేరఁ
బోయినవేళలు పొంచి, యత్తఱినిఁ
దను నాటలకుఁ బిల్చు దైత్యబాలురను
జనవునఁజేరి హాసవికాసవదన
మున వారిఁగాంచి యామోదమ్ముబెరయ
మునుకొన్న సంతోషమును వారుపొరయ
నాడుచునుండి "ఓయనుఁగుమిత్రములు!
చూడుఁడు గురులు పూజ్యులు నిక్కవమ్మొ
కాని, మనకు మేలుగలిగించు విద్య
లేనాఁడుఁజెప్పరే! యీనాఁటివఱకు 460
జెవులుచిల్లులువడఁ జెప్పుచున్నారు
మివులదగులముల మిడికెడు విద్య
లుత్తమవిద్య వేరొక్కటి మీకుఁ
జిత్తములుప్పొంగఁజెప్పెదవినుఁడు"
అని యేకతమ వారినందఱఁజేర్చి
వివరించె వేదాంతవిషయమ్ములిట్లు.

"బాలులారా! మనప్రాయంపువటులు
గూలుచుండుట మీరు గుర్తించియుంద్రు
అట్టిదేమనస్థితి యరయుఁడుమీరు
పుట్టుట చచ్చుట భువిఁబ్రాణితతికి
సహజ, మాదుస్థితిచాలించుటెట్టు?
లిహబంధములఁ ద్యజియించుటయెట్టు?
లను విచారము చేయునట్టి విద్యలను
మనగురుల్ చెప్పిరే మనకెన్నఁడేని,
కడువనర్థమ్ములు గలిగించు విద్య—
లెడపక మంచివం చెప్పియో యర్థ

కల్పనమ్ములఁజేసి గఱపుచునుందు
రల్పులావ్యర్థవిద్యల నమ్మియుంద్రు —
మనవారు సంసారమాయలోమునిఁగి
కనరు విడుపుత్రోవఁ గడువెట్టివారు 470
పలుయోనులందుండి పలుమారుఁబుట్టుఁ
దెలియఁడు తనుఁగూర్చి దేహియెన్నండుఁ
గర్మతంత్రుఁడు ముక్తిఁ గాంచఁడెన్నటికి
శర్మమ్మునహి, భవశతములకైనఁ
గాన సంసారానఁ గనరాదుశుభము
మానక పుట్టుచు, మరిఁజచ్చుచుండు
హీనమార్గమ్మున కెడమీకనరుఁడు
జ్ఞానియై పుట్టని చావనిత్రోవ
వెదకికొనుటమేలు వేయివిధాల
మదినిచింతించి నామాటఁగైకొనుఁడు ”
అనితెల్పి నరజన్మ మతిశ్రేష్ఠమనియు,
మనుజుని సత్యధర్మము లిట్టివనియు,
బోధించి, పురుషార్థములలోన మోక్ష
సాధన మత్యవసరకార్యమనియుఁ
దత్సాధనకు సత్పథంబిట్టిదనియు
వాత్సల్యమొప్పంగ వారికిఁజెప్పి
నారాయణుఁడు మును నారదమునికి
కారుణ్యమొప్ప వ్యాఖ్యానమ్ముతోడ
వినిపించెదీని, గోవిందువిదాస —
జనులకే వేద్యమిాజ్ఞాన; మన్యులకు 480
వేద్యమ్ము గాదని వివరించి చెప్ప
నాద్యంతముగ దాని నసురబాలకులు

విని ప్రమోదమ్మొంది, విస్మయమ్మొంది
యనిరి ప్రహ్లాదుతో నాకాంక్షమీఱ

"ఓమహితాన్విత, ఓయిప్రహ్లాద
మేము నీతోఁగూడి మెలఁగుచు గురుల
కడ విద్యలన్ని నీకరణిని జదివి
గడియించితిమి కొంతజ్ఞానమ్ము కాని
నీకీపరమవిద్య నేర్పినదెవరు?
మాకు సందియమయ్యె, మమ్మువన్నించి.
నిజమేమొ చెప్పుమా నిన్నెగురువిగ
భజియింతుమిఁక" యనిప్రాధీయపడెడు
దైత్యజులకతండు దయతోడఁదెల్పె
సత్యరూపము తన జ్ఞానకారణము.

## ప్రహ్లాదునకు నారదుఁడు హరితత్త్వమును బోధించినవిధము:

మందరశిఖరిని మాతండ్రి మున్ను
బృందారకులు కడుభీతిల్లునటులఁ
దపమొనరింప నాతనిశరీరమ్ము
విపులపిపీలికావితతిచే భోగి
వడువున భక్షింపఁబడుచుంటఁజూచి
'చెడుగీతఁ డింతతోఁ జెడు' నంచు భీతి— 490
మాని సురలు విజృంభణయుద్ధబుద్ధి
దానవజాతిపై దాడిగావింపఁ,
దగు యోధలేక యద్దనుజులు బెదరి
తెగి పరువెత్తిరి దిక్కుదిక్కులకు
నంతట నిర్జరు లసురరాజేంద్రు
నంతిపురము సొచ్చి యందలి సకల

విత్తమ్ముఁ గొనిచన, విబుధేంద్రుఁ డింద్రుఁ
డత్తఱి మాతల్లి, నతిభీతచిత్తఁ
జెఱవట్టి, నాయమ్మ సిగ్గిలి కురరి
తెఱఁగు నరచుచున్నఁ దెగువతోనతఁడు.
ఆలాగు మాయమ్మ నటుచెఱగొంచు
నాలేఖపతిచను నాదారి నెదురు
పడి నారదమహర్షి వారినిద్దఱినిఁ
బొడగాంచి యిట్లనె పురుహూతుతోడ
"పాకశాసన! స్వర్భువనపతీ! ఇంద్ర,
నాకనివాసులందఱలోన నీవు
పుణ్యమూర్తివి కాని, పొరపడి యీయ-
గణ్యసుచరిత, నకల్మషచిత్త
నాపన్నసత్వ నీయబలఁ బట్టితివి
పాపమౌ విడువిడు బదులాడఁబోకు 500
చూపునీరోషవిస్ఫురణమ్ము దనుజ
వేపడంగఁగ" నన నింద్రుఁడిట్లనియె
"మునినాధ! దనుజాధిపునివీర్య మీమె
తనయుదరమ్మునఁ దాల్చియున్నయది
యావీర్య మభివృద్ధియగునంతదనుక
నీవెలందిని చెఱ నేనుంచువాఁడ
నామీఁదఁబుట్టెడు నర్భకుఁ ద్రుంచి
యీమెనువిడిచి యేనెనసెదశాంతి"
అనువేల్పుఱేనికి, నావేల్పుఁదపసి
యనియె "ఈదైత్యరాజాంగనకుక్షిఁ
బెరుఁగుబాలుండు నిర్భీకుండు, విష్ణు
చరణసరోజపూజామానసుండు

పరమభాగవతుఁడు, వాసవా! నీదు
దురహంకృతినిఁగాని, దురమునఁగాని
చావఁడు వైష్ణవశక్తిసంపన్నుఁ
డీభావమును మానుటే నీకుశుభము"

అమ్మౌని పలుకుల నమరనాధుండు
నెమ్మిని భక్తి మన్నించి, యాలించి
భాగవతుం డౌట భక్త బాంధవము
బాగుగ గుర్తించి పరమాప్త బుద్ధి 510
మా తల్లి చెఱమాన్పి, మరిఁజుట్టు దిరిగి
జోత లర్పించి యచ్చోటు వాసి చనియె.

పదపడి వేల్పు తపస్వి మజ్జననిఁ
బొదలు ప్రేమంబునఁ బుత్రికగాఁగ
భావించి తన తపోవనికిఁ గొంపోయి
"ఓ వనితామణీ! యులు కింకమాను
పరమ సాధ్వివి, నీదు భవ్యగర్భమున
వరభాగవతుఁడగు ప్రాణి యున్నాఁడు
తనదు తపో మహత్వమునఁ గృతార్థ
తమజెంది నీ పతి తానిట వచ్చు
నందాక నీవుండు మమ్మ యిచ్చోటఁ
బొందెదు మంగళమ్ములు పెక్కు నీవు."
అని మునియోదార్ప నాలించి నాదు
జనని యోచించి వైషమ్యమ్ము ద్రెంచి
యానందమొంది భర్తా గమనమ్ము
మానసమ్మున నమ్మి మౌనిశుశ్రూష
లెలమిఁ జేయుచు భీతి యించుకంతేనిఁ
దలఁపున నుంపక తా మండె నచట.

తనకు సేవ లొనర్చు దైత్యేంద్రు సతికి
ముని నారదుండు ప్రమోదం బెసంగ 520
నభయం బొసంగి, యాయమను గాచుచును
శుభమని యాతల్లి చూలున నున్న
నను గుఱిగాఁ జేసి నానాఁడు ధర్మ –
ఘనతత్త్వవిధము నిష్కల్మషజ్ఞాన –
సరణి బోధించె మజ్జనని తద్బోధ
మరచె నానాఁటికి మహిళగావునను
కాని యా సురముని కారుణ్యపూర్ణ
మానస మెపుడు నన్ మన్నించు కతన
దైవయోగమున నా తపసి సద్బోధ
మావంత కొఱఁతలే కంతయు నాదు
స్వాంతాన నిలిచె విస్మరణమ్ము గాక
మంతనమ్మందు నమ్మహనీయ విద్య
వినిపింతు నా వయి విశ్వాసముంచి
వినుఁడు మీ మీ యవివేకముల్ వాయు."

అని నారదోక్త మార్గానుసారమ్ము
నన దైత్యజులకు దానవ చక్రవర్తి
కొడుకు ప్రహ్లాదుండు గురుతత్త్వసత్య
మెడఁదల బట్టంగ నెఱిగించి, గురుల –
సేవయు సాధుల స్నేహమ్ము వాసు
దేవుని స్మరణ మింద్రియ నిగ్రహమ్ము 530
సకల భూతముల నీశ్వరదృష్టిసమత
యకలంక చరిత మిత్యాదిగుణమ్ము
లలవడఁజేసి నిజాచరణమ్ము
లల జలజాక్షున కర్పణమ్మనుచుఁ

గావింపుడీ మీకుఁ గైవల్యమబ్బు
నీ విధమ్మగు భక్తియే సుఖదమ్ము
భవబంధములఁ ద్రెంప పంకజనాభు —
ప్రవిమల భక్తియే పటుతరాయుధము"
అని యిట్లు ప్రహ్లాదుఁ డసుర బాలురకు
దినదినమును జెప్పఁ దెలివొందివారు
గురుని పాఠమ్ములకుఁ స్వస్తి చెప్పి
హరిని భజించు మహా భక్తులైరి
బాలుర హరిభక్తి భావమ్ము నెఱిఁగి
చాల భయమ్ము విస్మయము తామొంది
శుక్రతనూజు లా చొప్పు వైనముగ
శక్రారి యాలకించఁగ నిట్టు లనిరి

## గురుపుత్రులు ప్రహ్లాదుని మతము మార్పఁ తమకు వశము గాదని హిరణ్యకశిపునకు చెప్పుట :—

"ఓ దైత్య రాజేంద్ర ఓ యశస్సాంద్ర
మాదగు విజ్ఞప్తి మన్నింపుమయ్య
అమరవైరుల బాలురందఱ నీదు
కొమరుఁడు తన చెంతకుం జేరఁదీసి 540
మా యుపదేశముల్ మానవతతికి
శ్రేయముల్ గావంచుఁ జెడుత్రోవలంచు
విపరీతభావముల్ వినిపించి, వారి
కపవర్గ పద్ధతి యాత్మలం దదుక
బోధించె వారు నీపుత్రోపదేశ
మాధారముగఁగొని యలరుచున్నారు.
హరికథనముఁజెప్పుమంచు మాహితము
నిరసించుచున్నారు నిర్జరారాతి

మోసపోతిమి నీదుపుత్రుని మేము
శాసించి చదివింపఁ జాలము, నిజము
దానవాన్వయమునఁ దా జనియించి
మానఁడు హరిచింత మాకిదివింత
నీనేర్పుఁజూపి వానిని జక్కఁజేయఁ
బూనుము గౌరవమును నిల్పికొనుము''

అమ్మాట లాహిరణ్యకశిపు చెవుల
కమ్ములపోటులై యతిబాధఁగూర్పఁ
గోపాగ్నిచే నొడల్గుముల నతండు
పాపమ్మనక పుత్రుఁ బరిమార్పనెంచి
వానిరప్పించి కృపాగౌరవములు
మాని గర్జించి యిమ్మాడ్కి దా ననియె 550

## ప్రహ్లాద, హిరణ్యకశిపుల సంవాదము:-

"ఓరి దుర్మార్గ! నీ యుద్ధతి మిగుల —
మేరమీరినది క్షమింపనిన్నింక
జనకుని నన్ను, నాస్థైర్యవీర్యములు
కనియును వినియు లెక్కకుఁగొనవీవు
నాదు నాదేశంబుననఁగాని దాఁటి
పోదు స్వేచ్ఛగ సృష్టిభూతవర్తనము
పంచభూతములు దిక్పాలురు దేవ
సంచయ మర్కాదిసకలగ్రహములు
ఎవరేని మదభీష్టమెట్టిదో యెఱిఁగి
సవరించెదరు వారుజరుపుకార్యములు
జగములన్నిటిఁ నొక్కక్షణములోగెల్చి
పొగడితలందితి భువనత్రయమునఁ

గంపించు మూడులోకమ్ములు నాదు
పంపుఁదెంపునెఱింగి బదులాడలేక
బలశౌర్యధైర్యసంపన్నుఁడేయైన
జలజనాభుఁడు నాకు సంగరమీఁడె
నీకు దిక్కెవ్వరో నిజమునేఁగందు
దక్కదు నీప్రాణతతి చూడు మూర్ఖ"
అని ప్రగల్భమ్ముల నాడెడు తండ్రి
కనియె కొడుకు వినయమ్ముదైవాఱ 560

"భూతసంతతికి వేపురుషండుబలమొ
యాతఁడేబలము నాకగు నసురేంద్ర
దిక్కఱియుండెడి దీనుల కెవఁడు
దిక్కొ యతఁడె నాకుదిక్కమరారి
సర్వసృష్టిస్థితి సంహారకర్త
సర్వాత్మకుని జగత్సాక్షిని హరిని
వైరిగాఁ దలఁచు నీభావమ్మువమ్ము
నారాయణుఁడె నీకు, నాకునుదిక్కు
చిత్తంబు సమముగాఁ జేసితివేని
యెత్తఱి వైరి నీకెందునులేఁడు
గడెలోన సకలజగమ్ముల గెలిచి
గడియించితివి ఖ్యాతిఁ గాని, చిత్తమ్ము
నింద్రియమ్ముల గెల్వవెటు నిన్నునణఁచు
సాంద్రభీకర శత్రుషట్కమ్ము వమ్ము —
గావింపు, మనల లోకములందు నీకు
భావింపనుండఁడు పగతుఁడొక్కరుఁడు
కర్మబంధములను ఖండించి వైచి
శర్మమౌ మార్గమ్ము స్వాంతమందెంచి

చాలింపు మిఁకనైన సంసారరక్తిఁ
గీలింపు హృదయాన కేశవభక్తి" 570
అనినఁ బ్రహ్లాదు నయ్యసురనాథుండు
గని యిట్టులనియె కర్కశభాషణముల

"ఓరి! చంపెదనన్న నోడక సత్య
దూరోక్తులను బల్కుదువె యెదురొడ్డి
నాకన్న నీభువనత్రయమ్మందుఁ
బ్రాకట పూర్ణప్రభావసంపన్నుఁ
డితరుఁడు లేఁడు నీకీభ్రాంతియేల
వెతకితిఁదొల్లి యీవిశ్వమంతయును
మదనుజునిం బరిమార్చిన విష్ణు –
మదమణగింపఁ బల్మారు నాకూళ
కనఁబడఁడెచ్చటఁ గడుభీతి డాఁగి,
మనెనేమొ యిఁక వానిమాట నీకేల
పోనిమ్ము, వాఁడెట్టిపొలుపున నెందు
నే నియతిని నుండు, వేజాడవచ్చు
నెఱిఁగింపు నిను వాని నెసరేఁగి చంపి
మెఱయింతు నాదు సమీకప్రసిద్ధి"
అని క్రుద్ధుఁడై పల్కనతనికి హరిని
నినుమనమ్మనవమ్మి నీరజనాభ
బాలవర్తనమునఁ బ్రహ్లాదుఁ డపుడు
కేళిఁదేలుచు నమస్కృతి నీకొనర్చి 580
భవదీయ సంపూర్ణవైష్ణవశక్తి
వివరించె తండ్రికి వినుమని యిట్లు.

"జలజనాభుండు రాక్షసరాజచంద్ర!
కలఁడుసాగరమందుఁ గలఁడువాయువునఁ

గలఁడు వ్యోమమునందుఁ గలఁడుధరిత్రిఁ
గలఁడగ్ని దిశలను, గలఁడు పగళ్లఁ
గలఁడు రాత్రుల, దివాకర నిశాకరులఁ —
గలఁ డా మహాత్ముఁ డోంకారమ్మునందుఁ
గలఁడు త్రిమూర్తులఁగలఁడు త్రిలింగ
కలితరూపములందుగలఁడు నిక్కముగ.
నందులేఁ డిందులేఁడను శంకయేల
యెందుఁజూచిన నతఁడెసఁగియందుండు ”
అని నిన్గురిచి సమస్తాకృతులందుఁ
గనవచ్చు నెల్లడఁగలఁడని పుత్రుఁ
డనుచుండ; లేఁడులేఁడని తండ్రి బాలు
కినుకమై బెదరించి క్రీడించుచుండ,
నారాయణా జగన్నాటక సూత్ర —
ధారి, శ్రీవైకుంఠధామ, నీవపుడు
నానాచరాచరాన్తర్భాగములను
శ్రీనృసింహాకృతిఁ జెలువొందియుంటి. 590

## శ్రీనృసింహావతార ఘట్టము :-

ఆసమయంబున నద్దానవేంద్రుఁ
డీసునతవనుతు నీక్షించి, “ ఓరి,
డింభకా ! నిన్ను ఖండింతు నీయింటి
స్తంభాన నీదుకేశవుఁడు లేకున్న ’’
ననుఁడు నాబాలకుఁ “ దసురేంద్ర విష్ణు
డనఘుఁడు విశ్వమ్ము నంతయునిండి —
యుండ నీ స్తంభాన నుండఁడా యేల
మెందు సందేహాన మిడికెదవిట్లు ”

అనవిని రక్కసుం డాగ్రహమ్మొత్తి
కనకవసముఁ డిందుఁ గలఁడే యటంచుఁ
దన యఱచేతితో స్తంభంబు నొండు
ఘన బలమ్మున మోఁదెఁ గటకట పడుచుఁ
నామోఁదు తోడ సర్వాశలు వగుల
భీమమౌ చిటపటల్ ఫెళఫెళార్భటుల
తోడ మిడుంగురుల్ స్తోమంబుగాఁగ
జడిపట్టి పడుచుండ స్తంభంబుఁ జీల్చి
కొనఁజేసి, యందుండి కోపమాకృతిని
బొవరినట్లుల వీరమున రౌద్రమొకటి
గాఁ గూడి నట్టులఁ గన్పడుచుండఁ
గ్రాఁగు కన్నుల నిప్పుకలు రాల్చుచుండ
శ్రీనృసింహాకృతి క్షితికి లంఘించి
హూనితి ఖలు శత్రుఁబొలియింప నపుడు 600

## హిరణ్యకశిపువధః -

నిను విచిత్రాకృతి వెలిఁగన్నవానిఁ
గనులారఁ గని హేమకశిపుఁడు మిగుల
నచ్చెరువొంది "యాహా యిదియేమి
యెచ్చటవేఁ గలదే యిట్టిరూపు
నరరూప మంచు నెన్నంగనుగాదు
హరిరూపమే యని యనుటకుం గాదు
నరహరి రూపమనంగ నబ్రమ్మఁ
బొరయించునట్టి రూపున దోఁచెనిద్ది
యతని వైష్ణవ మాయయగుఁ నిక్కమమ్మ
వితథంబుగాదు వివేకించి చూడ

బాలకుఁ దనిన సర్వగతత్వ మహిమ
మీలాగు చూపఁగ నెంచి నృసింహ
దేహుఁడై హరినను దెగటార్చు కొఱకు
సాహసమున వచ్చెఁ జావు నా కతని
చేతనేమో, యని చింతింతువైన
నాతెంపు వీరలందఱు చూచునట్లు
సమరమ్మొనర్చి యీ చక్రిని జంపి
విమల విఖ్యాతిని విలసిల్లువాఁడ" 610
నని గదా దండంబు హస్తానఁ బట్టి
దనుజుఁడు నీ పయి దర్పించి దుముక
గరుడుఁడు ఫణిఁ బట్టు కరణిని వానిఁ
బరమ లాఘవమునఁ బట్టి యూరువుల –
నదిమి యా రాక్షసు నవయవములను
బదనగు చేగోళ్ల వలుతెఱంగులను
చీలిచి చంపి, చెచ్చెఱ వాని భటులఁ
గూళ దైతేయులఁ గూలిచి తీవు.

నీ విజయమ్మును నిర్జరుల్ చూచి
భావముల్ పొంగ పుష్పముల వర్షమ్ము
గురిసిరి మరియు నెక్కొన్న మోదమున
సరసిజాసనముఖ సర్వదేవతలు
బాల ప్రహ్లాదుండు వరమునీశ్వరులు
చాలుగాఁ నీ ముందు సద్భక్తి నిలిచి
నిను నుతియించిరి, నీవు శాంతించి
కనికరమొప్ప భక్తజనమ్ముఁ గాంచి
శ్రీరమాదేవి నీ చెంగట నుండ
వారికి సౌమ్య రూపమున దర్శనము

విభవమ్ముగాఁ గూర్చి విశ్వభవ్యమున
కభయమ్ముఁ గరుణించి యాదరించితివి 620
జేజేలు నీకు లక్ష్మీ నరసింహ
జేజేలు గోవింద, జేజే ముకుంద.

ఘన తపస్సంపన్న గర్వమ్ము చేతఁ
దనుఁదాను దెలియు తత్వమనీష లేక
వేన సర్వ నియంత నిఖిలమ్ము నందు
గాన నా కన్న నుత్కర్షుఁడౌవానిఁ
గనమని కొంద ఱజ్ఞానమ్మునందు
మునిఁగి యుందురు సత్యబోధనల్ వినరు
పరమ భాగవతుల భద్రభావములఁ
జెఱుపఁ జూతురు తామె చెడిపోవుచుంద్రు
పెక్కువిధుల వారిఁ బీడించుచుందు
రక్కటికము స్వాంతమం దుంచఁబోరు
కాని నిన్ గొల్చు భక్తవరుల కవ్వి
హానిఁ గూర్పఁగఁజాలవయ్య గోవింద.
గర్వమ్ము నాయందుఁగలదేని దాని
నిర్విశేషముగ మాన్పింపుమో దేవ!
హరిదాసబోధన లాలించుబుద్ధి
హరిదాససేవ నాకలవడఁజేసి
నాదు దోషమ్ములెన్నక కరుణించి,
నీదాసజనదాసునిగ బ్రోవుమయ్య 630
కేమోడ్పులివియ లక్ష్మీనరసింహ
పామరుఁడను నన్నుపాలింపుమయ్య

ఫలశ్రుతి :

వరభక్తుఁడైన యీ ప్రహ్లాదుచరిత
దురితవిదూరమ్ము దుఃఖనాశమ్ము

ఈపుణ్యచారిత్ర మెవ్వఁడే వినిన
పాపనిచదిపన భక్తి వ్రాసినను
సకలశుభంబులు సంప్రాప్తమగును
ప్రకటమోక్షమ్ము కరస్థమేయగును

---

# త్రిపురాసుర సంహారము

* * * * *

శ్రీరమా హృత్సరసీరుహమిత్ర
కారుణ్యమయగాత్ర కంజాతనేత్ర
మాయాప్రపంచ సంబంధవర్తనకు
నేయుత్తమజ్ఞానియేని యొకప్పు
డేమటి చింతించు టెందును విందు –
మామాయలను నీవె యణచుచుండుదువు

## అసురులు అమరుల బాధించుట:

మున్నొకప్పుడు వేలుపుల కోహటించి
ఖిన్నులై యసురులు కీడ్పాటునొంది
తమశిల్పి మయుని చెంతకుఁజని తమకు
నమరులచేఁ చావు నపజయబాధ
కలుగనియట్టుల గరుణింప వేఁడఁ
గలితమాయాగుణకష్టుఁడామయుఁడు 640
నిజయోగబలమున వేర్పుమై భర్మ –
రజతకాలాయస, ప్రచురమయమ్ము

లనుపమ కఠిన పటాచ్ఛాదనమ్ము
లనితరగోచరమగుగమనమ్ము
లగు పురమ్ముల మూటినపుడునిర్మించి
దిగులుమానుండని దితిజులకొసఁగె

రక్కసు లాత్రిపురమ్ములు తమకు
నిక్కలుగాఁజేరి యెసగుగర్వమునఁ
బూర్వవైరము మనమ్మునఁబెంచి సర్వ —
గీర్వాణజాతికిఁ గీడు చేకూర్పఁ
గామసంచారులై కర్కశబుద్ధి
భీమబలోద్ధతి వెఱపునుమాని
సకలసనాయక జగములనెల్ల
వికలమ్ముగాఁజేసి వేధించుచుండ.

## శివుని అమరులు శరణుచొచ్చుట :

లోకపాలకులు పెల్కుటి చాలవెఱచి
శోకచేతస్కులై శుభ్రాంశుధరుని
సకలలోకేశుని శంభునిజేరి
ముకుళితకరులయి మ్రొక్కి నుతించి
"దేవ, మహాదేవ దీనసంరక్ష
శ్రీవామదేవ ఆశ్రితజనపక్ష 650
త్రిపురాసురులు బలోత్సేకంబుతోడ
నపరాజితులయి మమ్మనవరతమ్ము
బాధించుచున్నారు పలుతెఱంగులను
గ్రోధమ్ము మాపయిఁగూఁగియున్నారు.
దీనుల యుష్మదధీనుల శక్తి —
హీనుల శరణమీవేయను మమ్ముఁ

బాయని వాత్సల్యభావానఁజూచి
యాయపరాధుల హతముగావించి
మాభీతిఁ దొలగింపుమా యనివేఁడ
నాభవుండమరుల కభయమ్మొసంగి

## శివుడు త్రిపురాసురుల సంహరించుట :

బాణాసనము చేతఁబట్టి నిశాత
బాణమ్మునొండు దివ్యప్రభావమ్ము
గలదాని త్రిపురముల్ కలగుండుచెంద
బల పరాక్రమములు వరగంగవైవ
రవిమండలమునుండి ప్రభవించు కిరణ
నివహమ్ములవెడు సందియమగునట్టు
లాదివ్యబాణమ్ముసందుండి పెక్కు
దేదీవ్యమానముల్ తీక్ష్ణబాణములు
పొడమి భూమ్యాకాశములుఃనిండి మండి
కడువడిఁ ద్రిపురముల్గప్పెఁదద్బాణ 660
పావకహేతి విస్ఫారతాపమున
జీవముల్వాసిన జేజేలరిపులఁ

## మయుడు చచ్చినఅసురుల బ్రదికించుట :

దనయోగమహిమ సిద్ధరసకూపమ్ము
నొవరఁగల్పించి మయుండు గతాసు
లగు త్రిపురాసురులను దెచ్చి దాన
నొగి వేయుచుండ నాయుత్తమసిద్ధ
రసమహిమను వారు ప్రాణముల్వొంది
వెస జవసత్వముల్ వెలయుచుండంగ,

నావింతఁగని శివుఁ డామయుమాయ
భావించి యమ్మాయఁ బాయంగఁజేసి
త్రిదశుల రక్షించు తెఱఁగిట్టిదనుచు
మదికిఁదోఁచక చింతమఱుగుచునుండె

**విష్ణువు మయుడు నిర్మించిన కూపరసమ్మును త్రావుట:-**

సకలలోక శరణ్య సర్వనియంత
అకలంక చరిత! దాసావననిరత
హరి! చతురాననా ద్యఖిల దేవతలు
పరికింపఁగా నీదు ప్రతినిధులయ్య
ముమ్మూర్తులకు మూల పురుషుఁడ వీవె
యెమ్మెయిఁ జూడ నీవే దిక్కు జగతి
కేవేళ కెయ్యది యెటులఁ గావలెనొ
యావేళ కయ్యది యటులఁ గావించు 670
సర్వశక్తివి నీవె చక్రి దైత్యారి
శర్వుని వెతఁబాపి జయము గూర్పంగ
దలఁచితి పాఁడి మొదవు రూపుఁ దాల్చి
జలజోద్భవుండు వత్సమయి నీ వెంటఁ
బడిరాఁగ యాధమ్ముఁ బసివట్టు కరణిఁ
బుడమి ఘ్రాణించుచుఁబోయి, యా కూప
మధ్య రసమ్ము నెమ్మదిఁ ద్రాగితీవు
సాధ్యమా యొరుల కీ సాహస కృత్య —
మసురు లా కూపము నందున్న సిద్ధ
రస మొక ధేనువు త్రావుచునుంట
వచ్చుట నుండియు నా వింతఁ గనియుఁ
జచ్చి బ్రదికిన నుత్సాహాన మునిఁగి,

యారసమంతయు నానెడి గోవు
వారింపరైరి, దైవబలమ్ము దప్పి,
యా విధమ్మునను నీవాకూపసిద్ధ
జీవరసమ్ము వైచికి యనురూపు
తో నరుదెంచి సంతుష్టి సర్వమ్ము
నాని వెళ్లుటయు నా యసురుల మూఁక
తమ మోహ బుద్ధికిఁ బ్రదపచాలనొంది
విషనులై యుండుట వీక్షించి యోగి 680
మాయలాఁడును నగు మయుఁడు లోలోన
నీ యుపాయమునకు నీరజనాభ!
వెఱగంది దైవమ్ము విపరీత మగుట
యెఱిఁగి యా దైత్యుల నిటుల నోదార్చె.

## మయుడు అసురుల నోదార్చుట:-

"దితిజులు! మీరు చింతిల వలదింక
గతమును గూర్చి వగవ ఫలమేమి?
యనిమిషులేయైన నసురులేయైన
మనుజులేయైన నే మహనీయులైన
దైవ నిర్ణయమును దప్పింపలేరు
కావున మనముల కలఁత మానుండు"
ఆ మాటలెల్ల నా యసుర సంహతికి
ప్రేముడి శాంతమ్ము పెక్కుగాఁ గూర్చె

## శివుఁడు త్రిపురముల భస్మము చేయుట:-

అంత ననంతుఁడ వాదిదేవుఁడవు
శాంతమూర్తివి సర్వసాక్షివి నీవు

సకల ధర్మజ్ఞాన సత్తపో మహిమ
ప్రకట విద్యా మంత్రబల సంయుతములు
సర్వోత్తమంబులౌ సర్వశక్తులను
శర్వున కర్పించి సమరోపయోగ
రథసూతకేతు ఏర్మములను మరియు
ప్రథితమ్ములౌ ధనుర్బాణాదికమ్ముల 690
ననువుగాఁ గూర్పించి తాప్యాయనముగఁ
దనిసె నెడంద చంద్రకళాధరుండు.
వామదేవ మహానుభావ సర్వేశ
శ్రీసితికంఠుఁడు శిఖరిజాప్రియుఁడు
ధనురస్త్రములు తన త్రాణముల్ దాల్చి
ఘనకేతుయుత శతాంగము నెక్కి సైన్య —
యుతుఁడయి మిక్కలి యుగ్రరూపమున
నతి భయంకరమగు నస్త్రమ్ము వేయ
నయ్యస్త్ర జనిత మహానల శిఖలు
చయ్యన ప్రాకంగ ఛట ఛట ధ్వనులు
భూనభంబులు నిండ పురములు మూఁడు
నానావిధమ్ముల నాశమై కాలె
నారీతి నభిజిన్మహా ముహూర్తమున
ఘోరపురత్రయిఁ గూల్చి భస్మంబు
గావించినట్టి శ్రీకంఠుని శివుని
దేవగణమ్ము భక్తిని నుతియించి
కుసుమ వర్షమ్ముల గురియించె నెలమి
వసుధ వెల్లెడ మహా వైభవమబ్బె

శ్రీ తరుణీమణీ హృదయానురాగ
పీత కౌశేయ శోభిత కటిభాగ 700

ఖలశిక్ష సాధు రక్షయ భవన్నిరతి
యలతులు నీ యాశయములకు భంగ..
మొనరింప యత్నింతు రుద్ధతిఁ దుదకు
కనఁబోరు విజయమ్ముఁ గాంతురు వంత
మయుని మాయలనెల్ల మట్టిలోఁ గలిపి
జయము శంకరునకు సమకూర్చినట్టి
నీ మహామహిమ లనేకముల్ వాని
నా మనమ్మునను ధ్యానముఁ జేసికొనెడి
జ్ఞానమ్ము నాకుఁ బ్రసాదింపుమయ్య
నా నేరముల గణనము వలదయ్య
దాస జనోద్ధార దైత్య సంహార,
భాసురాకార సద్భక్త మందార

---

## నారదుని పూర్వజన్మ వృత్తాంతము :—

శ్రీ రమానాధ శార్ఙ్గి వాసుదేవ
వారిజనాభ ప్రభాయుక్తభావ
నీ భజనలుమాని నెలఁతుల సహజ
శోభనమ్ములఁజూచి చొక్కి యా సతుల
మరులెత్తి తిరిగెడు మానవజాతి
దొరయుచుండు నధోగతుల్ పద్మనాభ

## ఉపబర్హణుఁడను గంధర్వుఁడు శపింపఁబడుట :-

తొలి నొక కల్పమందునను గంధర్వ—
కులుఁ డుపబర్హణాఖ్యుం డొకఁడుండె 710
నతఁ డతి సుందరుఁ డగుట సుందరుల
కతిప్రియుఁడై యుండు ననవరతమ్ము

ముము నవబ్రహ్మలిమ్ముగ దేవదత్త –
మను యాగముం జేయు నవసరమ్మునను
నారాయణా! భవన్నామముల్ కథలు
పారాయణము సేయఁ బాడించఁ గోరి
పిలిచి రచ్చరలనుఁ బేర్మి, గంధర్వ
కులము వారిని గూడఁ గుతుకంబుతోడ
నాహ్వానితుఁడతోడ నా యుపబర్హ
ణాహ్వయ గంధర్వుఁ డట కేగుదెంచె.

పతిత పావన పరబ్రహ్మ స్వరూప
నతజనసంరక్ష నలినాయతాక్ష
గోవింద నీ దివ్యగుణ కీర్తనములు
భావించి గంధర్వపతి కొన్నిపాడి
యచ్చర లటనుండి యరుగుచునుండ
విచ్చలవిడి వారి వెనువెంట దగిలి
ఘనుల బ్రహ్మలనైన గణియింప కతఁడు
చనియెను వలపు జంజాటమ్ము తోడ

తమ్ముఁ గైకొనక సుందరులను గూడి
యమ్మెయిఁ జనుచుండు నట్టి గంధర్వుఁ 720
గని నవబ్రహ్మలు కడు నాగ్రహమున
"వనజాక్షు నచ్యుతుఁ బాడక వీఁడు
చానలతోఁగూడి చనిన పాపమున
మానగు నిజకాంతి మాయమైపోవఁ
బుడమి శూద్రస్త్రీకిఁ బుత్రుఁడు గాఁగఁ
బొడమెడు" నని శాపమును నిడిరంత

శపితుఁడగు ఉపబర్హణుఁడు మఱుజన్మమున నారదుఁడై
పుట్టుట :-

ఆ యుపబర్హణుఁ డాశాప వశత
నీ యుర్వి శూద్రయో నింటికిఁ బుట్టి
పరతాపసులకు సేవలుచేసి దాన
పరమపూరుష నీదు వరభాగ్యమంది
వేరొక కల్పాన విధిపుత్రుఁ డగుచు
నారదాఖ్య జనించినాఁడు సర్వేశ.

మధుసూదనా! యెట్టి మనుజుఁడే గాని
విధి హరేంద్రాదులౌ విబుధులేఁగాని
మరి యెవ్వరేఁగాని మమతను బెంచి
నిరయమ్ముఁ గూర్చు నింద్రియ సౌఖ్యములకు
మరగి నీ సేవలు మానిన భీతిఁ
బొరయించు కష్టముల్ వొందుదురయ్య
కాని భవత్కృపఁ గనిన నరునకు
మాను పాపముల్ మహిమలుఁ బెరుగు 730
నింద్రియలోలుఁడ హీనుఁడ కొలల
సంద్రానమునిఁగిన జడుఁడను నన్ను
నీ సన్నిధిం జేర్చి నినుఁ గొల్చు దాస –
దాసునిఁగాఁజేసి దయనేలు దేవ

ఫలశ్రుతి :

ఈ సప్తమస్కంధ మేప్రొద్దు నరుఁడు
భాసుర భక్తితోఁ బఠియించెనేని
ఘోర పాపమ్ములకుం గుఱిగాక
నీరజనాభు సన్నిధిఁ జేరవచ్చు. 734

సప్తమ స్కంధము ముగిసెను.

# అష్టమ స్కంధము

**యజ్ఞావతారము :—**

శ్రీ చక్రపాణి శార్ఙ్గీ వాసుదేవ
వాచంయమీ మనోవాస సద్భావ
నీ ఎప్పు డప్పుడు నీరజనాభ!
యీ విశ్వమున జనియించుచునుందు
నా యవతారము లఖిల జగత్తు
శ్రేయమ్ము వడయు ప్రసిద్ధ హేతువులు.

మనువు స్వాయంభువు మహనీయుఁ డతని
తనయలందుఁ గనిష్ఠ తనయయైనట్టి
దేవహూతికి పుట్టితివి యజ్ఞుఁడనఁగ
నీ విశ్వ కల్యాణ మెదవెంచి నీవు

మనువు 'నీ, నా' యను మమతలు దుడిచి
తన సతి శతరూప తగులము న్విడిచి
రాజ్యాధికారానురాగాదు లెల్ల
త్యాజ్యమ్ము చేసి నిజాంగన తోడ
వనమునకుంజని వరసునందాఖ్యఁ
దనరు తరంగిణీ తటమునఁ జేరి
పరమేశ్వరుని నిన్ను భావానసుంచి
వర యుపనిషదర్థ భద్రసంస్తుతులఁ
గావించుచును గడు క్రమనియమముల
వేవేళ నేమర నేకపాదమున
నిలిచి తపమ్మును నెమ్మి నూరేండ్లు
చలనమ్ముగానీక సాగించుచుండ

10

ఆ తపోనియము, మహోమహు, మనువు
వీతరాగద్వేష వీక్షించి, దనుజు
లారాచ తపసి మహానుభావత్వ —
వైరాగ్య సద్గుణవారమ్ము తమకు
సహియింపకుండుట; చలమూనివారు
మహిపతిఁజంపి యమ్మాంసమ్ముఁదినెడు
కడఁక జేయంగఁ జక్రమునంపి వారి
పొడవు మాన్పితి యజ్ఞపురుష! సర్వేశ

సజ్జన పక్ష! కేశవ నీదు దీక్ష
యిజ్జగమ్ములకు వేకైక సంరక్ష
సాధు తిరస్కృతి జరపెడి గుణము
శ్రీధవా! నా యందుఁ జేర్చకుమయ్య
నను సజ్జనుల సేవనముఁ జేయునట్లు
కనికరముం జూపి కాపాడుమయ్య.

---

## గజేంద్ర మోక్షణ కథ:-

శ్రీ కమలాలయార్చిత దివ్యపాద
వైకుంఠవాస తాపస జనోల్లాస
స్థావర జంగమ జంతు సంతతులు
నీ వర శరణాప్తి నిఖిల బంధములు 20
శత్రుబాధలు వాసి జయమందుచుండుఁ
బాత్రు లేరైన నీ పాదముల్ గొలువ
భక్త రక్షణమె నీ ప్రముఖ గుణమ్ము
వ్యక్తమ్మె నీ కథలందు తద్గుణము.

## త్రికూటాచల వర్ణనము:

పాలవారాశిలో పర్వతమొండు
చాలిన యెత్తును జంపును గలిగి

కలధౌత, కాంచన, కాలాయసములఁ
జెలువు మించిన మూడు శృంగముల్ గలిగి
ధాతు వర్ణాంచిత తటములు గలిగి
ఖ్యాత త్రికూటాఖ్య నలరుచునుండు

ఆ గిరీంద్రమ్మున నవనీజములును
తీఁగలు పొదలు వర్ధిల్లి దట్టముగ
బలిసి, తమ ఋతుసంపద వేళలందుఁ
దలిరుల బహు సుగంధయుత పుష్పములఁ
బొలుపునరాలు పుప్పొడి దుమారముల
ఫల భాగ్యములఁ గనుపండువైయుండు.

సుమరసంబులఁద్రావి సొక్కి తుమ్మెదలు
విమల గాంధర్వమ్ము వినిపించుచుండు
చిలుకలు కోకిలల్ చెవికింపు గూర్చ
కలకలా రావముల్ గావించుచుండు. 30
గలగల శబ్ద సంగతములై ఝరులు
విలసితకాంతి శోభిలఁ బాఱుచుండు
నన్నగ మమర విహారస్థలమ్ము
కిన్నరజాతికిఁ గ్రీడాస్థలమ్ము
అప్పర్వత నమీప మందున్న యడవి
గొప్ప గొప్ప మృగాలు క్రూరమృగాలు
గలవు, తిప్పలు లాగఁ గనఁబడు కరులు
బలిసిన దున్నలు, బలి ముఖంబులును
హరులు భల్లుక వరాహ వ్యాఘ్రములును
శరభముల్ ఖడ్గముల్ చక్షుశ్శ్రవములు
కాక దివాంధాది ఖగసంహతులును
వీఁకమై యందున విహరించుచుండు.

## అందలి యేనుఁగులు :—

ఆ మహాగిరి కందరాంతర వన్య
సామజంబులు గొన్ని సమదంబులగుచుఁ
గాసార గాహన కాంక్షమై వెడలి
యా సమీపాటవి నెదురెందులేక
గట్టులకేఁ దొలఁగక, సింగములను
దిట్ట తనమ్మునఁ దెగి యెదిరించు —
ఆ మదేభముల విహారంపు జాడ
లేమాత్రమేని తామెఱిఁగినఁ జాలు 40
పులులు కాసరములు భూదారగణము
లెలుఁగుబంటులు పాము లిత్యాదులెల్లఁ
గలగుండు వడుచుండుఁ గదల కందుండుఁ
దలలు చూపక భీతి దాఁగుచునుండుఁ
గలఁగిన చమరీమృగమ్ము లా కరుల
యలపు వాయగ తోఁకలాడించి విసరు
గుమిగూడి తిరుగు నక్కంబి సంఘమ్ము
తమకడ్డులేని విధాన నయ్యటనిఁ
బడియలఁ జెరలాడు, పల్లవంబులను
వడిమేయు, ఫలవృక్ష వారమ్ము రాయు,
పులుల నెన్బోతుల పొగరు నణంచుఁ
గొలఁకులఁ గలిగించుఁ గోరాడు గిరుల

## గజేంద్ర మొందు తెన్నుదప్పి యొకకాసారముం జేరుట :-

ఆ రీతి స్వైర విహారమ్ము సేయు
వారణ యూధమ్ము వదలి యొకండు

కరిరాజు నిడివకి కరిణులు తనకు
పరిచర్య లొనరించి బడివచ్చు చుండఁ
దెరువెద్దియో తాను దెలియ కయ్యడవిఁ
దిరుగులాడుచు నొక్క తెన్నునఁ జనుచుఁ
గడు డప్పిఁజెంది వెక్కసపు తాపమున
వెడఁద గలంగ నట్లే యేగి యేగి 50
తన కరేణువులును దా నొక్కచోట
ననుపము నిష్కళంకాచ్ఛ తోయముల
వికసితాంబుజముల భృంగ సంహతులఁ
బ్రకట కూర్మముల, నక్రముల, మత్స్యములఁ
బకజాతులను చక్రవాకాది పక్షి
నికరమ్ము లస్నిండి నిబిడమైనట్టి
వివిధ భూరుహలతా వితతిఁ దత్తీర
సవిధ ప్రదేశముల్ జానొందనొప్పు
కాసార మొక్కండు గాంచి యానంద –
భాసుర మానస బంధురుఁ డయ్యె.

అచటి చల్లని గాడ్పు లచటిమరాళ
నిచయరవమ్ము లిందీవరామోద
మచటి నిర్మల తరంగాంబు కణమ్ము
లచటి ప్రకృతి మనోహర దృశ్యమ్ము
ద్విరద యూథమ్ము నింద్రియ పంచకమున –
కరయఁ దృప్తియు మహోహర్షమ్ముఁ గూర్చె.

అంతట నా హస్తి హస్తినీ చయము
స్వాంతమ్ము లుప్పొంగ సరసిలోఁ జొచ్చి
తొండముల్ నిండుగాఁ దోయముల్ పీల్చి
నిండారు తృప్తి దండిగఁ ద్రావుచుండె. 60

మరియు నగ్గజరాజు మదమతిఁ దనదు
కరము సారించి పుష్కరముఁ బూరించి,
జలజంతువుల తోడఁ జదలు తాకంగ
వెలయఁజిమ్మును కలభీతతి మెచ్చ
కరిణు లా కరిరాజుఁ గ్రమ్మి యక్కొలని
సరసీరుహంబుల సౌగంధికముల
బిసషండముల జలబిందు సంహతుల
ననమాన సమ్మోద మలరంగఁ గప్పె
వివిధ ప్రసాధనావృతి గజరాజు
సవతు గానని యందచందాల నొప్పె.

## మకరము కరింబట్టుట:

ఆ రీతి గజయూధమంతయు రేఁగి
నీరాట గావింప నిరవధికముగ
కలఁగిన యత్తటాకమునుండి యొక్క
యలఘుజవమ్ము మహాసత్వమొప్ప
గ్రాహమ్ము చనుదెంచి కదుహుంకరించి
సాహసమొప్పఁ గుంజరరాజుఁ బట్టె.

## కరి మకరమ్ముల పోరు:

ఆ పట్టు దప్పించి హస్తి విభుండు
చాఁవగు తనదు హస్తము వెత్తివేయ
నీరాట మా ప్రేట నీల్గిన యట్లు
నీరమ్మువంబడి నిముసమ్ములోనఁ 70
దెప్పిటి కదువడి తేఁకువ తోనఁ
జప్పున రిపు పూర్వ చరణముల్ వట్టె.

పదములు వట్టినఁ బడలక, గట్టి
యెదగల వాఁడగు వేఘ్గలతేఁడు
తనకొమ్ము కొనలచే తద్వైరిమేనఁ
దనరు చిప్పలు గ్రుచ్చి, తలగించి నొవ్వఁ
జేయంగ వదలి చెచ్చెఱ మకరమ్ము
కాయమ్ము బాధ లెక్కకుఁ జేరనీక
వారణరాజేంద్రు వాల మూలమ్ముఁ
గోఱలతోఁ బట్టి కొఱుకుచుఁ జీరె
కరికి మకరియు, మకరికిని కరియు
దురమున భరమయి తోఁచెడు కొలఁది
కరిని సరసికి మకరిలాగు, కరియు
దరికి మకరిలాగు దర్పమ్ము మెఱయ
కరము భీకరముగా కరి మకరములు
దురమునఁ దలపడి తోయజాకరము
కలఁకలు రేఁగ వెక్కసపు రోషమున
చలముఁ బెంచుచు పరస్పర జయకాంక్ష
నిదురయు నోరెము న్విడిచి యే మాత్ర
బెదరదురులు లేక పెనఁగుచు నుండె. 80
నక్రమ్ముతోఁబోరు నాధునివిడుట
యక్రమమని చన నడుగులురాక
కలభీచయము జయకాంక్ష నందుండెఁ
దెలియ మగలు తగుల్తెఱవలకెల్ల
జలమె తాఁబ్రదికెడు సంపదయగుట
బలముమొసలిలోనఁ బ్రబలుచునుండె
స్థానబలమ్మట్లు తనకులేకుంట
న్యావబలమ్మువ నుండె వేనుంగు.

## మకరము కరిపై విక్రమించుట :

కడువిక్రమమున నక్రము చెలరేఁగి
పిడుగువోలె గజమ్ము వెన్నుపైదుముకు
హరిరీతి కుంభద్వయమ్ముపైనుఱుకు
చరణయుగ్మము మధ్య చరియించి పఱచుఁ
బొడగాననట్లుండి పోఁజూడ నెదురఁ
బొడచూపి యడ్డమై పోనీక పాద —
ములఁబెనగొను నీటముంచును మున్గఁ
దలముగానట్టి బాధల గూర్చుచుండు

ఆమాడ్కి మకరి మహోసాహసమున
సామజరాజును చాలవేధించి
తనపదనమున మాతంగపాదమ్ము
ఘనశక్తి నుక్కుఁగట్టిగాఁబట్టె 90
గ్రాహమ్ముపట్టూడ్చగల దేహబలము
సాహసమ్మును లేక సామజరాజు
దీనస్థితినిబొంది తేఁకువలేక
తానుండియును శక్తితగ్గుచున్న
నలపుసొలపుమాట నాత్మరానీక
తలపెల్లవిజయసాధనముపై నిలిపి
దివముల రాత్రుల దినభాగములను
బవరమ్ము వేయేండ్లు పటుశక్తిచేసి
తనబలముడుగుట తనవైరిబలము
దినదినమమితవృద్ధిని జెందుచుంట
మనమునఁ దలచి యామాతంగవిభుఁడు
కనలును చల మహంకారమ్ముమాని

"ఇఁక దీనితోఁ బోరి యేఁ గెల్వఁజాల
వికటించె నాలోని విజయేచ్ఛ యిపుడు"
అని తన పూర్వ జన్మార్జిత పుణ్య
మున జ్ఞానియై మనమ్మున నిట్టు లనియె.

## కరిరాజు విచారము:

"ఏ విధమ్మున దీని నే గెల్చువాఁడ
నే వేల్పుఁ బ్రార్థింతు నెవరిని బిల్తు
నేరు నా కడ్డమై యీ మకరమ్ము
వారింపగలరొ యా ప్రవిమలాత్ములకు 100
దిక్కుమాలిన నాకు దిక్కు మీరనుచు
మ్రొక్కెద నా చేయి మొఱ వినుఁడనుచు
నింతకాలము వని నేమ్గు యూధములు
స్వాంతాన నను గౌరవమ్ముతోఁ జూడఁ
గదిసి కరేణువుల్ గారవింపంగ
ముదమొప్ప రాజనై పొంగుచునుండి
పొందైన చందన భూరుహచ్ఛాయ
లందుండలేక నీరాశ నిటేల
వచ్చితినో కడు భయ మయ్యె నాకు
వెచ్చటి నున్నావొ యీశ్వరా యెఱుఁగ

## కరిరాజు భగవంతుని ప్రార్థించుట:-

ఎవ్వనిచే జనియించు నీలోక
మెవ్వనిలోనుండు నెవనిలోడిందు
నెవ్వఁ డన్నిటిమూల మెవఁడు సమస్త
మెవ్వఁ డాద్యంత రహితుఁ డప్రమేయు

డా మహాపూరుష నయ్యాదిదేవు
నా మహాత్ముని దివ్య. నర్థింతు శరణు"
అని యచ్యుతా! నిన్ను హస్తి రాజేంద్రుఁ
డమవమభక్తి సర్వాత్ముని గాఁగ
పెక్కు విధంబుల వినుతించి మరియు
దిక్కు నీ వనుచుఁ బ్రార్థించె నీ రీతి. 110

"దీనులయెడ, నన్నిదిశల యందునను
మౌనులందును యోగి మండలమందుఁ
గలఁడందు రారీతిఁ గలఁడు కలండు
కలఁడను దేవుండు కలఁడొ! లేఁడేమొ.
నా పాల కలుగఁడే నా పైని కరుణ
చూపఁడే, నాపాటు చూడంగ రాఁడె
నామొఱ్ఱవినరాఁడె నాకడ్డపడఁడె
ప్రేమసాధులపైన వెలయించువాఁడు
అన్నిరూపులు తానయైయుండువాఁడు
వెన్నుఁడైలోకాన విలసిల్లువాఁడు
విశ్వదూరుండును విశ్వాత్మకుండు
విశ్వకరుండును విశ్వవేద్యుండు
శాశ్వతుఁడును సర్వసాక్షియునైన
యీశ్వరు పరమేశు వేభజియింతు.

అని నిన్ను నిఖిలేశు నాదిపూరుషుని
వినుతించి తనదైన్యవిధి నిట్టులనియె
లావతె ధైర్యమల్లన తగ్గిపోయె
జీవముల్ చెదఱినస్థితిగల్గె మూర్ఛ
వచ్చెఁ దనువుడస్సె, వాయక శ్రమము —
హెచ్చయ్యె నీవె నన్నేలెడి దొరవు 120

పెరవారి వెఱుఁగ రావే సర్వరక్ష
వరద నన్గరుణింపవయ్య భద్రాత్మ
వినుచుందువట జీవవితతి మాటలను
చనుదట చనరానిస్థలములకైన
శరణుజొచ్చిన, భక్త జనములు పిలువ
పరమేశ, ఓయని పలుకుచుందువట
కాని నామనమున గలిగె సందియము
దీనమానవపక్ష త్రిదశ సంరక్ష.

ఓ కమలేక్షణ ఓ యోగివంద్య
ఓ కృపానిధి తాపసోల్లాసకరణ
ఓ దీనమందార, ఓభక్తవరద
ఓ దైత్యసంహార, ఓ జగద్రక్ష
నీవె నా శరణమ్ము నినువేఁడువాఁడ
రావె నన్బాలింపఁ బ్రణతార్తిహరణ
గ్రాహపీడను మాన్పి కరుణింపుమయ్య
పాహిపాహిముకుంద పాహిగోవింద''
అని నీదు శరణమ్మునర్థించి నీవె
తను బ్రోతువనెడి ప్రత్యయమున నింగి
నిక్కినిక్కగనుచు నిట్టూరుపులను
బెక్కుగా విడుచుచు వేఁడుచునుండ 130
వనజాసనాది గీర్వాణు లామొఱ్ఱ
విని యూరకుండిరి, విశ్వమయత్వ
మరయ తమకు లేమి, నబ్జాయతాక్ష;
హరి! నీవు విశ్వమయాత్ముండ వౌట
శ్రీవికుంఠమున లక్ష్మి సతితోడ
భావ ముప్పొంగెడి భంగి వినోద

పరతనుండియు, కరి పాహి మాం పాహి
శరణను నామొఱ చక్కనాలించి —

## విష్ణువు కరిని గావవచ్చుట:-

సిరితోడఁ జెప్పవు చేదోయిఁ జక్ర
దరములఁ దాల్పవు, తార్క్ష్యుఁ బన్నింపఁ
గోరవు సేనలఁగూడి రమ్మనవు
జారిన క్రొమ్ముడి సరిచేయఁబోవు
శ్రీ స్తనాచ్ఛాదిత చేలాంచలమ్ము
హస్తమ్ము నందుండి త్యక్తమ్ము సేయ,
నతి దైన్య వన్య గజావనోత్సాహ
మతి వెడలితి సంభ్రమము జవమొప్ప

ఆ రీతి సర్వమ్ము నాత్మలో మఱచి
వారణత్రాణ భావము గుఱినుంచి
గగన మార్గమున కుద్గమనమ్ము చేసి
జగదవనా! నీవు చనువెడ నీదు 140
వెనువెంట సిరి యామెవెంట శుద్ధాన్త
జనమును పన్నగాశనుఁడును వారి
పొంత పంచాయుధములును, దేవర్షి
యంతట సేనాని, యవల వైకుంఠ
పట్టణవాసు లాబాలగోపాల
మట్టి చయ్యన పైనమై వచ్చె నెలమి.

నీ వెంట వచ్చు నిందిర లోకమాత
యీవట్లు చను హేతు వినుమంతయేని
యెఱుఁగదు, కావ తా నిట్లు స్వాంతమున
కరము సందేహతర్కము చేసికొనియె.

తన పయనముఁ గూర్చి తాఁ దెల్పఁ దార్తి
మునిఁగిన స్త్రీ జనమ్ముల మొఱల్ వినెనొ
త్రుచ్చిలించిరొ వేదములను తస్కరులు
విచ్చలవిడి సురద్వేషులు స్వర్గ
భువిపైన దండెత్తి పోయిరో, భక్త,
నివహమ్ముఁ గని చక్రినిం జూపుఁ డనుచు
జడిపించిరేమొ దుర్జనులు మరేమొ
యెడదకేమియుఁ దోఁచదే యనియనుచు
నడిగెదనని యొక యడుగుముందునకు
నిడు, నడిగినఁ జెప్పఁడేమో యటంచు 150
నడమాను, కడు నెడందయు తడబడఁగ
నడుగిడు, నిడకుండు నా జగజ్జనని.

వినువీధి మీర లవ్విధ సంభ్రమమున
చనుచుండఁ గాంచి నిర్జరు "లదె గనుఁడు
హరిని నాతని చెంత నల్లదేలక్ష్మి
దరచక్రములవి, యాదండ తార్క్ష్యుండు
చనెదరు వారి దర్శన భాగ్యవశత
మన జననములు సంభావ్యమ్ములయ్యె
నని, "నమో నారాయణా" యంచు నీకు
వినయమ్ము భక్తియు వెలయంగ మ్రొక్కి
యానందవారిధి యందున మునిఁగి
ధ్యానవిమగ్నులై రంద అయ్యెడను.

## ౦కరమ్ము శిరమ్మును భగవంతుఁడు చక్రాయుధముచే ఖండించుట :—

వసుమతీభారనివారణా! శార్జ్గి
వెసనీవు చనిచని ద్విరద నక్రములు

సమరమొనర్చు కాసారమ్ముఁ గాంచి
శ్రమ నొందుచున్న గజముఁ గరుణించి,
నక్రమ్ము శిరము ఖండనసేయు మనుచు
చక్రమ్ము నంపితి శత్రుసంహార
ఆ సుదర్శన చక్ర మర్కసహస్ర
భాసురమై యతి త్వర చనుదెంచి 160
కొలనులోనికి గుభుల్ గుభులను రవము
వెలయంగఁ జొచ్చి యా భీమ నక్రమ్ము
తలఁద్రుంచి ప్రాణముల్ దప్పించి మించె
జలచరాళికి సాధ్వసమ్ము జనించె
మొగిలు వాసిన చంద్రముని బోలి హస్తి
పగతు మకరి పట్టువాసి పాదముల
నల్లార్చి తన వ్యధ లంతమ్ము లౌట
నుల్లసితోత్సాహ మొప్పంగ నుండె.
నీరాటములకెల్ల నెక్కొనె భయము
పూరించితివి శంఖము నరిభీకరము
అంత క్రూర మకర హననమ్ము సాధు
దంతావళ జయమ్ము త్వద్భక్త పక్ష
పాతమ్మెటింగి, సర్వజగత్తు మిగుల
ఖ్యాతమౌ నీదు మాహాత్మ్యముల్ వొగడె,
సురదుందుభులు మ్రోగె సురభిళ శీత
మరుదంకురములు నిమ్మళముగ వీచె
విరివాన గురిసె వినీ్వధి నచ్చరల
పరితోష నాట్యముల్ పఱగె నెల్లెడల
జయశబ్దములు నిండె నంద్రముప్పొంగె
భయమేది జగతి శుభము పాదుకొనియె. 170

## గజరాజును మహావిష్ణువు నిజకరస్పర్శచే నుత్సాహ పఱచుట :-

పరమపూరుష భవద్బాహుదండమునఁ
గరిని సరసినుండి గట్టు జేరంగఁ
దిగిచి తియ్యమున దద్దేహమ్ము నిమిరి
వగపుమాన్పితివి యవ్వారణరాజు
నీ హస్త సంస్పర్శ నిఖిల దుఃఖములు
దేహబాధలు దీఱి, ధృతిఁ గరేణువులఁ
గలసి వాని యొడళ్లు కరమునఁ బ్రేమ
మొలయంగ నిమురుచు నుత్సాహపడుచు
శ్రీహరీ! నీ దయామృత వృష్టిఁబొంగి
మోహన ఘీంకారముల వెలయించె.

భవదీయ హస్త నంస్పర్శానుభూతి
భువనత్రయమున నే పుణ్యులకేని
కలదొ లేదో గాని కరిరాజుతాను
తొలి పుట్టువున నెట్టి తులలేని పుణ్య
మొనరించెనో యిట్టి యుత్తమభాగ్య
మునుబొంది కీర్తిపెంపున ధన్యుఁడయ్యె.
కరియూధనాథు నిష్కలుష చిత్తమ్ము
పరిపూర్ణ తాత్త్విక భావ సంశుద్ధి
పలుజన్మములకేని పరికింపనాకు
వలవడదేమొ; నీ హస్త సంస్పర్శ 180
నముఁబొందు భాగ్యమున్నదొ లేదొ కాని
యమరేంద్ర వంద్య నాయజ్ఞానబుద్ధి
సైరించి నీదివ్యచరణదాసునిగఁ
గారుణ్యమేపారఁగాఁ గటాక్షించి

వమ్రోవుమా జగన్నాథ శ్రీనాథ
వనజాసనార్చిత పావనపాద. 183

## మకరిశాపవృత్తాంతము :—

మును దేవలుని శాపమును బొందినట్టి
ఘనుఁడు హూహూనామ గంధర్వుఁడట్టి
మకరరూపమునంది, మలయుచు నీదు
ప్రకట చక్రమ్మున ప్రాణముల్ వాసి
నీదివ్యదర్శన నియతి శాపమ్ము
పోఁ దన మొదటిరూపునుదాల్చి నీకు
వినతులు నతులు గావించి, మోదించి
తనలోకమున కేఁగె ధన్యాత్ముఁడగుచుఁ
గరుణామయా జగత్కల్యాణరూప
పరికింప ప్రాణుల భావముల్ వాని
పర్యవసానముల్ బహు చిత్రములుగఁ
దిర్యగ్జడాదులఁ దెలియ యోచింప

## కరిరాజుశాపవృత్తాంతము :

కరినాథు తొలిజన్మకథయు నిట్టిదయ
యరయ నింద్రద్యుమ్నుఁడను పేర్గలాఁడు 190
ద్రవిడదేశ ప్రభూత్తముఁడు పుణ్యుండు
ప్రవిమల వైష్ణవభక్తుండితండు
మును నొకశైలాగ్రభూమి సర్వాత్మ
నిను మౌననియతి ధ్యానించుచునుండె.
వటులుండ నొక్కనాఁడచటికివచ్చె
జటిలముఖ్యుండగస్త్యమహర్షి; వచ్చి

తనుఁజూచి లేచి సత్కారముల్ సేయఁ
డని మౌనమున నున్న యవనీశుఁగాంచి
క్రోధపూరిత మనస్కుండయి, "ఓరి,
సాధుమర్యాదలక్షణదూర, మూఢ
కరియోనిఁ బుట్టుదుగాక" యం చతని
కరుణలేక శపించి, కదలి తాఁ జనియె
సాధుమానవతిరస్కారమ్ము మిగుల
బాధాకరమ్మె యెవ్వానికినైన
ఆవిప్రశాపాన నాభూమిభర్త
యీ విధముననఁదా గజేంద్రుఁడైపుట్టఁ
గాని, భవత్కృప కష్టమ్ములన్ని
మాని, చెడని మోక్షమార్గమ్ముఁగనియె.

కర్మతంత్రుండేని కమలాక్ష నిన్ను
నిర్మలమతిఁ గొల్వ, వెఱికర్మచయము 200
శిథిలమై చెడుఁ, గాని చెడదు నీభక్తి
ప్రథితమౌ పుణ్యసంపదఁగూర్చుచుండు
ధనకనకాదులు, దారాదిబంధు
జనము, కూళలకు శాశ్వతముగాదెపుడు
విశ్వాత్మ నిన్ను సేవించెడు నిరతి
శాశ్వతమగు భక్తజనములకెపుడు
కడుఁబాపినగు నన్నుఁ గరుణించి నిన్ను
విడువక భజియించు విమల గుణమ్ము
నాలోన నిశ్చలనముగ స్థాపించి
పాలింపుమా భక్తవరపారిజాత.

మహావిష్ణువు లక్ష్మీదేవితో తన యభిప్రాయమును దెల్పుట :

అలనాఁడు పద్మాలయాదేవితోడ
జలజాక్ష నీవు ముచ్చటలాడుచుండి

వనుఁబ్రోవుమా జగన్నాథ శ్రీనాథ
వనజాసనార్చిత పావనపాద. 183

## మకరిశాపవృత్తాంతము :—

ముని దేవలుని శాపమును బొందినట్టి
ఘనుఁడు హూహూనామ గంధర్వుఁడట్టి
మకరరూపమునంది, మలయుచు నీదు
ప్రకట చక్రమ్మునప్రాణముల్ వాసి
నీదివ్యదర్శననియతి శాపమ్ము
పోఁ దన మొదటిరూపునుదాల్చి నీకు
వినతులు నతులు గావించి, మోదించి
తనలోకమున కేఁగె ధన్యాత్ముఁడగుచుఁ
గరుణామయా జగత్కల్యాణరూప
పరికింపప్రాణుల భావముల్ వాని
పర్యవసానముల్ బహు చిత్రములుగఁ
దిర్యగ్జడాదులఁ దెలియ యోచింప

## కరిరాజుశాపవృత్తాంతము :

కరినాథు తొలిజన్మకథయు నిట్టిదయ
యరయ నింద్రద్యుమ్నుఁడను పేర్గలాఁడు 190
ద్రవిడదేశ ప్రభూత్తముఁడు పుణ్యుండు
ప్రవిమల వైష్ణవభక్తుండితండు
మును నొకశైలాగ్రభూమి సర్వాత్మ
నిను మౌననియతి ధ్యానించుచునుండె.
నటులుండ నొక్కనాఁడచటికివచ్చె
జటిలముఖ్యుండగస్త్యమహర్షి; వచ్చి

తనుఁజూచి లేచి సత్కారముల్ సేయఁ
డని మౌనముననున్న యవనీశుఁగాంచి
క్రోధపూరిత మనస్కుండయి, "ఓరి,
సాధుమర్యాదలక్షణదూర, మూఢ
కరియోనిఁ బుట్టుదుగాక" యంచతని
కరుణలేక శపించి, కదలి తాఁ జనియె
సాధుమానవతిరస్కారమ్ము మిగుల
బాధాకరమ్మె యెవ్వానికినైన
ఆవిప్రశాపాన నాభూమిభర్త
యీ విధమునఁదా గజేంద్రుఁడైపుట్టెఁ
గాని, భవత్కృప కష్టమ్ములన్ని
మాని, చెడని మోక్షమార్గమ్ముఁగనియె.

కర్మతంత్రుండేని కమలాక్ష నిన్ను
నిర్మలమతిఁ గొల్వ, నెటికర్మచయము 200
శిథిలమైచెడుఁ, గాని చెడదు నీభక్తి
ప్రథితమౌ పుణ్యసంపదఁగూర్చుచుండు
ధనకనకాదులు, దారాదిబంధు
జనము, కూళలకు శాశ్వతముగాదెపుడు
విశ్వాత్మ నిన్నుసేవించెడు నిరతి
శాశ్వతమగు భక్తజనములకెపుడు
కడుఁబాపినగు నన్నుఁ గరుణించినిన్ను
విడువక భజియించు విమల గుణమ్ము
నాలోన నిశ్చలనముగ స్థాపించి
పాలింపుమా భక్తవరపారిజాత.

## మహావిష్ణువు లక్ష్మీదేవితో తన యభిప్రాయమునుదెల్పుట :

అలనాఁడు పద్మాలయాదేవితోడ
జలజాక్షనీవు ముచ్చటలాడుచుండి

వినుపించి తీరీతి విబుధులుమెచ్చ
నమపమాన వరమ్ము లాభాషణములు
"బాల, రమా, నీదుపయ్యెదనాదు
కేలఁగీలించి వేగిరమ విన్వీధి
వచ్చుచునుండ నాబడివిడకీవు
వచ్చుచు నెడఁద నేభావంబుఁ గంటి?
వినుము, నాభక్తు లేవేళనేగాని
నను మనమ్మునవెంచ నాస్వాంతమందు 210
వారిని మఱవ, సర్వమ్మును మఱతు
నీరజాక్షి నాదునిశ్చయమిద్ది
కాన నీతోడి సాంగత్యమ్ము నిన్ను
వైనతేయాది నా పరివారసమితి
నాయుధమ్ముల మఱి నన్నింటిమఱచి
నాయూహలోన దంతావళరాజు
రక్షణముఖ్యకర్తవ్యమం చెంచి
యాక్షణమున నిటకరుదెంచినాఁడ
మరి కొన్ని పుణ్యకర్మలు వినిపింతు
గరిత విన్మని లక్ష్మిఁ గాంచి యిట్లంటి

## భగవంతుఁడు గజేంద్రరక్షణ కథా మహిమను దెల్పుట —

"ఈ గజరాజేంద్రు నితిహాసవరము
భాగధేయమ్మగు భక్తాళికెల్ల
ఈకథ వినువారి కెసఁగు యశమ్ము
పోకాడు కల్మషములు పుణ్యమబ్బు
చెడుకలల్ రావు, నశించు దుఃఖమ్ము
లొడఁగూడు సౌఖ్యమ్ము లొదవు సంపదలు,

ఉదయాన నిద్దురమండి మేల్కాంచి,
చెదరనిమతి నీ విశిష్ట చరిత్ర
మెవఁడు నిత్యము పఠియించు నాతనికి
మివుల శాంతమ్మును మేల్మి భద్రములు 220
స్థిరమగుఁగాక! ప్రసిద్ధ మోక్షమ్ము
కరతలామలకమ్ముగాఁ గూడుఁగాక!

ఈ విధమున శుభహేతువులైన
పావన వాక్యముల్ వరములు గాగఁ
బలికి శ్రీసతితోడ వైనతేయాంస
మొలసి యారోహించి యుత్సాహమొప్ప
సంకు మ్రోగించి నిజస్థానమునకు
పంకజాక్షా! హరి పయనించి తీవు

ఆర్త రక్షణమె మహాత్మ నీ ప్రథమ
కర్తవ్య, మదె నీదు కరకంకణమ్ము
ఓ దేవ దేవ, మహోత్కృష్ట భావ
నీ దయకుం బాత్రునిగ నన్నుఁజూచి
నా పాపములనెల్ల నాశమ్ము చేసి
కాపాడరావె యో గజరాజ వరద

**ఫలశ్రుతి:**

గజరాజ మోక్షణ కథ యిది, దీని
నిజభక్తిఁ జదివిన నిర్మలాత్ములకు
గజతురగాదులు కైవల్యసిద్ధి
గజరాజ వరదుఁడు గరుణించుఁ గాక!

# క్షీరసాగర మథన కథ

శ్రీపతి, నిర్జరార్చితపాదపద్మ
తాపసవంద్య, సద్భక్తహృత్పద్మ 230
చతురాననేంద్రాది సర్వసుపర్వ
తతి దైన్యముం బాప, ధైర్యమ్ముగూర్ప
నీవల్కు లేఁప్రావు నిగమసంచార
పాపవిదూర శుభంకరాకార

## బ్రహ్మాదిదేవతలు భగవంతుని ప్రార్థించుట:

మును బలిదైత్యుండు ముజ్జగంబులను
దనవశమొనరించి దర్పమ్ము మెఱయ
నమరులఁద్రోలి, స్వర్గాధిపత్యమ్ము
నమరఁజేఁబట్టి రాజ్యముసేయుతఱిని,
నసురులకోడిన యమరబృందమ్ము
వెస బ్రహ్మకడకేగి వినుతులు నతులు
గావించి తమకున్న కష్టముల్ దెల్పి
కావవే యనివేఁడఁ గమలజుఁడంతఁ
ద్రిదశుల యిడుమలఁ దీర్చెడునట్టి
సదుపాయములు నిజస్వాంతమ్ము నందుఁ
దోఁచకనుంట నాతోయజసూతి
వాచామగోచరు పద్మాక్షు నిన్ను
మనమున నెంచి నమస్కృతుల్ సేసి
యనునయమ్ముగ దేవతాళికిట్లనియె.

"అమరులారా సృష్టియందున్న ప్రాణి
సముదాయ మెవ్వని సత్కళాంశమ్మొ 240

యాదేవుచెంతకు నరుగుద మిప్పు
డాదీనబాంధవు నా రమాకాంతుఁ
గాంచనంతన మనకష్టముల్ దొలఁగు
నంచితాదృతితోడ నాకృపాళుండు
మన దైన్యముంబాపి, మనకుక్షేమమ్ము
పొనరు మార్గముఁదెల్పి ప్రోవంగలండు"
అని బ్రహ్మ వాసవాద్యమరబృందమ్ముఁ
దనవెంటఁ గొని భవత్సదనమ్ముఁజేరి,
యందున నిముగాన కాగమోక్తులను
బొందుపఱచి స్తోత్రములు భక్తిఁజేసి
"ఓ పవిత్ర చరిత్ర ఓ సాధుమిత్ర!
ఆపన్నులము నీమహాదర్శనమ్ముఁ
గోరివచ్చితిమి, మాకోర్కెలు నీకు
వేరుగ మేముగా వివరింపనేల?
నీవె యెఱుంగుదు నిఖిలజీవాత్మ!
పావననామ గన్పడవెమాకిపుడు"
అని యమరులుఁ దాను, నబ్జభవుండు
నినుఁగొనియాడెను నీరజనాభ

## భగవంతుడు దేవతలకభయమిచ్చి అమృతమును బడయుఁడని ప్రోత్సహించుట:

దీనులమొఱవింట దీనరక్షణము
నీనియమముగాన, నిఖిలామరులకుఁ 250
జతురాననునకు హర్షముజనియింప
నతులిత తేజోమహత్తరరూప—
మునఁ దోఁచితివి; భవన్మూర్తి దర్శించి
యనుపమానందాబ్ధి నావేల్పుగములు

మునిఁగి "ముమ్మూర్తులమూలమౌ నిన్ను
వనజనాభునిఁజూచు భాగ్యంబుమాకుఁ
గలిగె, మాయాపదల్ కడుదూరమయ్యె
నెలకొను మాకు నన్నిఁటనిఁకఁ మేళ్లు,
అభయంబొసంగి మాయక్కఱల్‌దీర్చి
శుభములిప్పింపవే సుజనసంరక్ష"
అనివేఁడి జోతలనర్పించుచున్న
కనకగర్భాదులఁ గాంచియిట్లంటి

"ఓయిచతుర్ముఖ ఓనిటలాక్ష
ఓ యమరేంద్ర, సురోత్తములార,
దనుజులగెల్వంగఁ దఱి యిదిగాదు
మనకు వారలతోడి మైత్రియేయిపుడు
తగును; తనకునుసత్త్వముగూడుదాఁక
పగఱకుఁ జాటుగఁబ్రదుకు విజ్ఞాని
కావున మీరలు క్షమతోడనుంట
భావింపమేలు, నాపల్కులువినుఁడు 260
అమృతమ్ముఁ బడసెడు యత్నమ్ముసేయు-
టమిత ప్రముఖ కార్య మయ్య మీకెల్లఁ
నమృతమ్ముఁ ద్రావిన నాయువుపెరిగి
యమృతగతినినుండు నన్నిజంతువులు
పాలమున్నీటిలోఁ బలువిధలతలఁ
జాలినన్నింటి యోషధులనువైచి,
మందరశైలమ్ము మంథానమట్లు
పొందించి, వాసుకి బొనరఁ గవ్వంపుఁ
ద్రాడుగఁజేసి. నిస్తంద్రులై నాదు
తోడునుబొంది, యుత్సుకతఁజిల్కుండు

ఫలితము మీకగుఁ; బ్రబలకష్టములు
ఖలరాక్షసులకగుఁ గాని, వినుండు
అమృతోద్భవమునకు నరయంగమున్నె
యమృతరాశి జనించు హాలాహలమ్ము
కాని వెఱవరాదు, కార్యయత్నమ్ము
మానరా'' దని మరిమరిఁ బ్రోత్సహించి
యటనుండి నీవదృశ్యమ్మైతి; చనిరి
దిటముమై తమతమ తెంకికి సురలు.

## ాసురమైత్రి:

నీయమృతోక్తు లన్నింటి వెమ్మదులఁ
బాయక, యారీతి వర్తింపఁదలఁచి 270
యసురులతోఁ గలహముమాని మైత్రిఁ
బొసగించుకొని, బలి ముదమంద నతులు
గావించుచును పెక్కుకానుక లిచ్చుచును
దేవతలుండ మదించి రక్కసులు
ఆనిర్జరులను సంహారమ్ముచేయఁ
బూనుటెఱింగిన పూర్వదేవుండు
వైరోచనుఁడు సురవైరులఁగాంచి
యీరీతిఁబల్కె, "మీకిదెనాదునాజ్ఞ
శరణన్నవారలు శత్రువులైనఁ
బరుషబుద్ధిని వారి బాధింపరాదు
తగుసమయమ్ములు ధర్మముల్ గలవు
మగఁటిమిఁజూప, నామాటవినుండు''
అని బలిరాజు సురాసురద్వేష
మును నడంచుచు రాజ్యమును జేయుచుండె.

బలిచక్రవర్తి వైభవమెసగంగఁ
గొలువుండ, నొకనాఁడు గోత్రారి యింద్రుఁ
డతి కుతూహలమున నటనుండి సచివ-
తతిని, సేనానిబృందమ్మును భటుల
హెచ్చరించుచు రాక్షసేంద్రుండువినఁగ
నిచ్చకమొప్పార నిట్టులననియె. 280
"నిక్కమ్ముమదిఁగన వెఱిమనమెల్ల
నక్కసెల్లెంద్రల యనుఁగు బిడ్డలము
అన్నదమ్ములమయ్యు నన్యోన్యవైర
మెన్నిపెంచుచునుంట యేమి లాభమ్ము?
ఇఁకవైన స్నేహసమృద్ధినొందెదము
సుకము గల్గెడు త్రోవ చూచికొనుదము
ఇదిమొద లీబలియే ప్రభు, వితని
ముదలఁబాటింత మిమ్ముగ మనమెల్ల.
మనకులంబులు రెండు మరణమ్ములేక
మనుమార్గమొందు, నామాటవినుండు"
అని యమృతమ్ము సమార్జించు విధము
వనజలోచను వితోడ్పాటుమ దెల్ప
విని, దైత్యులెల్లరు వేడ్కనాయత్న
మున కియ్యకొనిరి ప్రేముడి వెలయించి.

## సురలసురులు మందరాద్రిందెచ్చుట :—

సురలసురులును జిష్ణుండును బలియుఁ
గర మనురాగసఖ్యములఁ బెంపొంది
యమృత సంపాదనాయత్త చిత్తముల
గుమిగూడి మందర గోత్రరాజమ్ము

దరిఁజేరి తమ బాహుదర్పముల్ మెఱయ
గురుసాధనంబుల గ్రుచ్చి యాగిరిని 290
కదలించి, పెకలించి, కడుసాహసమున
కుదురుగాఁ బైకెత్తి, కుదికిలఁబడక,
తమ మూపురమ్ములఁ దమ తలలందు
సమతనానిచి నిజచరణముల్ తొట్రు
పడకుండ మెల్లన పదముపైఁ బదము
నిడుచు వారందఱు వెమ్మదిఁ గదలి
తెరువుదెసనుబట్టి తెచ్చుచునుండి
ఁరుసమ్ముతో వెనుకాడని కడఁక
కాని సంద్రముదవ్వు, కాన, మార్గమున
నూనిన గిరిభార మోరువలేక
నిలుచు శక్తియు లేక, నేలపైఁ గూలి
తొలఁగెడు మార్గమ్ముదోఁపక వారు
కొందఱుమడిసిరి కొందఱునుగ్గు
చందమ్ముగాపైరి సాధ్వసమెత్తి
కొందఱు పాఱిరి, కొందఱందునను
బృందారకులు ధైర్యమేది "హా! మనము
హరిచెంత కెందుకు నరిగితి మతఁడు
తరముగానట్టి చేతకుఁ బూన్చెనేల?
గిరిమోసితే నేల? కీడ్పడి మీరు
మరణింప నేలంచు మది చింతనొంది 300
"శ్రీహరీ!, లక్ష్మీశ, జీమూత తులిత —
దేహ, సర్వేశ వందే జగన్నేత,
ఈ పర్వతముఁగొని యేఁగ మా కగువె
మా పాటు భావించి, మాకుఁ దోడ్పాటు

గారమ్ము, మా పూన్కి కడతేరునటుల
కారుణ్యముంచుమా కంజ దళాక్ష ”
అని యమరులుఁ దాము యజ్ఞేశ నిన్ను
మనముల నెంచి సమ్మతి వినుతింప —

దీనులౌ దివిజుల దితిజుల మొఱ్ఱ
వీనులఁబడ వేగ విహగవాహనము
నారోహణముచేసి యాయుధంబులను
గూరిచికొని రవికోటి తేజమునఁ
బ్రత్యక్షమయి “భయపడకుఁడీ” యంచు
నత్యనుకంప నా యమరాసురులకు
వెఱమాన్చి, యగ్గిరి వేడుక నొక్క
కరమునఁ బైకెత్తి, ఖగనాధుపైన
నమరిచి పయనమై యయ్యార్తులెల్ల
నమిత బలోత్సాహ మంది నీ వెంటఁ
జనుదేర క్షీరాబ్ధి సరసనఁజేరి
యనువుగఁ దత్తీరమందు నగ్గిరిని 310
విడుమని పంచితి, విహగేంద్రుఁ డటులె
విడిచి మహాభక్తి వెలయంగ నీకు
నతిచేసి నీదు నాజ్ఞనుగొని చనియె
పతిత పావన దయాపర భవదీయ
దీనావననిరతి దివ్య మాహాత్మ్య —
మేనాటికే ఘనుండేని యెఱుంగఁ
జాలఁడు, నా వంటి జాల్మఁ డెట్లెఱుఁగు ?
శ్రీలలనాధీశ జేజేలు నీకు

## సురలసురులు వాసుకిని తరిత్రాడుగఁ జేసి క్షీరాబ్ధి మథియించుట:

పదపడి నాయిరు పక్షాలవారు
ముదమంది కర్తవ్యమును జేయఁ బూని
వాసుకిఁబిలిపించి, ప్రణయమ్ము వెలిపి,
వాసియౌ తమకార్యభారమ్ముఁదెలిపి
తరిత్రాడుగా సమ్మతముఁజూపవేఁడి
"హరియాజ్ఞయిది" యని యంతయుఁజెప్పి
ఫలభాగమిడు నొడంబడికయు వినిచి,
తిలకింప మాకోర్కి దీర్పంగనీవె
తగుదనిపొగడి తథాస్తనిపించి,
జిగిమించు నమ్మేను చేతుల నిమిరి
తరికొండ మిగుల స్నిగ్ధమ్ముగాఁజేసి
గిరికి పాముని జుట్టి, క్షీరాబ్ధి భాండ 320
ముగ నొనరిచి కేశముల వస్త్రములను
బిగగట్టి మథియించు వెడుకఁగదిసి
సురలును నీవు వాసుకి శీర్షములను
దటిసి పట్టంగ యత్నము సేయుచుండ
హరి నీదుమాయ నయ్యసురు లందఱును
సురల యుద్యోగమ్ము చొప్ప వారించి
"తలలు మీరలు పట్టి తరుచ మేమెల్ల
బలహీనులమె తోఁకభాగమ్ముఁబట్ట
నన్నిట మీకన్న నధికుల మగుట
నిన్నీచకార్యమ్ము నిచ్చ మెచ్చుదుమె
కాన శీర్షముల భాగమ్ము మాకిందు
మానము మాకుండు మర్యాద" లనుచుఁ
దముధిక్కరించెడు దైత్యులఁజూచి
యమరపక్షము బదులాడక యపుడ

వారుకోరిన ఫణపక్షమ్ము విడువ
మేరమీరిన తృప్తిమించి రసురులు.

## మందరపర్వతము సముద్రమున మునుంగుట:—

చివరకు దితిజులు శీర్షభాగమ్ము
దివిజులు పుచ్ఛమ్ము దృఢముగాఁబట్టి
క్షీరాబ్ధియందు నగ్గిరి మెల్లనుంచి
వారిరుపక్షాలవా రమృతమ్ముఁ 330
బడయు నుత్సాహమొప్పఁగద్రచ్చువేళ
విడువిడుడని యహివిభుఁడనుచుండఁ
గడుభారమగుట నాగ్రావమ్ము తనకు
నడుగున కుదురులేనందున నపుడు
బుడబుడమను రవమున సకలమ్ము
వడకుచుండంగ నవ్వార్ధిము నింగె
మునిగెడు పర్వతమును మున్గనీక
వనధిపైఁదేలంగఁ బట్టెడు సత్త్వ—
మేమాత్రమునులేక యెల్లరబ్రముగ
సామాన్యులంబోలి జలధి తీరమున
పౌరుషమ్ములు దక్కపడిరి; దైవమ్ము
వేరైన ఫలితముల్ వేరగుఁగాదె.

# కూర్మావతారము

గిరి మునుఁగుట గాంచి ఖేదమ్మునొందు
సుర సమూహమ్మును జూచి సర్వేశ
కరుణించి వారిదుఃఖము మాన్పఁదలఁచి
సరగున నీవు తజ్జలధిమధ్యమున

శతసహస్రాంక యోజనములవిప్ప
నతికఠోరమ్మగునట్టి కర్పరము
సకల జగములొకేసారి వెన్నీక
నొకముద్ధగ్రామింగు నరువదనమ్ము 340
అనువుగా సర్వచరాచరమ్ములను
దనలోన నుంపంగ(దగు పెద్దకడుపు
పుడమిపై వేరొక పుడమినుంచినను
వడకని, వంగని బటువులౌ కాళ్లు
వెలికి లోనికిఁ జను విపులతుండమ్ము
జలజములం బోలు చక్షుయుగ్మమ్ము
తనరంగ సురలపై దయఁబూని నీవు
ఘన కమఠాకృతిగాఁ దోఁచినావు

నిగమాంతసంచార, నీవిశ్వమయత
జగదుపకార ప్రశస్తరూపములు
వాని రహస్యముల్ వర్ణింపనౌనె
మానవులకెకా దమర్త్యులకైన.

## సంద్రమున మున్గిన మందర పర్వతోద్ధరణము :—

ఆరూపుతోన నీవంబుధిఁదూటి
ధీరత మందరాద్రికిఁగ్రిందఁ జేరి
కుదురయి, మునిఁగిన గోత్రసర్పముల
పదిలమ్ముగా వెన్నుపయి చిన్నరత్న
ములఁ బోలెఁ దాలిచి మున్నీటఁదేల్చి
కలఁతమాన్పితి సురగణము మోదింప

నీపెంపు నీరూపు నీతెంపు జూచి
బాపురే యనుచు సుపర్వులందఱును 350

దలలూపి, కూర్మావతార! జేజేలు
జలజాక్ష శరణమ్ము శరణమీవనిరి
తరిగాంౘ్రడనొకఁడవై తరికుదురైతి
తరిౘ్రతాడునైతివి, తరికవ్వమైతి
హరిహరి! నీలీల లత్యద్భుతములు
హరి నీవ యెఱుఁగుదు వా మహత్వములు -

అంత సురాసురు లప్పాలవెల్లి
స్వాంతముల్ పొంగఁౘ్రదచ్చంగ, నగమ్ము
జలనిధి ౘ్రభమియింప, జనితమైనట్టి
జలజల చిఱుబుఱు, శబ్దజాలమ్ము
భూనభోంతరములు పూర్తిగా నిండఁ
ౘ్రబాణిలోకమునకు బధిరత్వమయ్యె

## శివుడు హాలాహలమునుౘ్రమింగుట:

ఆరీతిగా మందరాౘ్రదిచేఁబాల
వారాశి విడువక వారు చిల్కంగ
నల్లకల్లోలమై యతిభీతిదమయి
యుల్లోలమైన యా యుదధిలోనుండి
కోలాహలము కడుఘోరమైరేఁగ
హాలాహలగరళ మావిర్భవించె
నావిషాగ్నిజ్వాల లతివేలమగుచు
భావింపరాని ౘ్రప్రభాయుక్తమగుచు 360
భూనభంబులు నధోభువనముల్నిండి
న్యూనమ్ముగాని మహోౘ్రగతాపమున
సకల చరాచర జంతుజాలములఁ
దికమికలార్చి, బూదిగ జేయుచుండ

దివిజులు దితిజు లాదీప్తవిషాగ్ని
సవతులేనట్టితత్సంతాపశక్తి
దాన లోకములొందు తపనమ్ముఁగాంచి,
పూనినతమయత్నమును గొంతమాన,
నాయకాల ప్రళయమ్ము నణంచి
శ్రేయమ్ముఁగూర్చెడి జెట్టి నేరుపరి
తమలోనలేమి, వేధయుసురాసురులు
గుమిగూడి యోచించి గొబ్బునవేగి
కైలాసమున శితికంఠువాసమ్ము
మ్రోలఁజేరి "మహాత్మ! భూతేశ! యీశ!
శంకర, భక్తవశంకర, మాకు
సంకటహరణ దర్శనభాగ్యమీవె"
అనివేఁడుచున్న నయ్యార్తులమొఱ్ఱ
విని గౌరితోగూడి వేడ్కతోనున్న
హరుఁడు కృపాళుఁడై యయ్యర్థితతికి
దరిసెనమిచ్చె నందఱి కోర్కిదీఱ 370
నంతట నాచతురాననప్రముఖు-
లెంతయు ముదమున నిందుశేఖరున
కతివినయమ్మున నంజలుల్ చేసి
స్తుతియించిరిట్లు నిస్తులభక్తివెలయ
"దేవ, మహాదేవ దివ్యప్రభావ,
నీవకావే జగన్నేతవు త్రిగుణ
భావమూలక్రియాపరుఁడవు జగతి
భావించిసృజియింతు, వరఁగఁబోషింతు
వంతమొందింతు వీవఖిలమ్ము నిన్నుఁ
జింతించి, నుతియింపఁ జెల్లునే మాకు
మూఁడు మూర్తులకును, ముల్లోకములకు
మూఁడు కాలములకు మూలమ్ము నీవ,

ఈ వెలుఁగనిది లే దెందును జూడ
భావించియుందు మా పద్ధ పాట్లెల్ల
వైనను వినుము సూరాసురుల్ మేము
పూనినారము పాలమున్నీటిఁ దరువ
హాలాహల గరళ ముందుండి పుట్టి
కోలాహలమ్ముగఁ గుంభినినెందు
నాశము చేయుచున్నది ప్రాణికోటి —
నీశ, ఈ యిడుమ మాయించి లోకమ్ము 380
గాపాడవే శుభంకర. నీవెగాక
ప్రాపెవ్వరిక మాకు "పార్వతీనాథ."
అనివేఁడుచున్న నయ్యబ్జజాదులను
గని యీశ్వరుఁడు ప్రియాంగన కట్టులనియె.
"సతి! కంటివే ప్రపంచముపొందు నిడుమ
నతివేలమట వింటివా విషానలము
వేఁడిమి గూరిచి; విశ్వమంతటికి
నొడయుండనేన, నాకుచితధర్మమ్ము
ఆర్తుల యాపద లణఁచుటసుమ్ము
కీర్తియు దాన ప్రవర్ధమ్మనమ్ము
ఇది హరి కామోదమిచ్చు కార్యమ్ము
సుదతి యాహరిమెచ్చ శోభించుజగము
కాన నాగిరళమ్ము కమ్మఫలమ్ము
గా నెంచి భక్షింతుఁ గాతుజగమ్ము"
అన వినియార్య "దేవా నీదు చిత్త
మునకు వచ్చినరీతిఁ బొనరింపు" మనియె

వేదమయా బుధవేద్య విశ్వాత్మ
నీదు భావములు పెన్నిధులు జగతికి

హరియన నెవ్వఁడు, హరుఁడన నెవఁడు
హరిహరులకు మూల మరయంగ నీవ 390
ఏ రూపమున నెప్వ దేవని నెవరు
తీరుచవలయు? నా తీరున లోక
వర్తన జరుపు నీ భావంబు దెలియ
నేర్తురె నా వంటి నీచ మానవులు.

అంత దేవతలు జయ జయ నాదమ్ము
లంతరిక్షము నిండు నట్లొనరింప
శివుఁడు విజృంభించి, జీమూతభీమ –
రవ రభసమ్ము దుర్భర హుంకరణము
గావించి, "పోకులోక ద్రోహిరమ్ము,
నీ వెందు దాగెదు నిన్నిఁక వదల"
నని కేలుసాచి యా హాలాహలమ్ముఁ
దనకరతలమునఁ దాలిచి యొక్క
యుండగా నొనరిచి, యుబ్బివేరేదు
పండన మ్రింగె సువర్వులు మెచ్చ
వామదేవుండు భవానీప్రియుండు
భీమమౌ గరళమ్ముఁ బిలిచెడి నవ్వ
దది సమీపించిన యప్పుడు, దానిఁ
గదిసి కబళముగ గావించునపుడు,
మెసవఁ బూనిన యప్డు మ్రింగిన యపుడు
భసితాంగు నా దేవు పాపసరములు 400
కదలవు పుట్టదు ఘర్మ జలమ్ము
పొదలు కొనదు నేత్రముల వెఱ్ఱదనము
కందదు శశికళ, కమ్రముఖాబ్జ
మందమ్ము చెడ వాడ, దతి విచిత్రమ్ము

హరిహరుల్ మీ యసహాయ శూరత్వ
మరరె వర్ణింపంగ నలవి యెవ్వరికి?
ఒకఁడు మహానగమూనె పృష్ఠమున.
సుకుమారమున మించు సుమగుచ్ఛమటుల
నొకఁడు హాలాహల మొనర భక్షించె
ప్రకటి మధూత్కర ఫలరాజ మటుల
నా దోషముల నెల్ల నాశమ్ము చేసి
నీ దాపునకు నను నెమ్మినిఁజేర్చి
కాపాడుమా నమస్కారము లివియ
నా పాలి హరిహరానంద స్వరూప!

తన యుదరము సమస్త భువనములకు
ననికి పట్టగుట తా నూహించి శివుఁడు
గరళ వహ్నికిఁ దన కంఠబిలమ్ము
నిరవుగాఁ, దిరముగా నెలుకగాఁ జేసె
హరుగళమందు నా హాలాహలమ్ము
వరఁగె నల్లని మణిభాతి నందముగ 410
నార్త రక్షణము మహాత్ములకెల్లఁ
గీర్తింపఁదగు పరిష్కృత భూషణమ్ము
హరుఁడు హాలాహల మానినచరిత
పరమ భక్తిని విన్న పఠనమ్ము సేయ
నరు లహిదంత సందష్టులేయైనఁ
బొరయరు విషబాధఁ బుడమి నెందైన 413

## పాలకడలిలో నైరావతాదులు జనించుట:—

మరియు నా దుగ్ధాబ్ధి మధియించువేళ
నరుదరు దని యందఱనఁగ నందుండి

సురభియొండుజనింప సురమునుల్దానిఁ
దిరముగా తమకుఁజెందినదని కొనిరి
పదవడి యుచ్చైశ్శ్రవమ్మను తురగ
ముదయించె నద్దాని నుత్సాహపడుచు
బలిరాజు తన వశపఱచె, నింద్రుండు
తలఁపడు గొన, నీదుతలఁపు తానెఱిఁగి
యంత నైరావతమను దంతిరాజు
వింత చతుర్దంతవిభవమై పుట్టె
సకలర్తుసంపద సర్వకాలముల
బ్రకటించుచుండు కల్పకము జనించె
నవలనవతరించె నప్సరోజనము
భువిదివి శృంగారపూర్ణమై వెలయ 420
చందురుఁడుదయించి స్రష్ట్రయానతిని
పొందికఁ దొలిస్థానమునకుఁ దాఁజనియె
పిదప సంపదలను బెల్లుగానిచ్చు
ముదిత లక్ష్మీదేవి పొడమెనాయబ్ధి
శృంగారములకెల్ల సేవధి యామె
రంగారు కళల కాశ్రయభూమి యామె
యామెదేహచ్ఛాయ యత్యంతవిశద
మామెమనోభావ మతికరుణమ్ము
ఆమెచూపులె జగద్వ్యాప్తభాగ్యమ్ము
లామెసన్నని నవ్వె యాహ్లాదకరము
ఆతల్లి రూపగుణాదులఁ బొగడఁ
జేతగా దయ్యాదిశేషునకైన

ఆదేవిని గని యమరగణమ్ము
మోదించి సద్భక్తి పూజించెనిట్లు

మంగళస్నాన మామాతసేయుటకు
బంగరుపీఠమ్ము వాసవుఁడుంచె
నమల జలాపూర్తి నలరు కుండికల
నమరాంగనలుదెచ్చి యమరిచి రెలమి
వసుమతి చేకూర్చె పల్లవంబులను
పసరముల్ పంచగవ్యమ్ములనిచ్చె 430
మధువుమాధవుఁడిచ్చె మౌనిజనమ్ము
ప్రథితకల్పమ్మును భక్తిపఠించె
నంబుదపంక్తి వాద్యములనాదమ్ము
పంబుగా గావించె బయలుమార్మోగ
పండితుల్సూక్తులు పల్కుచుమెండ
తుండాలతోఁ దీర్థతోయముల్దెచ్చి
దిక్కరి బృందమ్ము తీర్థమాడించె
నక్కజమెసఁగంగ నయ్యబ్ధి సుతకు
భ్రాజిత స్వర్ణవస్త్రమునిచ్చె నర్థి
వైజయంతీమాల వరుణుఁడొసంగె
సురుచిరాభరణముల్ సురశిల్పియొసఁగె
వరతారహారముల్ వాణియొసంగె
వనజగర్భుఁడు పాణి పద్మమ్మొసంగెఁ.
బొనర జానువుల సొమ్ములు ఫణులొసఁగె
సర్వప్రసాధన సౌందర్యరాశిఁ
బర్వేందుముఖిని నా పద్మాక్షిఁగాంచి
శ్రుతులు భద్రములిచ్చు స్తోత్రముల్చేసె
"నతిలోకసుందరీ అఖిలలోకముల
నేలికసానివై యేలుమా! యనుచు
చాలుగా దిశలెల్ల సమ్మతిఁబలికె 440

## లక్ష్మీదేవి విష్ణుదేవుని వరించుట:—

అవ్విధంబున సకలైశ్వర్యసిద్ధి
నివ్వటిల్లెడు నామె నిఖిలమ్ముఁగాంచి
తగినభర్తనుగోరి తనహస్తమందుఁ
దొగపూలదండఁ బొందుగఁదాల్చి సురల
నడుమన నిలిచి, యన్నలినాయతాక్షి
కడుదూరదృష్టి చక్కఁగ యోచనమ్ము
గావించి శ్రీహరీ కమలాయతాక్ష
నీవె నాథుండుగా నెమ్మదివెంచి
తనచేతి కల్వపూదండతో భక్తి
నిముఁబూజ చేసి, పెన్మిటిగ వరించి
భవదీయ సుందరవక్షమ్మె తనకు
నివసింపఁదగిన మందిరముగాఁ దలఁచి
తనచూపునచ్చోటఁ దగ నిల్పిచూడ
వనజనాభా! ఆమె వాంఛ నీవెఱిఁగి
ధరియించి తందు నా తామరసాక్షి
వరదుఁడంటకు నిద్ది ప్రత్యక్షసాక్షి

జగదేకపిత భవత్సద్వక్షమందు
జగదేకమాత భాస్వత్సముల్లాస
శ్రీరమ నాసీనజేసిన నీదు
కారుణ్యదృష్టి జగంబుల ప్రజలు 450
తొల్లిటి సౌఖ్య సంతోషముల్ వొంది
రెల్లెడ మంగళ మేర్పడె జగతి
సిరియురమందున చెన్నారు నీదు —
పరమ వైభవమును బ్రహ్మాది సురలు

పొగడిరి కురిసిరి పూల వర్షమ్ము
గగనానఁ బాడిరి గంధర్వవరులు
అచ్చరలాడిరి, అఖిలవాద్యములు
విచ్చలవిడి మ్రోగె విన్వీధియందు
పాలవెల్లి సుత కృపాకటాక్షమునఁ
జాలిన సంపదల్ జగమున నిండె.

## అమృతోద్భవము :—

వారిధిఁ బిదప నవ్వారు ద్రచ్చంగ
వారుణియను నొక పడఁతి జనించె
నా పడంతిని భవ దనుమతి నొంది
చేపట్టి రసురులు చెలఁగు మోదమున
మరి మరి మిగుల సంభ్రమమున జలధి
సుర దానవులు మహోత్సుకతఁ ద్రచ్చంగ
నా జిడ్డు సంద్రమ్ము నందుండి యొకఁడు
రాజిత దివ్య వర్చస్సుగలాఁడు
భవదంశ జనితుఁడు భద్రయశుండు
దివిజవైద్యుండు సాధిత వైద్యశాస్త్రు 460
ఘనుఁడు ధన్వంతరి కడు నబ్బురముగ
తన దేహకాంతి తద్దయు ప్రబ్బికొనఁగ
నమృత పూర్ణ కలశహస్తుఁడై వచ్చె
నమరుల కసురుల కరుసమ్ము హెచ్చె.
నావల నా వెజ్జు హస్తమందున్న
పావనామృత పూర్ణభాండమ్ముఁ జూచి
యమరుల వంచించి యసురులుబల్మిఁ
దమ వశపఱచి రాతని నుండి దాని

నమృతమ్ము రక్కసులాఁచి కొనంగ
తమకేమి తోఁచక ధైర్యమ్ము లేక
"కేశవ, హరి, హృషీకేశ, కంజాక్ష
నాశరహిత, శత్రు నాశ, సర్వేశ
అమృతభాండముఁగొని యరిగి రసురులు
శ్రమము, మాత్రమ మాకు స్వామ్యమ్ము స్వామి ?"
అని నీదు శరణమ్ము నర్థించు సురలఁ
గని వారిదైన్యమ్ముఁ గడఁద్రోయఁబూని.
"త్రిదశులారా ! మీరుదిగులొందుటేల ?
యిదె నాదుమాయ యీయిష్టార్థసిద్ధి
గావింతు" వని వారిఁగరుణించితీవు
దేవ, దీనులకెల్ల దిక్కవుగావె 470

## శ్రీ విష్ణుమూర్తి మోహినీస్వరూపంబు నొందుట :

అమరారులెల్లరు నాసమయమున
నమృతమ్ముఁద్రావెడు నరుసమ్ముఁ బూని,
మునుపేమనుచు వేముమునని దైత్య-
దనుజులుతర్కించుతటి వారిలోన
నశుభంబులిడు కలి యావిర్భవించె
వశముగాని యనూయ వారలముంచె

అమృతావహారులౌ యసురులఁ గొంద
రమరారులావి "మహాదోషకృత్య
మిది, సురలును మనమేకీభవించి
హృదయముల్‌గలిపి, నహిష్ణులమగుచు
సమముగా శ్రమపడి సాధించినట్టి
యమృతభాగమున కాయమరులుగూడ

తగుదురు, విడుఁడు సుధాభాండమిపుడు
తగవులు పెంచుట తగనికార్యమ్ము''
అమడు వారలనించుకైనను లెక్క
గొనని వారలు సుధాకుంభమ్ము బలము
గలవాఁడు బలహీనుకడ నాఁచికొనుచు
నలబలముగనుండు నాసమయమున
నారాయణా, జగన్నాటకసూత్ర –
ధారి, శత్రుహర, భక్తజనమందార 480
ధూర్తులౌ యసురుల దుష్టవర్తనము
నార్తులై సేయు దేవాళిప్రార్థనము
కని, విని, కినుకయు కరుణయు నీవు
మనమునఁబెంచి దుర్మార్గ సన్మార్గ
శిక్షయు రక్షయు సేయంగఁ దగిన
దీక్షణమే యని యెంచి తత్క్షణమ
"చతురాననుఁడు కడుసౌందర్యవస్తు
తతి నంతయును జేర్చి తననేర్పుఁగూర్చి
యీతన్విసృష్టించెనేమొ, లేకున్న
నేతటి నేభువి నీయింతివంటి
సుందరినెందేనిఁ జూడఁగల్గితిమె
అందాలరాశి యీయతివయం చసురు"
లందఱు వ్యామోహ మందెడువట్టు
లిందిరా సుందరీ హృదయవిహార
శ్రీహరీ సర్వ నిర్ణేత నమోస్తు
మోహినీరూపమ్ము పొందితివీవు

## మోహిని రాక్షసులనుండి యమృతభాండమ్ముఁ గొనుట :—

అంగముల్ వొంగఁజేయంగల నీదు
సింగారమొలికించు చేష్టలఁజూచి

రక్కసుల్ నినుమూఁగి రాగమ్మురేఁగి
మక్కువనెక్కొను మాటలాడుచును 490
"ఎక్కడిదానవే యిందీవరాక్షి
ఇక్కడి కరుదెంచు హేతువెయ్యదియొ
నీ నామ మే మంత్రు, నిర్జరజాత
మానవజాతి వే మానిని గాని
నీ సాటి యనరాదు, నీరజనేత్ర
నీ సొగసున కీడు నీ సొగసొండె''
అని పొగడుటెగాక యసురులు మరల
వినిచి రీగతి కొన్ని విషయముల్ నీకు

"కమలాక్షి విను మేము కశ్యపు తనయు
లము గావునను భ్రాతలము, సురలెన్న
లాదిత్యులౌదు. రేమన్న దైత్యులము,
మీదు మిక్కిలి వారి మించు శూరులము
దాయాదులకు మాకుఁ దగవు రానట్టు
లీ యమృతముఁ బంచి యీగదే నీవు
మేమెల్ల సభదీరి మిన్న కుండెదము
మామీద వెనరుంచి మాట రానట్లు
చెరి సగముగ విభజించి యీ రెండు
తెఱగులకును బంచి తీర్పు మీ చిక్కు"
అని మోహపరవశమై పల్కుచున్న
దనుజ సంఘముఁ జూచి, దైత్యారి నీవు 500
మృదు మధురోక్తుల వెడఁద లుప్పొంగ
కుదురుగఁ బల్కితి కులుకు చిందంగ
"అసురులారా! కడు నాశ్చర్యమయ్యె
పసమీఱు శృంగార బంధురులైన

పురుషులఁ గని ప్రీతిఁ బొందు నా యందు
పరఁగె మీ బుద్ధి యెవ్వారలు స్త్రీల —
నమ్మరు నను నమ్మి నారలు మీరు.
నెమ్మనమ్మున ప్రేమనిండారె మీకు
నా వేర్పు కొలఁది నందఱు చూచుచుండ
మానుగఁ బంచెద మానుఁడు శంక''
అనుఁడు నీ పల్కుల కలరి నీ చేత
నునిచి రమృతభాండ మొనర దానవులు.

ముల్లోకములఁ గడు మోహింపఁ జేయు
సల్లలిత విశేషసత్వ స్వరూప
యసురు లొసంగిన యమృత భాండమ్ము
ముసి ముసి నగవుల ముచ్చటలాడి
కొని, చేతఁ దాలిచి గుమిగూడి యున్న
దనుజాదితేయ బృందమున కిట్లంటి.
"ఓ యసురామరు లోపిక మీకు
నీ యమృతముఁ బంతు హెచ్చు తక్కువలు 510
పలుకక నా చేయు పందేర మెలమి
వెలయఁగాఁ గొనుటయె విధి యగుసుండు
అనవుఁ డట్టులె యగునని వారలెల్ల
మనుకొన్న సంతోషమున త్వరితముగ
స్నాన సంధ్యాద్యనుష్ఠానముల్ దీర్చి
మానుగ దాన ధర్మముల నొనర్చి
తూరుపు చూచు బంతులుగ నందఱును
కూరుచుండిరి శుద్ధ కుశపీఠములను

## మోహిని యమృతమును బంచుట :-

దానవపోషణ దివ్యధామనివేశ
ఖాసుర మోహినీ భామావతార

దాపలి యరచే సుధాకలశమ్ము
నైపుణిఁ దాలిచి నడకలో కులుకు
లొలుక వలపలికే లూపుచుఁ గనుల
బెళికించి చూచుచు, బిర బిర వచ్చి
సురల దైత్యుల మధ్యఁజొచ్చి నీలోన
"పరమ పవిత్ర మీ పరమామృతమ్ము
అసురుల కిది వోయ నాపదల్ గల్గు
విసదారులను బాలఁ బెంచిన యట్లు"
అనియెంచి నీవాసురాసురబృంద
మును వేరువేర నిమ్ముగ రెండు పంక్తు 520
లొనరఁగఁ బంచి కూర్చుండఁగాఁ జేసి
దనుజుల కిట్లంటి తామరసాక్ష

"దానవులార! తొందరపడకుండుఁ
డేను మీ చెంతకు నిప్పుడ వత్తు
సురల కించుక రుచి చూపి యాపైన
నుడుభాగ మమృతమ్ము నొనర మీ కిత్తు
జావలు మఱదులు పరికింప మీరు
భావింప మఱదలు వదినెను నేను
మిము నా మనంబున మెచ్చినదాన
సమయమ్ముఁగని మిము సంతోష పఱతు
నటు మీర లాసీనులై యుండుఁ డిపుడె
చిటికెలో వత్తు మీ స్పృహలెల్లఁ దీర్తు"
ననిమెల్ల నవ్వి సంవ్యానమ్ముఁ జార్చి,
కనుగీటి మోహ సాగరమున వారి
ముంచితి, వారెల్ల ముగ్ధులై తాము
వంచింపఁ బడుటను భావింపరైరి.

నీరజాక్షా! నీవు నిర్జర పంక్తిఁ
జేరి వారలకు మచ్చికతోడ సుధను
పంచుచు "దడవింక వలదు త్రావుండు
మించిన కార్యము మేలిమి చెడును."  5
అని సుధనంతయు నమర సంఘమ్ము
తనియంగఁ బంచెడు తఱి నిశాచరులు
"అమరులకును మన కనిరాని యటుల
సమబుద్ధితోడఁ బంచఁగ నీమె పూనె
మనల వంచింపదు, మనకోర్పులేక
మునుపడి యడిగిన ముదిత కోపించి
మనతోడఁ బల్కక మనలఁ గన్గొనక
తన ప్రేమ మనపైనఁ దప్పించునేమొ."
అని మోహపరవశులై గ్రుక్కు మిక్కు
మనకుండిరేగాని, యమృతమ్ము మాకు
నతివ, తేతెమ్మని యడుగలేఁడయ్యె
దితిజులనొకఁడైన దేవ! నీమాయ

ఆసందడిని రాహువను దైత్యుఁడొకఁడు
మోసముగ సురసమూహమ్ములోనఁ
దానొక వేల్పువాఁదగి యమృతమ్ము
నానుచుమండ. చంద్రార్కులవలన
వాకన్నెఱింగి చక్రాయుధధార
వీఁక ఖండించి తా విబుధారిశిరము
ఆమూర్ధ మమరత్వమందె దేహమ్ము
భూమిపైఁబడి తనపోడిమివాసె  5
నామూర్ధమును నజుఁడంబరమందు
గాముగానుండ వాజ్ఞాపనచేసె

నది పర్వదినముల నర్కచంద్రులను
వదలని పగతోడఁ బట్టుచునుండు
మాయచేజగములమరపించు నిన్ను
మాయచేయగనెంచు మానవుఁ డెంత-
జ్ఞానహీనుఁడొ చెప్పఁజాల సర్వేశ
జ్ఞాని యెఱుంగు నీశక్తి రమేశ,
నన్ను,నజ్ఞాని నెన్నటికేనిఁ గరుణ
మన్నించి కాపాడుమా దేవదేవ.
కమలాక్ష! నీ సేవ గావింపనట్టి
కుమతుల శుభములుగూడ వెన్నడుమ
పిమ్మట మోహినీవేషమ్ముమాని
యిమ్ముగా నిజరూపమెత్తి ఖగేంద్రు
నారోహణముచేసి యరిగితివీవు
నారాయణా కరుణాగుణాభరణ

ఆరీతి పీయూషమంతయు సురలఁ
జేరుట తమకుఁ గొంచెమ్మైని చేర
కుండుట మోహంపుటురులలోఁదాము
గండారిపడుట శ్రీకమలాధినాథ! 550
నీమాయమొదలగు నిఖిలమ్ముఁగూర్చి
వేమరుచింతించి, విధిమదినెంచి,
రోషానమించి, విరోధమ్ముఁబెంచి,
దోషాచరులు మహాదుర్దాంతశక్తి
నమరులహింసించి యతగులఁజేయ
సమకట్టిరంద ఱాసమయమ్మునందు

## సురాసురుల కలహము:

అమరులపక్షమ్మునందు నింద్రుండు
సమద దైతేయపక్షమునందు బలియు

మొనకాండ్రుగా నిల్వ పోరిరి దేవ -
దనుజవీరులు సముద్ధతి పరస్పరము
విమతనాశమ్మును, విజయమ్ముగోరి
యమిత పరాక్రమ మావేశమొప్ప
నాసమరమ్మున నచ్యుతా నీదు
భాసుర సద్భక్తపక్షానుకంప
విజయమ్మునొందెను విబుధగణమ్ము
గజిబిజిఁబాఱె రక్కసులగణమ్ము

రాజీవలోచన రవికోటితేజ
రాజితకౌస్తుభరమ్యోరువక్ష
పతితపావన భక్తవరజనశ్రీద
చతురాననార్చిత సరసిజపాద 560
జగతినెవ్వరు తమ సంకల్పములను
దగఁదీర్చుకొనలేరు తమప్రయత్నమున
భవదీయ కారుణ్యభాగ్యమేయున్న
వెవరేనిఁ బడయుదు రిష్టార్థములను
గడలిచూడంగ మోకాటిబంటియగు
గడునెండుబెండగు ఘనగిరియైన
నివి నీదుమహిమ లోయిందిరానాథ
వివరింపనావంటి వీఱిడికగునె
నన్నునిష్కామ మనస్కుగాఁజేసి
నిన్నుసేవించెడి నియతిఁగల్పించి
నీదాసునిగఁ గరుణింపుమా నీదు
పాదమ్ములేగతి వైకుంఠవాస

## శ్రీహరి తన మోహినీస్వరూపముచేత ఈశ్వరుని మోహింపఁజేయుట :

గజరాజవరద యోఖగరాజగమన
ద్విజరాజశయన, విద్విషరాజదమన
యెంతటిసర్వజ్ఞులేని నీమాయఁ
గొంతేనియిదియనిగురుతింపలేరు

పురుషోత్తమా నీదుమోహినీరూప -
గరిమయు, రాక్షసగణ మతిమోహ
వాగురఁబడుట, నీశ్వరుఁడాలకించి
యాగురుమాయామహత్వంబుఁ దెలియఁ 570
దనదేవితో భూతతతితోడఁ గదలి
వనజనాభా ! నీనివాసమ్ముఁజేరి
నీపూజలంది, తానినుగౌరవించి
యేపారుమైత్రి నీకిట్టులననియె

"దేవ ! జగన్మయ దివ్యప్రకాశ
భావనాతీతప్రభావ లోకేశ
నీదు మాయాగుణాన్విత వర్తనములు
నీదగు సద్ధర్మనిర్ణయకథలు
కనవిన వేడుకఁ గల్గించుచుండుఁ
దనివితీరకయుండు ధర్మస్వరూప,
నీమగపోడుముల్ నీ మహత్త్వములు
వేమారుకంటిమి వింటిమి కాని
నీమాని నీత్వమ్ము నీదంటతనము
వేమెఱుగము జగదీశయెన్నఁడును
మోహినివై సోకుమూఁకలనెల్ల
మోహానముంచి వేల్పుల కమృతమ్ము

పంచితివందు రాపడఁతిరూపమ్ముఁ
గాంచఁ గోరితిఁ జూపఁగదవె లక్ష్మీశ

అని కోరుచున్న నయ్యభవువీక్షించి
మనముపొంగుచునుండ మందహాసమ్ము 580
గావించి "ఓయుమాకాంత, శ్రీకంఠ
నీవేమఅకుమ నేనీకోర్కెఁదీర్తు
ననురులనెల్ల మోహాబ్ధిముంచుటకుఁ
బొసగించుకొన్న నాపొలఁతిరూపమ్ముఁ
జూపెదఁ జూతువుసుమ" యంచుఁబలికి
శ్రీపతి యపుడ యదృశ్యుఁడవైతి

అంతగౌరీనాథుఁ డహహ శ్రీనాథుఁ
డింతలో నెటువోయె నిదియబ్బురమ్మ
ఎందుఁజొచ్చెనొ, యతఁడెందున్నవాఁడొ
కందుఁగాకని దిశల్ కలయవీక్షించు
నామహాదేవున కతిసమీపమున
నామనిశోభతో నలరారుచున్న
యారామమొండు నేత్రానందమిచ్చు-
సౌరుతోఁ దోఁచె నాచక్కనితోఁట,
నొకచోట, నొకవీధి నొకచెట్టునీడ
నొకమనోహరమూర్తి యుగ్మలి తనదు
వలకేలి పూబంతి బయలున కెగురు
పొలుపున మీటుచు, మూఁపుననుండి
తలఁగి జాఱెడు పైఁటఁ దనదుడాకేల
నిలువంగఁబట్టుచు నెమ్మినాడుచును 590
దనకంపఁబడగ నాతన్వంగిఁజూచి
ఘనమోహమున మున్గి కఱకంఠుఁడపుడు

"ఎవతె యీ యెలనాగ? శృంగారమెల్ల
సవరించి యొక్క మూసను బోసినట్టు
లతిలోక సుందరియై తనరారె
నతివ యీ చెలి నాకు నబ్బుట యెట్టు"
లని యామె వాల్చూపుటమ్ముల నతఁడు
తనుఁ దా మఱచెఁ దన తన్విని మఱచె
నా సమయమ్మున నామె పైకెగుర
వేసి పట్టఁగ రాని విధమునఁ దనదు
చేఁదప్పి వ్రాలెడు చెండునుబట్ట
నాదరబాదర నటునిటుఁబర్వ
నాతలోదరి కటినలరు చేలమ్ము
వాతాహతింజాఱి వసుధపైఁబడియె
చీరవీడినయట్టి సిగ్గుతోఁదరులఁ
జేరి, చాటునడాగఁ జెచ్చెరఁజనెడు
నాతలోదరిని వెన్నాడుచు నభవుఁ
'డోతన్వి పోకుమా! ఓచెలినిలుము'!
అనిడాసి బలిమిమై యాశ్లేషసౌఖ్య
మొనరించి యంతలో మోహమ్ముపీడి 600
అది భవదీయమాయగఁ దావెఱింగి
మది పదిలముచేసి మరలెనతండు
అవలనీవును బురుషాకారమొంది
భవుసత్కరించితి ప్రహ్లాదవరద

ఆదిపూరుష జగదాధారమూర్తి
నీదివ్యమహిమల నీదుమాయలను
దెలియంగనేర్తురె దేవతలేనిఁ
దలఁప నెవండేనిఁ దగులునీమాయ

నను మాయముంచి యనాదరదృష్టిఁ
గనకుమా, సజ్జనగణపారిజాత!
నీదాసుడనని మన్నింపుమా నీదు
పాదంబులంబట్టి ప్రార్థింతునయ్య

ఫలశ్రుతి :

క్షీరాబ్ధిమథనమ్ముఁ జెలఁగుకూర్మావ –
తారచరిత్ర సుధాసంభవమ్ము
మోహినీవృత్తాంతమును బఠియింప,
నీహతోవిన, రచియించిన నరులు
సకల సౌభాగ్య సత్సంపదల్ వొంది
యకలంకపదవిఁ దామంది హర్షింత్రు 609

## శ్రీ వామన చరిత్రము

* * * * *

శ్రీలలనామణీ! హృదయాబ్జభృంగ
కాలుష్య విరహిత కరుణాంతరంగ 610
నీ లీల లవనికి నిత్యోత్సవములు
చాలు వెవఁడు వాని సన్నుతియింప?
నీ యనుగ్రహమున్న నెఱయు సంపదలు
నీ యాగ్రహమునకు నిలువవాసిరులు
జేత కోటమి, పరాజితునకు గెల్పు
నీ తలంపులె గదా నిఖిల లోకేశ.

## బలి స్వర్గమును తన వశము చేసికొనుట :—

ముని శక్రుచే నోడిపోయి, భార్గవుల
కనికరమున బలి క్రవ్యాదరాజు
విశ్వజిద్యాగంబు విధివిధానముగ
విశ్వాసమున వెలవేరిచి దానఁ
గడు శ్రేష్ఠ యుద్ధోపకరణ సంచయము
వడసి, వాడని దివ్య పద్మ మాలికను
దన తాతవలనఁ జంద్రమ్మువంటి శంఖ
మును శుక్రువలనను బొంది యతండు
అరికోటి గర్వాపహరణ ప్రసిద్ధ —
పరివారముంగొని పాకారి గెలువ
దండు సాగించి యుద్దండుఁడై సురల
గుండెలదరఁ జేరు కొనియె నాకమ్ము
అసుర నాయకు చతురంగ సేనాంగ
మెసరేఁగి చేయు విశృంఖల ఘోర 620
రవమొక్కమాటు స్వర్గమ్ము నంతయును
సవతుగానని సాధ్వసమ్మున ముంచె

బలి దనుజేంద్రుండు స్వర్గమ్ము మీఁద
బలయుతుఁడై దండు వచ్చుట దెలిసి
బలభేది గురు బృహస్పతి కడకేగి
"యలఘు సేనాయుతుఁడై యమరారి
దండు విడిసియుంటఁ దగ విన్నవించి
భండన మ్మొనరింప వలయునో వలదొ
ముని మనచే నోడి పోయినవాఁడు
చనుదెంచి నాఁ డిదె సత్వమ్ముమిగిలి

యా దురాత్మకునకు నండ యెవ్వాఁడొ
యేదారి మనకిచ్చు నెక్కువ మేలు
తెలుపవే యనుచు భక్తిగనతుల్ సేసి
పలు విధముల వేఁడఁ, బల్కె నా గురుఁడు.

"విను మమరేంద్ర! యీ విబుధారి కిపుడు
మన జయయోగమ్ముఁ గరుణించినారు
భృగువరుల్, కావున వీని జయింప
ఖగరాజ వృషరాజ గమనులు దక్క
నినుఁబోలు వారలు, నీవు నీ కంటె
ఘను లోప, రీరాజ్య కాంక్ష నీ విపుడు 630
చాలించి యెటకేనిఁ జనుటయే నీతి
కాలమ్ము నెదురుకోఁ గలవారు గలరె?
భృగు బలంబున వీఁడు వృద్ధికి వచ్చె
నగుఁగాక, కాని యా యనఘుల వీఁడు
మదిలెక్క సేయక మఱయు నొకప్పు
డదె వీని యిడుమల కంకురార్పణము.
అందాక రిపువాక్కు లన్నియు మఱచి
యెందేని యుండుటయే నీకు మేలు"

అను గురుహిత వాక్కు లన్నింటి భక్తి
విని మంచిదని యెంచి విబుధాధిపతియు
నమరులు స్వర్గమ్ము నప్పుడ విడిచి
తమ తమ కనువగు స్థలములఁ జేరి
రంతట బలి దానవాగ్రణి తనదు
స్వాంతముప్పొంగగా స్వర్గాధిపత్య –
మునుబొంది ముజ్జగముల తనవశము
నొనరించుకొని తన కొఱకుఁదే వెఱ

డేని యెదురులేక యెసఁగు శౌర్యమ్మొ
పూనిన ప్రాభవమ్మున నొప్పుచుండె.

## అదితి సురలయిడుములఁ కశ్యపునికిఁ దెల్పుట :—

తన కుమారుల ప్రోలు దైత్యులు గొనుట
ననదలై దేవతలటనుండి చెదఱి
పాఱి డాఁగుట నెడ భావించి, యదితి
తీఱని బాధఁ జింతించుచునుండె
ఒకనాఁడు కశ్యపుఁ డదితి ధామమ్ము —
నకుఁజని యామెయొనర్చిన పూజ
లంది, యాసాధ్విదైన్యమ్మునుగాంచి
పొందిక తనదు దాపున నుండఁ దివిచి
మోము స్పృశించి చుబుకమును నిమిరి
ప్రేమనిల్లాలి కివ్విధమున ననియె.
"అతివ వగపు నొందినట్టులున్నావు
కతమేమి? నీకు సుఖమ్మె? కుటుంబ
ధర్మములన్నియుఁ దప్పక జరగి
శర్మమ్ము జగతికి సాగునుగాదె,
యతిథి సంతర్పణ మరకొఱగాక
కుతుకంబుతో శక్తికొలఁదిఁ గావింతె.
యతిథి తృప్తివహింప, హరితృప్తినొందు
సతి! హరితృప్తియే జగతికిఁదృప్తి
కొఱయేమి? నేవినఁగోరెదననుఁడు
తెలవ పతికి నిట్లు దీనయైపలికె.

"హృదయేశ! నావగపేమని దెల్ప
మదికివేదన తలంపఁగ, నైన వినుఁడు

దితిసంతు నాసంతు ద్వేషభావమున
నతిబలమునమించి, యందఱఁ దరిమి
యమరావతికిఁ దామ యధిపులై, పాల —
నము వారె సేయుచున్నారు మౌనీశ.
దితి నన్నుఁ బ్రేమంపు దృష్టులఁ జూడ,
దతిక్రూరబుద్ధి నిజాత్మజుల్ నరల
మోదుచునుండ తా ముదమొందుఁగాని
యాదుష్టవర్తన మణగించఁబోదు
పలుపంచలంబట్టి పౌలోమి యింద్రుఁ
డలుకున నడవుల యందుఁ దా దాఁగె,
బోయబాలురమైత్రిఁబూనె జయంతుఁ
డీ యక్రమస్థితి నేమనవచ్చు
బలిగెల్వఁజాలఁడు బలభేది, వాఁడు
తులువయై హవ్యమింద్రునకీయఁ దలఁప
డిట్టి యకార్యమ్ము లెక్కడౌచుండ
నెట్టులఁజూచి సహింపంగవచ్చు
నిరుతెగల్ నీపుత్రులే, కాన వారిఁ
బరికించి, దుర్మార్గవర్తనులైన
దితిజులశాసించి దీనలౌసురల
నతికృపామతిఁ బ్రోవుమయ్య మహాత్మ" 660
అనివేఁడు నదితి దీనాలాపములను
విని కశ్యపుఁడు మౌనవిధి కొంతసేపు
చింతించి, యోగదృష్టిని భవిష్యత్తు
నంతయుఁదెలిసి నిజాంగనకనియె.

### కశ్యపుడు అదితినోదార్చుట:

"విను సతీమణి నీకు వినిపింతు నిజము
జనగోచరంబగు జగతి నెవ్వరికిఁ

దలిదంద్రులెవ్వారు? తనయుఁడెవ్వాఁడు?
తెలియ సంసారముఃతీ రెటులుండు?
ఎందాక దేహమ్మ్మలెసఁగు లోకమున?
కొందఱైనను వాని గుర్తింపఁగలరె
అంతయు విష్ణుమాయావిలాసమ్ము
కాంత! దైన్యమ్మొందఁగా నేమిఫలము?
ఐనఁ గాలోచితమగు నొక్కకార్య
మేనెఱిగించెద నిప్పుడు వినుము
పరము జనార్దను భక్తి సేవింపు
మరయ నాహరి భవదకలంకభక్తి
కరుసమ్ముఁ దృప్తియునంది నీకోర్కె
లిరవొందఁ జేకూర్చు నిందీవరాక్షి"
అని కశ్యపుఁడు సతి ననునయోక్తులను
వెనరుంచి యోదార్చి నిఖిలవ్రతముల 670
వరమైతనరు 'పయోభక్షణ' మనెడి
యురుతరవ్రతము నొండుపదేశమీయ
నదితి తద్వ్రతముఁ గశ్యపుబోధయటులఁ
గుదురగు మదితోడఁ గొనకొనిసేసె. 672

## భగవంతుడు అదితికి ప్రత్యక్షమగుట:

సాధురక్షణ భక్తజనపారిజాత,
శ్రీధర, నతజనేప్సితవరదాత
శ్రితజనావనదీక్షఁ జెన్నొందు నీదు
వితతమాహాత్మ్యంబు వినుతింపఁదరమె
సురమాత చేసిన సువ్రతాంతమున
పరమపూరుష యామెభక్తికిమెచ్చి

ప్రత్యక్షమైతి; వా పావన చరిత
అత్యుత్సుకత నొంది, యతివేల భక్తి
నినువేయి విధుల వర్ణించి యా మీఁదఁ
దన మనోవ్యధ నిట్లు తగ విన్నవించె

"గజరాజ వందిత, ఖగరాజగమన
భుజగేంద్ర శయన, సంపుల్లాబ్జనయన
యసురులు సురసమూహముఁ బాఱఁద్రోలి
యెసఁగు గర్వమ్మున నింద్రార్హమైన
స్వారాజ్యమును దమవశము గావించి
ధీరులై పాలించు తీరును జూడ 680
కన్న కడుపుగానఁ గంటికి నిదుర
సున్న యయ్యెను నాఁటిసుతనాకుదేవ
నా కడ్పు పొక్క నణంచి మోదమ్ముఁ
జేకూర్చుమా యివే జేజేలు శ్రీశ"
అని వేడుచున్న నా యదితిని కరుణఁ
గని యిట్టులంటివి కల్యాణమూర్తి.

## విష్ణువు అదితికి అభయమిచ్చుట:—

"అమ్మ! యే మాత్రమీవడలకు మమ్మ
నెమ్మి నుండుము, నీకు నీ ప్రాణపతికి
నీదు కోడండ్రకు నీ తనయులకు
మోదమ్ము, మరి సోకు మూఁకల కెల్ల
ఖేదము గలుగ నీ కీర్తి పెంపొంద
నీదు గర్భమునందు వే జనియింతు
నీ తనయుండనై వెగడంగఁ గలదు
నా తలంపున కోర్కి నలినాయతాక్షి

వినయమ్ము ననగాని వేఱుమార్గమున
దనుజులఁ ద్రుంచ నెత్తఱి వీలుగాదు
దానికిందగిన పద్ధతి నేను చూతు
మానుము నీ చింత, మఘవు వశమ్ము
గావింతు స్వర్గమ్ము, కలిగింతు నిమ్ము
నీ వింక పతిసేవ నెమ్మిగానిమ్ము " 690

ఈ రీతిఁ బల్కి యదృశ్యుండవైతి
నారాయణా జగన్నాథ సర్వేశ

**అదితి గర్భిణియగుట :**

భవదాజ్ఞ భక్తితోఁ బాటించియదితి
ప్రవిమలమతి నిజభర్తృసేవనము
గావించుచుండి, తత్కరుణపెంపొంద
పావనమతి గర్భవతియయి తనరె.
నంతట మాసములగుచుండ నెలఁత
కంతకంతకు గర్భమభివృద్ధియయ్యె
నా రీతి విశ్వమయాత్మక నీవు
కారుణ్యమొప్ప నా కాంత గర్భమునఁ
బెరుఁగుట గర్భమ్ము బెరిగి మాసములు
పరిపూర్ణమయి ప్రసవము వేళవచ్చె.
నా సమయంబున నంబుజాసనుఁడు
భాసురమతి కశ్యపబ్రహ్మ నెలవుఁ
జేరి, యదితి గర్భసీమయందున్న
నారాయణుని నిన్ను నర్మిలి వినతి
గావించి, " దుర్దశఁ గడు స్రుక్కుచున్న
దేవసంఘమ్మును దేర్చి రక్షింప

నీవెగా శరణమ్ము నిఖిల లోకేశ,
యావిర్భవింపవే" యని వేఁడుచుండ 700

## శ్రీ వామనావతారము:—

శ్రవణమ్ము, ద్వాదశి సమకూడినట్టి
దివముపఁ దరణి మధ్యేదినమందు
వెలుఁగుచుండెడు శుభవేళ సద్ధర్మ
కలితవర్తి యదితిగర్భమ్మునుండి
యవతరించితి వామనాకృతి నీదు
నవరగురూపమ్ము సర్వమ్ముదోఁప,
నంతనింద్రాదులౌ నమరులెల్లరుమ
జింతవాసిరి, యక్షసిద్ధాది దేవ-
యోనిగణము కడునుత్సాహమొందె
సూనవృష్టిగురిసె సోగిసెలోకమ్ము
నినుఁగాంచిన యదితి నిర్భరానంద
మున ముగ్ధి మిగులంగఁ బొగడందొడంగె
నాలోననీవు నిజాకృతిమాని
బాలవామనుఁడవై పరగితివయ్య

నినుసుతుగాఁగని నిఖిలలోకముల
ననుపమవిఖ్యాతినందే నాయదితి.
రార నాదు కుమార రార నా తండ్రి
రార నా సువ్రత రాశి ఫలంబ
రార నా దైవమ, రార నా వడుగ
రార రారని ప్రేమ రంజిల్లఁ బిలిచి 710
ముద్దులు వెట్టి నీ మురువులు గముచు
దిద్దుచుఁ దీర్చుచుఁ దియ్యంబుఁ జూపి

నిను( బెంచు భాగ్యమందిన వేల్పుమాత
కెవయని చెప్పంగ నింతులే లేరు.

## వామనుఁడు బ్రహ్మచర్యమును గైకొనుట:—

కడు మోద మొప్పారఁ గశ్యపు నెదుట
వడుగు సేసిరి నీకు బ్రహ్మర్షులంత
సావిత్రినిం దెల్పె సవిత, జన్నిదము
దేవగురుం డిచ్చె, దివ్యమౌ ముంజిఁ
బిత కశ్యపుం డిచ్చెఁ, బ్రియమాత యదితి
యతిపూత కౌపీన మాదృతి నిచ్చె,
నవని కృష్ణాజిన, మబ్జుండు యష్టి
దివి ఛత్రమును, బ్రహ్మదేవుండు కుండి
జపమాల వాణియు, సప్తర్షులెల్లఁ
గృప పవిత్రమ్మును కిన్నరేశుండు
భిక్షఁ గైకొనుపాత్ర, వేర్వేర నొసఁగ
నక్షయమని భిక్షయార్యతాఁబెట్టె
నీ విధమున జగదీశ్వర నీవు
పావనమై తగు బ్రహ్మచర్యమ్ముఁ
బూనితి త్రిభువనముల మేలుగోరి
శ్రీనాథ నీ చెయ్ది చెప్ప నబ్బురము 720

## వామనుఁడు బలిచక్రవర్తి కడకుఁ జనుట:—

జనకుఁ డెవ్వాఁడు నీకు జనని తానెవతె?
జనన మెచ్చోట వాసమ్మన నెద్ది?
యెరులీయఁ గొనుట, నీ కొరులు వేర్పటయు
హరి! నీవు చూపు మాయా విశేషములు

అన్నియు జగతికి నగు నౌరవడులు
నిన్నుఁ జెందని ధర్మ నియమ వర్తనలు

పరదేశముల నుండి వచ్చెడివిప్ర —
వరులను బరికించి, బ్రాహ్మణులారా!
పాటులు కోరిన వస్తుసంచయము
మాటువల్కకయిచ్చు మాన్యుఁడున్నాడె?
అతఁడెవ్వఁడో దెల్పుఁడని నీవుకోరఁ
గుతుకంబుతో విప్రకులజు లిట్లనిరి
"వినవయ్యవడుగ యీపృథ్వీతలమున
ఘనులగుదాతలు గలరు పెక్కండ్రు
ఇత్తురు కోరినవెల్ల నర్థులకుఁ
దెత్తురర్థులు తమిదీఱ వస్తువులు
కాని, బలినిఁ బోల్పఁగల వదాన్యులను
కానము, మ్నింక గనుఁగొనఁబోము
అతఁడు శుక్రాచార్యునాజ్ఞ నధ్వరము
వితతవిఖ్యాతిఁ గావించుచున్నాఁడు 730
ఆదాతవేఁడి నిజాభీష్టములను
మోదాన నెవఁడేనిఁ బొందంగవచ్చు"
అని బ్రాహ్మణులుదెల్ప నాలించి లోక -
మునకు ముదంబును బుట్టింపఁగోరి,
జననీజనకుల మెచ్చయినయాశీస్సు -
లను బొంది, యుత్తమ లగ్నమ్మునందు
పయనమైచనితిని బలి యధ్వరమ్మ -
నయరీతిఁజేయు పుణ్యస్థలమ్మునకు

బలినెఱుఁగవె వాని ప్రఖ్యాత దాన
విలసితగుణమీవు విన్నదిగాదె!

కాని, యెఱుఁగనట్లుగా వారివీరిఁ
బూనిప్రశ్నించితే పురుషవరేణ్య
అది నీదు మాయామయత్వనాటకము
గద! భవలీల లగణ్యముల్ దేవ!
సిరి యురమందునఁ జెన్నారునీకుఁ
గొఱయె సంపద; లేలొకో యిట్టిపూన్కి
పరహితరతమతిఁ బరఁగు నీమహిమ
లరయంగ లోకకల్యాణముల్ గావె

జన్నమ్ముఁజూచు ప్రేక్షకసమాజమ్ము
నిన్ను, నీరూపమ్ము, నీదుతేజమ్ముఁ 740
గాంచి, "యీతఁడుబ్రహ్మగానుండు, లేక
కాంచనవసనుఁడొ, గంగాధరుండొ
రవియొ యగ్నియొ నగు, బ్రాహ్మణుఁ డింత
ప్రవిమల తేజోవిరాజితుఁడగునె?"
యని గుసగుసలాడు చబ్బురపడుచు
వెనలేని సంతసమేర్పడనుండ
వడివడిఁజని యజ్ఞభవనమ్ముఁజేరి
కడునిష్ఠమెయి వేదకథితమార్గమున
జరగు జన్నపుతీరు సకలమ్మునీవు
పరికించి యచ్చటి వరపురోహితులఁ
గలసి యజ్ఞక్రియ గావించు విధము
తెలియఁ జర్చించుచుఁ దెలిసి మేలనుచు,
వటునిటుచూచుచు నాహ్లాదపడుచు
దిటవుమై సభలోనఁ దిరుగుచునుండి
మెలమెల్ల ముందుకు మిగులుచుఁబోయి,
బలి దానవవరేణ్యుపజ్జను జేరి

యాతనివీక్షించి యందఱువినఁగ
ఖ్యాతమౌ దక్షిణహస్తమ్ముచాచి

## వామనుఁడు బలిని దీవించుట:

"యీతఁడెగద యమరేంద్రాదిసురల
వీతగర్వులఁజేసి వెలసినప్రోఢ
యీతఁడేగద యాచకేప్సితార్థముల
నాతతమ్ముగ నిచ్చునట్టి ప్రదాత
యితఁడెగా ధర్మపథైకానువర్తి
వ్రతదీక్షనున్నట్టి బలిచక్రవర్తి
యితనికి, త్రిజగములెలెడుఘనున,
కతులిత శౌర్యగుణాన్వితమూర్తి
కమరేంద్రభయదున కధ్వరాచరణ —
సముచితమతికి విస్తరదానగుణికి
స్వస్తియౌఁగావుత! శాశ్వతకీర్తి
నిస్తులపదవియు వెలకొనుఁగాత!"
అనుచు దీవించిన యమరేంద్రనుతుని
యనుపమచారిత్రు, నాగమాకారు
వటు లక్షణాన్వితు, వామనరూపుఁ
జటులతేజస్వి కేశవు విన్నుఁగాంచి
భృగువులు కూర్చున్నయెడనుండివచ్చి
తగసేమమడిగిరి తద్ధప్రేమమున
అంతట నాబలి యసురలోకేంద్రుఁ
డంతరంగమ్మున నానందమొంది
వీకు నమస్కృతుల్ నెమ్మిఁగావించి
ప్రాకటమగుభక్తి బంగరుగద్దె

మనిచి నిఱ్గూరుచునుండఁ బ్రార్థించి,
వనజోపములగు నీపాదముల్ దుడిచి
తనసతిదెచ్చు పుత్తడిగిండినీట
ననుపమభక్తి పెంపారంగఁ గడిగి
తడియొత్తి తత్పవిత్రజలమ్ము తనదు
నడువెత్తి మిగుల పుణ్యమ్మనిదాల్చి
యనువమానందమ్మునంది యాదాత
వినుగని వినుమని వెమ్మినిట్లనియె

## బలి వామనుల సంభాషణము :

"వడుగ యెవ్వఁడవు నీవాసంబదెద్ది?
కడుమేలు నీదునాగమనముమాకు
నాజన్మ, నాదునన్వయము ధన్యమ్ము
నాజన్మము ఫలవంతమ్మయ్యె నేను
ధన్యుండనైతి నాతలఁపులన్నియును
మాన్యంబులగుచు సంపదలుచేకూర్చు
ధరణీసురోత్తమ దయయుంచి కోరు
మరయ నీవడిగినవన్నియు నిత్తు
వలువలో, మాడలో, పశువులో, హరులో
చెలులో, రత్నమ్ములో, సేవకజనులో,
కరులో, మందిరములో, గ్రామాదికములో,
మరి రాజ్యమో కోరుమా విప్రవర్య" 770
అనెడు వైరోచను నాత్మ నీవెఱిఁగి
మనమున ముదమంది, మాయయేర్పడఁగ
నీమానసము దాఁచి నేర్పుమై నతని
కీమాడ్కిఁ బల్కితి విందిరానాథ

"బలిదానవేంద్ర! నావసియించునట్టి
నెలవిదియని చెప్పవేరకున్నాఁడ
నెవ్వడే నెచ్చటవేని నేనుండ,
ముప్పోకలంబట్టి పోవుచునుందు
నేను నేర్వనిదిలే దెందుశోధింప
నేనొక్కఁడన నాకు నెవ్వరులేరు
సిరిసుఖంబుల మున్నుచెందితిఁజాల
నొరుల కష్టముఁజూచి యోర్వంగఁజాల
వృజనాత్ములకుఁ గడు వెడగాఁగనుందు
సుజనహృచ్ఛిమలఁ జొరఁబడియుందు
అదియటులుండని మ్మసురలోకేంద్ర
విదితమ్ము మీవంశవిఖ్యాతి జగతి
మీయన్వయమ్ము సామీచీన్యమునకు
నాయువుపట్టయి యలరారుచుండు
మీతాతలెల్లరు మేటిపోటరులు
దాతలయ్యేదరు ప్రత్యర్థులకైన 780
మును హిరణ్యాక్షుండు ముజ్జగమ్ములను
దన గదాదండమ్ముదర్పాన నొంచె
నతనియన్నయు హిరణ్యకశిపుఁడనెడు
వితతబలాఢ్యుఁడు విష్ణునేయెదిరె
దనుజేంద్ర వారు ముత్తాతలునీకు
ఘనులు వీరులు పరాక్రమముగలారు
మీతాత ప్రహ్లాదు మేల్మిగుణమ్ము
భూతలమ్మున వెందుఁ బొడమదెవ్వరికి
ఘనుని విరోచనాఖ్యునుమన్న నీదు
జనకుని గుణముఁ బ్రశంసింపఁదరమె
యమరాధిపతివేఁడ నాయువేయిచ్చి
విమలవిఖ్యాతిమై వెలసెనతండు

నీవు వదాన్యాగ్రణివి విన్నెఱుంగ—
నే విశ్వవిఖ్యాతి వెగడుచున్నావు
కాని యెన్నఁడు నిన్నుఁగదిసి యొక్కింత
యైన నేమైన నేనర్థించియెఱుఁగ
నీఁదలఁతేని నాకిమ్మసురేంద్ర
కాదనకుండ నాకాంక్ష విన్పింతు
నారయ నాకు మూఁడడుగులయంత
మేర పుడమినిమ్మ మేలునీకగును 790
ఒంటికాఁడను దృప్తినొందెదదాన
మింటినంటిన యంత మెప్పునాకగును"
అను నీదుపల్కుల నయ్యమరారి
విని యందలి రహస్య విషయమ్మెఱుంగఁ
జాలమి, నిన్ను విస్మయబుద్ధిఁ జూచి
బాలుఁడవంచెంచి పలికె నీరీతి
"వడుగ! యేమడిగితి వాజులా, కరుల
పుడమిభాగమ లేక పొలఁతులా, కాదు
పాపము కడుఁబసివాఁడవు గాన
నాపాటి భాగ్యంబు లర్థింప వైతి
వలతి పదత్రయ మడిగితి పుడమి
నలఘు దాతగుణమ్ము నరయలేవైతి"
వనుఁడు మోమున మందహాసమ్ముదోఁప
ఘను బలికిట్లు వక్కాణించితీవు

"వడుగు బాపఁడ, నాకువలయు వస్తువులు
గొడుగు, జందెము, జలకుండిక, ముంజి
మొదలగునవి కాని పుడమి, స్త్రీజనము
మదగజంబులు వానిమాటి నాకేల?

నానిత్యకర్మమ్మునకు వాని కెప్పు
డేని పొందగువె? యాయిాని నేనొల్ల
మూఁడడుగుల నేలఁ బొమ్మనకిమ్మ
నాడెందమొందు నానందమ్ముసుమ్మ
అదిగాక, వినవయ్య అసురరాజేంద్ర,
తుది శూన్య మాశకెందును బరికింప
మితిగలయాశ నెమ్మినిగలిగించు
మితిమిాఱునాశ యెమ్మెయిఁ గీడుఁబెంచు
ప్రాప్తమల్పమ్మైనఁ బదివేలటంచు
తృప్తిఁజెందిన హాయి తెలియు రాజేంద్ర
దాత నెఱిఁగి సమస్తము కోరుకొనుట
నీతిగాదర్థికి నియమనప్వాంత"
అను భవదమృతోక్తు లాలించి ముదము
మునుకొన బలి నీకు భూమి దానంబు
సలుపఁగ జలము హస్తమునందుఁ బట్టి
వలదని వారించి భార్గవుండనియె,

శుక్రనీతి :—

దానవనాథ! యీతండు సామాన్య
మానవుఁడైన బ్రాహ్మణుఁడేమొగాఁడు.
ఇతఁడు సురలకార్య మేడ్తెఱఁదీర్చు
ప్రతినకై యదితిగర్భమునుండి యిట్టి
వామనాకృతితోడఁ బ్రభవించినట్టి
శ్రీమహావిష్ణువు సిరిచెలువుండు
ఇతనికిప్పుడు దానమిచ్చితివేని
పతితమై చెడు దైత్యవంశమంతయును
ఇతఁడు పాదత్రయి నీజగత్రయము
వితత దేహస్ఫూర్తివిధి నాక్రమించు

నిచ్చెదనని పల్కి యీకువ్నపాప
మచ్చుపడఁగవచ్చు నైనను వినుము
స్త్రీలయెడను పెండ్లిచేయించువేళ,
నాల, బాపల వెఱవణగించువేళ
ధనజీవమానముల్ తప్పెడు వేళ,
వనృతమ్మువల్కిన నఘమురాదధిప
దానముగీనను దలఁపు లిత్తఱిని
మాని యీవామను మరలించుమయ్య"
అను శుక్రుహితమున కతఁడొక్కక్షణము
కనుమూసి యోచించి, కడకిట్టులనియె

**శుక్రునకు బలిచెప్పినసమాధానము - శుక్రుడు బలిని శపించుట:**

"నీవు దెల్పినయట్టినీతి నేనొల్ల
భావింప నది గేస్తుపద్ధతిస్వామి
యర్థుల[ప్రార్థన మంగీకరించి,
యర్థలోభమున కాదనునొక్కదాత ?
అంతకంటెను పాప మరయంగఁగలదె ?
వింతలే తొల్లింటి పెద్దలకతలు 820
రాజులెందఱులేరు రాజ్యముల్లేవె !
భ్రాజితసంపదల్ వడయరె కాని,
వారలు తమవెంట భాగ్యముల్గొంచుఁ
బోరుగదా ; వారిపాలకువ, పేరు
ధారుణినిలిచెనే దాతలైనట్టి
భూరమణులు శిబి మొదలగువారు
యశమును గాంక్షించి యడిగినవెల్ల
భృశముగా నీయరే? యిక్కాలమునను
వారలమఱచిరే ? - వామనుఁడైన
యీరమేశున కిచ్చు టెంతపుణ్యమ్మొ

అల్ల శ్రీలక్ష్మి శుభాంగమ్ములందు
సల్లలితామిత సత్కారములను
గరిమఁగైకొను హరికరము క్రిందగుట
కరమరుదుగ నాదుకరము మీఁదగుట
యరయ మేల్గాదె రాజ్యమ్ము గీజ్యమ్ము
స్థిరమె, కాయము హానిఁజెందకయున్నె
ఏది యేరూపాన నెట్టులఁజెడిన
నాదుసర్వస్వమ్ము నాశనమైన
హరియొ యెవ్వండొ యభ్యాగతుండైనఁ
దిరుగదునానాల్క తెలుపుచున్నాఁడ 830
మాటదప్పక యీయ మాధవుఁడేల
పాటువాటిల్ల నన్బట్టి బంధించుఁ
గడిమిబంధించినఁ గరుణించివిడుచు
విడువకున్నను మేలె వేయివిధాల"

అని సత్యముం దప్పనను బలి శిష్యుఁ
గని యసురగురుండు కడుఁగ్రుధనొంది
"నిరసించితివి నాదునీతి యద్దానఁ
ద్వరితమ్మునన పదభ్రష్టుండవౌదు
గా" కని శపియించెఁ గాని, యారాజు
వీఁకమై తనపట్టువీడకయుండె

## వామనునకు బలి మూడడుగుల మేరభూమిదానమిచ్చుట :

తనసతియైన వింధ్యావళింజూచి
కనుసన్నగావించి కనకపుగిండి
జలముదెప్పించి నిర్జరవైరి భక్త
సులభు, మాయాభిక్షు సుజనశరణ్యు

నినుఁజూచి భవదీయ నిర్మల పాద
వనజముల్ గడిగి తత్పాదతీర్థమ్ముఁ
దలఁజల్లికొని కరతలమునుజాఁచి
"యిలను మూఁడడుగుల నిదెనీకునిడితిఁ
బ్రీతిగ్రహింపుమ,విప్రుఁడా"యనుచుఁ
జేతికుండిజలమ్ముఁ జెచ్చెరవిడిచె 840
జలమును ధారగా జాఱనీకుండ
కలశబిలము మూఁతగాఁగఁగావ్యుండు
నిలిచియుండఁగ దానినిజమ్ముగ్రహించి
జలనిధిశయన కుశముకొనచేత
వీఁకమైపొడిచితి వెఱ్ఱియౌ శుక్రుఁ
డేకాక్షియై యవహేలనమొందె.

సర్వమ్మునీవయై జగతివర్తనము
నిర్వహించుచు వెందు నిండియున్నట్టి
నీముందు కపటమ్ము నెరపంగనౌనె
యామీఁద నంగద లందుటేగాని
నిను గుఱితింపని నీయాశయముల
ఘనమని యెంచని, కడుహీనబుద్ధి
ననుఁజేరనీక, యెన్నండు నీపాద
వనజములంగొల్చు పావనబుద్ధి
కరుణింపుమా నాకుఁ గారుణ్యమూర్తి
శరణమ్మునీవె శశ్వద్దివ్యకీర్తి

అంతట కలశమ్మునందుండి యెట్టి
యంతరాయములేని యటు జాఱుధార
భవదీయ శుభకర పద్మహస్తమున
మివులప్రేమ గ్రహించి మెచ్చితి బలిని 850

" బలిదాతయయ్యె శ్రీపతి యర్థియయ్యె
ఫలితము జగతికి భద్రదమయ్యె "
అని పంచభూతము లానందమొందె
వినుతించి రమరులు విశ్వమ్ముపొంగె
విరివానపడె దిశల్ విశదములయ్యె
మొరసెను సురదుందుభులు మంగళముగ

## వామనమూర్తి విశ్వరూపము :

దానవేంద్రునికడ దానమీరీతిఁ
బూని కైకొని జగత్పూజ్య సర్వేశ
నీవు భూస్థలికిని నింగికిఁ బెరిగి
భావింపరాని రూపముతోడనుండి
యొకపాదమున భూమినంతయుఁగప్పి
ప్రకటితమగు నన్యపాదమ్ముతోడ
మీఁదిలోకమ్ములమేరకు నవల
మేదురమైనట్టి మిన్నును గప్పి
యెనఁగితి; నీదు విశ్వైకరూపమ్ము
నసదృశ భక్తితో నబ్జాసనాది
సురలెల్ల వీక్షించి, స్తోత్రముల్చేసి
నిరుపమానంద మొందిరి మానసముల
బలి నీదు విశ్వరూపము నేత్రయుగ్మ
మలరంగఁ గాంచి బ్రహ్మానందమొందె 860
నీ రీతి నడుగుదోయి భువిని దివిని
పూరితమ్ములుగ నప్పొల్పునఁ గొలిచి
పదపడి తొల్లింటి వామనాకృతిని
గుదిరిచికొని యుంటి కుంజరవరద

భవదీయ మాహాత్మ్య ప్రజ్ఞాదికముల
లవమే నెఱుఁగఁ జాలని సోఁకుగములు
ఈతఁడు మనజాతి కెంతయు వెగ్గఁ
జేతమ్ము నందెంచి చేయుచున్నాఁడు
ఈతని నిర్జింత మిపుడంచు క్రోధ
చేతస్కులగుచు విజృంభింప వారిఁ
గని బలిరాజు భార్గవు శాపఫణితి
మనమునఁ దలపోసి "మన కిది జయముఁ
గలిగించు సమయమ్ముగా, దిట్టిపూన్కి
వలదిఁక యిచ్చోటు వదలిపొం" డనుడు
దనుజభటుల్ బలిదానవు నాజ్ఞ
చనిరి, రసాతలస్థలిఁ జేరుకొనిరి.

**వామనుఁడు బలిని కరుణించి పాతాళమున కనుపుట:—**

అత్తఱి, శ్రీమానసాంబుజ మిత్ర
చిత్తజజనక నీ చిత్త మెఱింగి
ఖగరాజు బలిరాజు కాలుసేతులను
బిగియంగ బంధించెఁ బెద్దపాశముల 870

"నా కివ్విధమున బంధ ప్రాప్తియగుట
శ్రీ కమలావిభు కృపయ" యటంచుఁ
గలఁక లేకుండు రాక్షసరాజుతోడ
జలజాక్ష యిట్లంటి జగములు మెచ్చ.
"దానవ! మూఁడు పాదమ్ముల నేల
దానమిచ్చితి నాకు, ధరయొక్క యడుగు
దివమొక్క యడుగయ్యెఁ దెలియ నీ సొమ్ము
సవరింపఁబడె రెండు చరణమ్ములకును

గడమ పాదమునకుఁ గలదేని భూమి
నుడువుమా! కొందు, నిన్ను వరించు గీర్తి
యిచ్చెదనని చెప్పి, యీనిచెనంటి
నిచ్చలు నిరయమ్మనే పొందుచుండు''
నను నీదు పల్కుల నాలించి యసుర
తన యెడందను రవంతయుఁ జింతపడక
మోమునఁ జిఱునవ్వు మొలకలు వెలయ
నీ ముఖాబ్జము గని నిండు నెడదందఁ
దా నిట్టులనియె "ఓ ధర్మ స్వరూప
సూనృతమే నాదు సువ్రతమయ్య
యేనాఁడు నా నాల్క యెఱుఁగదు బొంకి
యీనాఁడు బొంకునే యేల యీ శంక 880
నీ తృతీయపదమ్ము నిఖిల సేవ్యమ్ము
నా తలపై నుంచి నను ధన్యుఁజేయఁ
గదవె! మాతాత! నీ కలుషాపహరణ—
పదకమలంబుల భక్తితోఁ గొలిచి
పరమ భాగవతులఁ బ్రథముఁడైనాఁడు
చిరజీవియై కుల శ్రేష్ఠుఁడైనాఁడు
అరియని నీ తోడ నాలమ్ము చేసి
పొరయరె నిన్ను మా పూర్వులు మున్ను
లచ్చి పెన్మిటివి యీలాగు నవ్వేరి
బిచ్చమడ్గితివి నా వంపేమి సెప్పు"

## ప్రహ్లాదు నాగమనము:—

అని యనుచుండఁ బ్రహ్లాదుఁ డచ్చటికిఁ
జనుదెంచె నెల్ల రాశ్చర్యమ్ము నొంద

బలి తాను బంధింపఁ బడియుంట లజ్జఁ
దలవాల్చి తాతకు దండముల్ వెట్టి
నంతటఁ బ్రహ్లాదుఁ డతిభక్తి నీదు
నంతికమ్మున జేరి హస్తముల్ మొగిచి
పరమాత్మ; హరి, భవబంధ విదూర
సరసిజాక్ష, ముకుంద, సాధు మందార
ఈతని మును దివికెకిమానిఁ జేసి
యీతఁటిఁ దొలఁగించి తిది చాలమేలు 890
అరివర్గ మూలమౌ యైశ్వర్యమెల్లఁ
బరమ వాత్సల్యానఁ బాయఁ జేసితివి
నిను నిజంబుగఁ గొల్చు నీదు భక్తులకుఁ
దృణసమానముగద యింద్రపదమ్ము
ఇది యితనికి బంధ మెట్లునుగాదు
పదిలమౌ ముక్తికి భవ్యమార్గమ్ము

అనుచుండె, నంతలో నసుర నాయకుని —
వనిత వింధ్యావళి వరపూత చరిత
యతిభక్తి నీ చెంత కరుదెంచి మ్రొక్కి
"పతిభిక్ష పెట్టుమా పద్మాధినాథ
నాదయితుండు దానము కొఱలేక
కాదనకిచ్చె జగమ్ములు మూఁడు
ఏల బంధించితి యీలాగు స్వామి ?
పాలింపవే దయావర" యనుచుండె.

### బలి బంధ విముక్తి :—

ఆ సమయంబున నచటికి వారి —
జానమ్ముఁ దగుదెంచి జగదేక వంద్యుఁ

బరము జనార్దను, వామనరూపు,
నరసిజాక్షుని, నిన్ను సంస్తుతి యించి
యనెనిట్లు, "దేవ! యీ యసుర నాయకుఁడు
తనదు సర్వస్వమ్ము తప్పక నీకుఁ 900
గొనుమని దానముఁ గొఱలేక యిచ్చె
ఘనుఁడు వదాన్యుండు గాఁడె; సర్వేశ!
నిండు మనంబున నినుఁ గొల్చు నితఁడు
దండయోగ్యుఁడు గాడు, దయవీని విడుము
పరమ భక్తుండగు బలిచక్రవర్తి
కరయ బంధనమెట్లు న్యాయంబుగాదు."
అను బ్రహ్మ పలుకుల నాలించి యతని
గని యిట్లు లంటివి కమలదళాక్ష.
"ఎవ్వానిఁ గరుణింప నే నిశ్చయింతు
నవ్వాని సర్వమ్ము హరియింతు మొదట
వినుము చతుర్ముఖ! విశ్వమ్మునందు
ధనకనకాదుల దర్పమ్ము పెఱిగి
సంసార సుఖతృప్తి సకలధర్మముల
ధ్వంసమ్ముచేయుచుఁ బాపాత్ములగుచు
ననుధిక్కరించు దుర్నయమానసులకు
ననయమ్ము నరకమేయగు శరణ్యమ్ము
సకలసౌభాగ్యాలఁ జాలియు గర్వ
మొకయింతయునులేక యుత్తమ బుద్ధి
నెవడుండు నతని నే నెఱిఁగి రక్షింతుఁ
దవులదు వానిచిత్తము మోహమునకు 910
గురుశాపముంబొందెఁ గొలమువారలమ
పరిహరించెఁ, ద్యజించె వైభవమ్ములను

దనదు సర్వస్వమ్ము దానమ్ము చేసె
ధనహీనుఁడయ్యె పేదయు నయ్యె నితఁడు
ఇన్ని వెతల్ తన కేర్పడుచున్న
ఖిన్నత్వ మొందఁడు కృపణుఁడు గాఁడు
తన శుద్ధతత్వ సత్య వదాన్యగుణము
లను మానెనే మాయలను గెల్చెగాని!
మాట తప్పని యట్టి మహనీయుఁ డితని
సాటి యెవ్వరు? నాకుఁ జాల మెచ్చొదవె
ననఘ చరిత్రుఁ డీ యసుర సావర్ణి
మనువు కాలమున సమ్మాన్య దేవేంద్ర
పదము నొందెడుఁగాక! పదవడి నాదు
పద సమీప పదవిఁ బడయును గాక!
అందాఁక నితఁ డమరాదులు మెచ్చు
సుందర భువనమౌ సుతలమ్ముఁజొచ్చి
యనుపమ సౌఖ్యమ్ము లందునుగాక!"
అని పల్కి; బలిఁజూచి యవల నిట్లంటి' —

"బలి దానవేంద్ర! సాధ్వసపడకింక
తెలిసె నీ వితరణ తెచ్చె మోదమ్ము 920
సుతలమ్మునకుఁ బొమ్ము, సురలు నందుండఁ
గుతుకమ్ము వడునట్టి క్షోణి యా జగతి
అందుండు వారికి నపమృత్యువులును
గుందు లాపదలును గూడ వెన్నటికి
నీ వందు ప్రభుఁడవై నెగడుము, నిన్ను
సేవింప నొల్లని చెనటి రక్కసుల
నా సుదర్శనము ఖండన మొనరించు
నా సుదర్శనమె యెన్నఁడు నీకుఁ బ్రాపు

దిక్కుల పతులకు దీటగు చుందు
వక్కడి వారలెంతనవచ్చు నీకు,
నా యర్చనమ్ము దానవత నీ యందు
మాయించు నా భక్త మాన్యుఁడవౌదు
వనుచు నాదేశింప నా వాక్య సరణి
తన కర్ణముల కమృతపు సోనయటుల
నానందమును గూర్ప నసుర నాయకుఁడు
మేను గగుర్పడ, మిగుల సంతోష
వారి కనుల జాలువాఱుచునుండ.
కారుణ్య నిధి నిన్నుఁగాంచి యిట్లనియె.

## బలిచక్రవర్తి పాతాళమునకుఁ జనుట :—

"పన్నగతల్ప కృపాసింధు, భక్త-
సన్నుతపదపద్మ సర్వలోకేశ,
వాసవుఁడాది దిక్పాలురవైన
వేసమయంబున నేని వీక్షింప
నట్టి వాత్సల్యదయావీక్షణమున
కట్టిడియనక నన్గరుణించి చూచి,
ప్రాభవంబును నాకు వరలంగఁజేసి,
నాభావినిండెల్పి ననుఁగాచినట్టి
నీదు వాత్సల్యమ్ము నీదయాదృష్టి
నాదుభాగ్యమ్ము బృందారకవంద్య!
నిచ్చలు నినుఁగొల్చు నీదాసతతికి
వచ్చువేయాపదల్ వారిజనాభ"

అని నినుఁగీర్తించి యసురవల్లభుఁడు
ఘనపాశబంధముక్తతఁబొంది నీకు

వనజాసనాది దేవసమూహమునకు
వినతి నతుల్ భక్తి వెలయంగఁజేసి
విమలమనస్కుఁడై విశ్వమ్ము మెచ్చ
మిమునెల్లవీడ్కొని మీకృపవడసి
తనవారలంగూడి తడయక సుతల-
మును జేరఁజనియె ప్రమోదమ్ముఁగనియె
కులమునకుం గీర్తిఁగూర్చినయట్టి
బలిని పౌత్రునిఁగని ప్రహ్లాదుఁడపుడు 940
మదిముదమంది నీమహిత కారుణ్య
సదమల భక్తవాత్సల్యమ్ముఁ బొగడి
యాతఁడిబలివెంట నానందపడుచు
ప్రీతిమై భవదాజ్ఞవిని తానుఁజనియె

## బలియజ్ఞము పూర్తియగుట:

అవల శుక్రునిఁగని యవశేషమైన
సవనమ్ము పూర్తిగా సాగించుమనుచు
నాదేశమిచ్చితి, వతఁడునీయాజ్ఞ
మోదమ్మనుచుఁ దలమోసి జన్నమ్ము
మునిజనంబుల సాయమున నీవు మెచ్చ
మునుకొన్న శ్రద్ధతోఁబూర్తిగావించె
నావెన్క నిను వామనాకృతినున్న
దేవదేవుని కోటిదినకరదీప్తు
భగవంతు వామను బ్రహ్మ, యింద్రుండు
దిగధీశులును సురల్ దివ్యయానమున
నుపవిష్టుగావించి యుత్సాహపడుచు
నుపనిషద్వాక్యసంయుతములౌ స్తవము

లమరఁగావించుచు నటనుండి కదలి
యమరావతినిఁజేరి రందఱావేళ

అంతట దేవేంద్రుఁడచ్యుతానీకు
నంతరంగముపొంగ నర్చనల్ చేసి 950
వందనములు సమర్పణము గావించి
యందఱుదేవతలగ్గింప, మరల
భవదీయకారుణ్యఫలముగా స్వర్గ
భువనసామ్రాజ్యమ్ముఁ బొలుపారఁబూనె
'ఇంద్రునిసామ్రాజ్య మెప్పటియట్లు
సాంద్రవైభవమున జరుగుగా'కనుచు
నాడిరిపాడిరి యఖిలవాద్యముల
నెడలేకమ్రోగించి రెల్లదేవతలు
జగదేకరక్ష నీసంకల్పమహిమ
ప్రగతిమార్గము త్రిభువనభద్రములకు
ధర్మమ్ము నిలుప నధర్మమ్ముదులుప
శర్మమ్ము జగతికి సమకూర్పఁదలఁచి
పలురూపులెత్తుదు. పన్నుదుమాయ,
దెలుపుదు జగతికుత్కృష్టమార్గమ్ము
సత్యధర్మాది ప్రశస్త మార్గముల
నిత్యమ్ముపాటించు నిర్మలాత్మకుల
కెవరికైనను దగునీప్సితార్థముల
నవరించుచుందువు సాక్షిస్వరూప

ఓత్రివిక్రమ పురుషోత్తమ శ్రీశ
ఓత్రిగుణాత్మక ఓ జగదీశ 960
నిన్ను, నీమహిమల నీదుభావముల
వెన్ని నిన్ పూజించు నెఱుకించుకేనిఁ

గలిగినవాఁడను గాను మూర్ఖుండఁ
దెలియక నాయిచ్చఁదిరుగుచున్నాఁడ
సరసిజనయన నన్‌చల్లఁగాఁజూచి
కరుణింపుమా జగత్కల్యాణమూర్తి

**ఫలశ్రుతి :**

ఈవామనావతారేతిహాసమ్ము
నేవేళనేగాని యేమానవుండు
చదువు విను వాఁడుసాహసోపేత
విదిత విక్రముఁడగు విభవమ్మునొందు
మరి సర్వకార్యసమయములయందు
కరము భక్తివి త్రివిక్రము విక్రమంబు
నెందెందు కీర్తింతు రెవ్వరు వారు
పొందుదు రానంద భూరిసౌఖ్యములు 967

వామన చరిత్ర సంపూర్ణము

---

# మత్స్యావతార కథ

శ్రీ సాగరాత్మజా హృదయానుమోద
భాసుర సుర సమభ్యర్చితపాద
భువనరక్షణకు నీ పూనయత్నమ్ము
లివియం చెఱిఁగి నుతియింపంగ నౌనె
అని భక్తజనతతి కతిసమ్మదమ్ము
లవియ లోకోద్ధరణానుకూలములు 970

## సత్యవ్రతరాజు మత్స్యమును జలకుండిక యందుంచుకొని పోవుట :—

మునుపు ద్రవిడదేశముననుండె నొక్కఁ
డనఘుఁడు సత్యవ్రతాఖ్యుఁడు రాజు
అతఁడు నీరము మాత్ర మానుచు నిన్ను
నతిభక్తి తనయెద హత్తించి తపము
కృతమాలికయనెడి యేటితీరమున
స్థిత దృఢనిష్ఠతోఁ జేయుచునుండె

ఒక్కనాఁ డతఁడేటి యుదకమ్మునందు
మిక్కలి భక్తి నెమ్మిగ నిలుచుండి
హరిసమర్పణమంచు నంబుతర్పణముఁ
గరము నిర్మలమతిఁ గావించుచుండ
శ్రీవత్సలాంఛనాంచిత దివ్యమూర్తి
జీవనజోదర శ్రీనాధనీవు
అతి లఘుమీనమవయి ప్రభవించి
క్షితిపతిప్రవరు దోసిలి నీరమందుఁ
జేరి కన్పడఁగఁ జెచ్చెర నా విభుండు
నీరమ్ములోన నిన్విడిచెఁ గలంగి
యావల నీవు మత్స్యాకృతి విడక
యావిభుఁ డద్భుతం బంద నిట్లంటి
ఓరాజ! ఈయేట నుండంగఁజాలఁ
గ్రూర భయంకర గురు మత్స్యజాతి 980
నావంటి చిన్న మీనంబులంబట్టి
యేవేళ మ్రింగెడు నెటులనిందుందు
శరణన్నఁ గాఁచురాజవుకాన, నీవె
శరణని మదినెంచి చనుదెంచిరాఁగ

నను దయఁజూడక నట్టేట విడుచు
టనఘ! నీకది ధర్మమనఁ జెల్లునయ్య
మీలచేఁ జాకుండ మెలఁగెదమన్న
జాలరి వలఁజిక్కి చచ్చుటనిజము.
కాన, మిత్తికి నోటి కడిగాని యట్టు
లో నరనాథ! నన్నోమవే కరుణ''

ఆ పల్కులను విని యతి కృపాబుద్ధి
భూపతి చిఱుమీను పోఁడిమినున్న
నిముఁదనఁ జలము కుండికలోన నుంచి
కొనిచనె ధర్మమ్ము కొఱవడనట్లు.

## రాజు మత్స్యము పెఱుగు కొలఁది అచ్చటచ్చట నుంచి సంద్రమునఁ జేర్చుట :—

అంత నా కుండి మధ్యమ్మున వీవు
వింతగా నెదుగుచు విభుఁజూచి "రాజ
ఇది యిఱుకయ్యె వే నిందుండఁ జాలఁ
బదిలమౌ నొక పెద్ద పాత్రతె" మ్మనుడు
అతఁడు వేరొక భాండమందు నిమ్నుంప
వితతము నామేను వేరొక వెలవు 990
అవపరమంటివి, యటు నీవు వృద్ధి
యవుచుండ నా విభుఁ డటు నిను నోలి
పడియను, చెలమను బావియందునను
నడబావియందుఁ చిన్నని హ్రదమందు
సరసియందును చేర్చసాగె నీ మేను
కొఱలేక యవి నిండుకొనునట్లు పెరిగెఁ

నంత మహామీనమైయున్న నిన్ను
చింతిల కారాజు చేర్చె సంద్రమున
నప్పు డా విభుఁగని యంటి వోరాజ!
ముప్పుగువాకు నీ మున్నీట నున్న
నిందున్న మకరమ్ము లెగసి క్రీడించి
క్రందుకొనుచు నన్ను గ్రసియింపకున్నె
కాన నిందుండి వేగమ నన్ను వెలికి
బూని లాగిన నీకు పుణ్యమ్ము గలుగు"
నను నీదు పల్కుల కారాజు వింత
మనమున నొంది నీ మాయ యొకింత
భావించి నినుఁ జక్రపాణిగా నెఱిఁగి
నీవు వినంగఁ దా నెమ్మి నిట్లనియె

## మత్స్యమును రాజు పొగడుట:—

"ఓ మత్స్యరూప! మహాత్మ్యభావ
నీ మాయ నెఱుఁగంగ నేరను నేను 1000
సామాన్య జలచరజాతిని జీవు—
లీమాడ్కి వింతల నెందుఁజూపెడినె?
కడు చిన్నచేఁపవు కనుచునుండఁగనె
గడెగడెకును మార్పు గన్పడుచుండ
నొకనాటనే శతయోజనమాత్ర
ప్రకటితమగు వృద్ధివఱలె నీమేను
కాన నిన్నొక మీనుగా నేను నమ్మఁ
బో నెద్దియో యొక్కముఖ్యకార్యమ్ము
సృష్టికి మేల్గూర్ప నెడద నూహించి
శిష్ట మత్స్యాకృతిఁ జెలువొంద నిప్పు

డీరీతి నవతారమెత్తిన యట్టి
నారాయణుఁడవని నమ్మెద నిన్ను
ఏల యీ త్రిప్పట? యేల యీ రూపు?
నీలీలలోఁ గల నిక్కమెయ్యదియొ
దానిఁ దెల్పఁగరాదె, దయఁ జూపరాదె
మీనావతార! స్వామీ వందనము"
అని వేఁడుచున్నట్టి యారాజుపైన
కనికరముంచి శ్రీకాంత యిట్లంటి

## మత్స్యరూపముననున్న విష్ణువు రాజునాదేశించిన విధము :-

అయ్య! విభుండ! సత్యవ్రత! వినుము
నెయ్యమ్ము మీఱ నే నిజమెఱిఁగింతు 1010
నింక వేఁడు దినమ్ము లేర్పడ దాఁటఁ
బంకజాసనునకుఁ బగలొండు నిండు
నత్తఱిఁ బ్రళయాబ్ధియందు జగాల
మొత్తమ్ము మునుఁగు నా మునకకు మున్నె
నావంపుచే నొక్కనావ వే నీదు
దాపునకే తెంచు, దాన బీజముల
రాసులు నోషధీవ్రజములునుంచి
యా సంద్రమందు విహారమ్ము సేయు,
మట్టి కల్పాంతమ్మునం దంధకార
మిట్టలమ్మగు నట్టియెడ సప్తఋషులుఁ
బడవయందుందురు ప్లవము నెమ్మదిగఁ
గడలియందునఁ దేలి కదలుచునుండు
నానావ మున్నీటి యలలతాకిడుల
చే నటునిటు దొర్లిచెడకుండ, దాని

ముందు వెనుకల భాగముల, నిరుక్రేవ
లందునఁ దిరుగుచు, నస్మదీయంబు
లైన పక్షంబుల హతులకు బెదరి
యానావఁ బొడువంగనడరు నక్రముల
నొడియుచునుండు మహోరగంబొండు
పొడసూపు నాయాజ్ఞఁబొంది నీచెంత
దాన నాకొమ్ముకుఁ దరిఁ బదిలమ్ము
గా నొనరిచి సుడిగాడ్పుల నావ
పననిధి తిరుగుడు పడకుండఁజేసి
మునులకు నీకును ముప్పురాకుండ
జలజోద్భవుఁడు నిద్రచాలించువఱకు
మెలకువ మిమ్ము నెమ్మినిబ్రోవఁదలఁచి
యీమత్స్యరూపమ్మునెత్తివవాఁడ
నామహిమమ్మనంతము బ్రహ్మమగును
ఎఱుఁగుమా" యని రాజునెడఁగరుణించి
యెఱిఁగించి తంత నదృశ్యుండవైతి
నీయమృతోక్తులఁ నెమ్మదినెపుడుఁ
బాయకదలఁచుచు వసుమతీవిభుఁడు
దర్భశయ్యను తూర్పుతలగాఁగబండి
నిర్భరానందమ్మునెలకొన నుండె 1020

## బ్రహ్మ నిదురించుట - హయగ్రీవుడు వేదములదొంగిలించుట:

అంతటఁ గల్పాంతమగువేళరాఁగ
వింతగా మేఘముల్ విరివిగాఁబ్రబలి
వానపడంగ దివమునకుభువికిఁ
గానంగ నిసుమంత కడమలేనట్లు

జలమయమై దాన జగములుఁబ్రుంగెఁ
బ్రలయమిమ్మాడ్కియై ధ్వాంతమ్ముమూఁగె 1030
ఘోరమయ్యెనునిశి కూరినతంద్ర
నీరజోద్భవుఁడంత నిద్రింపఁదొడఁగె

అలపున సొలపున నతిగాఢనిద్ర
జలజాసనుండున్న సమయమ్మునందు
అతని ముఖాబ్జమునందుండివెడలు
శ్రుతిసమూహమ్మును చోరుఁడైయొక్కఁ
డమరవిరోధి హయగ్రీవుఁడనెడు
కుమతి యపహరించి కుతుకానమించి
వానిఁజదువ, బైలవసియింప శంక-
నూనినమదితోడ నుదధినిడాఁగె

**మత్స్యావతారుఁడు విష్ణువు హయగ్రీవుఁజంపుట,**
**వేదోద్ధరణము, సత్యవ్రతుని మనువుగ నొనర్చుట:**

వేదచోరునిద్రుంప వివిధబీజమ్ము
లాది వస్తుభరితమగు నావఁగావఁ
బ్రాపు మూలమ్మనౌ పంకజనాభ
శ్రీపతీ నీవుచెచ్చెర నొక్కరేయి
తొంటిమత్స్యాకృతిఁదోతెంచి లోక
కంటకు వేదతస్కరు హయగ్రీవు
విదళింపనెంచి యబ్ధిని ప్రవేశించి
యెదురెందులేక విశృంఖలవృత్తి
విహరించుచుంటి నీవిమలబోధమున
సహనశీలుండగు సత్యవ్రతుండు 1040

నినుస్మరించుచునుండి, నీయాజ్ఞచేత
తనచెంతఁజేరిన తరినిండునట్లు
తరులతాబీజసంతతులను జేర్చి
వరమునీశ్వరులు సప్తర్షులు దాను
నాయుడుపముఁజొచ్చి యయ్యబ్ధిలోన
నేయపాయములేక యెలమితోనుండి
నినుఁగని పడవను నీకొమ్ముకొనకుఁ
బెనుపాఁపత్రాటితో బెనవేసికట్టి
కృపఁజూడవేయని కేశవనిన్ను
తపనీయచేలుఁ బ్రార్ధనచేసెనిట్లు

అనయవర్తనఁ గుటుంబాబ్ధిలోమునిఁగి
యనయమ్ముఁ బాపకృత్యములేయొనర్చు
వారలేయైన నేపరమేశుఁగొలిచి
పారలౌకిక సుఖప్రాప్తినందెదరొ
ఆపరమాత్మ వవ్యయుఁడవునీవు
కాపాడుమా నమస్కారముల్ దేవ
అంగారమునుగూడినందున వన్నె
బంగారమునకు సంప్రాప్తమైనట్లు
నీసేవచే నఘ నిర్మూలనమయి
భానురమ్మగు ముక్తిప్రాపింపకున్నె 1050
నీదయాభాగ్యమందిన నింద్రపదవి
మోదమిచ్చునె పుణ్యపురుషులకెందు ?
దేవ ! నీ మహిమలు దివ్యముల్, వాని
భావించి యాతీరు ప్రార్థింపఁ గలనె ?
ఆలింపుమయ్య నా యభిమతమొందు
నాలోని కలుషమంతయు దుల్పివైచి

నీలోన నను(జేర్చి, నిగమాంతవేద్య
పాలింపుమా జగత్పరిరక్ష దీక్ష !

ఆత( డవ్విధమున నర్థింప నతని
నాతత కృపతోడ నరసి, యాతనికి
సత్యవ్రతున కీవు సాంఖ్యయోగమ్ము
నత్యుత్తమమ్ము శాస్త్రార్థమ్ము తోడ
నుపదేశమిచ్చి, తా యుర్వీశు(డంత
నపగత కల్మషు(డై బ్రహ్మరూప –
మును గనుంగొని తా( బ్రమోదమ్ము నొంది,
మనువుల వేడవ మనువయి వరలె.

అంతట నీవు మహామత్స్య రూప !
దంతి సంరక్ష ! వేదమ్ముల కూయి,
దైన్యస్థితిని జూచి, తడయకాక్షణమ
యన్యమేమియు( జూడ కంబుధి(దూటి 1060
గఱుల నాడించి, ముఖంబు నిగిడ్చి
చఱచంగ( బెనుతో(క సారించి, మేను
మెఱపులు జిమ్మంగ మీనమ్ము లదర
కఱకు దౌడల జత కదలంగ(జేసి,
మీన రూపముతోడ, మిడిసి యా చోరు
దానవు, సాధుహంతకు హయగ్రీవు
వధియించి వాని చేవడియున్నయట్టి
ప్రధితమ్ము లగు వేదవర్గమ్ము( దెచ్చి
ప్రళయాంతమున నిద్ర వదలి మేల్కొన్న
జలజసంభవుని వశమ్ము చేసితివి.

విశ్వప్రకాశ నీ విశ్వమయత్వ
విశ్వంభరత్వాది విశ్రుత మహిమ

లనుపమానములు మహా ప్రభావములు
వినుతింప, వివరింప, వివిధ రూపములు.
ప్రళయవేళ నెఱింగి భావిని సృష్టి —
వెలయించుటకుఁదగ్గ వేఱు మార్గములు
యోచించి, వేదము లుద్ధరింపంగ,
నీచు హయగ్రీవు నిర్మూలనమ్ము
చేయ, సత్యవ్రతు, శిష్టుని బ్రోవ,
శ్రేయమ్ము జగతికిఁ జేకూర్ప నెంచి 1070
మీనరూపమ్ము నెమ్మిని దాల్చి సర్వ
మానందకరముగ నాచరించితివి
నీదు సత్సంకల్ప నియతికి మారు
లేదెందు శ్రీశ పాలిత నిర్జరేశ!

జలము సమర్పించి సత్యవ్రతుండు
జలజాక్ష నీ దయా సముపార్జనమున
మనువయ్యె, సురలోకమాన్యుండు నయ్యె
ననువమ భద్రదమయ్య నీ సేవ
జలమువేగాని నిశ్చలమానసమున
జలధిశయన నీకు సద్భక్తి నొసఁగు
నియమ శూన్యుఁడఁ గడు నీచుఁడ నన్ను
దయఁజూచి ప్రోవుమా తామరసాక్ష
విడనాడ వలదయ్య విబుధ సంరక్ష
కడతేర్చుమా నను గజరాజపక్ష

**ఫలశ్రుతి :**

మాధవు శ్రీహరి మత్స్యావతార
గాథ నెవ్వాఁడేని కడుభక్తి వ్రాయఁ
జదివిన, విన్నను సకల సంపదలు
పొదలంగ సౌఖ్యముల్ పొందం గలండు. 1079

మత్స్యావతారకథ సంపూర్ణము.

అష్టమస్కంధము ముగిసెను.

శ్రీరామ

శ్రీ ప్రార్థనాభాగవతము

# నవమస్కంధము

* * * **

## అంబరీషోపాఖ్యానము :—

శ్రీ సచ్చిదానంద జేజేముకుంద
వాసవార్చితదివ్య పాదారవింద
నాగారివాహన నాగేంద్రశయన
నాగసంరక్షణ నాళీకనయన
నీదు సద్భక్తుల నిష్కారణముగ
వాదుకీడిచి కష్టపఱచంగనెంచు
వా రెంతఘనులైన వారిదుర్నయము
నోరువ వీవు తదుద్ధతి భంగ —
పఱచి భక్తుల మహత్వం బిట్టిదనుచు
నెఱిగింతుజగతికి నిభరాజవరద
ధూర్తశిక్షణమొనర్తువు తఱియెఱిఁగి
యార్త రక్షయొనర్తు వనుకంపవెరిగి

## అంబరీషుని శీలము (హరిభక్తి) :—

పూర్వకాలమ్మున బుధజననుతుఁడు
గర్వరహితుఁడు నిష్కలుషమానసుఁడు
అంబరీషాఖ్యచే నలరెడియనఘుఁ
డంబుజనాభ నిన్నర్చించువాఁడు

అతఁ డేఁడుదీవుల యవనికిఁ దాన
పతియయి సర్వసంపదలతో నొప్పి
వైష్ణవార్చనల విర్విఁగఁ జేయుచుండుఁ
దృష్ణాలతలఁ ద్రెంచి తృప్తితో నుండుఁ 10
ప్రజల బిడ్డలఁ బోలెఁ బాలించుచుండు
గజిబిజిలేని చక్కటి మతినుండు
నీపాదముల యంద నిల్పు నెమ్మనము
నీపవిత్ర చరిత్ర నిగదించు నుడుల
హస్తాల నీనికాయము శుద్ధిపఱచు
శస్త్రమౌ నీకథల్ శ్రవణమ్ము సేయు
నెఱపు నీరూపుపై నిజమనోదృష్టి
శిరమును నీ నమస్కృతులకై యునుపుఁ
బదముల నీగుడి వలగొనుచుండుఁ
గుదురుచుఁ గోర్కె నీకొలువు సేయంగ
నీ దాసజనమైత్రి వే గోరు నీదు
పాదాబ్జ పరిమళ భాగ్య మిచ్చించు
రసనచే తులసిపత్రము రుచిచూచు
విసువక సత్కార్య వితతిఁ గావించు
నీ రీతి నీ సేవలేమర కెపుడుఁ
గోరి సేయుచునుండుఁ గొదలేని భక్తి

అతఁ డొకప్పుడు విష్ణు నచ్యుతు నిన్నుఁ
బతిత పావను పరబ్రహ్మమ్ముఁ గూర్చి
మునులు వసిష్ఠాది ముఖ్యుల గురుల
పనుపుఁ దోడ్పాటును బడసి సరస్వ 20
తీ తీరభూమిని తృష్ణను మాని
ఖ్యాతి ననేకముల్ హయమేధములను

గావించి, మంటి బంగారమ్ము నొక్క
భావమ్మునం జూచి బహు విధమ్ములుగ
దానమ్ము లొనరించె, ధర్మతత్పరత
నేనాఁడు మావక కనీతి రానీక
నీదు భక్తులయందు నీ యందు మనసు
పాదుకొనంజేసి ప్రాభవమొప్ప
ధరణి నేలుచు రాచ తపసి యనంగ
నరపతియొప్పె జనమ్ములు వొగడ
హరియంచుఁ దాఁకు శ్రీహరి యంచుఁ జూచు
హరియంచుఁ ఘ్రాణించు హరియంచు వినును
హరియంచు రుచిచూచు నారాచతపసి
హరియె సర్వమ్మని యాత్మ భావించు
నానాట నా రాజునకుఁ జూడఁ జూడ
మానె సర్వమ్మున మమతలు మరులు
ఆ రీతి నీ భక్తుఁ డా రాచ తపసి
సార విహీన సంసారమ్ము తగులు
త్యజియించి నిను నిజాత్మను నెలకొల్పి
భజియించు నేకాంత భక్తితో నెపుడు 30

ఆ రాజు భక్తికి నాత్మ మోదించి
కారుణ్య రసము పొంగార నాతనికి
నరి శిక్షణంబు భక్తావనదక్ష
మురు కాంతియుత మాయుధోత్తమంబైన
పరసుదర్శనముఁ బెంపారరక్షణగ
వరలంగ నొసఁగితి వారిజనాభ
భవదీయ సద్భక్తవాత్సల్యగరిమ
వివరింపఁ గాదు - భావింపను గాదు

## ద్వాదశీవ్రతము :

అంతటనీభక్తుఁ డంబరీషుండు
దంతివరద నినుఁ దలఁపుననిలిపి
యనుకూలవతియగు నాత్మీయదార
తనకుఁదోడ్పడుచుండ ద్వాదశీవ్రతము
పరమమునుల్ గురువర్యులు దెల్పు
సరణిని నొకయేఁడు సద్భక్తి జరపి
పూర్తియగు దతండు బుధజనుల్ మెచ్చ
కార్తికమున నోజగా మూఁడురాత్రు
లుపవాసముండి, యచ్యుతునిన్ను శ్రీశ
నపరిమితాప్తి మహాభిషేకాది
వివిధ సపర్యల వేడ్కఁబూజించి
నవసుమంబుల నర్చనలుభక్తిచేసి 40
ప్రాయంబు రూపంబు పటుతరాంగములు
కాయంబుకాంతి బంగారుశృంగములు
వెండిగిట్టలుగల్గి వెలసెడునవియు,
మొండిబడనివియు మోదమ్ముతోడ
దూడలనాకుచుఁదుష్టినున్నవియు
వేడుకనెపుడు పాల్విండెడువవియు
నైన మందాల నాయవనీవిభుండు
దానమొసంగె సద్బ్రాహ్మణతతికి
మరియు నుత్తములు సంభావ్యులైయొప్ప
గురుజనంబులకు పెక్కుర కన్నదాన
మతిబంధురమ్ముగా నమరిచి,వారి
యతులిత భద్రంకరాశీస్సులంది
దీనరక్షణ! నెమ్మదిని నిన్నునిల్పి
తాను పారణసేయఁదలచుచున్నెడను

**దుర్వాసమునిరాక :**

వేదరహస్యార్థవేది తపస్వి
యాదిత్యసమతేజుఁడైన దుర్వాసుఁ
డతిథియై చనుదేర నతిమోదమంది
క్షితిపతి యమ్మునిఁజేరి కేల్మోడ్చి
తనయింట భుజియింపఁ దద్దప్రార్థింప
ముని వల్లెయని స్నానమునకని యరిగి 50
యమునానదిని గ్రుంకి యందు ధ్యానమ్ము
సముచితపద్ధతి సాగించునుండె

**ద్వాదశిపారణము :**

"ఆలస్యమయ్యెడి నమ్మునిచంద్రుఁ
డేలాకోరాఁడు. నేనేమియొనర్తు
ద్వాదశిఁజేయఁగవలయు పారణము
వేదోక్తమిదియని పెద్దవారండ్రు
భూసురవరిభావమున నగు పాప-
మీసమయమున నాకెనఁగెడునేమొ"
అని యంబరీషమహారాజు మిగుల
మనమునఁ జింతించి మాన్యులౌ గురుల
ననఘుల తనసందియముఁదీర్పుఁడంచు
వినిచె వారలకు నవ్విధము నీరీతి
"మునిరాఁడునదినుండి మునగంగఁబోయి
చనియెడుద్వాదశి జాగగుకొలఁది
పారణ మీలోన వలయు సేయంగ
నేరీతియర్హమో యెఱిఁగింపుఁడయ్య"

అను రాజుపల్కులనాలించి వారు
వినుపించిరిటుల "ఓపృథ్వీశ వినుము
ద్వాదశిపారణ తపసికై విడువ
రాదు విడినలేదు వ్రతఫలితమ్ము 60
తెలియుము తినరాదు, తినకుండరాదు
నలిలమ్ముగ్రోలుట సర్వసమ్మతము"
అని ధర్మసంశయ మపనయించంగ
విని రాజు ముదమంది విహగరాడ్గమన
నిను మనమ్మునవెంచి, నీరమ్ముగ్రోలి
మునిరాక కెదురుచూపులఁ జూచుచుండె

## దుర్వాసునాగ్రహము :

యమునలో స్నానసంధ్యాదులనెల్లఁ
గ్రమమునఁదీర్చి దుర్వాసుండు, మిగుల
బిరబిరఁజనుదెంచి, విభుఁడొనరించు
మరియాదలంది నెమ్మనమున నతని
చెయిదమెఱింగి, యచ్చెరువు సంభ్రమము
పయికొన బొమముడివడు మోముతోడ
నదరెడిమేనున నాగ్రహమెత్తి
పాదలుక్షుత్తున శాంతమునువిడనాడి
"కంటిరేవీనిని ఖలుని నున్మత్తు
తుంటరి, దుష్టుని, దుర్మార్గుఁ, గష్టు
వీఁడెన్నడునుగాఁడువిష్ణుభక్తుండు
పాడిదప్పి నటించు పాపాత్మకుండు
భుజియింప నన్నుఁబిల్చి ముందుగఁ దానె
భుజియించె ధర్మముబుగ్గి గావించె 70
కాని నాశక్తిని గాన్పింతునిపుడ
వేమకోపించిన నిల్చువాఁడెవఁడు?"

### దుర్వాసుఁడు కృత్యను అంబరీషునిపైఁబంపుట:

అనుచు నందుండువారందఱుఁజూడఁ
గనులెఱ్ఱనయి నిప్పుకలురాల్చఁబండ్లు
పెటపెటగీటుచు, భీతిదుఁడగుచు
జటను హుంకృతితోడఁ జయ్యనపెఱికి
దాని సశూలహస్తగ ఘోరకృత్య
గా నొనరిచి రాజుఁ గారింపఁబంచె
నాకృత్య శూలమ్ము హస్తానఁబట్టి
భీకరగర్జ వావిరినొనర్చుచును
బదఘట్టనమ్ముల వసుధపెల్లదర
నదలించు చమితాట్టహాసమ్ముతోడఁ
గడురయమ్మునవచ్చి మనునంబరీషు
నొడిసిపట్టుటకువై యుంకించుచుండ

ఓ జగత్పరిపూర్ణ ఓ దీనబంధు
ఓజగదానంద, ఓకృపారూప,
వాసుదేవుఁడవు దుర్వాసుండు నీదు
దాసుని బాధింపఁదలఁచిన చెయ్ది
యెఱిఁగి యావేదురుఋషి యొనరించు
కొఱమాలినట్టి యాక్రూరకార్యమ్ముఁ 80
జక్కఁబెట్టుమనుచుఁ జక్రమ్మునీవు
గ్రక్కునఁ బంచితి కంజదళాక్ష

### సుదర్శన చక్రము దుర్వాసుని వెన్నంటి బాధించుట:—

ప్రలయ కాలానల భాతి నా చక్ర
మలఘు దీధితులతో నరుదెంచి కృత్య

దహియించి యద్దాసఁ దనివిఁ దానొంద
కహిరాజుఁదరుము దవానలమట్లు
కనకనమని నిప్పుకలు రాలుచుండ
మునిరాజు వెనువెంటఁ బోవంగఁదొడఁగె

అమహోత్తతచక్ర మమ్ముని వెంట
నేమరుపాటులే కేగుచు నతఁడు
ధరదూర ధరదూరుఁ దడయక నబ్ధి
జొర నబ్ధిలోఁ జొరుఁ జుక్కలవీధిఁ
బ్రాఁక చుక్కలవీధిఁ బ్రాఁకు, దిక్కులకు
వీఁకమై చన దిశల్ వీఁకమై చను
జిక్కినఁ జిక్కును చెలఁగినఁ జెలఁగు
గ్రక్కనం గ్రుంకిన గ్రక్కనం గ్రుంకు
నీ రీతి తన్నులయించు చక్రమ్ము
వారించుటకు నే యుపాయమ్ములేక
పరమేష్ఠి చెంతకుఁ బరుగిడిపోయి
"కరుణాసముద్ర! ఓ కాంచన గర్భ! 90
యీ చక్రబాధ మాయింపవా! నన్ను
వాచంయమిని బ్రోవవా, కృపఁజూపి,"
అనెమౌని వానికి నబ్జుఁడిట్టు
లనె" తపస్వీ! వినుమయ్య నా నుడుల

## బ్రహ్మ దుర్వాసునకుఁ దెల్పిన హితము :

ఎవఁడుకాలాత్మకుఁ డెవఁడు తత్కాల
మవలంబనముగ బ్రహ్మాండమందుండి
జగముల సృజియించి సంరక్షచేసి
తెగిదగ్ధముంజేసి తీర్పగలాఁడు

ఆపరంధాము చక్రానలజ్వాల
లాపంగఁజాలెడు నన్యుడెవ్వండు ?
ఏను దక్షుఁడు శివుం డింద్రాదు లతని —
యాన పాలింతు మత్యంతమ్ముభక్తి
కాన దైత్యారి చక్రమ్మువారింప
నేనోప నీవింక వెందేనిజనము ''
అప్పలుక్కులనువిని యమ్మునీశ్వరుఁడు
చవ్వన నీశ్వరు సన్నిధిఁజేరి
సవినయంబుగ సుదర్శనముతెఱంగు
వివరించి కాపాడవేయనివేఁడ
నమ్మహాదేవుఁ డత్యాదర బుద్ధి
నమ్మునీశ్వరునితో ననియె నీరీతి. 100

## శివుఁడు దుర్వాసునకుఁదెల్పిన హితము :—

" వినవయ్య దుర్వాస, విశ్వమయుండు
సనకాది మునినుత చరణుఁ డాద్యుండు
శ్రీవిష్ణుదేవుఁ డాశ్రీశునియందు
భావింప సర్వభువనములు ప్రాణి —
నివహంబు కాల నిర్ణీతమ్ముఁబట్టి
ప్రభవించు నణఁగు నాపద్మాక్షునాజ్ఞ
మరియొకమాట బ్రహ్మయు దేవతలును
వరయతీంద్రులు లోకపాలకు లేను
ఏ మహాత్ముని మాయ లెఱుగంగలేక
పామరత్వమ్మున భ్రాంతినొందుదుమొ
ఆ మహాత్ముని ప్రశస్తాయుధమిద్ది
యేము దీని సహించ నెటులుచాలుదుము ?

వెడలుమా హరిఁజేర వేఁడుము శరణు
కడుదయ నతఁడు నిన్గాపాడఁగలఁడు

## దుర్వాసుఁడు మహావిష్ణు శరణమ్ము వేఁడుట :—

అన నంత దుర్వాసుఁ డల్లవైకుంఠ —
మున కరుదెంచి నీముంగలఁజేరి,
"ఓ పురుషోత్తమ ఓ యోగివంద్య
ఓ వరమానంద ఓ భక్తపక్ష,
నీదు మాహాత్మ్యంబునెఱిఁ గనలేక
నీదాసుఁ జెఱుపఁ బూనితి పాపబుద్ధి 110
భవదీయ సద్భక్తవత్సలత్వమ్ము,
నవతుమీరిన భక్తజన మహత్వమ్ము
నెఱిఁగితి మదమేదె; నింక నాదోష
మరయక నన్నుఁబ్రోవుమయ్య సర్వేశ"
అని భవద్దివ్యపాదాంబుజములకు
ప్రణతులొనర్చి లేవకయున్నవాని
మౌని దుర్వాసుని మన్ననఁజూచి
దీననంరక్ష బోధించితీరీతి.

## మహావిష్ణువు దుర్వాసునకు హితముపదేశించుట :

"మునివర నామనమ్మును లీల సాధు
జనములు తమకువశమ్మొనరింత్రు
భక్తిలతల నన్నుబంధింత్రు నేన
శక్తుఁడనౌదు నాస్వాంతమ్ముపొంగి
వలలఁజిక్కిన మదవారణమట్లు
చలియింపకుందు వాత్సల్యమ్ముకతన
భక్తికిమించిన ప్రణయమ్ములేదు
భక్తులమించిన బందుగుల్‌లేరు

కోరనునామేలు కోరుదు భక్త-
వారమ్ముమేలును, వారికి నేన
పరమగతియగుదు వారెందుచనినఁ
బఱతువారికివెంట భద్రమ్ముగూర్చ 120
సాధుజనమ్ముల స్వాంతమ్ము నాది
సాధుజనమ్ముల స్వాంతమ్ము నేను
సాధులనెఱుఁగుదు చక్కఁగనేను
సాధులకెఱుక నాచరితమ్ము విప్ర!
ధారుణీసురులకుఁ దపమును విద్య
గూరుచు భుక్తిముక్తులరెంటి నోజ
ఆరెండె యావిప్రులవినీతులైనఁ
గూరుచకున్నె పెక్కుగఁ గడగండ్లు
నాతేజు భక్తజనంబుల నుండు
నాతేజె భక్తజనారుల నణఁచు
సాధుమాహాత్మ్య ప్రశస్తతత్వమ్ము
బోధపడెనె మునిపుంగవ యింక
పొమ్మంబరీషుని బుధనుతగుణుని
సమ్ముఖంబునఁజేరి శరణమ్మువేఁడు
మతఁడునిన్గరుణించు నభయమ్మొసంగు
వెతనివారించుఁ గావించుమోదమ్ము"
అని సాధుమాహాత్మ్యమంతయుఁ దెలిపి
పనిచితాతని శుభప్రద పద్మనాభ,
నిను వలగొనిమ్రొక్కి నీయాన మౌని
చని యంబరీషుని సన్నిధిఁజేరి 130
యావృథివీపతి యడుగులఁ బట్టి
కాపాడుమా నన్ను క్ష్మాపతీయంచు
విడువకవేఁడ నావిప్రునిగాంచి
కడువిచారమునొంది కరుణించి రాజు

హరిచక్రరాజమ్ము నత్యంతభక్తి
కరములు మోడ్చి యిక్కరణినుతించె

## దుర్వాసుని మన్నింపుమని అంబరీషుఁడు సుదర్శన చక్రమును ప్రార్థించుట :

"ఖలశిక్ష సాధురక్షయొనర్చుహరికి
నలఘుసాధనమయి యలరుచక్రంబ
పంచభూతములీవ, బ్రహ్మంబునీవ
యెంచఁగ లోకేశు లినశశులీవ
సత్యంబునీవ యజ్ఞంబునునీవ
నిత్యమౌతేజంబు నిఖిలంబునీవ
ఈవులేనిదె సృష్టి నెందేదిలేదు
నీవె సర్వాత్మవు నీకువందనము
ఖలశిక్షకై యాజ్ఞ కమలాక్షుఁడీయ
ప్రలయార్కువలె నీవుభాసిలితిపుడు
ఐన శాంతమ్మొంది యాపన్నుఁడైన
మౌనిని కాపాడుమా ధర్మవృత్తి"
అని వినుతించి యాయవనివిభుండు
తనమనోనిశ్చయత్వము నిట్లువలికె 140
"ఏను ధర్మాత్ముఁడనేని, యర్థులకు
దాన మడిగినదంతయు నిత్తునేని
ధరణీసురుఁడు నాకుదైవంబయేని
హరి నాదుసేవకు నలరెడునేని
యీచక్ర మతిశాంతి నెసఁగునుగాక!
వాచంయమికి దిగుల్ వాయునుగాక!"
అని తాఁడువినుచు సత్యమ్ముఁకలరి
మునినివిడిచి శాంతమునుబూనిచక్ర

మచ్చోటునుంబాసె; నంతదుర్వాసుఁ
డిచ్ఛశాంతించి యెంతే సంతసించి
యంబరీషుని గని యాశీర్వదించి
యింబుగ మెల్లన నిట్టుల ననియె

## దుర్వాసుఁడు చక్రంబు బాధవాసి, అంబరీషుని దీవించి చనుట :—

నరనాథ! ప్రోచితి నన్ను మన్నించి
హరి భక్తులందు నీ వగ్రగణ్యుఁడవు
నినువంటి ఘనున కెంతేని నైజమ్ము
మనుచుట యిచ్చుట మహనీయ చరిత,
హరిభక్తులకు నెందు నడ్డంబు గలదె?
యరయ వారల యూహ కన్యంబులేదు.
నా తప్పు లెన్నక నాకుఁ జక్రాగ్ని
హేతిచ్ఛటాబాధ లెలయంగ నీక, 150
కాపాడితి మహాత్మ! కరుణా సముద్ర
నీ పాటి గుణుల నెందేని వేఁగానఁ
జచ్చి బ్రతికితిని సంతోషమయ్యె
మెచ్చొదవించె నీ మేల్మి గుణమ్ము
శ్రేయముల్ నీకు సుస్థిరము లౌఁగాక!
పోయి వచ్చెద నింక భూపవరేణ్య''

అనవుఁడు రాజర్షి యా మహర్షికిని
వినయమ్మునను మ్రొక్కి వివిధ భోజ్యముల
ననువుగఁ బెట్టింప నమ్మౌని మిగులఁ
దనిసి, యిట్లనియె భూతలనాథుతోడ.

"కంటిని నిను నేఁడు, కర్ణపేయముగ
వింటిని నీ నుడుల్, వేడ్క నన్నంబుఁ
గొంటి, మంటిని నీదు గురుతర కీర్తి
మింటను మంటిని, మించును గాత!"
అనుచుఁ గొండాడుచు నాశీర్వదించి
చనియె దుర్వాసుఁడు సంయమీశ్వరుఁడు

## అంబరీషుఁడు రాజ్య ప్రాభవాదుల వదలుట :-

మునిపతి వచ్చుట మొదలు నతండు
చనువేళ కొక్కవత్సరమయి వ్రతము
పరిపూర్ణమగుట నా నాభాగసుతుఁడు
ధరణీసురుఁడు తిన్నతదుపరి తానుఁ 160
దినియెను మునినెగుల్ దీరుట యెల్ల
వనజాక్షు కృపగాఁగ భావించె నెదఁద

మరలఁ గొన్నాళ్ల కా మానవనాథుఁ
డరిషట్కముం గెల్చి యచ్యుతుఁ గొల్చు
వర భక్తులకుఁ బ్రహ్మపద భాగ్యమేని
నరకసమమని డెందమున తా నెంచి
రాజ్యమ్ము వైభవ ప్రాభవంబులను
ద్యాజ్యమ్ముచేసి పుత్రకులకుఁ బంచి
హరి భవద్ధ్యాన మాహాత్మ్యంబు మహిమ
పరమ భాగవతాఖ్యఁ బడసె లోకమున

దాసపోషణ బిరుద విశేష భూష
భాసమాన శరీర భక్తమందార
ధరణిపుఁడైనను దపసియే యైన
నిరతమ్ము నిన్ను ధ్యానించువాఁడైన

శాంత శమద దమ సద్గుణ రహితు
స్వాంతాన మెచ్చవు సమయమ్ము చూచి
భవదీయ దాసుల ప్రతిభావిశేష
మవని వెల్లడిసేయు దందరెఱుంగ
నీ దాస వాత్సల్య నిరతి కీ చరిత
పాదగు సాక్ష్యమ్ము భక్తవాత్సల్య 170

శాంతదమాది ప్రశస్త గుణాల
పొంతవెన్నఁడు బోని మూర్ఖుండ నీదు
భక్తుల స్నేహమ్ముఁ బడయనివాఁడ
రక్తుఁడ దుష్ట కార్యమ్ముల యందు
నా కలవడిన దుర్ణయముల నెట్లు
పోకార్చి నన్ను నీ పూజ్య పాదముల
చెంతఁ జేర్చెదవొ లక్ష్మీ హృదయేశ,
యంతయు నీ భారమయ్య సర్వేశ!

ఫలశ్రుతి:—

ఈ యంబరీషుని యితిహాస మెవఁడు
వ్రాయుఁ జదువు, విను, వాఁడెల్లవేళ
వనజాక్షు విష్ణు కృపా విశేషమున
ననుపమానందమ్ము నందిందు నందు

———

# శ్రీ కపిలు మాహాత్మ్యము

శ్రీ రమాహృత్సరసీజ పతంగ
కారుణ్యపూర్ణ నిష్కలుషాంతరంగ
ఖలుల దండించి భక్తజనమ్ముకోర్కి
ఫలియింపఁజేయుదు పద్మాక్ష శౌరి

## సగర చక్రవర్తి:—

చక్రపాణి ముకుంద జగదీశ మున్ను
చక్రవర్తి సగరజనపతి నిన్నుఁ
గూరిచి భక్తిఁ బెక్కుగ జన్నములను
గోరిచేయుచునుండె గురుజనుల్ మెచ్చ

## సగరుని సవనాశ్వమును ఇంద్రుఁడు దాఁచుట:-

ఒకతఱి జన్నమాయుర్వీశ్వరుండు
సకలలక్షణముల సాగించుచుండ
వాసవుఁ డామఖవాజిఁ గొంపోయి
వాసియౌ పాతాళ వసుధఁ బ్రశస్త
మైన వీయవతారమగునట్టి కపిల
మౌని దివ్యాశ్రమ మహిఁ గట్టిపోయె —

## సాగరులు కపిలాశ్రమమున భస్మమగుట:—

పిత్రాజ్ఞ నశ్వమ్ము వెదకి సాగరులు
ధాత్రినిలేమి పాతాళమ్ముఁ జొచ్చి
యమలమౌ కపిలాశ్రమావని నున్న
తమ జనకుని మహాధ్వర తురంగమ్ముఁ

గని, యెఱుఁగఁగనయ్యె కట్టిడి యితఁడు
మునిముచ్చు మనహయమ్మును దస్కరించెఁ
దడవేటి కీతని దండింతమనుచుఁ
గడువడిఁ బైకొనఁ గపిలేశనీవు
కనులుదెఱచిచూడ ఖలులగువారు
తనువులుగాల నందఱు భస్మమైరి.

తమ యొనర్చినయట్టి తప్పునుబట్టి
తమమేల ననలముద్భవమయి తారు
సగరపుత్రకులు భస్మమైరి గాని
ఖగరాజగమన నీక్కమ్మయోచింప 190
జనులకు సాంఖ్యమ్ము చక్కబోధించి
యనఘులఁగా వారి నాదృతిఁజూచు
ఘనునకు నీకు నాగ్రహమేల గల్గు ?
ననువమ శాంతాత్మ యబ్జదళాక్ష !

## అంశుమంతుఁడు సవనాశ్వముం దెచ్చుట :—

అంత సగరు మన్మఁడైనట్టి యంశు—
మంతుండు తన పితామహు నాజ్ఞవడసి
సవనాశ్వముందేర నమకట్టి యరిగి
భువిని తత్తురగమ్ము పొలకువలేమి
తన జనకులు చన్న దారినిఁబట్టి
చని యధోభువిఁజేరి చయ్యననందు
బూది కుప్పలకు దాపుననున్న హయము
వాదటఁ గాంచి యాహయ సమీపమున
నున్న కపిలుని నచ్యుతు విష్ణదేవు
నిన్నుఁ గనుంగొని నిండు సద్భక్తి

కరములు మోడ్చి "పంకజనాభ దేవ
వరమ దయాకర భక్తమందార
నిన్ను నీ మహిమల నీదు భావముల
నెన్నఁగలఁడె బ్రహ్మయేని సర్వేశ,
ఆ పితామహు నవయవముల నుండి
యీ పృథ్వి బొడమిన యీ జంతుజాల 200
మం దతి హీనులమైన నా వంటి
మందబుద్ధులు నీదు మహిమ లెఱుంగ -
జాలక, నిను తిరస్కారమ్ము చేసి
కూలుచుందురు పాపకూపమ్ము లందు"
అని నుతిసేయుచు నశ్వమ్ము మాటఁ
దన పితరుల మాటఁ దలఁపక మ్రొక్కి
నిలుచున్న నాతని వెనరునఁ జూచి
పలికితి విట్లు శ్రీ పంకజనాభ.

## కపిలుఁడు అంశుమంతు ననుగ్రహించుట :—

మతిమంత, ఓ యంశుమంత హయమ్ము
నతివేగఁ గొని చను మధ్వరస్థలికి,
నీ తాత మోదించు, నీ తండ్రులెల్ల
నీతి విహీనులై నీఱైరి యిట్లు
దివిగంగ యీబూది దిబ్బలపైన
ప్రవహింప పాపముల్ వాయుటెగాక,
భవదీయజనకులు భద్రాత్ములగుచు
నివసింపఁగలరయ్య నిర్జరభూమి"

ఆవల్కులనువిని యంశుమంతుండు
నీపాదములకు వినీతుఁడై మ్రొక్కి

పవనాశ్వముందెచ్చి సగరునకీయ
మివులుజన్మమ్ము నామేదినీశుండు 210
సవరించి గురుబోధ చక్కపాటించి
ప్రవిమలోత్తమపద భాగ్యంబుఁ గనియె

## కపిలుని ధర్మతత్త్వము :

సగరుఁడు భవదీయసద్భక్తుఁడగుట
నగవైరి యతనిజన్మమున కాటంక
ములు గూర్చినను యజ్ఞమును చిట్టచివర
ఫలవంతముగఁజేసి భక్తవత్సలతఁ
జూపితి; వారాజుసుతులెల్ల వారి
కోపాగ్నివారలే కూలెడునట్లు
గావించితిని శాంతు ఘను నంశమంతు
భావంబెఱింగి కృపాదృష్టిఁ గంటి
స్వామి నీభక్తవత్సలత నీశత్రు
నామనాశనము వినమ్రజనమ్ము
పైఁ గల కరుణమ్ము వర్ణింపఁదరమె
నాగేంద్రునకువైన నలినాయతాక్ష

మంచిచెడ్డలెఱుంగ, మండుఁడ; నీతి
కొంచెమేనియులేని క్రూరుఁడ నన్ను
సగరాత్మజులవలె జడిపింపఁబోక
సగరుమన్మనివలె చల్లఁగాఁజూచి,
కరుణింపుమయ్య యోకంధిగంభీర
శరణమ్మునీవె యోసాధుమందార 220
పురుషోత్తమా జగత్పూజ్య రమేశ,
కరుణామయా, స్వప్రకాశ, సర్వేశ

# శ్రీ పరుశరామచరిత్రము

శ్రీపుండరీకాక్ష శ్రితజనపక్ష
పాపజనవిపక్ష భక్తసంరక్ష
నారాయణా జగన్నాథ లోకేశ
ధారుణీభారమ్ముఁ దగ్గింపనెంచి
మానవులకు నీతిమార్గమ్ముఁదెలుపఁ
బూని నరాకృతిఁ బొడముచుండుదువు
అదినీకులీల యోయంబుజనాభ
మదదైత్యహార రమామానసచోర

## పరశురాముని బాల్యము:

మును విప్రకులజుఁడు పూజ్యవర్తనుఁడు
ఘనుఁడగు జమదగ్ని కలఁడొక్కతపసి
స్త్రీరత్నము గుణాఢ్య రేణుకయనెడి
నారి యామౌనీంద్రునకు భార్యయయ్యె
వారిద్ద రొకతపోవనమున నుండి
శ్రీరమానాథ నిన్ సేవించుచుండ్రు
వారిపురాకృత ఫల మమోఘమ్ము
కోరివారికి నీవు కొడుకవైపుట్టి
విరివిగా శాస్త్రముల్ వేదముల్ సదివి
పరమనైష్ఠికవృత్తిఁ బరఁగుచునుంటి
మరియు శస్త్రాస్త్ర సంబంధమౌ విద్య
లరుదుగ నేర్చితి యవనిపుల్ మెచ్చ
పరశురామాఖ్య సంభావ్యుఁడవగుచు
పెరిగితి పితరులు ప్రియమొందుచుండ

క్షాత్రమ్ము బ్రాహ్మ్యమ్ము సరిలేని ప్రతిభఁ
జిత్రమ్ముగా నిమ్ముఁజెందె సర్వేశ!
గుణము విద్యయుఁ గల కొమరులఁగన్న
జననీజనకులకు స్వర్గమదెన్న

## కార్తవీర్యార్జునుఁడు:

ఆకాలమునను హైహయవంశజుండు
ప్రాకటబలశాలి బాహుసహస్ర -
సంపదకలవాఁడు శత్రుభీకరుఁడు
పొంపిరివోవు సంపూర్ణయశుండు
కార్తవీర్యార్జునాఖ్యగలాఁడు, పుణ్య
వర్తనుఁడై ప్రజఁ బాలించువాఁడు
అతఁడు మాహిష్మతి యనుపట్టణమున
వితతవైభవముల వెలయుచునుండె

## కార్తవీర్యుని దుండగము:

ఆరాజు మృగయకై యటవికిఁ దగిన
వారి, వేటరులను బలుసాధనములఁ
దనవెంటఁగొనిపోయి తద్దయువేడ్కఁ
దనివోవ వేఁటాడి దప్పియు క్షుత్తు 240
తనువేఁప జమదగ్నితపసి మాతండ్రి
ఘన తపోవనిఁజొచ్చి కడుభక్తి మునికి
జోతలర్పించి నిల్చుండ నతండు
భూతలేశునిఁగని పొడమినకృపను
దనహోమధేనువుఁ దడయక పిల్చి

నాగోవుమూలాన నత్యద్భుతముగ
బాగుమీరిన పంచభక్ష్యాన్నములను
బెట్టింప నారాజు ప్రీతిభుజించి
కట్టిడిబుద్ధి యకార్యంబునాక
"యితరసంపదలేల యీగోవెయున్న
నతిచిత్ర మిట్టి దీయవని వేఁగాన"
అనిభటులంబంచి యాహోమగవిని
మునివలదన్న నాముననుబట్టించి
తెంపున మాహిష్మతీ పురమ్మునకుఁ
బంపి, తానును వెంటఁ బయనమైపోయె

## పరశురాము నాగ్రహము:

అంత భార్గవరామ యరుదెంచినీవు
వింతఁగొల్పెడు రాజువిద్రోహచర్య
విని. "ఆహా మాయింటవిడిసి భుజించి
యనయుఁడై మాగోవునం దాశచూపి 250
మాతండ్రి వలదనుమాటలు వినక
భీతిలే కన్యాయవృత్తి హైహయుఁడు
గొనిపోయెనంట యాక్రూరాత్మమదము
నణగింతు నాదుశౌర్యమ్ముఁ జూపింతు"
అని కడునాగ్రహమంది తత్క్షణమ
మనుజనాధుఁడుచన్న మార్గమ్ముఁబట్టి
చని రాజునగరమ్ము సరసమజేరి
యనికి సన్నద్ధుఁడవై యుంటివీవు

## కార్తవీర్యార్జునుని పరశురాముఁడు చంపుట:—

నిన్నతి సామాన్యునిగ నెంచెఁగాని
యెన్నఁడారాజు సర్వేశుఁడవంచు

నా విధమున నెంచి యర్జునుఁ డంతఁ
గావరమ్మున వచ్చి కలనకుఁ బూని
తనదు సహస్ర హస్తములతో వివిధ
సునిశితాస్త్రముల నిష్ఠురగతి నీదు
మేనుఁ దాఁకగనైన మిగులఁ గ్రేడించి
వానిఁ జెదరఁ గొట్టి పటుశక్తి నీవు
పరశువుచే నృపు పదినూర్ల కేళ్లు
వరుసగా ఖండించి, పక్షముల్ దెగిన
యురుపర్వతముఁ బోలియున్న యా రాజు
శిరమును గూడ చెచ్చెరను ఛేదించి 260
భువిఁ బడవేసి నీ మొదవును గొంచు
నవనీసురులు మెచ్చునట్లు వచ్చితివి
ఉత్తములకు బాధ లొనరించువారి
కెత్తెఱగుననేని యెసఁగునే మేళ్లు

## జమదగ్ని రేణుకను జంపఁ బుత్రుల నాజ్ఞాపించుట :–

ఒకనాఁడు రేణుక యుదకంబుఁదేర
నికట గంగానదిం జేరంగ నరిగి
యచ్చరచెలులతో నయ్యేటి నడుమ
నిచ్చమై జలకమాడెడు చిత్రరథుని
చూచుచునుండి యించుక వేళమించి
వాచంయమికి నిజభర్తకై మిగులఁ
దలఁకుచు వచ్చి యాతనికి ముంగలిగ
జలభాండముంచి హస్తములు జోడించి
నిలుచుండె, నంత ముని ప్రవరుండు
కులసతి తడయుటకుం గారణమ్ము

నరసి కుమారుల నందఱఁ బిలిచి
"దురిత దీనిని మీరు దునుమాడుఁ" డనుచు
ముదలయీ, జ్యేష్ఠులౌ పుత్రులు జనని
విదళింపరైరి తప్పిద మదియనుచు

**పరశురాముఁడు జనకాజ్ఞఁ బాలించుట :—**

పెద్ద సుతులు తల్లిఁ బీచమణంచు
టద్ది పాతకమని యనుట నెఱింగి 270
తాపసి జమదగ్ని తద్ద కోపించి
యా పెద్ద కొడుకుల, నాలిని జంపఁ
దన కనిష్ఠ సుపుత్రు ధర్మజ్ఞు నిన్నుఁ
గని యానతీయఁ దత్క్షణమ యా తపసి
చరణంబులకు నమస్కారముల్ సేసి
తఱిగి తన్నల తల్లి తలల నన్నింటి
నా రీతి జనకాజ్ఞ కటు లిటు లనక
ఘోర పాతకమని కొంకక వెసను
జనని నన్నల నటు చంపిన కొడుకు
నినుఁ గాంచి నీ తండ్రి నిండు సంతసముఁ
బొందనాతని పాదములకు సద్భక్తి
వందనములు చేసి "వర తపో ధన్య!
జనక! నా భ్రాతలు జననియు మరల
మనఁ బ్రాణముల నిచ్చి మనుపగదయ్య"
అనుచుఁ బ్రార్థించితి వా మౌని వారిఁ
గనికరింపఁగ, వింతగా వారలెల్ల
బ్రదికి నిల్చుండి, రెప్పటియట్ల నీకు
ముద మావహిల్లె నమ్మునియు మోదించె.

## పరశురాముని ధర్మప్రవర్తన ప్రశంస:—

"జననిని భ్రాతలఁ జంపకయున్న
జనకుఁడు కోపించు శపియించు లేక 280
తనవంపు చేసినఁ దా నను మెచ్చు
జనని భ్రాతల నసంశయముగ నిచ్చు"
నని నీవు మున్నె భావ్యర్థంబులెల్ల
మనమున నెంచి యమ్మాడ్కి సోదరుల
జననినిఁ జంపితి; సర్వేశ, నీదు
విమత సంకల్పమ్ము వితవోవునయ్య?
జనకాజ్ఞఁ జనువాఁడు సాధింపరాని
పనులు లేవను సూక్తిఁ బ్రజలెల్ల రెఱుఁగ
నీ నాటకమ్ము నాడించితివయ్య
శ్రీనాథ నీ కివే చేమోడ్పులయ్య

## కార్తవీర్యుని తనయుల దుండగము:-

చెడు కాలమునకెగా చెడు బుద్ధులెల్లఁ
బొడమెడు జనులకు పుండరీకాక్ష!
తమ తండ్రి పగదీర్పఁ దలఁచి యర్జుని
కొమరులు శోకమ్ము కోపమ్ము తమ్ము
ప్రేరేఁప నటునిటు విపినమ్మునందు
తారుకాడుచునుండి తటిఁజూచి యొక్క
నాఁడింటి నీదునన్నలు నీవులేని
జాడయెఱింగి స్వేచ్ఛగ నాశ్రమంబు
నందుఁ బ్రవేశించి, యచట సర్వేశుఁ
బొందుగ తనమనమ్మున నిల్పి ధ్యాన — 290

మొనరించుచుమ సుఖమున్న తపస్వి
ననఘుని జమదగ్ని నందఱుఁబొడిచి
కుదులకుండగఁ దలఁగోసి చేకొనుచు
ముదము పొదలవారు పురిఁజేరఁజనిరి

## పరశురాముఁడు క్షత్రియవంశ నాశమ్ముచేయుట :-

పిదప నన్నలతోడ విపినమందుండి
సదనమ్మునకు నీవుచని తండ్రిహత్య
జరిగినవివరమ్ము చక్కఁగానెఱిఁగి
పరిభవానలతాప భర మోర్వలేక,
సోదరశోకమ్ముఁ జూడంగలేక
గాదిలి జనని దుఃఖమ్మునమునిఁగి
పతిమృతదేహమ్ముపైఁబడి దీన –
గతినేడ్చు చాత్మజు ఘను నిన్ను రాముఁ
దలఁచి "రామా! రామ, తమతండ్రి నీవు
పొలియించితంచు నాభూపతితనయు
లందఱువచ్చి మీయయ్యను బుఱ్ఱ
ద్రుమందించిపోయిరి రార! వారలను
కడతేర్తు" వనుచు బిగ్గరగ ముఱ్ఱేడు
తడవలార్వగ విని తాళంగ లేక,
కోపమాకారమ్ముఁగొన్నట్లు భయద –
రూపమ్ముతో నీవు రోషమ్ముఁబెంచి
మాహిష్మతికిఁజని మారెందులేక
ద్రోహులౌ కార్తవీర్యుని తనయులను
పదివేలమందిని పరశువుచేత
చదిపి వారల తలల్ శైలమ్ములట్లు

కుప్పలుగాఁజేసి గురురక్తనదుల
నిప్పుడమిని ప్రవహింపఁజేసితివి
మరియంతవాగక మచ్చరమెచ్చి
యిరువదియొకమారు లిలనెల్లవెదకి
రాచపురుగు కాన రాకుండునటుల,
నేచి చంపితి వవనీశులనెల్ల.

## పరశురాముఁడు శాంతి వహించుట:-

తద్ధతరాజ రక్తప్రపూర్ణముగ
బద్ధదీక్ష శమంతపంచకస్థలిని
హ్రదనవకంబు నిర్మాణమ్ముచేసి
కుదిరినయెద పితకుం దర్పణమ్ము
నచ్చోటన యొనర్చి యాగమ్ముచేసి
విచ్చలవిడిగ నీవిపుల విప్రులకు
దానమ్ముచేసి పాతకములువాసి
మాననీయమ్ము సంభావ్యమ్మునైన
శ్రీ మహేంద్రాద్రిని జేరితివీవు
రామ, పరశురామ ప్రణుతులునీకు 310

## పరశురామావతార ధర్మప్రశంస:-

"ఉత్తములకు దొనంగొనరించు వారి
కెత్తెఱంగుననేని యేర్పడుఁగీడు"
అను సూక్తి కార్తవీర్యార్జును నతని
తనయులచావు నిదర్శనమటుల
చూపితి "పిత్రాజ్ఞ సుతు దోషమునకుఁ
బాపి యభీష్టముల్ ప్రాపింపఁజేయు"

నమధర్మసూక్ష్మమ్ము నన్నులఁ దల్లిఁ
దునిమి తత్క్షణమ బ్రదుకునట్లుచేసి
జగతికిఁ దెల్పితి జమదగ్నిరామ
నిగమవందిత శుభనిచయాభిరామ.

నీమహిమముల వర్ణింపఁ జాలుదునె
శ్రీమానినీప్రియ శ్రితభాగధేయ
అవగుణంబులకు వేనాటపట్టయితి
భువి నీచమతినైతి మూర్ఖుండనైతి
ననుఁ గడఁద్రోయక నాదు నజ్ఞాన
మును మాన్పి భవదీయ ముఖ్యభక్తునిగఁ
గనికరమున దిద్ది కాపాడుమయ్య
నినునమ్మినాడ నిందీవరశ్యామ —
బృందారకమునీంద్ర బృంద సంసేవ్య
ఇందిరా సుందరీ హృదయసంభావ్య

— —

## శ్రీ రంతిదేవుని చరిత్రము

శ్రీకర మునిబృందచేతోవిహార
పాకారిముఖ సురవ్రజ, శుభాధార
గోవింద కల్యాణగుణమహానంద
శ్రీవనితాప్రియ జేజేముకుంద
సకలభూతముల నీసత్వస్వరూప
మకలంకమైయుండు టాత్మనెఱింగి
మానవసేవయే మాధవసేవ
గా నెంచి జనులకుఁ గడుభక్తిఁ దృప్తి
నొదవించు నుత్తము లొందరానట్టి

## రంతిదేవుఁడు:

రంతిదేవుండనురాజు పూర్వమ్ము
శాంతశమదమాది సద్గుణయుతుఁడు
ఆతండు తన సంచితార్థంబులెల్ల
వీతరాగమ్మున వివిధభూతముల
నిమ్నగామదినెంచి నిశ్చలభక్తి
మన్ననచూపుచు మానవతతికిఁ
దనకుఁ గొంతేనియు దాపకయిచ్చి
తినఁదిండిలేని దుస్థితినొందియుండె
నలువదియెనిమిదినాళు లాలాగు
కలఁగని మనమున ఘనుఁడతఁడుండ, 330
నకలపదార్థప్రశస్తమౌ నన్న
మొకనాఁటిప్రొద్దున నొదవెనాతనికి

## రంతిదేవుని నిస్స్వార్థత:

అలపున దూపయు నాకలి తన్ను
నలయించుచుంటచే నావంటకమ్ము
నతఁడు దినఁగఁ బూనునంతలో నొక్క
యతిథి భూసురుఁ డన్నమడిగినఁ బ్రీతి
హరిసమర్పణమంచు నతఁ డందుసగము
కొఱలేకయిచ్చె నెక్కుడు ముదమంది
యతిథిసాపడె, నంత నన్నంబుకొఱకు
బతిమాలు శూద్రునిబాధ తానెఱిఁగి
యున్నయన్నంబులో నొకభాగమిచ్చి
మన్నన సేయ నామనుజుండుచనియెఁ
దదుపరి కుక్కురద్వయముతో నొక్కఁ
డెదురయినిల్వఁగా నిచ్చెశేషమ్ము

నావల నొకమాలఁడావిభు రంతి-
దేవునెదుటనిల్చి దీనుఁడై "రాజ!
మానవకులనాధ! మన్నింపుమయ్య
హీనుఁడనంచు నన్నెడసేయకయ్య
కడు దప్పియయ్యె నిక్కడనుండి యొక్క
యడుగేని కదలించి యరుగంగఁజాల 340
నీదు పాలికినున్న నీరమ్ము పోసి
నాదుప్రాణము నిల్పననుఁబ్రోవుమయ్య

అనివేఁడు వాని దీనాలాపములను
విని కరుణించి యావిభుఁడిట్టులనియె
"అన్న! అన్నమ్మలే దాఁకలిఁదీర్పఁ
గొన్ని యంబువులివి కొని త్రాగుమన్న
ప్రాణులయాపదల్‌వాపి వారలకు
మానుగ సౌఖ్యసంపదలు గల్గంగఁ
జేయు కార్యముకన్న శ్రేష్ఠమౌకార్య
మేయెడ నన్యమొం డీక్షితిలేదు
నాకు దిక్కగు వాఁడు నారాయణుండు
గాకొక్కఁడన్యుండు గానంగలేఁడు."
అని యతిథినిఁ మధురాలాపములను
దనిపి "యీ యతిథికిఁ దప్పియు క్షుత్తు
హృదయతాపంబు సర్వేశ్వరు కరుణ
వదలి యీతఁడు తృప్తి వడయునుగాక!"
అని వాని పాత్రమ్మునందు నీరమ్ము
మనము పొంగఁగఁ బోసె మనుజనాథుండు

## బ్రహ్మాది దేవతలు రంతిదేవుని కొనియాడుట :—

ఆ సర్వ భూతదయాపరు, త్యాగ –
భాసితు, వసుధేశవరు, రంతిదేవు 350

మెచ్చి యా నృపునకు మేలు సేకూర్ప
నిచ్చఁదామెల్ల బ్రహ్మేంద్రాది సురలు
తమ నిజరూపముల్ దాలిచి యతని
సముఖమందున నిల్చి "క్ష్మాపతీ! నీదు
గుణము పరీక్షింపఁ గోరి మేమెల్ల
ఘన విష్ణుమాయా ప్రకల్పితంబైన
పలువిధరూపముల్ వడసియేతెంచి
తెలిసితిమయ్య నీ దివ్యతత్త్వమ్ము
ముదమయ్యె, నీ కిష్టములగు కోర్కెలను
కొదలేక యిత్తుము కోరుకొ"మ్మనుడు
ఆ రాజు సర్వమ్ము త్యజియించి యుంట
వారికిఁ గడు భక్తి వందనమ్ములను
గావించి, యేమియుఁ గాంక్షింప కతఁడు
భావమ్మునందు నీ భవ్యరూపమ్ము
నిలిపి భవద్ధ్యాన నిరతిమై నుండి
జలజాక్ష నీ పాద సన్నిధిఁ జేరె.
నారాజ వరుఁ గొల్చినట్టి వారలును
జేరిరి నీ చెంత స్థిరనివాసముగ.

## భగవద్భక్తుని తత్త్వము:-

ఎంతటి వేదాంతియేగాని, యాతఁ
డెంతటి సత్కృత్యమేఁ జేయునేని, 360
మానవులను తన మాడ్కిఁ దలంచి
పూనిన ప్రతి కార్యమును నీకు నర్ప —
ణముగా నొనర్చి శ్రీనాథ నీ మదికిఁ
బ్రమదమ్ముఁ గూర్చినవాఁడె నీ వాఁడు
అట్టి నీ భక్తుని యతుల భాగ్యమ్ము
నిట్టి దంచుం జెప్పనేరి తరమ్ము

సర్వభూతములందు సమ దృష్టి, దాన
నిర్వహణత్వము నీ యందు భక్తి
నాకుఁ బ్రసాదించి నన్నుఁ బ్రోవుమయ్య
శ్రీకర! సర్వేశ! శ్రితపారిజాత!

## కవి - గ్రంథ ప్రశస్తి:—

శ్రీ కర వేంకటాద్రికి దక్షిణాశ
ప్రాకట కీర్తి సంపదలఁ జెల్వొంది
అనృణ సరోవర మనియెడు పేరు
గను అప్పళయగుంట గ్రామమ్మునందు
కనమలూర్యన్వయ కలశాబ్ధి విధుఁడు
ఘనుఁడు విద్వన్నుత ఖ్యాత యశుండు
నైన వేంకట సుబ్బయాఖ్య కవీంద్రు
సూనుండు సునయుండు సుజన మాన్యుండు
శివరామ నామ ప్రసిద్ధిఁ గన్నట్టి
కవితల్లజుండు వేంకటనాథు కరుణ
విజ్ఞులు మెచ్చంగ ద్విపద కావ్యముగఁ
బ్రజ్ఞా విశేషాన రచియించినట్టి
ప్రథగన్న ప్రార్థనాభాగవతమున
ప్రథమమ్ము నుండి నవమము వఱకును
దొమ్మిది స్కంధముల్ తొలివిభాగముగ
నెమ్మి సమాప్తమై నిలిచె నాంధ్రమున.

నవమస్కంధము ముగిసెను.

శ్రీ ప్రార్థనాభాగవతమున ప్రథమభాగము సమాప్తము

ఓం ఓం ఓం

# సవరణలు

| పుట | పంక్తి | ఉన్నది | ఉండఁదగినది |
|---|---|---|---|
| 1 | 8 | ఉరగశయనా | ఉరగశయన |
| 3 | 7 | మనుజుఁడు | మునుజని |
| 4 | 18 | ప్రదుఁడైన | ప్రదుజగద్గురుని |
| 9 | 14 | మోసితివి | మోసితి |
| 12 | 4 | గర్తనమమ్ము | గర్తసమమ్ము |
| 14 | 2 | నన్ముని | సన్ముని |
| 18 | 4 | కాణక మేలంచు | నాణెమ్ము మెచ్చి |
| 20 | 19 | నీ చిత్రవృత్తి | నీ చిత్తవృత్తి |
| 23 | 13 | శరీరమ్మునఁగని | శరీరమ్మున కని |
| 28 | 22 | నతిమహిమాన్విత | యతిమహిమాన్విత |
| 30 | 5 | నీదునిరుపమ | నీనిరుపమ |
| 31 | 1 | ననుచు | అనుచు |
| 34 | 21 | శరవ్నహి | శరవహ్ని |
| 36 | 9 | పాంచాలసుత | పాంచాలుసుత |
| 36 | 11 | ఖలులూడ్చుచుండ | ఖలుఁదూడ్చుచుండ |
| 42 | 19 | ధర్మునకు | ధర్ముండు |
| 48 | 23 | విశ్రుతి నీకు | విశ్రుతి నీదు |
| 52 | 13 | అతిప్రీతి | నతిప్రీతి |
| 53 | 9 | అవని గంటకు | అవనిఁగంటకు |
| 54 | 25 | తీక్ష | తీక్ష్ణ |
| 54 | 4 | పరమపావనము | పరమపావన |
| 56 | 21 | గొల్లలల్లెల గోపవాసములను | గొల్లల పల్లెల గోవాసములను |
| 59 | 24 | పురుషుఁడెవ్వండో | పురుషుఁడెవ్వఁడో |
| 61 | 16 | చేసినారో | చేసినారొ |
| 61 | 22 | నందుండ్రు | నందుండు |
| 77 | 23 | స్వామిని | స్వామివి |
| 81 | 10 | నిరుమానములు | నిరుపమానములు |

| పుట | పంక్తి | ఉన్నది | ఉండఁదగినది |
|---|---|---|---|
| 84 | 4 | యొన్నుచుండె | యెన్నుచుండె |
| 86 | 2 | వాసుదేవునకు | వామదేవునకు |
| 103 | 23 | మోనీంద్ర | మౌనీంద్ర |
| 113 | 4 | విమలపర్తనల | విమలపర్తనులు |
| 113 | 5 | మోనిజనమ్ముల | మౌనిజనమ్ముల |
| 132 | 8 | మజ్జదళాక్ష | మబ్జదళాక్ష |
| 141 | 3 | యీదమ్ము | యీదుమ్ము |
| 141 | 18 | ఘొరాట్ట | ఘోరాట్ట |
| 147 | 14 | కార్యములు | కార్యమ్ములు |
| 149 | 5 | బూమండు | బూషండు |
| 150 | 23 | భర్త | భక్త |
| 150 | 25 | నా పప్పిదములు | నా తప్పిదములు |
| 152 | 5 | మమ వేఱుగా | మము వేఱుగా |
| 154 | 14 | చేరువనుకండి | చేరువ నుండి |
| 154 | 23 | నాఁనాడె | నా నాఁడె |
| 155 | 3 | వేఁగి | నేఁగి |
| 157 | 6 | మూర్ఛమ్ము | మూర్ధమ్ము |
| 158 | 15 | తటకు | తుటకు |
| 158 | 25 | స్మేహమ్ము | స్నేహమ్ము |
| 159 | 7 | లొకముల | లోకముల |
| 159 | 16 | నాడదు | నారదు |
| 160 | 14 | ప్రతిమల | ప్రవిమల |
| 160 | 20 | గోష్టి | గోష్ఠి |
| 160 | 23 | మేమో | మేమొ |
| 165 | 5 | భుజముల నాశ్లేషమును జేయు కరణి | వెండియు నాశ్లేషవిధి సల్పు కరణి |
| 165 | 7 | మెండగు భక్తి నెమ్మిగఁ జక్క నిలిచి | యనుపమ భక్తి చయ్యనఁ జక్క నిలిచి |
| 165 | 9 | మునుకొని తాత్కార్యమునుఁ జేయుటెట్లొ | తలకొని తద్విధిఁదగఁ జేయు విధము |

| పుట | పంక్తి | ఉన్నది | ఉండఁదగినది |
|---|---|---|---|
| 168 | 28 | దత్యూత్సాహ | దత్యుత్సాహ |
| 171 | 20 | గురుడాంక | గరుడాంక |
| 173 | 12 | ఘునమతి | ఘనమతి |
| 176 | 2 | లాదరింతువో | లాదరింతువొ |
| 176 | 22 | వేఁడికొనంగ | వేఁడికొనఁగ |
| 180 | 26 | సన్మానించి రతని | సన్మానించెనతని |
| 184 | 17 | నాని తీరున | నా తీరున |
| 189 | 8 | పాడుగుచుండు | పాడగుచుండు |
| 190 | 3 | బలుభేది | బలభేది |
| 190 | 8 | మానవనాథ | మానవోత్తములు |
| 190 | 23 | ప్రార్థివ | పార్థివ |
| 193 | 11 | లాంఛనాంత | లాంఛనాంచిత |
| 198 | 21 | నాత్మనందును | నాత్మనందను |
| 200 | 6 | ముక్తి | ముక్తిని |
| 207 | 23 | నజినాభ | నజనాభ |
| 209 | 2 | దూరుండవై | దూరుండునై |
| 209 | 9 | గణక | కణఁక |
| 210 | 2 | మృగపాతమ్ము | మృగపోతమ్ము |
| 211 | 26 | వెందుపోయితివి ? | వెచటికేగితివి ? |
| 212 | 9 | బూర్వ కర్మఫలము | బూర్వపుఁ గర్మఫలము |
| 220 | 11 | రహోగణుఁడు | రహూగణుఁడు |
| 221 | 19 | రహోగణుఁడు | రహూగణుఁడు |
| 222 | 1 | రానియట్టుఁడు | రానియట్లుండు |
| 223 | 3 | బలము, కార్శ్యమో | బలమొ కార్శ్యమొ |
| 224 | 1 | రహోగణుని | రహూగణుని |
| 231 | 17 | భూమీంద్రుఁడో | మహేంద్రుఁడో |
| 233 | 1 | షష్ఠమ స్కంధము | షష్ఠస్కంధము |
| 234 | 10 | పయసు నెన్బదిని | పయసెనుబదిని |
| 235 | 1 | షష్ఠమ స్కంధము | షష్ఠస్కంధము |

| పుట | పంక్తి | ఉన్నది | ఉండఁదగినది |
|---|---|---|---|
| 237 | 1 | షష్ఠమ స్కంధము | షష్ఠస్కంధము |
| 237 | 2 | లేరో | లేరా |
| 237 | 10 | దప్ప | దప్పు |
| 238 | 18 | నిన్పించె | గన్పించె |
| 239 | 1 | షష్ఠమస్కంధము | షష్ఠస్కంధము |
| 246 | 20 | సంపదలఁ | సంపదఁ |
| 247 | 14 | వేరము | నేరము |
| 247 | 19 | నెమ్మిది | నెమ్మది |
| 250 | 22 | యితిహాస | నితిహాస |
| 257 | 5 | విశ్వరూప। | మునీశ్వర। |
| 278 | 18 | డువున | పడువున |
| 283 | 7 | సంకర్షణస్వామి | అనంతస్వామి |
| 283 | 20 | యుక్కడగిచి | యుక్కడగించి |
| 284 | 17 | విద్యాదర | విద్యాధర |
| 289 | 12 | లీల | భక్తి |
| 290 | 13 | చివోన్నరు | చిహోన్నరు |
| 293 | 15 | యయ్యువిధ | యయ్యువిద |
| 295 | 23 | నేనేగిరముగ | నేవేగిరముగ |
| 296 | 2 | చాలు | బాలు |
| 296 | 3 | సకలములు | శకలములు |
| 298 | 1 | యాత్మయ | యాత్మీయ |
| 301 | 7 | దానవులారా | దానవులార |
| 302 | 12 | నిజానిజుని | నిజానిజు |
| 302 | 15 | డనదు | తనదు |
| 304 | 24 | మముకార | మమకార |
| 305 | 12 | మరిఁ | నురిఁ |
| 305 | 23 | తావంబు | శాపంబు |
| 306 | 5 | వెల్లి | నెల్లి |
| 308 | 16 | గలిగింపుము | గలిగింపుమా |

| పుట | పంక్తి | ఉన్నది | ఉండఁదగినది |
|---|---|---|---|
| 308 | 21 | తపమొనరించి | తపమొనరిచి |
| 310 | 16 | విరూజితు | విరాజితు |
| 311 | 5 | నపతరించునో | నపతరించునౌ |
| 319 | 20 | యొకటిఁ | యొకటఁ |
| 322 | 4 | నేఁడెఱిందగె | నేఁడెఱింగెద |
| 325 | 19 | హిరణ్యకశిపు | హిరణ్యకశిపుడు |
| 329 | 1 | వినిఁగొని | వీనిఁగొని |
| 329 | 20 | గఋపరు | గఅపరు |
| 333 | 23 | బాలించె | బాతించె |
| 334 | 6 | యొక్క | యొక |
| 339 | 9 | ఇంద్రి | ఇంద్ర |
| 342 | 13 | మార్పుఁతమకు | మార్పుఁ దమకు |
| 355 | 6 | ధనుర్బాణాదికమ్ముల | ధనుర్బాణాదికముల |
| 362 | 20 | గలిగించుఁ | గలఁగించుఁ |
| 374 | 10 | కేఁగె | కేగె |
| 378 | 2 | హృత్పద్మ | హృత్సద్మ |
| 390 | 5 | ముందుండి | మందుండి |
| 397 | 10 | యీ యిష్టార్థ | మీ యిష్టార్థ |
| 402 | 3 | పంచుచు“డఁడవింక | పంచుచుఁదడవింక |
| 418 | 4 | బ్రాహ్మణులారా ! | బ్రాహ్మణులార ! |
| 440 | 7 | వెలికి | వెలికిఁ |
| 456 | 16 | మన్ననఁచూచి | మన్ననఁజూచి |

